# విచిత్ర రామాయణము



శ్రీమతి రాంపల్లి కామేశ్వరి

# విచిత్ర రామాయణము

శ్రీమతి రాంపల్లి కామేశ్వరి -
శ్రీరామచంద్రమూర్తి



ప్రచురణ :
భారతీయ సాహిత్య పరిషద్
రాజమండ్రి.

VICHITRA RAMAYANAMU
Srimati Rampalli Kameswari

ప్రథమ ముద్రణ : వెయ్యి ప్రతులు
జూలై 1998

పబ్లిషర్స్ :
భారతీయ సాహిత్య పరిషద్ : మె
రాజమండ్రి.




వెల రూ. 90/-

తిరుమల తిరుపతి దేవస్థానంవారి
ఆర్థిక సహాయంతో ముద్రితం

ప్రతులకు : డా॥ డి.యస్.వి. సుబ్రహ్మణ్యం, ఫోన్ 465873
23-11-11/1, L. B. శాస్త్రి రోడ్
రామకృష్ణారావుపేట, రాజమండ్రి-533 105.

R.V.S. సుబ్రహ్మణ్యం,
తెలుగు పండితులు
పరిషత్ ఉన్నత పాఠశాల
సీతానగరం, చింతలపూడి మండలం.
పశ్చిమ గోదావరి జిల్లా.

R.S.S. సీతారామస్వామి
తెలుగు పండితులు
P.H. స్కూలు, తూర్పు విప్పర్రు-534328
ఇరగవరం మండలం, పశ్చిమగోదావరి జిల్లా.

ముద్రణ : శ్రీ వాసవీ దత్తా ఆర్టు ప్రింటర్స్
ఆర్యాపురం, రాజమండ్రి. ఫోన్ 440436

# సహృదయామోదము

"వాస్తు జ్యోతిష ప్రవీణ"
శ్రీ టి ఎన్. గోపాల్
ప్రిన్సిపాల్
ఆంధ్రకేసరి సెంటినరి జూనియర్ కాలేజి
రాజమండ్రి. ఫోన్ : 471489

ఆదికవి వాల్మీకి కృతమైన రామాయణము ఉత్తరకాండతో కలిపి సప్తకాండ పరిమితమైనది. యుద్ధకాండ పట్టాభిషేక సర్గతో సమాప్తమగును. ఈ సర్గలో వాల్మీకిమహర్షి కృతమైన రామ రాజ్యంయొక్క వైశిష్ట్యం అద్భుతమైనది. రాముడు రాజ్యం పాలించు కాలంలో స్త్రీలు అకాల భర్తృవియోగం అనుభవించలేదు. విష జంతువుల వలనకానీ వ్యాధుల వలనకానీ చోరుల వలనకానీ ప్రజలు బాధపడలేదు. సర్వ కామ్యములను ప్రజలు పొందిరి. వృక్షములు, లతలు నిత్య పుష్ప ఫలములు కలిగియుండెను. రామునిచూచి అందరూ ధర్మపరులై యుండిరి.

"రామో రామో రామ ఇతి ప్రజానామభవన్ కథా ।
రామభూతం జగదభూత్ రామోరాజ్యం ప్రశాసతి ॥"

జగత్తంతా రామ మయం. ఎక్కడ విన్నా రామ కథలే. పర్వతాలు నదులు భూమిపై ఉన్నంతకాలం రామ కథ ప్రచారంలోనే ఉంటుంది. రామాయణ కథ చదివితే సర్వ పాపాలు నశిస్తాయి. దీర్ఘాయువు ఐశ్వర్యం పుత్రలాభం కలుగుతాయి. కేవలం ఐహిక సుఖాలే కాక పారలౌకిక ప్రయోజనాలతో కూడినది రామాయణం. మహామహిమాన్వితమైన రామాయణంలో ఉత్తర కాండ విశిష్టమైనది ఈ కాండ గురించి, ఈ కాండ ప్రాధాన్య

తను గురించి కొంత వివాదం ఉన్నా, పారాయణలో ఉత్తరకాండ నిబద్ధం కాకున్నా. పూర్వ రామాయణంలోని అనేక సంక్షిప్త విషయాలకు సమాధానం ఈ కాండలో లభిస్తుంది.

ఆర్ష వాఙ్మయంలో రామాయణ, భారత, భాగవతాలకు ప్రథమ స్థానం ఉన్నది. రామాయణం కావ్యంగాను, భారతం ఇతిహాసంగాను, భాగవతం పురాణంగాను ప్రసిద్ధి చెందాయి. రామాయణ గ్రంథాన్ని పరిశీలించడానికి వైవిధ్యంతో కూడిన మార్గాలనేకం కలవు. ఇది కావ్యమైతే రాముడు నాయకుడు. ఇది దివ్యప్రబంధమైతే రాముడు సాక్షాత్ శ్రీ మహావిష్ణువు. ఈ గ్రంథాన్ని శాస్త్రీయ దృష్టితో విశ్లేషించవచ్చు, కావ్య దృష్టితో ఆస్వాదించవచ్చు దివ్యగ్రంథంగా పారాయణ చేయవచ్చు. ఈ గ్రంథంలో అంతరార్థం ఉన్నదా ! రామకథ నిగూఢమైన ధ్వని, ఆధ్యాత్మిక, యోగరహస్యాలను వెల్లడిస్తుందా ! అనే సంశయాన్ని నివారణచేసిన రామాయణ రూపాలుకూడ మనకి లభిస్తున్నాయి. వ్యాసాలు, సంకలనాలు ఏర్పడ్డాయి.

త్రిమతాచార్యులుగా ప్రసిద్ధిచెందినవారిలో ద్వైతమత ప్రవక్తలయిన శ్రీ మధ్వాచార్యులు "కతక వ్యాఖ్యానము" రామాయణంపై పాఠకులకు ఒక నూతన పరిశీలనాదృష్టిని కలిగిస్తుంది. కలుషితమైన జలాన్ని శుద్ధిచేయడానికి కతక బీజము (ఇండుప గింజ) సమర్థవంతమైనటులే శ్రీ మధ్వాచార్యుల వ్యాఖ్యానములు కూడా రామాయణంలోని స్వచ్ఛమైన సారాన్ని వెలికి తీసికొని వచ్చినదిగా భావింపబడినది.

ఆధునిక సంప్రదాయంలో రామాయణాన్ని పరిశీలించిన వారు ముఖ్యంగా పాశ్చాత్య పండితులు. రామాయణ గ్రంథ ప్రాధాన్యతను ఇతరగ్రంథ ప్రమేయంతో నిర్ధారించుట కలదు. కానీ అట్టి నిర్ధారణ అవసరం లేకుండానే రామాయణ గ్రంథ

ప్రాధాన్యత తెలియ వచ్చును. ఈ కావ్య కథలో ప్రసన్నత, రసంలో ఆర్ద్రత ఈ గ్రంథాన్ని సార్వకాలికము, సార్వజనీనము చేసినవి

రామాయణ కథలో సారాన్ని విపరీత దృష్టితో పరిశీలించిన వారు, ఆ దృష్టితో రామాయణంపై గ్రంథములు ప్రచురించిన వారున్నారు. ఇందు ఇన్ని విధాలుగా రామాయణ గ్రంథంపై తమ దృష్టిని నిలపడము అనేది రామ కథయొక్క విశిష్ట ఆకర్షణ శక్తిని తెలియజేయును. "చరితమ్ రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్'' రామాయణ మహాకావ్యంలోని ప్రతిఅక్షరానికి మహా పాతకములను నాశనంచేసే శక్తి కలదు. అట్టిపుణ్యకథ ఏరూపంలో లభించినా అవశ్య శిరోధార్యమే మాయామానుష విగ్రహుడైన శ్రీరాముని దివ్యగుణములు అనంతమై అప్రమేయమైనటులే రామ చరితామృతముకూడా అప్రమేయమై అనంతరూపములలో వెలసినది.

వాల్మీకి గిరినుండి జనించిన రామాయణగంగ రామసాగరమును చేరి భువనత్రయమును పవిత్రము చేసినట్లే, అనేక ప్రాంతాలలో, కాలములలో, భాషలలో ప్రభవించిన రామాయణ కావ్యస్రోతస్సులు "రామసాగరము"చే అత్యంత పవిత్రమైనవి. అందుచే వాల్మీకి మహాకవి కృతముకాని ఏ ఇతర రామాయణము నైనా తులనాత్మక ప్రమాణ కోణమునుండి పరిశీలింపరాదు. ఏ గ్రంథమున కాగ్రంథమే స్వతః ప్రమాణం. ఆ మహాత్మ్యము రామకథ యందే కలదు.

భారతదేశంలో పుట్టిన రామాయణ మహాభారతాలు రెండూ రెండు శబ్ద ప్రపంచాలు. రెండు మహాసాగరాలు. ఈ రెంటిని

అనుసంధానం చేయడం విచిత్రమైన విషయం అందుచే "విచిత్ర
రామాయణం" కథ చాలా ఆసక్తిజనకంగా ఉంటుంది. ఇందులో
రామాయణ కథ భారత కథతో ప్రారంభిస్తుంది. కథా విషయంలో
సామ్యాన్ని ఒక సూచనగా గ్రహించి విచిత్ర రామాయణంలో
చేసిన పాత్రాముఖ ఆవిష్కారం గ్రంథానికి ఒక ఆకర్షణీయమైన
ప్రారంభంగా భావించవచ్చును.

విచిత్ర రామాయణాన్ని వేద వాఙ్మయకోటిలో చేరిన ఒక
దివ్య ప్రబంధంగా భావించి పఠించినవారు కొంత నిరాశ చెంద
వచ్చు. దీనికి కారణం విచిత్ర రామాయణం కథా కావ్యం ఉత్త
రోత్తర ఉత్కంఠా జనకంగా నడిచిన అనేక కథలు ఒక పూ
మాలలో పుష్పాలవలె అవ్యవహితంగా గుచ్చికూర్చడం ఈ
గ్రంథంలో కనిపించే ఒకానొక విశిష్టగుణం. పూర్వరామాయణాన్ని
వాల్మీకీయ రామాయణంలో ఉత్తరభాగం వివరణాత్మకంగా పూ
స్తుంది. యదార్ధమునకు ఉత్తరభాగం చదివినకానీ పూర్వ భా
పఠన పరిమాప్తముకాకున్నా ప్రచలిత పారాయణక్రమంలో పూర్వ
భాగానికే ప్రాధాన్యత ఉన్నది.

విచిత్ర రామాయణంలో ప్రధాన విషయం ఈ కథాభాగం
ఉత్తర రామాయణంతో ప్రారంభమయి పూర్వ రామాయణ
అంత్యముతో కల పట్టాభిషేక కాండతో సమాప్తమవుతుంది
ప్రాయశః ఇది ఉత్తర రామాయణాన్నికూడా పారాయణయోగ్యం
చేయుటకు చేసిన ప్రయత్నం కావచ్చు. ఉత్తర రామాయణ
కథ అప్రశస్తిని పూరించే విధంగా విచిత్ర రామాయణం సాగింది
ఆ కథాభాగాన్ని ప్రకృష్ట ప్రచారంలోనికి తెచ్చుటలో ఈ రామా
యణం సఫలం అయింది.

ఒక కథకు ప్రాధాన్యత నిచ్చినపుడు కథా విషయం సం

వమా యదార్ధమా అనే సంశయానికి తావు కల్పింపరాదు. అదే విధంగా విచిత్ర రామాయణం చదివేపాఠకులు అట్టి సంశయాలను దూరస్థం చేయాలి. కథ కలిగించే ఆసక్తిని మాత్రము పొంది, ఆకథలలో సంభ వాసంభవాలనుంచి ప్రస్తానం ప్రారంభింపరాదు.

రసాలలో అద్భుతరసం ఒకటి మనస్సును ద్రవింపజేయకుండా సద్యోజనితమైన ఆనందాన్ని కల్పించేది అద్భుతరసం. అద్భుతరస ప్రాధాన్యతా భావనకల ఆలంకారికులకు విచిత్ర రామాయణం విస్తరిస్తే ఒక ఉత్తమలక్ష్య గ్రంథంగామారుతుంది.

రామాయణ కథ అత్యంత విస్తృతమైనది. ఈ ప్రధాన కథలో అనేక ఉపకథలు కలవు. ఈ ఉపాఖ్యానాలలో పాత్రలకు ప్రత్యేక కథలు కలవు. కానీ ప్రధాన కథకుకల గౌరవము ఇతర కథలకు లేదు ఒక చక్కని కథకునికి పక్షపాత దృష్టి కానీ ప్రయోజన దృష్టి కానీ ఉండరాదు. ఈ కారణంతో రామకథతో పాటు అన్ని కథలకు స్థానం కల్పించిన విచిత్ర రామాయణం సాంప్రదాయవాదులకు అంతగా రుచింపదు.

తల స్పర్శగా చేసిన ఈ పరిశీలనలో లిఖిత రామకథాంశాల సార పరిశీలన పరిహరించుట జరిగింది. విచిత్ర రామాయణంలో స్వీకరించిన కథల విషయంలో కొంత వైచిత్రిపాటింపబడింది. అహల్య గౌతముల వృత్తాంతములో కథా కథనం ఇటువంటి ఒకలక్ష్యంగా భావించవచ్చును. ఇట్టివే అనేక లక్ష్యాలు ఈ విచిత్ర రామాయణ గ్రంథంలో లభిస్తాయి.

ఒక గ్రంథ వైశిష్ట్యానికి సహృదయ హృదయాలే ప్రమాణం. సహృదయ పాఠకులు పుష్పంలో మధుసారాన్ని సారంగాలు

గ్రహించినట్లుగా ఈ గ్రంథంలో లభించే సారాన్ని గ్రహించవ వని ప్రార్ధన.

రామ కథవంటి ఒక ఉత్తమ ఇతి వృత్తంతో ప్రచారం లేని కథాంశాలను జనానీకానికి అందించటానికి రచయి (త) శ్రీ శ్రీమతి రాంపల్లి చేసిన కృషి సర్వదా అభినందనీయము. కృషిని సఫలంచేస్తూ పుస్తక ప్రచురణ పూర్తిచేసిన భారతీం సాహిత్య పరిషద్ రాజమండ్రివారు మరింత అభినందనీయుల ఇట్టి గ్రంధాలకు ఇంకా వెలుగు చూపాలని పరిషత్తును కోరుం న్నాను.

"శివాస్తే పంథానస్సన్తు."

# ఒక్క మాట

**శ్రీమతి కొల్లేపల్లి రత్నావతి**
అధ్యక్షులు
భారతీయ సాహిత్య పరిషత్
రాజమండ్రి. ఫోన్ : 465583

ప్రపంచ మానవాళికి నాగరకత తెలియని కాలంలోనే - విశ్వ సాహితీ నందన వనంలో వాల్మీకి అనే కల్పవృక్షం గుబాళించిన కావ్య పారిజాతం రామాయణ మహాకావ్యం. మానవ జాతికి అక్షర భిక్ష పెట్టి కవితా సౌరభం అందించిన వాల్మీకి యావత్ప్రపంచానికీ ఆదికవి. అతడి కావ్యం ఆదికావ్యం. సరస సుందర కథోపాఖ్యాన మయమైన రామాయణం ఉత్తమ మానవ జీవిత గమన నిర్దేశకమైన నీతిశాస్త్రంగా గుర్తించాలి. వేదప్రతిపాదిత ధర్మమార్గాన్ని ప్రజలకు సులభంగా అందించే ప్రయత్నమే రామాయణం.

అనంతర కాలంలో ప్రపంచ కవులు, విమర్శకులు, పండితులు తమ తమ సంస్కారాలకు అనుగుణంగా రామాయణాన్ని తమతమ అభిరుచుల కనురూపంగా పద్య, గేయ, నాటక కథాది రూపాలుగా పరివర్తింప చేశారు. ఏ రూపంలో చిత్రించబడినా "రామో విగ్రహవాన్ ధర్మః" అను ప్రధాన సూత్రానికి అనుగుణంగా "రామాదివద్వర్తి తవ్యమ్"అను సూక్తికి అనుకూలంగా చిత్రించుట జరిగింది. "విచిత్ర రామాయణం" వచన గ్రంథం ఆ విధంగా చిత్రింపబడినదే.

శ్రీమతి రాంపల్లి కామేశ్వరి కీ॥ శే॥ శ్రీరామచంద్రమూర్తి దంపతులచే ఆవిష్కరింపబడిన ఈ గ్రంథం భారతీయ సాహిత్య పరిషత్ రాజమండ్రి శాఖచే ప్రచురింపబడటం ముదావహం. ఈమా మొదటి ప్రయత్నం పండిత పామర జనామోదం పొందుతుందని విశ్వశిస్తున్నాను.

# కృతజ్ఞతలు

డా॥ డి. యస్. వి. సుబ్రహ్మణ్యం
కార్యదర్శి
భారతీయ సాహిత్య పరిషత్
రాజమండ్రి.

రాజమండ్రీలో శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావుగారి చొరవవల్ల "భారతీయ సాహిత్య పరిషత్" శాఖ ఆవిర్భవింపబడింది. శ్రీమతి కొల్లేపల్లి రత్నావతిగారి అధ్యక్ష్యంలో సజావుగా సాగుతోంది. పరిషత్ పక్షాన వెలువడుతున్న మొదటి గ్రంధం "విచిత్ర రామాయణము". పరిషత్ రాజమండ్రీ శాఖ నిర్వహించే సాహిత్య కార్యక్రమాలుచూచి మురిసిపోతు ప్రోత్సహించే రాష్ట్ర శాఖ అధ్యక్షులు శ్రీ R.S K. మూర్తిగారు ఇటీవలే దివంగతులవడం బాధాకరం.

ఈ గ్రంధ రచయిత్రి శ్రీమతి కామేశ్వరిగారు మా మేనమామ కీ॥శే॥ రాంభల్లి శ్రీరామచంద్రమూర్తిగారి భార్య. వేమన శతకాన్ని శ్లోక రూపంలో సంస్కృతీకరించి సర్వేపల్లి రాధాకృష్ణ పండితుల మెప్పు పొందినా, వ్యాస భారతాన్ని అక్షరంకూడా విడువక వచన రూపంలో ఆంధ్రీకరించి "ఆంధ్రపత్రిక" దినపత్రికలో ధారావాహికంగా ప్రచురింపబడి "ఆంధ్ర వ్యాసు"నిగ ప్రజలచే మన్నన పొందినా, "కుమార సంభవం" హరికథ సంస్కృతంలో రచించి శ్రీమతి దాలిపర్తి ఉమామహేశ్వరివంటి వారికి నేర్పించి ఉజ్జయిన్యాది మహా నగరాలలో గానం చేయించి సమ్మానింపబడినా, వారి ముఖంలో కనిపించేది పెదవిదాటని మందహాసం మాత్రమే అలౌకికత్వం, నిరాడంబరత, సౌమ్యత,

నిత్య పఠన పాఠనాసక్తి శ్రీరామచంద్రమూర్తిగారి జీవితాంతం వారిని ఆశ్రయించి ఉన్నాయి.

అటువంటి శ్రీరామచంద్రమూర్తిగారిని రావులపాలెం బస్సుస్టాండులో అకాలమృత్యువు కబళించింది. వారి చిరకాల వాంఛ విచిత్ర రామాయణ ముద్రణ. కామేశ్వరీ శ్రీరామచంద్ర మూర్తి దంపతులు జీవాత్మ పరమాత్మవంటివారు. జీవాత్మ ఏమి చేసినా పరమాత్మ నిర్దేశానుసారమే కదా ! అందువల్లనే గ్రంథ రచయిత్రి కామేశ్వరిగారే. అయినా శ్రీరామచంద్రమూర్తిగారు రచించినట్లు భావనచేసినా తప్పుకాదు.

ఈ గ్రంథం నిజానికి కపిలేశ్వరపురం జమీందారులు మహారాజశ్రీ S. P B. K. సత్యనారాయణరావు మహోదయులు ముద్రించాలి. ఈ అవకాశం సాహిత్యపరిషత్‌కి రావడం విశేషమే. మా మేనమామగారి కుమారులు శ్రీ R.V.S. సుబ్రహ్మణ్యం, R.S.S. సీతారామస్వామి, ప్రసాద్, సూర్య సుబ్రహ్మణ్యం పుత్రిక చి॥ సౌ॥ లక్ష్మి ఈ గ్రంథ ముద్రణ బాధ్యత నాద్వారా సాహిత్య పరిషత్‌కి అప్పగించారు.

పరిషత్ అధ్యక్షులు శ్రీమతి కొల్లేపల్లి రత్నావతిగారు, కార్యవర్గము దీని బాధ్యత స్వీకరించుటకు అంగీకారం తెలిపినందు లకు వారందరికీ కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. ప్రసిద్ధ వాస్తు జ్యోతిష శాస్త్ర పండితులు, మా కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ శ్రీ తాడూరి శ్రీనివాస గోపాల్‌గారు సహృదయామోదము నందజేసి నందుకు వారికి, ఆర్థిక సహాయ మందించిన తిరుమల తిరుపతి దేవస్థానమువారికి, చక్కగ ముద్రించిన శ్రీ వాసవీ దత్తా ఆర్టు ప్రింటర్స్ అధినేత శ్రీ కె సత్యనారాయణమూర్తిగారికి, తగిన

సూచనలు ఇచ్చిన డా॥ పి.వి. మురళీకృష్ణ, శ్రీ మధునా పంతుల వేంకటాచలపతి, శ్రీ పెరుమాళ్ళ రఘునాథ్, కుమారి యశోదా కుమారిగారికి నా కృతజ్ఞతలు తెలుపుట కనీస ధర్మం.

"సీతాయాశ్చరితమ్ మహత్"అని ప్రసిద్ధి వడసిన రామాయణం ఎందరి కరకమలాలనుండి ఎన్ని రూపాలుగా వెలువడినా అది నిత్యనూతనంగా వెలుగొందుతూ పఠితల మనస్సులను రంజింపజేస్తూనే ఉంటుంది. మిక్కిలి సరళమైన భాషలో వచన రూపంలో వెలువడిన విచిత్ర రామాయణం సర్వజనామోదం పొందగలదని విశ్వసిస్తున్నాను.

# భారతీయ సాహిత్య పరిషద్ - రాజమండ్రి

## కా ర్య వ ర్గ ము

| | |
|---|---|
| అధ్యక్షులు | : శ్రీమతి కొల్లేపల్లి రత్నావతి, 465586<br>8-9-14, వలకాయలవారివీధి,<br>రాజమండ్రి-533 101. |
| ప్రధాన కార్యదర్శి | : డా॥ డి. యస్. వి. సుబ్రహ్మణ్యం, 465873<br>తెలుగు లెక్చరర్,<br>ఆంధ్రకేసరి సెంటినరి జూనియర్ కాలేజి<br>రాజమండ్రి-533 103. |
| ఉపాధ్యక్షులు | : శ్రీ మధునాపంతుల వేంకటాచలపతి<br>© 464678<br>కుమారి యశోదాకుమారి, 461816 |
| సంయుక్త కార్యదర్శి | : శ్రీ పెరుమాళ్ళ రఘునాథ్<br>"శతావధాని" |
| సంఘటనా కార్యదర్శి | : డా॥ అబ్బిరెడ్డి పేరయ్యానాయుడు |
| ప్రచారవిభాగ కార్యదర్శి | : డా॥ పి. వి. మురళీకృష్ణ, 464023 |
| కోశాధికారి | : డా॥ కొంపెల్ల సత్యనారాయణ, 460231<br>17-31-8, టీచర్సు కాలనీ,<br>రాజమండ్రి-533 105. |
| కార్యవర్గ సభ్యులు | : శ్రీమతి N.A.S. కుమారి, 461509<br>డా॥ T. నాగమణి, 464023<br>శ్రీ పొక్కులూరి కృష్ణభాస్కర్<br>కుమారి కె. దుర్గాదేవి, 461818<br>శ్రీ పి. వి. సూర్యనారాయణమూర్తి<br>శ్రీ బి. వి. రమణ<br>శ్రీ M.V.V.S.N. మూర్తి |
| వ్యవస్థాపకులు | : శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు<br>© 881811,<br>104 కల్యాణ్‌నగర్ III ఫేస్<br>హైదరాబాద్ - 500 018. |

# విచిత్ర రామాయణము - పూర్వ రంగము

శ్లో॥ చరితం రఘునాథస్య । శతకోటి ప్రవిస్తరం
ఏకైక మక్షరం ప్రోక్తం । మహాపాతక నాశనమ్

చతుర్ముఖ బ్రహ్మ పుత్రుడును దివ్యజ్ఞాన సంపన్నుడునగు వాల్మీకి మహర్షి నారదునివలన ఆదినారాయణుడు పదివేల సంవత్సరములకు భూలోకమున శ్రీ రాముడై యవతరించి రావణ కుంభకర్ణాది దుష్ట రాక్షసులను సంహరించి శిష్టులను రక్షింపగలడను విచిత్రమైన చరిత్రను నారదమహర్షి వలన నాలకించెను. నారదునివలన వినిన శ్రీరామ చరితమును వాల్మీకిమహర్షి శతకోటి శ్లోకములతో విలసిల్లు బృహద్గ్రంథముగా రచించి విచిత్ర రామాయణంబని పేరిడి తన శిష్యుడగు యజ్ఞదత్తుడను మునీంద్రున కుపదేశించెను.

యజ్ఞదత్తుడు గంగాతీరమునుచేరి స్నాన సంధ్యాద్యనుష్ఠానములు నెరవేర్చుకొని గురువగు వాల్మీకి మహర్షి యుపదేశించిన విచిత్ర రామాయణము నేకాగ్రచిత్తముతో పఠించుచు బ్రహ్మానందము ననుభవించు చుండెను. ఆ సమయమున శంఖకర్ణుడను గంధర్వు డచట కరుదెంచి యజ్ఞదత్తునిచూచి నీపేరేమని ప్రశ్నించెను. తన్మయత్వముతో రామాయణమును పఠించుచున్న యజ్ఞదత్తుడు శంఖకర్ణునకు సమాధాన మీయజాలడయ్యెను. అందుకు గంధర్వుడాగ్రహించి యజ్ఞదత్తుని సత్యలోకమునకు తీసికొనిపోయి యచట విడిచిపెట్టి యథేచ్ఛగా వెడలిపోయెను.

బ్రహ్మాది దేవతలు యజ్ఞదత్తుడు పఠించుచున్న విచిత్ర రామాయణము నాలకించి మిగుల యానందించు చుండెను. ఒక నాడు యజ్ఞదత్తుడు బ్రహ్మకు మ్రొక్కి దేవా! మా గురువగు

వాల్మీకి మహర్షిని దర్శింపవలెనని యున్నది. కాని యిచటినుండి యెట్లు వెడలవలెనో తెలియకున్నది. కావున నాయందు దయ యుంచి మా గురువర్యుని దర్శించు నుపాయము నొనతిమ్ము అని వేడుకొనెను. పితామహుడగు బ్రహ్మ యజ్ఞదత్తుని కోరికవిని సంతసించి నాయన! నీవు పఠించుచున్న రామగాథ మరల మరల వినవలెనను కోరిక మా కెల్లరకు కలుగుచున్నది కావున మీ గురువగు వాల్మీకి మహర్షిని సందర్శించి మరల వెంటనే మా కడకు రావలయును సుమా అని పలికి వాయువేగ మనోవేగము లతో సర్వలోకములుసంచరింపగల సామర్థ్యమొసంగెను. అందుకు యజ్ఞదత్తు డంగీకరించి బ్రహ్మకు మ్రొక్కి అనుమతి గైకొని గురువగు వాల్మీకిని సమీపించి ప్రదక్షిణ నమస్కారములుచేసి చేతులు జోడించి నిలబడెను.

వాల్మీకి యజ్ఞదత్తునిచూచి యాశ్చర్యపడి కుమార! చాల కాలమునకు తిరిగి వచ్చితివి. నీవు వెడలిన పిదప నేను రచించిన విచిత్ర రామాయణము లోకములో లేనందుకు విచారించి ఇరువది నాలుగువేల శ్లోకములతో శ్రీమద్రామాయణమును మరల రచించి పెక్కుమంది ముని పుత్త్రుల కుపదేశించి సీతాదేవి కొడుకులగు లవ కుశులకు బోధించు చుంటినని పలికెను.

అంత నాయజ్ఞదత్తుడు వాల్మీకి మునీంద్రునకు మ్రొక్కి జరిగిన వృత్తాంతమంతయు వివరించి చెప్పి తాను వాల్మీకికడ నుపదేశమందిన విచిత్ర రామాయణమును గురుసన్నిధానమున నుంచెను. ముని పుంగవుడగు వాల్మీకి తాను రచించిన విచిత్ర రామాయణము మరల తనకు లభించినందుకు మిగుల సంతసించి లవ కుశులకు దాని నుపదేశించి మరల నా గ్రంథమును శిష్యున కొసంగి చతుర్ముఖుని యాజ్ఞానుసారము అన్ని లోకములందును

ప్రచారము చేయుమని సెలవిచ్చి పంపెను. యజ్ఞదత్తుడు గురు వగు వాల్మీకి ఆదేశించినట్లుగా బ్రహ్మదేవుని యనుమతితో అన్ని లోకములలోను రామాయణ ప్రచారమునకు పూనుకొనెను.

భూలోకమున వాల్మీకి మహర్షి రామాయణము ప్రచారము చేయగా యజ్ఞదత్తునివలన నుపదేశమందిన ఆయాదివ్యమూర్తులు ఆయా లోకములలో చేసిన ప్రచార మీరీతిగానున్నది. భువర్లోక మున చంద్రుడు, సువర్లోకమున సంవర్తుడు, మహర్లోకమున పిప్పలుడు, జనోలోకమున జనకుడు, తపోలోకమున సనాత నుడు, సత్యలోకమున సనందుడు, చంద్రలోకమున మేధా కృత్తు, సూర్యలోకమున విఖనసుడు, పితృలోకమున యమ ముని, అతలమున సుదంకుడు, వితలమున సుమేధుడు, సుతలమున (శుక్రుడు) ఉశనుడు, రసాతలమున వికాశి, తలా తలమున దశశిరుడు, పాతాళమున హయగ్రీవుడు, నాగలోక మున క్రతుభుజుడును ప్రచారము చేసిరి.

శ్లో॥ వేదవేద్యే పరేపుంసి । జాతేదశరథాత్మజే
వేదః ప్రాచేత సాదాసీ । త్సాక్షాద్రామాయణాత్మనా

వేదవేద్యుడగు పురుషోత్తముడు దశరథ తనయుడై యవ తరింపగా వేదము రామాయణ రూపమున వాల్మీకి మహర్షి వలన అవతరించినది.

రామం అయతి రామాయణం రాముని పొందించునది రామాయణము రామః అయ్యతే అనేనేతి రామాయణం దీని వలన రాముడు పొందబడును కావున రామాయణము. రామస్య అయనం రామాయణం ఆనంద స్వరూపుడగు రాముని వాస

స్థానము రామాయణము. రామాయాః అయనం రామాయణం ఆనందస్వరూపిణి యగు జానకి వాసస్థానము రామాయణము. జయమను నామాంతరము కల రా మా య ణ ము శివాజ్ఞ వలన వాల్మీకి బుద్ధియందు ప్రతిబింబించెను.

అష్టాదశ వర్ణనలు కలది కావున రామాయణము మహా కావ్యము. ఏక పురుష వృత్తమితిహాసః అను వాక్యము ననుస రించి రాముడను మహాపురుషుని వృత్తాంతము కావున రామాయణ మితిహాసము. పురాపినవం పురాణం అనగా నిత్యనూతనమైన దగుట వలన రామాయణము పురాణము.

శ్లో॥ నవలక్షాని కాండాని । శతకోటి మితే ద్విజ
సర్గా నవతి లక్షాశ్చ । జ్ఞాతవ్యా ముని కీర్తితాః

రామాయణమున తొమ్మిది లక్షల కాండలు. నూరు లక్షల (కోటి) శ్లోకములు 90 లక్షల సర్గములు కలవు. గాయత్రీ మంత్రా క్షరము లిరువది నాలుగును ఆయాస్థలములందు చేర్చి వాల్మీకి రామాయణమును రచించెను.

ఉత్తర భారతదేశమున నివసించు నొక బ్రాహ్మణుడు హరి ద్వారమునకేగి తపమొనరించు చుండెను. వాని యదృష్టమున రామాయణ ప్రబోధము చేయుచు లోకసంచారము చేయుచున్న యజ్ఞదత్తు డొకనాడు తపమొనరించుచున్న యా బ్రాహ్మణునకు గోచరించెను. అంత నా బ్రాహ్మణు డానంద బాష్పములు రాల్చుచు భక్తి శ్రద్ధలతో యజ్ఞదత్తుని పాదపద్మములకు మ్రొక్కి మహాను భావ ! నీవు బ్రహ్మతో సమానుడవు. అరిషడ్వర్గమును జయించి నిరంతరము శ్రీ హ రి నారాధించు చుందువు అని ప్రశంసించి

మునీంద్రా ! పునరావృత్తి రహితమగు సాయుజ్య(మోక్ష)మును బడయు నుపాయము నెఱింగింపుమని ప్రార్థించెను.

బ్రాహ్మణుని పలుకులకు యజ్ఞదత్తుడు సంతసించి నీకుల గోత్రముల నెఱింగింపుము. నీ కోరిక నెరవేర్చెదనని పలికెను. అంత నా బ్రాహ్మణుడు యజ్ఞదత్తుని చూచి యోపూజ్యుడ ! నా పేరు సిద్ధేశ్వరదాసు. నేను బ్రాహ్మణుడను. నాకు సన్మార్గము నుపదేశింపుమని కోరెను. యజ్ఞదత్తుడు సిద్ధేశ్వరుని ప్రార్థనము నంగీకరించి నాగరలిపిలోనున్న విచిత్ర రామాయణము నిచ్చి దీనిని పఠించిన నీ యభీష్టము సిద్ధించును. కైవల్యమును బడయుదువు అని పలికి యంతర్థానమయ్యెను. ఆ సిద్ధేశ్వరదాసు ఓఢ్ర (ఒరియా) భాషలో విచిత్ర రామాయణమును రచించి లోకమునకు తెలియ జేసెను.

భారద్వాజ గోత్రుడగు గోపీనాథు డొరియా భాషనుండి విచిత్ర రామాయణమును తెలుగు భాషలో వచన గ్రంథంగ రచించెను. తెలుగులో వచనమున రచింపబడిన యా మహా గ్రంథమును గద్యపద్యాత్మక మగు తెలుగు గ్రంథముగా రచింపదలచి శ్రీ నరసింహదేవర వేంకటశాస్త్రిగారు ఈ మహాకార్యమును పూర్తి చేయుటెట్లా యని విచారించుచు పరుండి కన్నులు మూసికొని శ్రీహరి పాదారవిందములు ధ్యానించుచున్న సమయమున ఇందీవరశ్యాముడు కనకాంబర భూషణాలంకృతుడునైన దివ్య పురుషుడు గోచరించి వత్స ! నా తోడ్పాటుతో నీవు సంకల్పించిన మహత్కార్యము తప్పక నెరవేరునని పలికి మెఱపువలె మాయమయ్యెను. పరమేశ్వరుని యానతిననుసరించి యా కవితల్లజుడు విచిత్ర రామాయణము రచించి శ్రీరామచంద్రుని కృపకు పాత్రమయ్యెను.

శ్రీ శ్రీ శ్రీ సర్వారాయ విద్యానిధి స్థాపక నిర్వాహకులలో నొకరును హరికథా పాఠశాలను వేదపాఠశాలను రెండు నేత్రముల వలె చూచుకొను చున్నవారును రెండు పాఠశాలలో పనిచేయు చున్న యొజ్జలను గౌరవాదరములతో చూచుచున్నవారును రెండు పాఠశాలలలో విద్యనభ్యసించుచున్న విద్యార్థినీ మణులను విద్యార్థులను సుతనిర్విశేషముగా సాకుచున్నవారును నన్నయ పీఠవ్యవస్థాపకులును సనాతన ధర్మ పరిరక్షణకు కంకణముగట్టుకొన్నవారును సంగీత సాహిత్య పరిపోషకులును వేదపరి రక్షణకు సంప్రదాయ బద్ధమగు హరికథా గానమునకు పూనుకొన్న మహనీయులును సౌజన్యమూర్తులును నగు శ్రీ శ్రీ శ్రీ శ్రీ బలుసు ప్రభాకర బుచ్చి కృష్ణ సత్యనారాయణరావు దొరవారి యాదేశము ననుసరించి సులభవచనమున రచింపబూనుకొని ఆదికవియగు వాల్మీకిమహర్షికి మ్రొక్కి కథా ప్రారంభము చేయుచుంటిని.

రాంపల్లి శ్రీరామచంద్రమూర్తి

2-8-98 వ తేదీ ఆదివారం

శ్రీ జూలూరి వీరేశలింగం స్మారక సాహిత్య

కార్యక్రమంలో భాగంగా

"విచిత్ర రామాయణము"

ఆవిష్కరణము

నిర్వహణ :

భారతీయ సాహిత్య పరిషద్

రాజమండ్రి.

# విచిత్ర రామాయణము

## బాలకాండ

ఇంద్రప్రస్థ పురము నేలుచున్న ధర్మరాజు రాజసూయ యాగమారంభించెను. యాగమున కరుదెంచిన దుర్యోధనుడు పాండవుల యౌన్నత్యమున కీసు జెంది మనసులో కలతచెందెను. ఒకనాడు మయసభను సందర్శింపనేగి యసాధారణమైన యా సభా భవనము నందలి వింతలను చూచి యబ్బురపడెను. నీరు లేనిచోట నున్నదనియు నీరున్నచోట లేదనియు భ్రమపడి, తికమక పడు చున్న దుర్యోధనుని చూచి భీముడును ద్రౌపదియు నవ్విరి. ద్రౌపదీ భీమసేనుల హాసము పరిహాసముగా నెంచి దుర్యోధనుడు అవమానముగా భావించెను.

దుర్యోధనుడు మయసభ వెలువడి హస్తినాపురము చేరి ధృతరాష్ట్రుని సమీపించి తండ్రీ! పాండవులు రాజసూయ యాగమునకు నన్నాహ్వానించి యపహాస్యము చేసిరి నేను జీవింప వలెనని మీకున్న యెడల వెంటనే పాండవులను హస్తినాపురికి రావింపుడని పట్టు పట్టెను.

ధృతరాష్ట్రుడు తనయుని మాట కాదనలేక ఏదియో నెప ముతో పాండవులను రాజధానికి రావించెను. భీష్ముడు విదురుడు మున్నగు పెద్దల సలహాలను పెడచెవినిబెట్టి దుర్యోధనుడు శకుని మున్నగు వారి దుర్బోధలనాలకించి ధర్మరాజును జూదమునకంగీ కరింప జేసి మాయజూదమాడి ధర్మరాజు నోడించెను. ద్యూతము నందలి నిర్ణయము ననుసరించి యుధిష్ఠిరుడు సోదరులగు భీమా ర్జున నకుల సహదేవులతోను ద్రౌపదితోను అరణ్య వాసమునకు బయలుదేరెను.

ధర్మరాజాదులు ఒక వనమున ప్రివేశించి యా వన సౌంద ర్యమునకు ముగ్ధులై యచట కొంతకాలము నివసింపదలచి కుటీ రములు నిర్మించుకొని నివసించుచుండిరి.

ఏడు ప్రిళయములను కనులార గాంచిన చిరంజీవియు, అనేక కళలయందు నిపుణుడును, మహాతేజస్సంపన్నుడును నగు మార్కండేయ మహాముని పాండవులు నివసించు వనమున కరుదెం చెను. ధర్మరాజా మహర్షికి స్వాగతము పలికి, ఆశ్రమమునకు తోడ్కొనిపోయి యర్ఘ్యపాద్యాదు లొసంగి యర్చించి సుచితాస నాసీనుని జేసెను. మార్కండేయ మహర్షికి అజాత శత్రువు మ్రొక్కి దయా సాగర ! తమ రాక వలన మేము కృతార్థులమై తిమి. పురాకృతము వలన రాజ్యమును కోల్పోయి యీ భీకరార ణ్యమున పడరాని పాట్లు పడుచున్న మాకు మీ పాద పద్మ సంద ర్శనము అమితానందమును కలిగించినది. మా కష్టములు గట్టెక్కి నట్లే భావించుచుంటిమి. మావలె నడవులలో నిడుమలు పడిన మహా రాజు లెవరైన నున్న యెడల మా యందు దయ యుంచి యట్టి మహారాజుల చరిత్రలు వివరింపుడు అని ప్రార్థించెను.

ధర్మరాజు పలుకు లాలకించి మార్కండేయుడు ఈ రీతిగా చెప్పదొడంగెను. కౌంతేయా ! ధర్మజ ! హరిశ్చంద్రుడు నలుడు శ్రీరాముడు మున్నగు మహారాజులు మహారణ్యములలో నెన్నియో యిక్కట్టు లనుభవించియు ధర్మమార్గమును వీడక యఖండ కీర్తి నార్జించిరి. సోదరులతోను పెక్కుమంది విప్రవరులతోను మహర్షుల తోను, పరివేష్టితుడవగు నీకి వనవాసమెట్లు దుస్సహమగును ? ధర్మజ ! కలిమి లేములు విచిత్రమైనవి. వానిని గూర్చి యెంత మాత్రమును చింతింప బనిలేదు. తాము చేసిన కర్మ ఫలము నను భవించుచు దైవమును దూఱదగునా ?

మార్కండేయ మునీంద్రుని యూరడింపు పలుకు లాలకించి ద్రౌపదియు పాండవు లేవురును మహర్షికి మ్రొక్కి మునిసత్తమా ! లక్ష్మీ నారాయణులు సీతారాములై యవతరించి యడవులలో పలుకష్టము లనుభవించిరన్న మీ పలుకులు విని మేము మిగుల నాశ్చర్య పడుచున్నాము పరాభవానల పరిదగ్ధములగు మా మనసులకు శ్రీరామ కథామృత వృష్టితో చల్లదనమును సమకూర్చుడని వేడుకొనిరి. వారి ప్రార్థనము నంగీకరించి మునిచంద్రు డిట్లు చెప్ప దొడంగెను.

పురుషోత్తముడగు నాది నారాయణుడు కౌసల్యా దశరథులకు తనయుడై యవతరించెను. ప్రకృతి స్వరూపిణియగు శ్రీ మహాలక్ష్మి భూ పుత్రికయై యవతరించినది. సీతారాముల పావన చరితమే శ్రీ మద్రామాయణముగా విఖ్యాతి బడసినది.

శ్రీరాముడు విశ్వామిత్రుని యాగమును రక్షించి అహల్య నుద్ధరించి శివుని విల్లు విఱిచి సీతను పరిణయమూడెను. పరశురాముని గర్వము నణచి యయోధ్యకు చేరి పితృ వాక్య పరిపాలనకై సీతా లక్ష్మణులతో పదునాలుగేండ్లు వనవాసమొనరించి రావణుడు కపట వేషముతో సీత నపహరింపగా సామాన్య మానవునివలె దుఃఖించెను. సుగ్రీవుడు ఆంజనేయుడు మున్నగు వానరుల చెలిమి చేసి హనుమంతుని వలన సీత జాడ తెలుసుకొని సముద్రమునకు సేతువు నిర్మించి లంకలో ప్రవేశించి రావణ కుంభ కర్ణాది దానవులను సంహరించి విభీషణునకు పట్టాభిషేకము చేసెను. సీతా లక్ష్మణులతో పుష్పక విమానముపై నయోధ్య కేతెంచి పట్టాభిషిక్తుడై సహధర్మచారిణియగు జానకితో గూడి సమస్త రాజ భోగముల ననుభవించుచుండెను.

ఒకనాడు పరమేశ్వరుడు కైలాసమున కొలువుదీరి యుండెను దేవతలు మహర్షులు పార్వతీ పరమేశ్వరులను సేవించు చుండిరి. శంకరుని యాహ్వానముపై విచ్చేసిన పరమేష్ఠి యుచితాసనాసీనుడై యుండెను. చంద్రశేఖరుడగు శివుడు సభనంతయూ కలయజూచి బ్రహ్మ నుద్దేశించి యిట్లు పలికెను. చతురానన ! శ్రీమన్నారాయణుడు భూభారమును తొలగించుటకై శ్రీరాముడై యవతరించి రావణాదులను సంహరించి శిష్ట రక్షణ మొనరించెను. కావున నిక శ్రీహరి భూలోకమున నుండవలసిన పనిలేదు. భృగు మహర్షి శాపము వలన శ్రీరాముడు తన సామర్థ్య మెరుంగక మానుష భావమున మెలగుచుండెను.

శ్రీహరి రామావతారము చాలించి తొందరగా వైకుంఠమున కరుదెంచు నుపాయ మాలోచింప వలయును అని యాజ్ఞాపించెను. బ్రహ్మ క్షణకాలము కన్నులు మూసికొని యోచించి శ్రీరాముడు భార్యాలోలుడై పూర్వస్మృతి పోగొట్టుకొని యున్నాడు. కావున సీతారాముల కెడబాటు కలిగింప వలయునని యాలోచించి ముక్కంటి యనుమతిని బడసి సరస్వతితో నిట్లు పలికెను. వాణీ ! నీవు శ్రీరాముని యంతరంగమున ప్రవేశించి జానకీ రాఘవులకు వియోగము కలిగింప వలయును అని యాజ్ఞాపించెను. పతి యానతి సతులక నుల్లంఘనీయము కావున సరస్వతి శ్రీరాముని మనమున ప్రవేశించెను.

కౌసల్యా దశరథుల తనయుడగు శ్రీరాముడు ప్రజలెల్లరు తనను ధర్మ స్వరూపుడని పొగడు చుండ ధర్మ మార్గమున రాజ్య మేలుచుండెను. శ్రీరాముడును జానకీ సహితుడై సర్వ భోగములనుభవించుచుండెను. సీత చూలాలని విని శ్రీరాముడు మిగుల నానందముతో సీతను సమీపించి మానినీ ! గర్భవతులగు సతుల

కోరికలు దీర్చుట పతుల ధర్మము. కావున ననుమాన ము మాని మనసులోని కోరిక తెలియ జేయుమని లాలించి యడిగెను. దైవ ప్రేరణము వలన జానకి ముని కన్యలతో గూడి వనములో విహరింప వలెనని మనసుగా నున్నదని పలికెను. మైథిలియొక్క వింత కోరిక విని దశరథరాముడు కొంత తడవాలోచించి జానకీ ! నీ యభీష్టమును తప్పక నెరవేర్తునని పలికెను.

ఒకనాటి రాత్రి ఇంద్రదమూయ మేల్కొలుపగా శ్రీరాముడు లేచి పురజనులు తనను గూర్చి యేమనుకొనుచున్నారో తెలియగోరి మారువేషమున నగరమున తిరుగజొచ్చెను.

ఒక చాకలిపడుచు పరపురుషునితో కులుకుచున్నదని భర్త యనుమానించి భార్యను దండింపబోగా ఆమె యా నగరములోనే యున్న పుట్టింటికేగెను. ఆ పిల్ల తండ్రి కుమార్తెను కొందరుబంధు మిత్రులను వెంటబెట్టుకొని యల్లుని యింటికేగి అల్లుని మందలించెను. అప్పుడా రజకుడు మామా ! పరాయివాని యింటనున్న యిల్లాలి నేలుకొనుటకు నేను వెట్టి రాముడనుకాను. శ్రీరాముడు మహారాజు కావున రావణుడు సీతను చెరబట్టిన విషయమును ఎదుట విమర్శింపలేక చాటున గుసగుసలు వోవుచున్నారు. శీలము లేని భార్య నింట బెట్టుకొని లోకములో తలయెత్తుకొని జీవించు టెట్లు ? అని రోషముతో తీవ్రముగా పలికెను.

శ్రీరాముడు రజకుని పలుకు లాలకించి కలత చెందిన మనసుతో మందిరమునకేగెను. మరునాడుదయము శ్రీరాముడు లక్ష్మణుని రావించి సోదరా ! నీవు వెంటనే సీత నడవిలో విడచి రావలెనని యాజ్ఞాపించెను.

లక్ష్మణు డన్న యాజ్ఞ విని గడగడ వణకుచు గద్గద స్వరముతో ప్రభూ ! మూర్ఖుల పలుకు లాలించి జానకి నరణ్యములో

విడచుట న్యాయమా ? బ్రహ్మేంద్రాది దేవతలు మన తండ్రి యగు దశరథుడు "సీత" మహాసాధ్వి యని ప్రశంసించుచుండగా సీత అగ్ని మధ్య నుండి దివ్య తేజస్సుతో వెలువడి వచ్చినది. సీత యందిసుమంత దోష మున్నను వీతి హోత్రుడు బూడిద చేయక విడచునా ? నీచుల పలుకులు నమ్మ దగదని విన్నవించెను.

శ్రీరాముడు సౌమిత్రి పలుకులాలకించి తమ్ముడా ! భూ తనయయగు సీతతోడి పొత్తికచాలును మునికాంతలతో వనములో విహరింప వలెనని జానకి కోరినది. కావున ఆ నెపముతో వైదేహిని తీసికొనిపోయి యరణ్యములో విడచి రమ్ము. అని యాజ్ఞాపించి సీతను తన కడకు రావించి జానకీ నీవు లక్ష్మణునితో నేగి ముని కన్యలతో వనవిహార మొనరింపుమని పలికెను,

సీత సంతసముతో భర్త పాద పద్మములకు మ్రొక్కి ముడ్వురత్తలకు నమస్కరించి యనుమతి వేడినది. కౌసల్య జానకిని చూచి గర్భవతులు వన విహారము కోరదగునా యని మందలింపగా కైక కౌసల్యను చూచి అక్కా ! గర్భవతుల మనసు దీర్పక పోవుట తగదుసుమా యని పలికెను. కౌసల్య కొంత సేపు యోచించి జానకీ ! రామాజ్ఞ మీరరాదు కావున లక్ష్మణుని వెంట వెళ్ళి మునికాంతలతో వనవిహార మొనరించి తొందరగా తిరిగి రమ్మని యనుమతించెను. అప్పుడు సీత యత్తలకు ముడ్వురకు మ్రొక్కి దీవనలందెను.

సీత మగని పాదపద్మములు మనసులో నిలుపుకొని లక్ష్మణుడు తెచ్చిన రథమెక్కి ఆనందముగా వనవిహారమునకు బయలు దేరెను. విధినతిక్రమించుట యెవ్వరికిని సాధ్యముకాదు కదా ! మార్గమున కనుపట్టు రకరకముల చెట్లయొక్క పేర్లడిగి తెలిసికొనుచు అడవిలోని పలువిధములగు జంతువులను పరికించుచు సీతా

లక్ష్మణులు రథముపై పయనించుచుండగా పెద్ద పెద్ద కొండలు రథగమనమున కడ్డముగా నున్నవని సారథి పలుకగా జానకియు సౌమిత్రియు స్యందనమును దిగిరి. లక్ష్మణుడు సారథిని పిలిచి యారథమును నగరమునకు తీసికొని పొమ్మని యాదేశించెను.

సీతా లక్ష్మణులు పాదచారులై మునుల నివాసముల కభిముఖముగా పయనింపసాగిరి. కొండలతో, రాళ్ళతో, ముళ్ళతో దుర్గమముగా నున్న యడవి దారిని నడచుచు నెండలేమికి క్రింద పాదములు పైన శిరములు మాడుచుండ సీతా లక్ష్మణులు నడచి నడచి యొక కొలను సమీపించిరి. కొలనిలోని చల్లని నీటితో ముఖము కడుగుకొని దోసిలితో నీరు త్రాగుచున్న జానకి దుస్థితిని చూచి విధి నిర్ణయము నేమనగలము ? అని సౌమిత్రి మనసులో చింతించి సీతను చూచి తల్లీ! అడవి జంతువులు నీరు త్రాగుటకీ కొలనుకడ కరుదెంచు సమయమైనది. ఇక నిచట నుండదగదు ఆ మఱ్ఱి నీడను విశ్రమింపవచ్చును. రమ్ము. అని పలుకగా జానకి స్వయంకృతాపరాధమునకు వగచుచు మెల్లగా మఱ్ఱిచెట్టును సమీపించి సౌమిత్రీ ! మార్గ శ్రమ దీరుటకిచట విశ్రమించి వెళ్ళుదమని పలికి చీర చెరగు పరచుకొని పవ్వళించి చెఱువు నుండి వచ్చు చల్లని గాలికొడలు మరచి నిద్రించెను.

సీతను విడచి వెళ్ళుట కిదియే తగిన సమయమని లక్ష్మణుడు నిశ్చయించుకొని యొక యాకుపై లేఖ వ్రాసి సీత కెదురుగా కనుపించునట్లు చెట్టుకొమ్మకు వ్రేలాడగట్టి పెక్కు రీతులుగా విలపించుచు నగరాభిముఖముగా బయలుదేరి మాటి మాటికి దిరిగి చూచుచు స్వతంత్రములేని కింకరుని జీవితము వ్యర్థము కదా యని వగచుచు సాకేతపురమును చేరి ఖిన్నుడై రాముని యెదుట నిలబడెను.

శ్రీరాముడు దైవయోగమున సీతను విడచెనే కాని జానకి పై నపరిమితానురాగము కలదు. కావున వియోగమువలన దుఃఖావేశము పొంగి పొరలగా క్షణకాల మూరకుండి లక్ష్మణుని చూచి సీత నెచ్చట విడచి వచ్చితివని ప్రశ్నించెను. లక్ష్మణుడు గద్గద స్వరముతో ప్రభూ ! దుర్గమారణ్యమున ఏకధారయను పర్వత సమీపమునగల కొలని దగ్గర నున్న మఱ్ఱి నీడ నొడలు మరచి నిద్రించుచున్న వదినను నీ యాజ్ఞానుసారము విషయము నొక యాకుపై వ్రాసి చెట్టుకొమ్మకు వ్రేలాడగట్టి వచ్చితిని. ఏ క్రూర మృగములకైన నెరకాగలదేమో యని భోరుమని యేడ్చుచున్న తమ్ముని చూచి శ్రీరాముడు సీతపైగల ప్రేమాతిశయముతో కుమిలి కుమిలి యేడ్చుచుండెను. తల్లులు అంతఃపురస్త్రీలు పురోహితులు అమాత్యులు సేవకులు మున్నగువారు రాముని చూచి యాక్రందనము చేయసాగిరి.

కొంత సేపటికి వశిష్ఠాది మహర్షు లరుదెంచి రాముని చూచి నీచుల పలుకులు విని నిరపరాధిని యగు సీతను విడిచిపెట్టి యిప్పుడు వగచిన నేమి ప్రయోజనము ? భార్యా రహితునకు కర్మలోపము కలుగును. కావున సత్కుల సంజాతయగు నొరి యొక కన్యను పరిణయము చేసికొమ్మని పలికెను. రాముడు గురువగు వశిష్ఠునకు మ్రొక్కి మునీంద్రా ! సీతను పెండ్లియాడు నప్పుడు ఏకపత్నీ వ్రతము నవలంబింతునని ప్రతిన బూనితిని. కావున మరల వివాహము తగదని విన్నవించెను. వసిష్ఠుడు క్షణకాలము యోచించి రామా ! బంగారు సీతను చేయించి కర్మానుష్ఠాన సమయమున దగ్గర నుంచుకొమ్మని చెప్పగా శ్రీరాము డంగీకరించెను.

వసిష్ఠ మహర్షి యానతితో సుమంత్రుడు విశ్వకర్మచేత బంగారు సీతను చేయించి తెచ్చెను. శ్రీరాముడు సీతా వియోగము

వలప కలిగిన దుఃఖమున మునిగి బంగారు సీతను దగ్గర నుంచు కొని కర్మానుష్ఠాన మొనరించుచుండెను.

ఈ విధముగా మార్కండేయ మహర్షి చెప్పుచుండగా నాల కించుచున్న దౌప్రది మునీంద్రుని పాదపద్మములకు మ్రొక్కి పురుషులు నిర్దయులు. నిర్దోషయగు జానకిని అడవిలో విడచిపెట్టు మని రాముడాజ్ఞాపించగా లక్ష్మణుడట్లు చేసెనని మీరు చెప్పిరి కదా! లక్ష్మణు డొంటరిగా విడిచిన పిమ్మట జానకి యెట్టి యిక్క ట్టులనుభవించెనో వివరముగా తెలియజేయుడని ప్రార్థింపగా మార్కండేయ మునీంద్రు డిట్లు చెప్పదొడగెను.

ఒంటరిగా మఱ్ఱి నీడలో నిద్రించుచున్న జానకి శోణాద్రి నెక్కి క్రింద పడినట్లు కలవచ్చి యదిరిపడి లేచి లక్ష్మణు డెదుట కనుపింపక లక్ష్మణా! యని పిలచుచు అయ్యో! లక్ష్మణుడు క్రూరమృగములకు చిక్కలేదుకదా! కొలనులో నీరు త్రాగుట కేగెనేమొ! అని వగచుచు సౌమిత్రీ! ఎచట కేగితివి? ఏలనో భయమగుచున్నది? నన్నిట్లు చిక్కుపెట్ట తగదు. ఎచట కేగితివో వెంటనే వచ్చి నా భయమును పోగొట్టుము. చాల యాలస్యమైనది. నన్నిట్లు విడచి వెళ్ళుట తగునా? లక్ష్మణ? దండకారణ్యమున నన్ను కంటికిరెప్ప వలె కాపాడితివి రాముడు ఖరదూషణాది రాక్షసులను సంహరించునప్పుడు నన్ను రక్షించితివి శూర్పణఖ నన్ను భక్షింపరాగ ఆ రక్కసిని శిక్షించి నా ప్రాణ ములు దక్కించితివి.

లక్ష్మణ! ఏమి పనిమీద వెడలితివో! ఇంత జాగు చేయ వచ్చునా? వెంటనేవచ్చి నన్ను కాపాడుమని దీనముగా నేడ్చుచు తిరిగి తిరిగి తాను శయనించిన మఱ్ఱి క్రింద కేగి యచట కేగుట కును ఏమి చేయుటకును తోచక అటు నిటు చూచుచు చెట్టుకొమ్మకు తగిలించి యున్న లేఖను చూచి యిట్లు చదువసాగినది.

తల్లీ ! జానకీ ! రావణునిచే చెఱబట్టబడిన నిన్ను వెట్టి రాముడు కావున నేలుకొనుచున్నాడు అని నీచులాడు పలుకులు విని, రాముడాగ్రహించి, నిన్నడవిలో విడచి రమ్మని నన్నాజ్ఞాపించినాడు. సేవకుడు రాజాజ్ఞను పాలింపవలెను కదా ! ఇచటకు సమీపమున నున్న మిథిలానగరమున కేగి నీ తండ్రియగు జనకు నాశ్రయింపుము.

జానకి లేఖయందలి విషయమును గ్రహించి కన్నీరు మున్నీరుగా నేడ్చుచు హా! లక్ష్మణా ! అనుచు మూర్ఛవోయెను కొంతసేపటికి మూర్ఛలేచి కన్నులుతెరచి నలుమూలలకు చూపులు నిగిడించుచు ఇంత చేసినను పతిప్రేమను విడువజాలక రోదింప సాగినది. లక్ష్మణుడు నన్నొంటరిగా విడిచి వెళ్ళుటకు నేనెంత వెగటు కలిగించితినో కదా ! కొంచెమైనను విషయము తెలుపడయ్యెగదా! ఏమిచేతును ? అని విలపించుచున్న జానకి కష్టమును చూడలేనట్లు సూర్యుడ స్తమించెను. అంతలో చంద్రు డుదయించి ముసురు చున్న చీకట్లను పారద్రోలుటకు ప్రయత్నించుచుండెను.

సీత మరల మూర్ఛపడి కొంతవడికి తెలివి వచ్చి భయముతో నిటు నటు తిరుగుచుండగా ఆ యడవిలోని శార్దూలాది క్రూర మృగములు పరుగులిడుచు వచ్చి సీతను చూచి మీద పడి తిన బోయినవి కాని తేజః పుంజము వలె వెలుగొందు చున్న జానకిని చూచి భీతితో నిలబడిపోయినవి. ప్రాణత్యాగము చేయుటకు తగిన యుపాయము కానక విలపించుచున్న జానకి క్రూరమృగములను చూచి తనను భుజింపుడని పలుకుచు సమీపింపగా సీతా సందర్శనము వలన క్రూరమృగములకు దివ్య జ్ఞానము కలిగి మానవ భాషలో నిట్లు పలికినవి. తల్లీ ! నీవు లోకమాతవు. నిన్ను తినము అని పలికి నమస్కరించి యాదరము చూపుచున్న యా క్రూర

జంతువులను చూచి సీత యిట్లు చింతింపసాగినది. భర్తచే విడువబడిన స్త్రీని మృత్యువు కూడా అంగీకరింపదను సామెత కల్లకాదు. క్రూర సత్వములు కూడ నన్ను తిన నొల్లకున్నవి ఏమి చేయుదును? విధి విధానమెట్లున్నదో కదా!

అట్లు విలపించుచున్న జానకిని చూచి యా మృగములు దేవి! ఈ యడవిలో నొంటరిగా తిరుగుచు నీవేడ్చుటకు కారణమేమి? అని యడిగినవి. అప్పుడు సీత యిట్లు సమాధానమిచ్చినది. మిత్రులార! నా భర్తయగు శ్రీరాముడు నిరపరాధినగు నన్నీ యడవిలో విడిచి రమ్మని తమ్ముడైన లక్ష్మణు నాజ్ఞాపించి నన్ను నిందలపాలు చేసినాడు. పతికి వెగటైన సతి జీవించి యేమి ప్రయోజనము? నన్ను భుజించి నా కష్టములకు విముక్తి కలిగింపుడని ప్రార్ధించెను.

మృగములు సీతను చూచి భీతిల్లి తల్లీ; తేజోరూపిణివైన నిన్ను తినజాలము. మమ్ము కాపాడుము. అని మ్రొక్కి సీత కెట్టి యిక్కట్టును కలుగకుండునట్లుగా నలువైపుల తాము నిలచి సీతను కాపాడజొచ్చినవి సీత మిగుల దుఃఖించుచు పెద్దపులి మున్నగు జంతువులు తన కండగా నుండి సేవించుచుండగా పతి పాదపద్మములను మనసులో నిలుపుకొని ధ్యానించుచు నతికష్టముపై నా రాత్రి గడిపెను.

సూర్యోదయ సమయమున లేచి జానకి కొలనున కేగి స్నానాది కృత్యములు నెరవేర్చుకొని నలుప్రక్కల నుండి తనను కాపాడుచున్న మృగములను చూచి స్నేహితులారా! ఈ ఘోరారణ్యమున నెచటనైనను మునుల యాశ్రమము లున్న యెడల నన్ను తోడ్కొని పొండు అని వేడుకొన్నది. అంత నా మృగములు సీతతో తల్లీ! ఇచటకు సమీపమున వాల్మీకి మహాముని

యాశ్రమమున్నది. అని తెలుపగా సీత వెంటనే తనను వాల్మీకి ఆశ్రమమునకు తోడ్కొని పొండని మృగములను వేడుకొనెను.

మృగము లందుల కంగీకరించి నలుప్రక్కల తాముండి సీతనుమెల్లగా నడిపించుచు నడువలేనప్పుడు విశ్రాంతికై కూర్చుం డుటకు సౌకర్యములు కలిగించుచు ఆ యడవిలో లభించు మధుర మైన ఫలములను తెచ్చియిచ్చి తినిపించుచు సీత కేవిధమైన శ్రమము కలుగకుండ నాలుగు మాసములకు వాల్మీకి మహర్షి యాశ్రమమునకు చేర్చినవి.

గర్భ భారముతో. కలవరపడుచున్న మనస్సుతో కన్నీరు కార్చుచు సీత అతి కష్టముగా వాల్మీకి మహర్షిని సమీపించి చేతులు జోడించి నిలబడినది. జానకిని చూచి మహర్షి దిగ్గున ఆసనము నుండి లేచి తల్లీ! ఈ దుర్గమారణ్యమున నెచటకు పయనమైతి వమ్మా! రాముడు నిర్ధయగా నిన్నీ ఘోరారణ్యమున విడుచు టకు కారణమేమి ? నా బిడ్డలాంటి దానవు బిడియ పడక కుటీ రము లోనికి రమ్మి. అని పలికి లోనికి తీసికొని వెళ్ళి యుపచార ములు చేసి బడలిక తీరునట్లు చేసి మునికన్యలను చూచి యీమె లోకమాత. రాముని యిల్లాలు మీరెల్లరు నీమె నాదరించి సేవ లొనరింపుడని చెప్పి యప్పగించెను.

సీత వాల్మీకి పాదపద్మములకు మ్రొక్కి తన వృత్తాంత మును విన్నవించి నిరపరాధిని నగు నన్నీయడవిలో విడిచి రమ్మని శ్రీరాముడు లక్ష్మణుని నియోగించుటయు లక్ష్మణుడు రాజాజ్ఞాను సారము తనను నిర్జనారణ్యమున విడచి వెళ్ళుటయు క్రూరమృగములు తనపై జాలిపడి మహర్షి యాశ్రమమునకు చేర్చుటయు వివరించి చెప్పి భర్త పాదపద్మములను ధ్యానించుట తప్ప అన్య మెరుగని నాకు మీరేదిక్కు త్రికాలజ్ఞులైన మీరు

దివ్య దృష్టితో నా విషయమును గ్రహించి నన్ననుగ్రహింపుడు. అని ప్రార్థించెను.

సీత కోరిక ననుసరించి వాల్మీకి దివ్య దృష్టితో నంతయు గ్రహించి జానకీ ! నీవు నిరపరాధినివి. మహాపతివ్రతవు. దైవ నిర్ణయము నెవ్వరు నతిక్రమింపజాలరు. పదిదినము లిచ్చట విశ్రమించిన పిదప మిధిలా నగరమునకు మా తండ్రి కడకు తోడ్కొని పోవుదునని పలికి యనునయించెను.

సీత మునికన్యలతోగూడి పది దినములు పది క్షణముల వలె గడపినది. అంత నా బ్రహ్మ తనయుడగు వాల్మీకి దండకమండలములు చేతబట్టి ముందు నడువగా సీతవెనుక నడువ సాగినది. దారిలో నచ్చట నచ్చట విశ్రమించుచు అతి కష్టముపై నడచుచు జానకియు వాల్మీకియు మిథిలానగరమునకు క్రోశ మాత్ర దూరము చేరిరి. గర్భభారముతో జానకి యిక ముందున కడుగు వేయజాలక పోయినది, ప్రసవవేదనతో చెట్ల గుబురుల లోని కేగినది. వెనుక వచ్చుచున్నదను భ్రమతో కొంత దూర మేగిన వాల్మీకి వెనుదిరిగి చూచి జానకీ! మిథిలానగరము దాపున కరుదెంచితిమి. రమ్ము మెల్లగా వెళ్ళుదము అని పలికెను. సీత లేచి ముందు కడుగు వేయబోయి కన్నులు తిరిగి చీకట్లు కమ్మి నట్లనిపించి తెలివి తప్పి మూర్ఛపోయెను.

వాల్మీకి కమండలములోని జలముతో సీత కన్నులు తుడిచి సేద దీర్చగా నామె లేచి కూర్చుని మునీంద్రా ! మిగుల బాధ కలుగుచున్నది. ప్రసవ వేదన కావచ్చును. వెంట స్త్రీ లెవ్వరును తోడులేరు. నీవు దక్క నాకు వేరు దిక్కులేదు. అని దీనముగా పలుకగా వాల్మీకి సీతకు ధైర్యము గఱపుచు పొదనుండి వెలుపలి కరుదెంచెను.

ఇంతలో సీత యొక్క గర్భమనెడి యుదయాద్రి గుహ నుండి పుత్త్రుడను దివాకరుడుదయించెను. ఇంకను సీత ప్రసవ వేదన పడుట చూచి వాల్మీకి మంత్రించిన జలములు జానకి కొసంగెను. మంత్ర జలము తీసికొన్న వెంటనే సీత యొక్క కడుపు కడలి నుండి తనయుడను సుధా కరుడుదయించెను.

మబ్బులులేని యాకసమున తూర్పు దిక్కను కాంత సూర్య చంద్రులను ఒకేసారి ప్రసవించినట్లు జానకి యిరువురు పుత్త్రులను ప్రసవించి విలసిల్లెను. చిగురుటాకులు తెచ్చి మహర్షి యందివ్వగా ప్రక్కగా నమర్చి బిడ్డలను పరుండబెట్టి జానకియు నిద్రించెను. బిడ్డలను ప్రక్కలో వేసికొని నిద్రించుచున్న జానకిని చూచి మహర్షి మిగుల సంతసించెను.

ఆ సమయమున నొక వేటగాడరుదెంచుట చూచి ముని ఓయీ ! నీ వెవ్వడవు ? ఇచటకేల వచ్చితివి ? సత్యము పలుకుమని యడుగగా నా బోయవాడు మహర్షికి మ్రొక్కి మునీంద్రా ! నేను జనక మహారాజు సేవకుడను నన్ను సురేఖుడందురు కంద మూలాదుల నిమిత్త మరుదెంచితిని. అని విన్నవించగా వాల్మీకి యిట్లు పలికెను. సురేఖా ! నీవు వెంటనే నగరమున కేగి జనక మహారాజును సందర్శించి వాల్మీకి ముని నగర సమీప వనములో నున్నారు. వెంటనే మిమ్ము రమ్మనిరి. అని తెల్పుము. అని పలికెను. వెంటనే సురేఖుడు మిథిల కేగి జనకుని దర్శించి మ్రొక్కి మహారాజ ! వాల్మీకి మహా మునీంద్రులు నగరము వెలుపలగల వనములో నున్నారు. తమ నచటకు విచ్చేయ వలసినదని సెల విచ్చిరి. అని విన్నవించెను.

జనకుడు శిష్యులను వెంట నిడుకొని వాల్మీకి కడకరుదెంచి చరణార వింద ములకు మ్రొక్కి ఋషి సత్తమ ! పూర్వ పుణ్యము

షండి మీ పాద సేవ చేయు భాగ్యమబ్బినది. కామక్రోధాది శత్రువులను చిద్రామార్పిత చిత్త వృత్తి యను వజ్రపు దెబ్బచే ఖండించి యోగవిహారము చేయునట్లు వరమిమ్ము. మీరు మా గృహమున కరుదెంచి మీ పాదధూళిచేత మా పాపములు పోగొట్టి మమ్ము కృతార్థుల చేయుడు. మీ రాకకు గల కారణము సెలవిండు అని పలుకగా వాల్మీకి మహారాజా! దిగులు చెందక నేను చెప్పిన దాలకింపుము. నీ పుత్రిక యగు జానకి గర్భవతియై యుండగా నీయల్లుడగు రాముడు సీత నడవిలో విడువబంచెను. ఇందు సీత తప్పేమియును లేదు నాల్గు నెలలు నడచి నడచి సీత అతికష్టముపై నా యాశ్రమమునకు చేరినది. ఆమెను నీ యింటికి తీసికొని వచ్చుచుండగా నీ వనములో నిరువురు పుత్రులను ప్రసవించినది. అని పలికి పొదరింటిలో చిగురుటాకులపై పరుండి సూర్య చంద్రులవలె వెలుగొందుచున్న బిడ్డలను జానకిని మహారాజునకు చూపెను.

అంతలో సీత నిద్రలేచి తండ్రికి మ్రొక్కి విలపిల్లు చుండెను. జనకుడు జానకి నూరడించి తల్లీ! రాము డడవిలో నిన్నొంటరిగా విడిచి పెట్టుటకు కారణమేమి? తెల్పుము. అని పలుకగా సీత యేమియు పలుక జాలక సాభిప్రాయముగా మహర్షిని తిలకించినది. మహర్షి జానకి మనోభావమును గ్రహించి జనకునితో మహారాజా! సీత మహాసాధ్వి పుణ్యాత్మురాలు. నిరపరాధిని. దైవయోగమున రాముడు సీతను పరిత్యజించెనే కాని యామె యందిసు మంతయు దోషములేదు. మిగుల నలసిపోయినది. కావున నేమియు పలుకజాలకున్నది. వెంటనే గృహమునకు తీసికొనిపోయి తగిన పరిచర్య లొనరింపుము అని పలికెను. జనకుడు మారుమాటాడక యీ వాల్మీకి మహర్షి మన పాలిటి దైవము సుమా యని మ్రొక్కి జానకిని పసిబిడ్డలను తీసికొని మిథిలకు బయలుదేరెను.

జానకిని వాల్మీకిని పసిబిడ్డలను జనకమహారాజును చూచి పురకాంత లెదురువచ్చి యంతఃపురమున కరుదెంచిరి. రాజర్షి యగు జనకుని ఇల్లాలగు సుమేధ మున్నగు వారు సీతను చూచి కౌగిలించుకొని యూరడింపు మాటలు పలికి విశ్రాంతిగా పరుండ బెట్టి పసిబిడ్డలకు పరిచర్యలు చేయసాగిరి.

సీతకు వచ్చిన కష్టమునకు దుఃఖించుచున్న సుమేధాదుల ననునయ వచనములు పలికి యూరడించి వాల్మీకి మహర్షి జనకుని పరికించి రాజేంద్ర ! సీతకొడుకులకు జాత కర్మాది విహిత కృత్యము లొనరింప వలెనని పలుకగా జనకు డానందముతో శతానందాది పురోహితులను రావించి యథా శాస్త్రముగా జాత కర్మము నొన రించి విప్రులకు పెక్కు దానము లొసంగెను. స్త్రీలు సీతకు మంచి వస్త్రము కట్టబెట్టి నడుము బిగించికట్టి యింగువ ప్రమింగించిరి. బాలురకు నూనెరాచి పసుపుతో నలుగు లిడి నీరుపోసి శ్రీరామ రక్ష యని పిల్లల చుట్టును నీరు త్రిప్పి తుడిచి పొత్తిళ్ళలో పెట్టిరి. శుక్ల పక్ష చంద్రబింబములవలె దినదిన ప్రవర్ధమానులగుచున్న యా పసిబిడ్డలకు పండ్రెండవ దినమున బ్రహ్మసుతుడగు వాల్మీకి పుణ్యాహవచనము చేయించి లవకుశులని నామకరణములు చేయించిరి.

జనకుడు వాల్మీకిని చూచి యీ కవల పిల్లలలో పెద్దవాడె వరు ? రెండవవాడెవరు ? అని ప్రశ్నింపగా కుశుడు పెద్దవాడు లవుడు చిన్నవాడు అని వాల్మీకి తెలియజేయగా జనకుడు మునీంద్రా ! పెద్దవాడు కుశుడనియు, చిన్నవాడు లవుడనియు తెల్పిరి కదా ! మరి కుశలవులనక లవకుశులనుటకు హేతు వేమని యడిగెను. అంత వాల్మీకి జనకుని చూచి బీజోత్పత్తి క్రమమున చూచిన కవలలలో పెద్దవాడు కుశుడును చిన్నవాడు లవుడును

నగుదురు. కాని జనన క్రమమున చిన్నవాడు ముందు జన్మించు టయు పెద్దవాడు తరువాత జనించుటయు జరుగును. జనన క్రమము ననుసరించి నామకరణము చేయబడినది. ఇది దేవ (విజ్ఞాన) రహస్యము సుమా యని వివరించి చెప్పెను.

అట్లు మార్కండేయుడు చెప్పగా విని ధర్మరాజిట్లు ప్రశ్నిం చెను. మునీంద్రా లవకుశులను నామములు విచిత్రముగా నున్నవి. వాల్మీకి మహర్షి యట్టి పేర్లు పెట్టుటకు కారణమేమి? ధర్మరాజు సందియమును మార్కండేయుడిట్లు వివరించెను. యుధి ష్ఠిరా ! లవలను మంత్రించి రక్షింపబడిన వాడగుట వలన లవు డనియు కుశోదకములను మంత్రించి రక్షింపబడిన వాడగుట వలన కుశుడనియు నామ కరణములు చేసిరి.

జనకుడు సీతకువచ్చిన యపవాదునకు వెరచుచు చింతించు చుండ నొకనాడు వాల్మీకి యరుదెంచి సీత వినునట్లుగా నిట్లు పలి కెను. రాజ ! సీత యొనరించిన పుణ్యమువలన లవకుశులు మహా శౌర్యోదారులు కాగలరు. గారాబముగా పెంచి పెద్దచేయుమని హితము బోధించెను. అప్పుడు జనకుడు జానకీ! నీ యందే దోసము లేదని నేనెరుగుదును. కానీ సీత యందేతప్పును లేనిదే రాము డేల యడవిలో విడచును? ఏదో దోసమున్నదని మూతులయందు చేతులు చేర్చి లోకులు గుసగుసలాడుచున్నారు. ఏమి చేయ వల యునో తోచకున్నది. అని ఖిన్నుడై యడగగా సీత యోచించి యిట్లనెను. తండ్రీ! అగ్ని ప్రవేశము చేసి నిర్దోషిత్వమును నిరూపించుకొందును. అందుకు తగిన యేర్పాట్లు చేయుడు అని వేడుకొనగా జనకుడంగీకరించి తగిన యేర్పాట్లు చేసెను.

జానకి ముమ్మారు అగ్నికి ప్రదక్షిణము చేసి హవ్యవాహన ! రాముని కంటె నన్యమెరుగని దాననైన యెడల పతివ్రతనైన యెడల, నా యందే దోసమును లేనియెడల చల్లబడి నన్ను కాపాడము. అని మ్రొక్కి యగ్నిలో దుమికెను. ఆ సమయమున భూమి కంపించెను. సప్త సముద్రములూ ఘోషించినవి సూర్య చంద్రుల కాంతి తప్పెను. చీకట్లు క్రమ్మినవి. దేవతలు గడగడ లాడిరి. తల్లులు అంతఃపురస్త్రీలు జనులు హాహాకారములు చేయుచు కన్నీరు మున్నీరుగా విలపింపసాగిరి.

ఆ యగ్ని మధ్యమున పసిడిశలాకవలె జానకి వెలుగొందు చున్నది. తలలోని పూరేకుగూడ వాడలేదు. మంచి గంధములో నున్నట్లగ్ని మధ్య నానందముగా నున్న జానికిని చూచి యెల్లరా శ్చర్యానందములు పొందుచుండ జానకి మంటలలో నుండి వెలువడి వాల్మీకి మహర్షికిని తండ్రికిని తల్లికిని మ్రొక్కి నిలిచినది. జనకుడు జానకిని సమీపించి తల్లీ ! లోకుల మాటలు వినలేక నీ కగ్ని పరీక్ష నేర్పాటు చేసితిని పరిశుద్ధురాలివైన నీవు మహా పతివ్రతవు. ఇట్టి వింతలు మున్నెరుగము. నిన్ను పుత్రికగా బడసి నేను ధన్యుడనైతిని. అని సంతసము వెల్లడించెను. మునులు దేవతలు సీతను దర్శించి ప్రశంసించిరి. పూలవాన కురిసినది దేవదుందుభులు మ్రోగినవి.

వాల్మీకి మహర్షి కొంతకాలము జనకు నింట నుండి యొక నాడు మహారాజును చూచి యోరాజర్షి ! నేనిక యాశ్రమమున కేగెదను. సీతా తనయులు మిగులతేజశ్శాలురు వీరికి వేద వేదాంగములు ధనుర్వేదము గజారోహణము అశ్వారోహణము మున్నగునవి నేర్పవలయును అని పలుకగా జనకుడు చేతులు జోడించి మునీంద్రా ! నా యందు దయ యుంచి మీరానతిచ్చిన రీతిగా

లవకుశులకు సమస్త విద్యలు మీరే నేర్పవలయును. అని ప్రార్థించిన ముని యంగీకరించెను.

వాల్మీకి మహర్షి లవకుశులకు ఏకాదశవర్షమున నుపనయనములుచేసి సకల విద్యలు నేర్పి సకల కళా ప్రవీణులుగా జేసెను. రాజోచితము లైన గజారోహణాశ్వారోహణాది విద్యలన్నియు నుపదేశించెను పిదప తాను రచించిన ఇరువది నాలుగువేల శ్లోకములతో గూడిన రామాయణ మహాకావ్యము నుపదేశించుచుండెను. అట్లుపదేశించు సమయమున నొకనాడు వాల్మీకి శిష్యుడైన యజ్ఞదత్తుడరుదెంచి గురువునకు మ్రొక్కి నిలబడెను. వాల్మీకి యజ్ఞదత్తుని చూచి ఆశ్చర్యపడి శిష్యా ! చిరకాలమున కరుదెంచితివి. నేను రచించిన విచిత్ర రామాయణము లోకమున లేనందున శ్రీమద్రామాయణమును మరల రచించి పెక్కుమంది ముని కుమారులకు బోధించితిని. ఇప్పుడు జానకి కొడుకులకు బోధించుచుంటి అని వివరించెను.

యజ్ఞ దత్తుడు తన వృత్తాంతమంతయు వాల్మీకికి విన్నవించి తాను మొదట వాల్మీకి వలన నుపదేశమందిన విచిత్ర రామాయణము గూడ కుశలవుల కుపదేశించి యా మహా గ్రంథమును మరల యజ్ఞ దత్తున కొసంగెను. యజ్ఞ దత్తుడు వాల్మీకి సెలవు గైకొని యథేచ్ఛగా వెడలిపోయెను. లవకుశులు వాల్మీకి నుండి విరచితమైన రామాయణములు రెండును చక్కగా నభ్యసించి గానము చేయుచుండిరి.

ఒకనాడు వాల్మీకి లవకుశులను చేరదీసి కుమారులారా ! నా వలన విద్యలన్నియునేర్చితిరి కావున నాకు గురుదక్షిణ నొసంగుడు అని పలికెను. అంత నా బాలురు మునికి మ్రొక్కి గురువర్య ! మీరు కోరినది మీకు గురుదక్షిణ నొసగెదము. కావున మా యందు

దయ యుంచి కావలసినది కోరుకొనుడని పలికిరి. అంత వాల్మీకి లవకుశులను చూచి నేను మీ కుపదేశించిన రెండు రామాయణము లను గ్రామములలోను నగరములలోను గానముచేసి బియ్యమును సంపాదించి తెచ్చి యిండు అని యాదేశింపగా వారందు కంగీక రించిరి. వెంటనే తల్లి కావిషయమును తెలిపిరి. సీత బిడ్డలనక్కున జేర్చుకొని నాయనలారా! సరిగా బట్ట కట్టుట కూడ చేతకాని మీరు పల్లెలకు పట్టణములకు వెళ్ళి బిచ్చమెత్తి తేవలసివచ్చినదా! నేనిట్టి పనిని సహింప జాలను. మన తాతగారి యింటిలోని బియ్యము మీకిత్తును. మీరు రహస్యముగా తీసికొనిపోయి గురువు గారి కొసంగుడు. అని పలుకగా నాబాలురిట్లు సమాధానమిచ్చిరి. తల్లీ! పురాణమును గానముచేసి వినిపించి బియ్యమడిగి తెండని గురువుగారు కోరగా నంగీకరించియు ఇంటిలోని బియ్యమును తీసికొని పోయి యిచ్చి బిచ్చమెత్తి తెచ్చితిమని పలికి మోసగింప జాలము. మేము చేసిన వంచన బయల్పడిన ముని యాగ్రహించి శపించును. కావున నీ మాట కాదన్నందుకు మమ్ము క్షమించి మా మనవి నంగీకరించి వేగముగా రమ్మని దీవించి పంపుమని వేడు కొనిరి.

గురు వచన మతిక్రమించిన యెడల కొడుకులు శాపము లకు గురి కాగలరని జానకి పరిపరి విధముల చింతించి వెరచుచునే సుతులను దీవించి పంపెను. పల్లెలలో పట్టణములలో మోక్షదాయక మగు రామగాథ గానముచేసి ధనమిచ్చినను తీసికొనక బియ్య మడిగి తీసికొనివచ్చి గురువునకు సమర్పించి యింటికేగువారు. కుమారుల రాకకై మేడమీద కిటికీల నుండి చూచుచున్న జానకి కుమారుల జాడ పసిగట్టగానే ఆనందముగా మేడ దిగి యెదురేగి కౌగిలించుకొనిలోనికి తీసికొనివచ్చి కొడుకులతో కలసి భుజించెడిది ఇట్లు కొంతకాలము చనిన పిదప లవకుశులు తల్లిని సమీపించి

అమ్మా ! తండ్రి యెవరో తెల్పుమని యడిగిరి. కొడుకుల ప్రశ్న విని జానకి లజ్జా చింతాక్రాంత చిత్తముతో మీ తండ్రి యిచట లేరని పలికి కన్నీరు కార్చుచుండ నా బాలురు తెల్లబోయి తల్లితో బాటు తాము ను చాలాసేపు దుఃఖించి నిద్రపోయిరి.

ప్రతిదిన ముదయముననే లేచి కథా గానముచేసి గురువునకు సంపాదించి తెచ్చిన బియ్యమొసంగి తల్లితో నానందముగా నా బాలురు కాలము గడుపుచుండిరి. ఒకనాడు సీత కొడుకులతో బాటు భోజనముచేసి రామాయణము గానముచేసి వినిపింపుమని కుమారులను కోరినది. వారును రామాయణమును తల్లికి వినిపించి యానందము కలిగించుచుండిరి.

ఒక నాడిం దాద్రిది దేవతలు మునులు బ్రహ్మదేవుని కడకేగి లక్ష్మీనారాయణులు సీతా రాములై యవతరించి చరాచరములకన్నింటికిని మోక్షమొసంగు చున్నారు. అని మొరపెట్టగా బ్రహ్మ యిట్లు పలికెను. రాముడు తన పుత్త్రులగు లవకుశులను కలిసికొని సీత కడకేగినప్పుడు సీత కోపంతో భూమిని బ్రద్దలు చేసికొని ప్రవేశించును. అంత లక్ష్మణు డసువులు వీడును శ్రీరాముడును విరక్తి చెంది రాజ్యము కుమారుల కప్పగించి యవతారమును చాలించి తొందరలోనే వైకుంఠమును చేరును. మీరు నిశ్చింతగా నుండుడు అని యనునయ వచనములు పలికి దేవతలను మునులను సాగనంపెను.

అంత నా బ్రహ్మ సరస్వతిని పిలిచి నీవు లవ కుశులందు ప్రవేశించి అయోధ్యా సంపదను, అయోధ్యాధిపతిని దర్శింప ప్రోత్సహింపుమని యాదేశించి వాయుదేవునిచూచి నీవు ప్రతి దినము లవకుశులను క్షణములో నయోధ్యకు చేర్చి యక్కడ నుండి వారు బయలుదేరు నప్పుడు మరల వారిని క్షణములో

వాల్మీకిమహర్షి యాశ్రమమునకును సీత సమీపమునకును చేర్పు మని యాజ్ఞాపించెను.

ఒకనాడు లవకుశులు కథాగానమునకేగుచున్నప్పుడు కుశుడు లవునిచూచి నగరమున రామాయణము గానముచేసి బియ్య మెక్కువగా తెచ్చి గురువుగారి కొసంగవలయును. కావున నేను తూర్పు దెసగా పోదును. నీ వితర దిక్కులకేగి రామాయణము గానముచేసి బియ్యము సంపాదించి తెమ్ము అని పలుకగా లవుడు కోపించి నాకన్న చిన్నవాడవు నన్నాదేశింతువా ? మనము వేరు వేరు దిక్కుల కేగితిమని తెలిసిన తల్లి బాధపడును. గురువుగారు దండింతురు. అని యెంతగా చెప్పినను వినిపించుకొనక కుశు డొంటరిగా తూర్పు దిక్కునకేగెను.

లవుడుత్తరదిశగా పోవనుంకించు సమయమున వాయు దేవుడు మిథిలనుండి యయోధ్యకు లవుని క్షణములో చేర్చెను. నగర వీధులలో నడచివెళ్ళుచున్న లవుడు నగరములోని విశేషము లను వింతగాచూచుచు వెడలుచుండెను. రాజవీధులలోనియున్నత భవనములలోని కిటికీలనుండి లవుని చూచిన వనితలు మేడలు దిగి క్రిందకు వచ్చి యా బాలుని సోయగమును ముచ్చటగా తిలకింపసాగిరి. లవుడు తనను చూడవచ్చిన స్త్రీలను పలుకరిం చుచు మెల్లగా రాజభవనముచేరి రామాయణ గానము చేయు, లవుని కంఠమాధుర్యమున కెల్లరు తన్మయులై యాలకింప సాగిరి.

ఆ సమయమున పితృకార్యము నిర్వర్తించుచున్న శ్రీరా ముడు రామాయణ కావ్య గానము నాలకించి లక్ష్మణునిచూచి గానము చేయుచున్న యా బాలుని మేము వచ్చువరకు గాన మును నిలుపుమని చెప్పుమని యాదేశించెను. లక్ష్మణుడు వెంటనే

యా బాలునిసమీపించి వానియసదృశ రూపమునకు ముగ్ధుడై వానిని సమీపించి కుమార ! శ్రీరామప్రభువు నీ గానమాలకింప గోరుచున్నారు కావున వారువచ్చువరకు గానమునాపి వేచియుండు మని పలికి యా బాలుని గూర్చుండ నియమించి రాముని సమీపించి యా బాలుని రూప లావణ్య విద్యా గాంభీర్యాది గుణములను రామునకు విన్నవించెను. శ్రీరాముడు విస్మితుడై పితృకార్యమును యథావిధిగా నిర్వర్తించి పురోహితులు సోదరులు వసిష్ఠాది ముని పుంగవులు మున్నగువారితో సభా భవనమున కేతెంచి నవరత్న ఖచిత సింహాసనాసీనుడై బాలుని దగ్గరకు రావించి వాని ముగ్ధ సౌందర్యముచూచి యాశ్చర్య వాత్సల్య భరితాంతరంగుడై యుచితాసనాసీనుని గావించి నాయన ! నీ వెవ్వరివాడవు ? అని ప్రశ్నించెను. అంత నాబాలుడు. అయ్యా ! నేను వాల్మీకి మునీంద్రుని శిష్యుడను. నన్ను లవుడందురు. అని సమాధాన మిచ్చెను

వసిష్ఠమహర్షి లవునిచూచి వాని శుభలక్షణముల కచ్చెరు వంది దివ్యదృష్టితో సర్వముగ్రహించి రాముడుత్వరలో వైకుంఠ ధామమును చేరుననియు నీ బాలుడు అయోధ్యాధిపతి కాగలడనియు నూహించి యీ రహస్య మెవ్వరికిని తెలుపరాదని యూరకుండెను.

లవుడు శ్రీరాముని యానతితో రామావతారమునకు ముందే పదివేల యేండ్ల వ్యవధిలో వాల్మీకి రచించిన విచిత్ర రామాయణమును గానము చేయనారంభించెను అని మార్కండేయుడు చెప్పగా ధర్మరాజు ఇట్లు ప్రశ్నించెను. మునీంద్రా ! రాముడవతరింపక ముందే వాల్మీకి రామాయణ మహాకావ్యము నెట్లు

రచించెను ? వాల్మీకి మహిమ యెట్టిది ? తెలవిమ్ము అని యడిగిన మార్కండేయుడు శ్రీరాముని ప్రశ్నకు లవుడు చెప్పిన సమాధాన రూపమున నీవడిగిన ప్రశ్నకు సమాధానము వివరింతు వాలకింపుమని యిట్లు చెప్పదొడంగెను.

వైవస్వత మనువుకాలమున బ్రహ్మ వేల కొలది మునులతో స్వర్గము చూడనేగి యాకాశ గంగలో స్నానముచేసి యనుష్ఠానములు నెరవేర్చుకొని ఇసుకపై మృగ చర్మమును పరచుకొని కూర్చుండెను. ఆ సమయమున నారదు డింద్రుని దర్శించి పితామహుడు ద్విజబృందముతో నరుదెంచి స్వర్ణది సమీపమున నున్నాడు, వెళ్ళి దర్శింపుమని చెప్పెను. ఇంద్రుడు వెంటనే దిక్పాలురను వెంటనిడుకొని కమలాసనుని దర్శించి మ్రొక్కి పలు విధములగు స్తోత్ర వచనములతో నుతించి విరించి సంతసమునకై మేనక మున్నగు నచ్చర లేమలను నాట్యమొనరింపుడని యాదేశించెను.

మన్మథ బాణములకు వశుడను కానని భ్రమపడుచున్న చతుర్ముఖుడు దివ్యాంగనా నృత్యము తిలకించి మైమరచియుండగా వీర్యము స్ఖలించెను. వీర్యము కృష్ణాజినముపై పడుటనలు వగ్రహించి సిగ్గుపడి దాని నిసుకలో నణచివేయబోయెను. ఆవీర్యములరువదియొక్క వేల శకలములై ఇసుకలోపడి వెంటనే అరువదివేల పురుషు లుద్భవించి వాలఖిల్యులని పేరువడసి కామగమనులై యాకాశమార్గమున వెడలిరి.

మిగిలిన వేయిశకములతోనుద్భవించిన పురుషుడు బ్రహ్మను చూచి యచ్చరలేమల సౌందర్యమునకు ముగ్ధుడవై వీర్యమును విడిచితివి. అది యిసుకతో గలిసి యరువదివేల వాలఖిల్యు

తేర్పడి తపము చేయుట కేగిరి. నేను మట్టితో గూడిన వాలుక (ఇసుక) యందుపడిన వీర్య శక్తివలన పెద్ద శరీరముతో నుద్భవించి నీ యెదుట నిలచితిని. నాకాహారమేది ? అని ప్రశ్నింపగా బ్రహ్మసిగ్గుపడి సభలో తండ్రిగుట్టు బయటపెట్టితివి కావున బోయవాడవుగా మెలగుమని శపించెను.

అంత నావిరించి తనయుడు భీతిచెంది నమస్కరించి మహానుభావా ! నే నపరాధము చేసితిని. పిన్నవాడనగు నా యపరాధమును మన్నించి నన్ను భవబంధ విముక్తుని చేయుము అని ప్రార్థించెను. బ్రహ్మ యనుగ్రహము కలిగి కుమారా ! ముందు ముందు మునులవలన రామనామ మహాఫలము నీకు సిద్ధించును. రామ నామామృతమును గ్రోలి మేలు పొందుదువని యభయ మొసంగి యంతర్ధానమందెను.

బ్రహ్మ తనయుడగు ప్రాచేతసుడు తండ్రి శాపమువలన చమత్కార పురమున భృగువంశమున మాండవ్యుని యింట లోహజంఘుడను పేరుతో జన్మించెను. దుష్ట సహవాసములు చేసి బ్రాహ్మణ ధర్మము పరిత్యజించి లోహజంఘుడు అడవికేగి యచట నొక బోయపడుచును పెండ్లాడి బోయలతోగూడి తిరుగుచు దొంగతనములు దోపిడీలు చేయుచు కుటుంబ పోషణము చేయుచుండెను.

ఒకానాడడవి దారిలో సప్తర్షులు వెడలుచుండగా లోహజంఘుడు చూచి వారి నడ్డగించి మీ దగ్గరనున్న వస్త్రములు కమండలములు మున్నగునవి అక్కడ పెట్టుడు. నా మాట కాదన్న ఈ దుడ్డు కర్రతో మీ తలలు పగులగొట్టియైనను మీ కడనున్న సొత్తు లాగుకొందునని బెదిరించెను. సప్తర్షులు వానినిచూచి శాంత

చిత్తములతో నోయీ సాలగ్రామ శిలలు జపమాలికలు పుస్తకములు మాత్రము మాకు విడిచిపెట్టి మిగిలినవానిలో నీకు వలసిన వన్నియు తీసికొనుమని పలుకగా వాడు మునుల ధైర్యమున కాశ్చర్యపడి చూచుచుండగా మునులు మరల నిట్లనిరి. దారులు కాచి తలలు బ్రద్దలుకొట్టి సంపాదించిన ధనము పాప కారణమని యెరుగుదువా ? నీవు తీసికొనిపోయిన ధనమువలన సుఖములను భవించుచున్న భార్యాపుత్రులు నీ ధనమువలన వచ్చిన పాపము ననుభవింతురా ? తెలిసికొని రమ్ము మునుల పలుకులు విని యాలోచనలో పడిన లోహజంఘు డింటికేగి భార్యను చూచి ప్రేయసీ ; కుటుంబ పోషణకు పాప కృత్యములుచేసి ధన మార్జించుచున్నాను, నేనార్జించి తెచ్చిన సొమ్ములో కొంత భాగ మునను భవించుచున్నావు. కాన పాపములోకూడ కొంత భాగము ననుభవింపుమని కోరెను. అప్పుడతని భార్య ! నాథ ! ఆలి కన్నము పెట్టుట యూరికుపకారమా ? తాళి కట్టినవాడవు పోషింప కేమిచేయుదువు ? నీవు తెచ్చు ధనముతోనే కాని పాపముతో నాకు నిమిత్తము లేదని పలికెను.

అంత నా లోహజంఘుడు పిల్లలను జేరబిలిచి బిడ్డలార ! మీ పోషణకై పాపముచేసి ధనమార్జించుచున్నాను. నేను తెచ్చు సొమ్ములో కొంతభాగము మీరును అనుభవించుచున్నారు. కావున పాపములో కొంతభాగమును మీరును పొందుడు అని యడుగగా వానిపిల్లలు తండ్రీ ! కన్నవాడవు పోషింపవలదా ? నీవుతెచ్చు ధనముతోనే కాని పాపముతో మాకు నిమిత్తములేదని ఖండితముగా చెప్పివైచిరి.

భార్యా పుత్రుల పలుకులువిని సంసారముపై విరక్తిచెందిన లోహజంఘుడు సప్తర్షులను చేరి పాదములపైబడి సాష్టాంగ నమ

స్కారములుచేసి మహానుభావులార ! నా కన్నులు తెరిపించి నన్ను పాపకూపమునుండి రక్షించిరి. ఇక సంసారముచేసి పాపము మూట కట్టుకొనజాలను. పాప సాగరముతరించి ముక్తిమార్గమును పొందు నుపాయమును మీరే తెలియజేయుడు అని దీనముగా వేడుకొనెను. మునులు వానియందు జాలిపడి వీనినెట్లు తరింప జేయుదుమని తపంలో తాము యోచించుకొని దివ్యదృష్టితో పర మేష్ఠి తనయుడగు ప్రాచేతసుడు తండ్రి శాపమువలననట్లు పుట్టె నని గ్రహించి వానికి వ్యత్యస్తముగా (మరా....మరా) రామ మంత్ర ముపదేశించిరి.

సప్తర్షులు రామ మంత్ర ముపదేశించుటతో పాపములు పోగొట్టుకొన్న లోహజంఘుడు మునులను సేవించుచు వారివెంట తిరుగ జొచ్చెను. సప్తర్షులు సరస్వతీ సాగరసంగమముచేరి స్నానా ద్యనుష్ఠానములు నెరవేర్చుకొని ఆ నీటిలో శార్దూల చర్మము పరచుకొని వానిపై పద్మాసనమువేసికొని కూర్చుని పయనించు చుండ నిషాదుడగు నా లోహజంఘుడు మునులకు మ్రొక్కి అయ్యలార ! మీవెంట నేను రాజాలను. నన్ను విడిచి మీరెట కేగు చున్నారు ? అని ప్రశ్నింపగా మహర్షులు లోహజంఘా ! క్షీరాబ్ధి శయనుడగు శ్రీహరి సందర్శనార్థ మేగుచున్నాము. నీ వంటివారి కామార్గము అగమ్యము. నీవీ సరస్వతీ తీరమున రామ నామమును జపించుచుండుము అని చెప్పి వెడలిపోయిరి.

అప్పుడా లోహజంఘుడు స్నానాది కృత్యములు నెరవేర్చు కొని తూర్పు దిశగా పద్మాసనమువేసికొని కూర్చుని తపముచేయ సాగెను. కొంత కాలము ఫలములు మాత్రమే భుజించి తపమొన రించెను కాని క్రమముగా ఆహారము పూర్తిగా మాని రామ నామ మును జపింపసాగెను. నేలపై గూర్చుని రామనామ జప తత్ప

రుడై నిద్రాహారములు మాని తపమొనరించుచున్న యాలోహ జంఘుని శరీరముపై పెద్దపుట్ట బయలుదేరినది. లోహజంఘుడు కదలిక మెదలిక లేకుండ నాలుగు యుగములట్లు తప మొన రించెను.

దేవర్షి యగు నారదు డొకనాడు వీణ మీటుచు శ్రీహరిని కీర్తించుచు వైకుంఠ మేగి శ్రీహరిని సందర్శించి దేవ దేవ! కృత యుగాంతమున రావణుడను రాక్షసరాజు బయలుదేరి సజ్జనులకు దేవతలకు నుపద్రవము కలిగించుచున్నాడని పలికి వాని దుష్కృత్యములు విన్నవించెను. అంత శ్రీహరి మునీంద్రా ! పదివేల సంవత్సరముల తరువాత దశరథ తనయుడనై రాముడను పేర నవతరించి దశకంఠుని సంహరింతును. ఈ దేవ రహస్య మితరు లకు తెలుపకుము అని నారదు నాదేశించెను.

ఆలోచనాపరుడగు నారదముని వైకుంఠమునుండి తిన్నగా లోహజంఘుడు తపముచేయుచున్న ప్రదేశమునకరుదెంచి యచట లతలకు శ్రీరామ చరితమును వినిపించెను. పుట్టలోనుండి తపము చేయుచున్న లోహజంఘుడు శ్రీరామచరితము నాలకించెను. కొంత కాలమునకు సప్తర్షులా పుట్టకడ కేగుదెంచి దివ్య నేత్రములతో పుట్టలోనుంచి మైమరచి శ్రీరామ మంత్రమును జపించుచున్న మునిని తిలకించిరి. వెంటనే తమకడనున్న దండములతో పుట్టను త్రవ్వి దివ్యతేజస్సుతో విరాజిల్లుచున్న మునీంద్రుని వెలుపలికి తీసి వానిగికౌగిలించుకొని నాయనా! శరీరముపై పుట్టలు పోసినను దేహదృష్టిలేక నిద్రాహారములు విడిచి యపూర్వముగా తపమొన రించితివి. వల్మీకము (పుట్ట) నుండి పుట్టిన వాడవగుటచేత వాల్మీకి యను పేర ప్రసిద్ధినొందుదువు. నారదమహర్షి వలన నాలకించిన శ్రీరామ చరితమును కావ్యముగా రచింపుమని పలికి యథేచ్ఛగా నాకాశ మార్గమున వెడలిపోయిరి. రాజ! సప్తర్షులు

చెప్పిన రీతిగా నావాల్మీకి రామాయణ కావ్యమును రచించెనని యపుడు శ్రీరామునకు వివరించి రామచంద్రా ! రామాయణ మహా కావ్యము పఠించిన వారికి ఆలకించినవారికి ముక్తి కరతలామల కము అని తెలియజేసెను.

ధర్మరాజు మార్కండేయుని చూచి మునీంద్రా ! నీ వింత వరకును తెల్పినగాథ మిగుల నానందము చేకూర్చినది. తరువాతి వృత్తాంతమును వివరింపుమని కోరగా మార్కండేయుడు ఇట్లు చెప్పదొడంగెను.

పులస్త్య బ్రహ్మ రామాయణమును పఠించుచుండ దశగ్రీవుడు మండోదరీ సహితుడై యాలకించుచుండెను. శ్రీహరి పదివేల సంవత్సరములకు దశరథతనయుడై యవతరించి శ్రీరాముడను పేర బసిద్ధి చెంది రావణుని సంహరించునని పులస్త్యుడు చదివి చెప్పగా మండోదరి విని నాథుని చూచి ప్రభు ! శ్రీహరి రాముడై యవతరించి నిన్ను వధించునట కదా ! అని పలికి చింతింప సాగినది. భార్య పలుకులు విని రావణుడు నవ్వి కాంతా ! నేను శివుని గూర్చి తపమొనరించితిని. పరమేశ్వరుడు నా తపమునకు మెచ్చి ప్రత్యక్షమై రాక్షసరాజా ! నియమపూర్వకముగా నీవు చేసిన తప మునా కానందము కలిగించినది నీ కిష్టమైన వరము కోరుకొనుము అనగా నేను శంకరుని చరణారవిందములకు మ్రొక్కి చిరంజీవి నగునట్లను గ్రహింపుమని వేడుకొనగా రెండువందల ఇరువది నాలుగు వేల యుగములు జీవింతువని వరమొసంగి యంతర్ధాన మయ్యెను. అదియు గాక రాముడు మానవమాత్రుడు నేను మాన వాశనుడను. కావున నన్ను రాముడు చంపునని నీవు భీతిచెందకు మని యనునయించెను.

రావణుడు పురాణ శ్రవణమును విరమించి వెంటనే సభా భవనమున కేగి శుకసారణులను రావించి నిరంతరము సర్వ లోక

ములు సంచరించుచు వార్త లెప్పటి కప్పుడు నాకు తెలియ జేయుడు. అయోధ్యా నగరమును రాజధానిగా చేసికొని సూర్య వంశీయుడగు రఘువు పరిపాలించెను. ఆ రఘు మహారాజు కుమారుడు అజుడు. అజుడు కుమారుడగు దశరథుని తనయుడు నన్ను సంహరించునని తాత యగు పులస్త్యుడు పురాణము చెప్పెను. కావున దశరథుని బలపరాక్రమములు రణవిద్యలలో నైపుణ్యము పున్నగు నంశములే గాక దశరథుని పరిణయ సంబంధమగు సంగతులు ఎప్పటికప్పుడు నాకు తెలియజేయ వలెనని యాజ్ఞాపించెను. వెంటనే శుకసారణులు వార్తల సేకరణకై యాకాశ మార్గమున పయనమైరి.

శుకసారణులు ప్రపంచము నలుమూలలు తిరిగి హేమనగరము చేరిరి. మహావీరుడగు హరసేనుడను రాజు హేమనగరము నేలుచుండెను. హరసేన మహారాజు కోసల దేశమును కేకయ దేశమును జయించి ఆ దేశముల నేలు రాజుల పుత్రికామణులను తీసికొని వచ్చి తన భార్యయగు సౌదామిని కప్పగించెను. సౌదామిని కన్నబిడ్డయగు సుమిత్రతో బాటుగా కోసలాధిపతి తనయ యగు కౌసల్యను, కేకయరాజసుత యగు కైకను మిగుల గారాబముగా పెంచుచుండెను.

హరసేనుడు అయోధ్యాధిపతి యగు నజుని పుత్రుడగు దశరథుని సుగుణములను బలపరాక్రమాదికమును చారుల వలన విని కౌసల్య నొసంగి పరిణయము చేయ నిశ్చయించుకొని తన కుమారుడగు గృహమేధివలన నజమహారాజునకు తెలియజేసెను. అజమహారాజు సంతసముతో గృహ మేధికి పెక్కు కానుకలొసంగి సాగనంపెను. హరసేనుడు కుమారుని వలన దశరథమహారాజునకు కౌసల్యను చేసికొనుట కంగీకరించిన వార్త నాలకించి సంతసముతో వెంటనే పురోహితుడగు జైమినియను విప్రుని రావించి

ముహూర్తము పెట్టించెను. శుకసారణు లావార్తను రావణునకు తెలియజేసిరి రావణుడు కోపముతో మండిపడి శ్రీహరి సూర్య వంశమున దశరథునకు కౌసల్యయందు తనయుడై పుట్టి తనను పరిమార్చునని వినుటవలన సూర్యవంశము నిర్మూలింతునని ఆయుధ ధారియై రథారూఢుడై బయలుదేరెను.

శ్రీరాముడు లవునిచూచి బాలకా! శ్రీహరి సూర్యవంశమున దశరథ తనయుడై కౌసల్యయందు యవతరించుటకు కారణమేమి? అని ప్రశ్నింపగా లవుడిట్లు చెప్పదొడంగెను. రాజా! త్రేతాయుగమున సూర్య వంశమున అనరణ్యుడను రాజు కలడు. రావణుడనరణ్యుని బల పరాక్రమములు విని యోర్వలేక దండెత్తెను. ఆ సమయమున అనరణ్యుడు యజ్ఞము చేయుచుండెను. యుద్ధము నందనరణ్యునిచే నోడింపబడిన రావణుడు మాయోపాయమున అనరణ్యుని చంపి వెళ్ళిపోయెను.

అనరణ్యుని పుత్రుడగు అమరబాహువు తన తండ్రి నన్యాయముగా చంపిన రావణుని పై పగబూని యెట్లైనను ప్రతీకారము చేయదలచి శ్రీమహావిష్ణువును గూర్చి ఘోరమైన తపమొనరించెను. నిరాహారుడై ఏకాగ్రచిత్తముతో జపమొనరించుచున్న అమరబాహువు నందనుగ్రహము కలిగి శ్రీహరి ప్రత్యక్షమయ్యెను. అమరబాహువు ప్రార్థనల నంగీకరించిన శ్రీమహావిష్ణువు నీకువలసిన కోరిక కోరుకొనుమనగా నమరబాహువు దేవా! రాక్షసమాయచే మా తండ్రిని మట్టుపెట్టిన దశకంఠుని నేను వధించునట్లు వరమొసంగుము. అని చేతులుజోడించి మ్రొక్కెను. శ్రీహరి యారాజును చూచి యమరబాహూ! రావణుని నీవు సంహరింపజాలవు. కావున మరియొక వరమును కోరుకొనుము. అనగా నారాజు దేవా! నేను రావణుని సంహరింపజాలనిచో నా పౌరుషము వ్యర్థము కదా!

అదియు గాక సూర్య వంశమున బుట్టి మునినై తప మొనరించి మిమ్ము దర్శించియు కోరికనెరవేరక రాక్షసునిచే నోడింప బడి ననునింద భరించి సూర్యవంశరాజునగు నేను ప్రాణములతో నుండుట కంగీకరింపను. అగిన మాధవు డిట్లనెను. రాజ ! దశగ్రీవుని సంహరించు కాలమున నేను సూర్యవంశమున మానవుడనై పుట్టి సూర్య వంశమునకు కీర్తి కలిగింతును. ఇక ముందు సూర్యవంశ రాజులకు రావణుని వలన ముప్పు కలుగకుండ సుదర్శన చక్రము మును రక్షణకై పంపుదును. అని పలికి శ్రీహరి యంతర్ధానము నందెను. అది మొదలుకొని శ్రీహరి సుదర్శన చక్రము సూర్య వంశరాజులను నిరంతరము రాక్షసుల బారి నుండి రక్షించుచుండెను. రాజ ! అమరబాహువు ప్రార్థన వలన శ్రీహరి సూర్య వంశమున నవతరించెను. ఈ విధముగా లవుడు పురాణములు చదివి వినిపింవగా శ్రీరాముడును వసిష్ఠాది మునులును విని మిగుల నాశ్చర్యపడిరి. అని మార్కండేయుడు చెప్పగా ధర్మరాజు అనంతర వృత్తాంతమును చెప్పమని కోరెను. శ్రీరాముడు లవుని తిలకించి తరువాత నేమి జరిగినదని ప్రశ్నింపగా లవుడిట్లు చెప్పెను.

రావణుడు ధనుర్బాణములు ధరించి క్రోధావేశముతో రథారూఢుడై సాకేత పురమార్గమున వెడలుచుండగా పులస్త్యు డెదురుపడి నాయన ! ఇంత తొందరగా వెడలుచుంటివి. ఎచటకు బయలుదేరితివి ? అని ప్రశ్నింపగా రావణుడు నమస్కరించి మునీంద్రా ! తాము చదివి వినిపించిన పురాణమున సూర్యవంశమున మాధవుడు రాముడను పేర దశరథునకు తనయుడై పుట్టి రావణుని సంహరించునని తెలియజేసిరి కదా ! సూర్యవంశమునే నిర్మూలించిన యెడల నాకిక మరణభీతియే యుండదు. అని తలంచి బయలు దేరితిని. అని పలికెను. అంత నా పులస్త్యుడు దశగ్రీవా ! సూర్యవంశరాజులు శ్రీహరిని సేవింపగా శ్రీహరి తన

సుదర్శన చక్రమును సూర్యవంశ పరిరక్షణకై నియోగించెను. కావున యుద్ధమున సూర్యవంశ నిర్మూలనము చేయుట నీ వలన కాదు సుమా! యని హెచ్చరించి తాను శంకరుని దర్శించుటకై కైలాసమున కేగెను

పులస్త్యమహర్షి పలుకులు విని రావణుడు అయోధ్యపై దండెత్తుట విరమించి హేమపురమున కేగి యెల్లరూ భీతిల్లునట్లు బాణవర్షము కురిపించుచు నగరమును ముట్టడించెను. రాజగు హరసేనుడు పలాయన మంత్రము పఠించెను. రావణు డవ లీలగా నగరమును వశపరచుకొని యంతఃపురమున కేగి రాజకాంత లను ముగ్గురు కన్నెలను అచటచూచి రాజవనితలతో నోసుదతు లార ! ఈ పెండ్లి కాని పడుచు లెవ్వరని ప్రశ్నించెను. అంత నా కాంతలు దశముఖుని చూచి భయపడుచు నో రాక్షసరాజ ! ఈ ముగ్గురు కన్నెలును ఈ నగరాధిపతియగు హరసేనుని తన యలు. ఈ ముగ్గురిలో పెద్దది కౌసల్య. రెండవది కైక, మూడ వది సుమిత్ర అని తెల్పిరి. అంతఃపుర రక్షకు లటకరుదెంచి రాక్షసరాజ ! అంతఃపురస్త్రీలు నివసించు నీ ప్రదేశమున నిత రులడుగు పెట్టరాదు. కావున నీ విటనుండి వెళ్ళుమని పలుకగా దశగ్రీవుడు కోపముతో అంతఃపుర పరిరక్షకులను మట్టుపెట్టి కౌస ల్యను కైకను సుమిత్రను తీసికొని బయలుదేరబోగా హరసేనుని పురోహితుడగు జైమిని రావణుని చూచి దశానన ! ఈ కౌసల్య దశరథుని భార్యయగుట దైవనిర్ణయము కావున ఈమెను విడిచి వెళ్ళుమని మందలించెను. రావణుడు కోపముతో నాబ్రాహ్మణుని పట్టి బంధించి రథముపై గూర్చుండబెట్టుకొని ముగ్గురు కన్యలను రథమెక్కించి గగన మార్గమున పోవుచుండగా నొకప్రదేశమున తపమొనరించుచున్న ముని గోచరింపగా మునీంద్రా ! ఈ మార్గ మెట్లుపోవునని ప్రశ్నింపగా నా విప్రుడా దారి యయోధ్యకు చేర్చునని పలికెను.

రావణుడయోధ్యా మార్గమున కారథమును మరలించి తోలుచున్న సమయమున గంగానది గోచరింపగా తీరమున రథ మాపించి యచటనున్న నావికులను చంపి మాయోపాయవిశారదు లగు నిశాచరులను మాయవేషములలో నావికులుగా నుండ నియ మించి దశరథుడీ మార్గమున పెండ్లికి తరలివచ్చును. పెండ్లి వారి నందఱను పడవల నెక్కించి నదీ మధ్యమున నావలుముంచి చంపి యాశుభవర్తమానమును నా కెరింగింపుడని నియమించి పెక్కు బహుమానము లొసంగి యాకాశమార్గమున పోవుచు కౌస ల్యను కైకను సుమిత్రను తాను పెండ్లాడనెంచి యుప్పొంగువేళ సమయమున ఆకాశవాణి యిట్లు పలికెను. ఓ రాక్షసరాజా ! ఈ కౌసల్యాది కన్యలను వరించినయెడల నీకుహాని కలుగునని హెచ్చ రింపగా రావణుడా ప్రయత్నమును విరమించి లంకకేగి యొక పసిడి పెట్టెలో నా ముగ్గురు కన్నెలనుంచి మిగుల మాయావులగు సోమకాసుర తనయులనేవురను రావించి వికర్ణుడనువానితో మీరే వురును ఈ పెట్టెను భద్రముగా కాపాడవలయును అని యాజ్ఞా పించెను వాడాపెట్టెను కడుపులో పెట్టుకొని మిగిలిన సోదరులతో గూడి సముద్రమున నుండి యాపెట్టెను కాపాడు చుండెను.

రావణుడు జైమినియను బ్రాహ్మణుని రావించి నీవుకౌసల్యా దశరథులకు పరిణయమగునని తెల్పితివి. అది యథార్థమైన యెడల నిన్ను మన్నించి విడిచిపెట్టెదను. అసత్యమైన యెడల నిన్నుచంపి తినివేదును అని పలికి కారాగారమున బంధించెను.

దశరథుడు రావణుని దురాలోచన మెరుంగక బంధుమిత్ర పరివారముగా గంగాతీరముచేరి నావలనారోహించెను. కపట నావికులు గంగా మధ్యభాగమునకు చేరగా నా నావలను ముంచి వేసిరి. దశరథుడు అసువులు కోల్పోయి ప్రవాహమున కొట్టుకొని పోయి సముద్రమున ప్రవేశించెను

వరుణలోకమునకేగి తిరిగి వచ్చుచున్న వినాయకుడు లంకా సమీప సాగరమున నిత్యకృత్యములు నెరవేర్చుకొని విశ్రాంతిగా కూర్చుండగా దశరథుని మృతకళేబరము కెరటముల వలన నొడ్డునుచేరి దైవవశమున వినాయకుని కంటబడెను. వినాయకుడు దానినిచూచి త్రికాలజ్ఞుడు కావున దశరథుని వలన సిద్ధింపవలసిన దేవకార్యమును గ్రహించి పునర్జీవితునిజేయగా దశరథుడు నిద్రనుండిలేచినట్లు లేచి వినాయకునకు మ్రొక్కి దీవనలు బడసెను.

సోమకుని పుత్త్రిలు వికర్ణునికడుపులోనున్న పెట్టెనుతీరమున నుంచి జలక్రీడ లాడుచుండిరి. వినాయకుడు దశరథుని పెట్టె కడకు తీసికొనిపోయి యోగమాయా నైపుణ్యమున పెట్టెను తెరచి పెట్టెలోనున్న కౌసల్యాది రాజకన్యలతో దశరథునకు గాంధర్వ వివాహము నొనరించియానలువురను మరలపెట్టెలోబెట్టి అయోధ్యకు చేరువరకు నా నలువురకు ఆకలిదప్పు లుండకుండునట్లు వరమొసంగెను. ముగ్గురు భార్యల తోడను సర్వసౌఖ్యము లనుభవించుచు చక్కగా రాజ్యమేలుదువని దశరథుని దీవించి పెట్టె నెప్పటివలె మూసి తాను కైలాసమున కేగెను.

సోమక పుత్త్రిలు జలవిహారములు చాలించి పెట్టెనెప్పటివలె కడుపులో బెట్టుకొని సాగరమున ప్రవేశించిరి. తరువాత కొంత కాలమునకు గంగాతీరమున నియమితులైన కపట నావికులు రావణుని సమీపించి రాక్షసరాజ ! గంగానదిలో దశరథుని సపరివారముగా ముంచి చంపివేసితిమని విన్నవించిరి. రావణు డపరిమితానందమునంది జైమినిని రావించి యోబాపడ ! కౌసల్యా దశరథులకు వివాహయోగమున్నదని పలికితివి గదా ! అది నిజమో కాదో చెప్పుమని యడిగెను. జైమిని గణితమువేసి దశానన ! ముగ్గురు వనితలను పరిణయమాడి దశరథుడు పసిడిపెట్టెలో భద్రముగా నున్నాడని తెల్పెను.

రావణుడు జైమిని పలుకులు విని యబ్బురపడి విచిత్రకేతుని పిలచి సముద్రములోనున్న సోమకుల పుత్రుల నేవురను వెంటనే తీసికొనిరమ్మని యాజ్ఞాపించెను విచిత్రకేతుడు సముద్ర తీరమునుచేరి వికర్ణుడు మున్నగు సోదరులను పిలిచి రావణుని యాదేశమును తెలియజేసెను. వెంటనే వికర్ణుడు కర్ణనేత్రుడు అతి నేత్రుడు అతినాసుడు ఇభవక్త్రుడు అను సోమకాసురుని తనయు లైదుగురును సముద్రము వెలువడి లంకకేగి రావణుని దర్శించి మ్రొక్కిరి. రావణుడు వికర్ణునిచూచి దాచుమని నీకిచ్చిన పెట్టెను చూపుమని పలుకగా వాడు వెంటనే తన కడుపులోనున్న పెట్టెనుతీసి రావణునెదుట పెట్టెను.

రావణుడా పెట్టెను తెరపించిచూడగా నందు కౌసల్య కైక సుమిత్రలేకాక దశరథుడుకూడా నుండుటచూచి మిగుల రోషమంది కరవాలము దీసి దశరథుని సంహరింపబోయెను. దశరథుడు శ్రీహరి పాదపద్మములను మనమున నిలుపుకొని దేవా ! నీవే దిక్కని మ్రొక్కెను. అంతలో సుదర్శన చక్రమరుదెంచి రావణునిచేతిలోని ఖడ్గమును తునియలుజేసి దశరథుని కడనిలచెను. రాక్షసులు భీతితో చెల్లాచెదరైరి.

అంతలో విభీషణు డటకరుదెంచి అన్నా ! నిరపరాధి భార్యతోగూడినవాడు రాజ్యహీనుడు యుద్ధ విముఖుడు నిరాయుధుడు సన్యాసి, నిద్రించువాడు అనువారిని చంపరాదని పెద్దలు చెప్పుదురు. కావున నిరాయుధుడు నిరపరాధియునగు దశరథుని చంపక విడిచిపెట్టుమని జాలిగొలుపునట్లు పలుకగా జైమిని పలుకులు తలచుకొని రావణుడు కోపమును విడిచిపెట్టెను. వినాయకుని దీవనలు ఫలించి తమ్ముని పలుకులు మన్నించి కౌసల్యాది కాంతలతోబాటు దశరథునిగూడ మరల నా పెట్టెలో గూర్చుండబెట్టి పెట్టెను మూసి తాళమువేసి భటులను రావించి యొకదినములో సీ

పెట్టెను సాకేతనగరములో విడిచిరండని యాజ్ఞాపించెను. భటులా పెట్టెను కడుపులో పెట్టుకొని సాకేతనగరమునకు గొనిపోయి విడిచిపెట్టిరి. అంత నారావణుడు కారాగారములో బంధించిన జైమినిని విడిపించి హరసేననినగరమైన హేమపురిలో విడువుడని నియమించెను.

రాక్షసులు ఆ మధ్యలో విడిచిపెట్టిన పెట్టెను పురజనులు చూచి తెరచిరి. పెట్టెలో నున్న కౌసల్య కైక, సుమిత్ర, దశరథుడు వెలుపలి కేతెంచిరి. వారిని చూచి పురజనులు సంతసముతో అజమహారాజునకు తెలుపగా వసిష్ఠాదిమునులతోను సుమంతాది సచివులతోను మహారాజు పెట్టెకడ కరుదెంచి కుమారుని చూచి యమితానందముతో నాలింగనము చేసికొని రాజభవనమునకు తోడ్కొని పోయెను. దశరథుని తల్లి యగు నిందుమతి కోడండ్రను చూచి యాదరించినది. అజమహారాజు వసిష్ఠుడు చెప్పిన సుముహూర్తమున నా కౌసల్య కైక సుమిత్రలతో దశరథునకు మహావైభవముగా పరిణయ మహోత్సవము జరిపించెను. మరికొంత కాలమునకు దశరథునకు పట్టాభిషేకము చేసి తాను భార్యా సహితుడై తపము చేసికొనుటకు వనమునకేగెను.

దశరథుడు త్రిలోకాధిపతి యగుదేవేంద్రుని మైత్రిని బడసి ధర్మసమ్మతముగా రాజ్యము నేలుచుండెను. దశదిశలకు పది వేరువేరు రథములు, వానికి కావలసిన వేరువేరు అశ్వములు వేరువేరు సారథులు దశరథునకుండుటవలన ఆయా దిశలకేగు నప్పుడాయా నియమిత రథముల నుపయోగించుట వలన దశరథుడను పేరు సార్థకమయ్యెను.

పరశురాముడు దక్కతక్కిన వారి నెల్ల జయించిన దశరథుడు సంతానము లేక బాధపడుచు నొకనాడు వసిష్ఠ మునీంద్రుని జూచి యిట్లు పలికెను.

శ్లో॥ అపుత్త్రస్య వృథాజన్మ । శ్రీర్భోగో వా నిరుత్తరం
మృతోపిశోభతేపుత్త్రీ । నజీవన్నపి నిస్సుతః

పుత్త్రులు లేనివాని జన్మవ్యర్థము. పుత్త్రహీనునకుగల సంపద భోగములు నిరుపయోగములు. సంతానవంతుడు మృతినందినను అదృష్టవంతుడే. సంతానహీనుడు బ్రతికియున్నను శోభలేదు.

శ్లో॥ అగ్నింపురస్తాదాదాయ । యస్యగచ్ఛతి గర్భజః
బంధుభిర్నీయ మానస్య । మృతిరప్యుత్సవాయతే

అగ్నిఖాండమును చేతబట్టి కడుపున బుట్టినవాడు ముందు నడుచుచుండ బంధువులు వెంటరాగా శ్మశానమునకు కొనిపోబడు వాని చావు కూడ పండుగవలెనే యుండును.

మునీంద్రా! సంతానము లేదను చింత నాకు లేకుండు నట్లు చేయగల సమర్థులు మీరేయని నమస్కరించి ప్రార్థించెను. వసిష్ఠుడు సంతసించి దశరథుని చూచి మహారాజా! ఋష్యశృంగ మహర్షి వలన నీవు పుత్త్రకామేష్టి చేయించిన యెడల పుత్ర లాభము బడయగలవని పలికెను.

ఈ విధముగా పురాణము పఠించుచున్న లవుని పలుకులు ఆ రాముడాలకించి ఓ బాలక! ఋష్యశృంగుని చరిత్రమును వివరముగా తెలియజేయుము అని కోరగా లవుడిట్లు వివరింప దొడంగెను.

ఒకనాడు త్రిలోకాధిపతియగు దేవేంద్రుడు కొలువు దీర్చి సురేఖయను అప్సరసను నాట్యము చేయుమని యాదేశించెను. దేవతలెల్లరును సురేఖ నాట్యమును రెప్పపాటులేక చూచుచు అనిమిషులమగుట నేటికి సఫలమైనదికదా యని యానందించు చుండిరి. ఇంద్రుని పెంపుడు మృగములు చంద్రకాంత శిలా

నిర్మితమైన సభాభవనమున తిరుగుచుండగా సురేఖ క్షణకాలము నాట్యమును మాని యా మృగములను చూచి మైమరచినది. ఇంద్రుడది చూచి మృగములపై మమకారంతో నాట్యమునుమాని నా యానతిని ధిక్కరించితివి. కావున ఆడులేడివి కమ్ము అని శపించెను. అంత నా సురేఖ యింద్రుని పాదములపైబడి మన్నింపుమని వేడగా ఇంద్రుడనుగ్రహముతో విభాండకముని వలన నొక పుత్రుని బడసిన పిదప శాప విమోచనమంది నిజరూపము బడసి యిచట కేతెంతువని శాప విమోచనమును ప్రసాదించెను.

సురేఖ వెంటనే యాడులేడియై యడవిలేళ్ళతో గూడి సంచరించుచుండెను. విభాండకముని యా యడవిలో తపము నొనరించుచుండెను. ఒకనాడు విభాండకముని యాశ్రమమునందు కొలనులో ఒక వనిత దిగంబరముగా స్నానము చేసి గట్టెక్కి వస్త్రము చేతబట్టి నిలబడినది. అదే సమయమున తపము చాలించి కన్నులు తెరచి లేచినిలబడిన విభాండకుడు వివస్త్రయైన యా వనితను చూచి వీర్యము స్ఖలింపగా సిగ్గుపడి చెరువులో దిగి కట్టిన వస్త్రమును చెరువులో తడిపి శుభ్రముచేసి స్నాన మొనరించి మరల తపమునకు కూర్చుండెను. దిగంబర స్త్రీయు మహర్షిని చూచి బట్టలు చుట్టబెట్టుకొని వెడలెను.

ఆ యడవిలో లేడియై తిరుగుచున్న సురేఖ దప్పిగొని విభాండకుని యాశ్రమునగల చెరువులో కడుపార ముని వీర్యముతో గూడిన నీరు గ్రోలినది. వెంటనే గర్భవతియై మగబిడ్డను ప్రసవించి శాప విముక్తి బడసిన యా సురేఖ నిజరూపము దాల్చి స్వర్లోకమున కేగినది,

కన్నతల్లి తనను విడిచి వెళ్ళిన పిదప ఆ పసిబిడ్డ ఆకలి దప్పులు సహింపలేక యేడువసాగెను తపమొనరించుచున్న విభాండకుడు పసిబిడ్డ యేడుపు విని తపము చాలించి యా శిశువును సమీ

పించి యెత్తుకొని దివ్య దృష్టివలన వాడు తన బిడ్డయే యని గ్రహించి కామధేనువును రావించి యా పసిబిడ్డకు పాలిప్పించెను. కామధేనువు పాలతో పెరిగి పెద్దయగుచున్న యా శిశువు మానవ వీర్యముతో జనించుట వలన మానవ రూపమును ఆడులేడి కడుపున బుట్టుటవలన నొక కొమ్మును కలిగియుండెను. అందువలన విభాండకు డాబాలునకు ఋష్యశృంగుడని నామకరణము చేసి వేద వేదాంగాది సమస్త విద్యలు బోధించెను. ఈ విధముగా లవుడు ఋష్యశృంగుని జన్మ వృత్తాంతమును తెలుపగా రాముడు విని చిరునవ్వు నవ్వి దశరథునకు సంతానము కలుగని కారణమేమని ప్రశ్నింపగా లవుడిట్లు చెప్పదొడంగెను.

రాజా ! దశరథుడు దేవేంద్రుని మిత్రుడు. ప్రతి దినమును స్వర్గలోకమునకు వెళ్ళి వచ్చుచుండును. రాక్షసులతో నింద్రుడు యుద్ధము చేయవలసి వచ్చినప్పుడు దశరథుడు తోడ్పడుచుండును. ఒకనాడు స్వర్గలోకములో వేడుకలు జరుపుచు నింద్రుడు తన కాప్తుడగు దశరథుని తోడ్కొని రమ్మని కింకరుని పంపెను. కింకరుడు దేవేంద్రుని యాహ్వానమును తెలుపగానే దశరథుడు దేవలోకమునకు బయలుదేరి వెళ్ళి తొందరలో నింద్రభవన సమీపమున పరుండియున్న కామధేనువునకు నమస్కరింప డయ్యెను. ఇంద్రుని దర్శించి యచట వేడుకలలో పాల్గొని అయోధ్య కేగునప్పుడు కూడ ఋతుస్నాతయైన కౌసల్యను తలంచుకొని కామధేనువునకు మ్రొక్కక తొందరగా నగరమునకు వెడలుచుండెను. అంత నా కామధేనువు కోపించి నన్నవమానించితివి కావున నీ వీర్యము వలన సంతానము కలుగదని శపింపగా దశరథుడు శాపవచనములు చెవులలో బడి వెనుకకు తిరిగి కామధేనువును సమీపించి మ్రొక్కి తల్లీ గోమాతా ! నాయపరాధమును మన్నింపుమని వేడుకొనెను.

అంత నా కామధేనువు రాజ ! మదముతో నన్నగౌరవపర చితివి కావున శాపమును బడసితివి. కాలమును కర్మమును అతిక్రమించుటెవరితరము ? అని పలుకగా దశరథుడు కామధేనువునకు మరల మరల మ్రొక్కి శాపవిమోచనము నను గ్రహింపుమని వేడుకొనెను. అంత నా కామధేనువు దశరథ ! నా పాలు తీసికొని పోయి స్నానమునాడు కౌసల్య కొసంగుము. ఆమె కొక యాడుబిడ్డ జనించునని యనుగ్రహముతో పలికెను. దశరథు డావేలుపు టావు పాలుతీసికొని యయోధ్యకేగి కౌసల్య కొసంగెను. ఋతుస్నాతయగు కౌసల్య కామధేనుక్షీరములు గ్రోలి గర్భవతియై పదవ మాసమున నొక యాడుబిడ్డను ప్రసవించెను. ఆమెకు శాంతయని నామకరణము చేసిరి.

శాంత పెరిగి పెద్దదై యుక్తవయస్కురాలు కాగా దశరథుడు స్వయంవరము చాటెను. రాజులెల్లరు శాంతా స్వయంవరమునకు రాగా పరశురాముడు తెలిసికొని అయోధ్య కరుదెంచి నా విరోధులగు నీ రాజులనెల్ల సంహరింతునని పలుకగా వారెల్లరు పలాయన మంత్రము పఠించిరి అంత నా పరశురాముడు దశరథుని సమీపించి సంహరింతునని పలుకగా వసిష్ఠుడడ్డుపడి నిరపరాధిని శిక్షింపరాదనెను.

వసిష్ఠ మహర్షి పలుకులు విని పరశురాముడు మునీంద్రా ! ఈ దశరథుడు నా విరోధులగు రాజులను చేరదీయుట చేత దండనార్హుడేయని పలుకగా; వసిష్ఠుడు మహానుభావా ! కుమార్తె స్వయంవరమునకు రాజుల నాహ్వానించెనే కాని యన్యము కాదని వివరింపగా పరశురాముడు ఓ వసిష్ఠమునీ: దశరథుడు తన పుత్రిక నొక విప్రున కొసంగి పరిణయ మొనరించిన ప్రాణము

లతో విడుతును. అట్లుగాక క్షత్రియున కొసంగుచో ఈ గండ్ర గొడ్డలితో దశరథుని శిరము ఖండింతుననెను.

అప్పుడు దశరథుడు పరశురాముని చేరి మ్రొక్కి దేవా! నీ యానతి ప్రకారము నా తనయను విప్రునికే యొసంగి వివాహము చేయుదును అని విన్నవించెను. పరశురాముడు సంతసించి దశరథుని వీడ్కోలందుకొని తపోవనమునకేగెను.

దశరథుడు తన బిడ్డ నేవిప్రుడు పరిగ్రహించును? పుత్రిక పెండ్లి యెట్లు చేయుదును? అని విచారించుచుండ వసిష్ఠుడరుదెంచి ధైర్యవచనములు పలికి దివ్యదృష్టితో నంతయు గ్రహించి రాజా! విభాండక మునీంద్రుని తనయుడగు ఋష్యశృంగునకు నీ తనయ నొసంగి పాణిగ్రహణము చేయుము. ఋష్యశృంగ మహర్షిచేత పుత్రికామేష్టి చేయించుకొనిన నీకు పుత్ర సంతానము కలుగును అని పలికి దశరథునకు సంతసము కలిగించెను.

అంత రాముడు లవుని చూచి వత్స! క్షత్రియుడైన విశ్వామిత్రుడు బ్రహ్మర్షియగుటకును బ్రాహ్మణ వంశమున జనించిన పరశురాముడు జాలిలేక సాహసముతో రాజులను సంహరించుటకును కారణమేమి? రాజులు పరశురామునకేమి యొగ్గొనరించిరి? తెలుపవా? అని ప్రశ్నింపగా లవుడిట్లు చెప్పదొడంగెను.

చవనుడను రాజునకు రేణుక యనియు శౌనిక యనియు నిరువురు పుత్రికలు జనించిరి. రేణుకను జమదగ్ని మహర్షి పరిగ్రహింపగా శౌనికను గాధియనురాజు పరిణయమాడెను. జమదగ్ని మహర్షి యెంతకాలమునకు సంతానము కలుగనందున మిగుల చింతించి పుత్రుల బడయగోరి యాగము చేయదలచి ధనము నిమిత్తమై గాథిని దర్శింపనేగెను. గాధి జమదగ్నికి స్వాగతము పలికి పాదపద్మములకు మ్రొక్కి సుఖాసనాసీనుని

గావించి అర్ఘ్యపాద్యము లొసంగి పూజించి స్వామీ ! మా పూర్వ పుణ్యము వలన మీరు మా గృహమున కరుదెంచిరి. మునీంద్రా ! నాకు రాజ్యపాలనమున విరక్తి జనించినది. పుత్త్రులు లేనివారి సంపదలు సంపదలా ? మా యందు కరుణించి పుత్త్రులను బడసి యానందించు భాగ్యమును ప్రసాదింపుడని ప్రార్థించెను.

జమదగ్ని గాధినిచూచి మహారాజ ! నేనును పుత్త్ర విహీనుడనై నందున పుత్త్రులబడయుటకై యాగము చేయదలచి ధనార్థినై నీ కడ కరుదెంచితిని. జన్న మొనరించి నీకును పుత్త్ర సంతానము కలుగచేయుదును అని పలుకగా గాధి మునీంద్రా ! వలసినంత విత్త మొసంగుదును. యాగ మొనరించి సంతాన భాగ్యము కలుగజేయుము అని విన్నవించెను.

అంత నా జమదగ్ని రాజా ! నీ కెందరు పుత్త్రులు కావలెనో తెలుపుమనెను. గాధి తనకు నలువురు తనయులు కావలెనని కోరి నీ భార్యయగు రేణుకను రావించి జన్నము చేయుమని ప్రార్థింప జమదగ్ని యంగీకరించి రేణుకను రావించి పుత్త్ర కామేష్టి నారంభించెను. ఒక హవిర్భాగమున బ్రహ్మ తేజస్సంపన్నుడగు నొక తనయుడును, మరియొక భాగమున బలపరాక్రమ సంపన్నులగు నట్లు మనసులో సంకల్పించుకొని మంత్రములను సంపుట మొనరించి హోమమొనరించు సమయమున యజ్ఞపురుషుడు పాయసపాత్రలు రెంటిని రెండు చేతులతో బూని ప్రత్యక్షమై ఎడమచేతి లోని పాత్రలోగల పాయసము క్షత్రియ సంతాన మొసగుననియు కుడిచేతిలోని పాత్రలోగల పాయసము బ్రాహ్మణ సంతానము నొసగుననియు చెప్పియిచ్చెను.

యజ్ఞపురుషు డొసగిన రెండు పాయస పాత్రలను జమదగ్ని సంతసముతో తీసికొని తన భార్యకొక పాత్రయు గాధిభార్యకొక పాత్రయు నిచ్చి భుజింపుడనెను. అప్పచెల్లెండ్రగు రేణు

కయు శౌనికయు జమదగ్ని యొసంగిన పాత్రలు తీసికొని యాగశాలకు తూర్పున నున్న శాలకేగిరి. విధివశమున నచట వారి పాత్రలు మారినవి. ఆ విషయము గ్రహింపజాలక ఆ అక్కా చెల్లెండ్రు యజ్ఞపురుషు డొసంగిన పాయసాన్నమును భుజించి గర్భవతులైరి. నవమాసములు నిండి పదవమాసమున రేణుక నలువురు పుత్రులను ప్రసవింప, శౌనిక (గాధి భార్య) యొక పుత్రుని ప్రసవించెను.

జమదగ్ని తన నలువురు పుత్రులకు పరశురాముడు, హలరాముడు ఇలారాముడు వృద్ధరాముడు అని నామకరణములు చేయగా గాధి తన కుమారునకు విశ్వామిత్రుడని పేరిడెను. విశ్వామిత్రుడు పెరిగి పెద్దవాడై సమస్త విద్యాపారంగతుడై రాజ్యమేలుచుండెను. ఒకనాడు మహారాజగు విశ్వామిత్రుడు మహా సైన్యముతో నడవికి వేటకేగెను.

అరణ్యమున వేటాడి యలసట చెందిన విశ్వామిత్రుడు సమీపమున వసిష్ఠుని యాశ్రమమున్నదని తెలిసికొని వసిష్ఠ మునీంద్రుని సందర్శింప నేగెను. ఆశ్రమము వెలుపలనే విశ్వామిత్రుడు తేరు దిగి పాదచారియై వసిష్ఠుని కడకేగి మ్రొక్కి నిలబడెను. వసిష్ఠుడు విశ్వామిత్రు నుచితాసనాసీనుని గావించి క్షేమ సమాచారమడిగి తెలిసికొనెను. కొంతసేపట్లు సంభాషించి విశ్వామిత్రుడు లేచి వసిష్ఠునకు మ్రొక్కి మునీంద్రా! సెలవిమ్ము వెళ్ళి వత్తుమని పలికెను.

వసిష్ఠుడు గాధేయ! మధ్యాహ్న సమయమైనది. ఇచట భోజనముచేసి వెళ్ళవచ్చునని పలుకగా విశ్వామిత్రుడు సంతసించి మునీంద్ర! పరివారమును విడిచి భుజించుటకు నామనసొప్పకున్నది. అని పలుకగా వసిష్ఠుడు రాజ! నీ వొంటరిగా కాక

సమస్త పరివారముతోడను సుఖముగా భుజించియే వెళ్ళవచ్చును అని పలుకగా విశ్వామిత్రు డంగీకరించెను.

అంత వసిష్ఠుడు కామధేనువును స్మరించెను వెంటనే కామధేనువరుదెంచి మునీంద్ర! నన్నేపని నిమిత్తమై పిలిచితివో సెలవిమ్ము అని విన్నవించెను. వసిష్ఠుడు కామధేనువును చూచి ఓ గోమాతా! విశ్వామిత్రునకు, వారి పరివారమునకును విందు చేయుమని యాదేశించెను. మునీంద్రుని యానతి వినినంతనే కామధేనువు పంచభక్ష్య పరమాన్నములతో విశ్వామిత్ర మహారాజునకును, వాని పరివారమునకును గొప్పవిందు చేసెను.

విశ్వామిత్రుడు కోరినకోరికల నిచ్చు నావును పొందగోరి మునికి మ్రొక్కి వినయముగా నిట్లనెను. మునీంద్రా! ఈ యావును మాకొసంగుము. దానికి బదులుగ లక్షపాడియావుల నొసంగుదునని ప్రార్థించెను. వసిష్ఠుడా పలుకులాలించి రాజ! ఈ యావు దేవతల యధీనమున నున్నది. దీనిపై నధికారమింద్రునకు మాత్రమే కలదు. ఇతరులకు దీనిపై నెట్టి పెత్తనమును లేదు. అనెను. విశ్వామిత్రుడు కోపముతో కన్నులెఱ్ఱబారి మునివర! ఆవును గైకొనవలదంటివి. రాజాజ్ఞను పాటింపనివారు రాజ్యములో నిమిషమైన నిలువగలరా? నిన్ను దయతో విడిచితిని అని పలికి కామధేనువును త్రాళ్ళతో గట్టి బలవంతముగా తోలించుకొని పోవుచుండెను.

ఆ యావు వసిష్ఠుని జూచి యా రాజు నన్ను విడచునట్లు లేదు. ఆలస్యమొనరింపక నీవు నన్ను విడిపింపుమని కోరెను. వసిష్ఠుడా ధేనువును చూచి నీవు శక్తిమంతురాలవు భయమంద నేల? దైవబలమే నిన్ను రక్షింపగలదు త్రాళ్ళు త్రెంపుకొని రాజు సైన్యమును చంపివేయుము. అని పలికెను. అంత నాయావు

భయంకరముగా హుంకారముచేసి గ్రాడు తెంపుకొని దుమికి కొమ్ములతో రాజు సైన్యమును చిందరవందరజేసి వసిష్ఠుని కడ నిలబడెను.

విశ్వామిత్రుడు మునిపై బాణములు ప్రయోగించెను కాని మునియొక్క బ్రహ్మదండము వలన విశ్వామిత్రుని బాణము లన్నియు వమ్మయ్యెను. దానితో విశ్వామిత్రుడు కోపారుణిత నేత్రుడై బ్రహ్మాస్త్రమును సంధించెను. బ్రహ్మాస్త్రమునుండి బయు ల్వెడలిన అగ్ని జ్వాలలు వసిష్ఠ మునీంద్రుని సమీపించునంతలో వసిష్ఠుడు బ్రహ్మాస్త్రముమీదకు బ్రహ్మదండమునువ్రయోగించెను. అది బ్రహ్మాస్త్రమును క్షణములో మ్రింగివైచుట విశ్వామిత్రుడు చూచి రాజబలమును నిందించి బ్రహ్మబలమును ప్రశంసించెను.

అంత విశ్వామిత్రుడు తనకిక దైవమే దిక్కని తలచి తప మొనరింప బూనెను. కొంతకాలమునకు బ్రహ్మదులు విశ్వామిత్రుని కడకరుదెంచి విశ్వామిత్రా! నీవు మునివైతివి. ఇక తపమును చాలింపుమనిరి. విశ్వామిత్రుడా దేవతలకు మ్రొక్కి పూజ్యులారా! మీరు నన్ను బ్రహ్మర్షియనిన తపముచాలింతు ననెను. అంత నా దేవతలు మునీంద్రా! వసిష్ఠుడు నిన్ను బ్రహ్మర్షి యన్న నీకు బ్రహ్మర్షిత్వము సిద్ధించునని పలికి యంత ర్ధానమైరి.

విశ్వామిత్రుడు వెంటనే తానొక మహర్షినని భావించి వసిష్ఠుని చెంతకేగెను. వసిష్ఠుడు విశ్వామిత్రునిచూచి రాజర్షి! మరల రమ్ము అని పలికెను. అంత విశ్వామిత్రుడు కోపముగా వసిష్ఠుని తనయులనుచూచి వెడలెను. విశ్వామిత్రుని కోపాగ్నికి వసిష్ఠుని నూర్వురు తనయులలో నొకడు బలియైపోయెను.

తరువాత విశ్వామిత్రుడు నిరాహారుడై పదివేల సంవత్స

తములు తపమొనరించెను. తపము చాలించి విశ్వామిత్రుడు వసిష్ఠుని దర్శింపనేగెను. వసిష్ఠుడు విశ్వామిత్రునిచూచి రాజర్షి! మరల రమ్మనెను. విశ్వామిత్రుడు కోపోద్రేకముతో వసిష్ఠ సుతులనుచూచి మరలతపమునకేగెను. వసిష్ఠుని మరియొక తనయుడు విశ్వామిత్రుని కోపాగ్నికి బలియయ్యెను.

విశ్వామిత్రుడు మరల వనమునకేగి వాయువును బంధించి తపమొనరించెను. కొంత కాలము తీవ్ర తపమొనరించి విశ్వామిత్రుడు మరల వసిష్ఠుని దర్శింప నేగెను. వసిష్ఠుడు విశ్వామిత్రుని జూచి రాజర్షి! రమ్ము. నీకు కందమూలాదులు సులువుగా లభించుచున్నవా? నిరాతంకముగా తపముసాగుచున్నదా? అని ప్రశ్నించెను. వసిష్ఠుని వలుకులు ములుకులవలె తోచి విశ్వామిత్రుడు కోపముగా వసిష్ఠుని తనయులను చూచి మరల తపోవనమున కేగెను. విశ్వామిత్రుని కోపాగ్నికి వసిష్ఠుని మరియొక కొడుకు చనిపోయెను.

ఈ రీతిగా అరుంధతీ వసిష్ఠుల నూర్గురు కుమారులలో శక్తి యనువాడు గాక మిగిలిన వారందరు విశ్వామిత్రుని కోపమునకు ఆహుతియైరి. విశ్వామిత్రుడు మరల కొంతకాలము తప మొనరించి యెప్పటివలె వసిష్ఠుని చెంతకురాగా వసిష్ఠుడు మరల విశ్వామిత్రుని రాజర్షి! యని పిలచెను. అప్పుడు విశ్వామిత్రుడు కొంచెము యోచించి వసిష్ఠుని నూర్వురు తనయులలో శక్తియనువాడు దక్క మిగిలిన తొంబది తొమ్మిదిమందియు నా కోపాగ్నికి ఆహుతియైనారు, మరల నేను కోపించిన శక్తికూడా మరణించి వసిష్ఠుని వంశమంతరించును. ఆ విచారముతో వసిష్ఠుడు మరణించును. భర్త్ర మరణముజూచి మహాపతివ్రత యగు నరుంధతి జీవించుట కల్ల. అని భావించి గౌరవాదరములతో వసిష్ఠుని

చూచి చిరునవ్వు నవ్వుచు వెడలిపోవుచుండెను. వసిష్ఠుడదిచూచి విశ్వామిత్రుడు ఆగ్రహము విడిచి శాంతుడయ్యెనని గ్రహించి బ్రహ్మర్షీ ! విశ్వామిత్ర ! వెడలు చున్నావేమి ? రమ్మి అని యాదరముగా పిలిచెను.

విశ్వామిత్రుడు మరల వసిష్ఠుని సమీపించి మునీంద్ర ! కృతకృత్యుడనైతిని. ఇంతకాలమునకు నన్ను బ్రహ్మర్షి యని పిలిచిరి. కారణమేమి ? అని యడిగిన వసిష్ఠు డిట్లు వివరించెను. విశ్వామిత్ర మునీంద్ర ! మట్టిని బంగారమును, అగ్నిని మంచి గంధమును. శత్రువులను మిత్రులను సమభావముతో చూడగల్గిన కాని బ్రహ్మత్వము సిద్ధింపదు, అట్టి స్థితి నీకిప్పుడు కలిగినది కావున నిన్ను బ్రహ్మర్షి వంటిని. నీవు మహా తపస్సంపన్నుడవు సుమా అని పలురీతులుగా ప్రస్తుతించెను.

శ్రీరాముడు విశ్వామిత్రుని చరిత్ర నాలకించి కుమారా ! పరశురాముని వృత్తాంతమును తెలియజేయుమని కోరగా లవుడిట్లు చెప్పదొడంగెను.

జమదగ్ని సుతులు నలువురును క్షత్రియులవలె మెలగు చుండిరి. సహజములైన గుణములను మానుపుట యెవ్వరికిని సాధ్యము కాదు కదా ! పరశురామాది సోదరులు నలువురును ధనుర్బాణములుదాల్చి విలు విద్యనేర్చుట జూచి జమదగ్ని చింతించి పుత్త్రులను చేరబిలిచి నాయనలార ! మీరవలంబించునది రాజ ధర్మమే కాని బ్రాహ్మణ ధర్మము కాదు సుమా యని మందలించెను. పరశురాముడు చేతులుజోడించి తండ్రీ! నేను క్షత్రియ ధర్మమును వీడజాలను. అందుకు నా మనసంగీకరింపకున్నది. కావున ధనుర్విద్యాశ్యాలై పుణ్యముతో వర్ధిల్లుమని దీవింపుడు. మీపాద పద్మములకు మ్రొక్కెదను. అని పలుకగా మిగిలిన సోదరులు

కూడ మాకును అన్నవలెనే విలువిద్య యందాసక్తి మెండుగా నున్నది. మన్నింపుడని పలికిరి. జమదగ్ని వారల పుట్టుక నెరిగిన వాడు కావున ఏమియు ననలేక యూరకుండెను.

జమదగ్ని కుమారులు నలువురును వేద వేదాంగములునేర్చి విలువిద్య మున్నగు రణవిద్యల యందు నైపుణ్యమును సంపాదించి ధనుర్బాణములు దాల్చి యుద్ధము చేయుటయందు నైపుణ్యమును సంపాదించిరి.

ఒకనాడు జమదగ్ని సంధ్యావందనాద్యనుష్ఠానములు చేయ దలచి నీరు తెచ్చి కమండలములో పోయుమని భార్యయగు రేణుక నాదేశించెను. రేణుక నీరు తెచ్చి కమండలములో పోయుచుండగ బాలసూర్యుని కిరణములకు కన్నులు మిరిమిట్లు గొల్పుటచే కొంతనీరు క్రిందపడినది. అది చూచి జమదగ్ని కోపారుణితనేత్రుడై రేణుకను తిలకించి నీ మనస్సు అన్యాయుక్తమైనది. నీ కెవరియందు మనసు కలిగినదని తీవ్రముగా పలికెను.

రేణుక పతికి మ్రొక్కి నాథా ! నా యందే దోషమునులేదు సర్వమెరింగిన మీ రిట్లానతీయదగునా ? అని పలికిన మౌనికోపము విడువక హలరామాదులను పిలిచి మీ యమ్మ తల నరుకుడని యాజ్ఞాపించెను. కాని వారు మాతృవధకు భయపడి యూరకుండిరి. అంత జమదగ్ని పరశురాముని పిలిచి కుమార ! నీ తల్లి శిరమును నీ ముప్వురు సోదరుల శిరములను ఖండింపుమని యాజ్ఞాపింపగా పరశురాముడు వెంటనే తల్లి యొక్కయు ముప్వురు సోదరుల యొక్కయు శిరములు ఖండించి తండ్రికానందము కూర్చెను. జమదగ్ని మిగుల సంతసముతో పరశురామునిచూచి యోరీ ! నీవు సుపుత్త్రుడవు. నా యానతి నెరవేర్చితివి. కావున నీకు వలసిన వరము లిచ్చెదను కోరుకొమ్మనెను.

పరశురాముడు తండ్రికి మ్రొక్కి తండ్రీ! నాచే చంపబడిన తల్లిని తమ్ములను జీవింపజేయుమని కోరగా జమదగ్ని దేవేంద్రునారాధించి యమృతమును సంపాదించి మృత సంజీవనిచే రేణుకను పుత్రులను జీవింపజేసి తపము చేయుటకై వనమున కేగెను. పరశురాముడు విష్ణువు నారాధించి నిరాహారుడై తపము చేయగా శ్రీహరి ప్రత్యక్షమయ్యెను. పరశురాముడు శ్రీహరిని పలురీతులుగా స్తుతింప శ్రీహరి సంతసించి బ్రాహ్మణోత్తమా! నీవు రణభీకరుడవు కాగలవు. నీ తపమునకు మెచ్చి నా శక్తి నొకించుక నీ కొసంగితిని. రాజులు దుర్మార్గులై కుచ్ఛితపు బుద్ధితో సజ్జనులను పీడించుచున్నారు. అట్టివారిని సంహరింపుము సహస్ర బాహుడగు కార్తవీర్యుని కరములు ఖండించి కీర్తి నందుము. ధర్మపద్ధత నవలంబించి విప్రుల కోరికలు నెరవేర్చుము. దీనులను దయతో కాపాడుము. నిశ్చల భక్తితో నన్ను సేవింపుము. అని పలికి శ్రీహరి యంతర్ధానమయ్యెను.

జమదగ్ని యొక యరణ్యమున ఘోర తప మొనరించుచుండెను. కార్తవీర్యార్జునుడు వేటకై యడవిలో తిరుగుచు తప మొనరించు చున్న జమదగ్నిని చూచి మునీంద్ర! దాహము తీర్చుకొనుటకి ప్రాంతమున జలాశయ మెచట నున్నదో తెల్పుమని కోరగా తపము చేయుచు మైమరచిన జమదగ్ని సమాధానము చెప్పడయ్యెను. కార్తవీర్యార్జునుడు కోపముతో జమదగ్ని శిరమును ఖండించి నగరమున కేగెను. భర్తతో సహగమనము చేయదలచి రేణుక యగ్నిలో దుమికెను కాని యగ్ని మహా పతివ్రతయగు రేణుకను స్పృశింపజాలడయ్యెను. రేణుక దుఃఖముతో తిరుగుచు నొక బోయపల్లె చేరి యొకచోట గూర్చుని యేడ్చుచుండెను. తపము చాలించి భూప్రదక్షిణము చేయుట కేగుచున్న పరశురాముడు విధివశమున బోయపల్లె కరుదెంచి విలపించుచున్న

తల్లిని చూచి తండ్రిని విడచి యడవిలో తిరుగుచున్నదని తలచి గొడ్డలితో తలనరుకబోగా ఇంద్రాది దేవతలు అట కరుదెంచి నిర్దోషు రాలగు తల్లిని బాధింపకుము. ఈ సాధ్వి చిరకాలము పుణ్య దేహముతో నుండగలదు. మదాంధుడగు కార్తవీర్యార్జునుడు తప మొనరించుచున్న నీ తండ్రి శిరమును ఖండించెను. నీ తండ్రి శిరమును శరీరముతో జేర్చుము. దైవానుగ్రహము వలన నీ తండ్రి మరల జీవించును. అని పలికి యంతర్ధానమైరి. పరశురాముడు దేవతలు చెప్పినట్లు చేసి తండ్రిని బ్రతికించుకొనెను.

కృతవీర్యుని కుమారుడు కార్తవీర్యార్జునుడు సరయూ నదీ తీరమున పదివేల జన్మము లొనరించెను. ఇతడు సహస్రబాహువులతో సూర్యుని వంటి ప్రతాపముతో మహా సంపదతో అరిభీకరమైన పరాక్రమముతో ప్రసిద్ధిబడసెను. కార్తవీర్యార్జును డింద్ర విభవముతో రాజ్యమేలుచుండెను.

పరశురాముడు తపమొనరించి హరితేజమునుబడసి పరిపాలన చేయుచున్న రాజుల దుష్కృత్యములు గ్రహించి ఖడ్గము ధనుర్బాణములు, పరశువు చేబూని కార్తవీర్యునిపై దండెత్తెను. తనపై పరశురాముడు యుద్ధమును ప్రకటించుట తెలిసి కార్తవీర్యార్జునుడు అగ్నిలో బడబోవు మిడతవలె యుద్ధమునకు సంసిద్ధుడయ్యెను పరశురాముని చూచి కృతవీర్యతనయుడు ఓయి బాపడ ! నాతో సమరము చేయుట కరుదెంచితివా ? పారిపోయి యసువులు కాపాడుకొనుము. లేనిచో నొక్క నిమిషమిట నిలచిన నా పరాక్రమము నీకు రుచి చూపెదను. అని బెదిరింప పరశురాముడు వేద ధర్మములతో ధనుర్బాణములతో విలసిల్లు నేను "ఇదం బ్రాహ్మ్యమిదం క్షాత్రం" అనునట్లు బ్రాహ్మముక్షాత్రముఃజూపి "శాపాదపి శరాదపి" అను న్యాయమున శాపమువలనకాని శరము వలనకాని నాశనము చేయగలను సుమా ! అని హెచ్చరించెను.

కార్తవీర్యుడు ఆగ్నేయాస్త్రమును విడువగా పరశురాముడు వారుణాస్త్రమున దాని నణచెను. కార్త వీర్యుడు నాగాస్త్రమును సంధింప పరశురాముడు గారుడాస్త్రమును ప్రయోగించెను. కార్త వీర్యుడుగజాస్త్రము సంధింప పరశురాముడు సింహాస్త్రమును; కార్త వీర్యుడు దానవాస్త్రమునేయ పరశురాముడు వైష్ణవాస్త్రమునేసెను,

అంత పరశురాముడు కార్తవీర్యుని ధనుర్బాణములను రథమును అశ్వములను కవచమును చీల్చిన, కార్తవీర్యుడు క్షీణ బలుడైనను ధైర్యము కోల్పోక శూలమును పరశురామునిపై విస రెను. వెంటనే పరశురాముడు శక్తిని ప్రయోగింపగా అది రొమ్మువ తాకి కార్త వీర్యుడు మూర్ఛవోయెను. కొంతసేపటికి తెలివి తెచ్చుకొని కార్తవీర్యుడు వేయి చేతులతో వేయి ఆయుధములు పూని తనమీద కరుదెంచుట చూచి పరశురాముడు బాణవర్షము కురిపించెను. కాని వాడు జంకక ఇంకను మీది మీదికి వచ్చుటచూచి పరశురాముడు గండ్రగొడ్డలి చేబూని యెదిరించెను. రెండు కొండలు ఢీ కొనునట్లును, రెండు సింగములు పోరాడుచున్నట్లును పరశురామ కార్తవీర్యులు ఒండొరులతో భీకర సమర మొనరింప జొచ్చిరి.

అంత నా పరశురాముడు ఆగ్రహముతో గండ్రగొడ్డలి పైకెత్తి వజ్రముచే కొండల రెక్కలు ఖండించినట్లును, మదగజము చెరకు గడలు విరచునట్లును కార్తవీర్యుని వేయిచేతులు నరికి శిరము దునిమెను. వజ్రాహతమైన రోహణాచల శృంగమువలె కుండలాద్యాభరణములతో నేలబడిన కార్తవీర్యుని దేహము నుండి దివ్య తేజస్సు వెలువడి గగన మార్గమున ప్రవేశించెను.

పరశురాముడు కార్త వీర్యార్జునుని సైన్యము నంతటిని సంహరించి వేసెను. భర్తృ మరణమునకు విలపించుచున్న తల్లి యిరువదియొక్క పర్యాయములు తల బాదుకొనుటచూచి నందున

పరశురాముడు భూమండల మంతయు తిరిగి యిరువది యొక్క పర్యాయములు రాజులను సంహరించి యా రక్తముతో భూతృప్తికై తర్పణ మొనరించెను. అని లవుడు వివరించి చెప్పగా సభాసదులెల్లరు సంతసించిరి.

అంత శ్రీరాముడు లవుని చూచి తరువాతి వృత్తాంతమును తెల్పుమనగా లవుడిట్లు చెప్ప దొడంగెను. ఒక పర్యాయము అంగ దేశమున అనావృష్టి యేర్పడి క్షామముపట్టి పన్నెండు సంవత్సరములు ప్రజలు మలమలమాడిరి. అంగ దేశాధీశుడగు రోమపాదుడు తన మిత్రుడు బంధువునగు దశరథుని దర్శింపబోయెను. దశరథుడు రోమపాదునకు స్వాగతము పలికి యుచితాసనాసీను గావించి క్షేమసమాచారము లడిగెను. రోమపాదుడు దశరథుని చూచి మహారాజ ! మా దేశమును దుర్భరక్షామము పట్టి పల్లార్చుచున్నది. ప్రజలనెట్లు కాపాడవలయునో తోచకున్నది. అందు వలన రాజ్యమును విడిచి యడవికేగి తపము చేయ నిశ్చయించితినని పలుకగా; వసిష్ఠుడా రోమపాదుని పలుకులాలకించి రాజ ! పాలింపజాలక రాజ్యము విడిచిపోవుట తగునా ? నీ మిత్రుడగు దశరథుని కోరి వాని కుమార్తెయగు శాంతను పెంచుకొనుము. నీ రాజ్యమునకుగల సమీపారణ్యమున మిగుల దయాళువగు విభాండక ముని నివసించుచున్నాడు వాని కుమారుడు ఋష్యశృంగుడు. ఋష్యశృంగుని నీరాజ్యమునకు తీసికొనివచ్చి శాంతనిచ్చి పెండ్లి చేయుము. నీకు వలసినప్పుడు వానలు కురిసి సుభిక్షమేర్పడుటయే కాక ఆ ఋష్యశృంగుని యనుగ్రహము వలన నీకును నీ స్నేహితుడగు దశరథునకును పుత్రలాభము కలుగును. అని పలికెను.

వసిష్ఠుని పలుకులకు రోమపాదుడు సంతసించి దశరథుని చూచి మిత్రమా ! నీవు నాకు దైవసముడవు. నీ యశము దశ

దిశల వ్యాపించినది. నీ కుమార్తెయగు శాంతను పెంచుకొనుటకు నా కొసంగుము. అని వేడగా దశరథుడు వసిష్ఠుని యనుమతితో శాంతను రోమపాదున కొసంగెను. అంగరాజానంద పరవశుడై వసిష్ఠుని యొక్కయు దశరథుని యొక్కయు అనుమతి పొంది శాంతను రథముపై తన దేశమునకు తీసుకొనివెళ్ళి భార్యకప్పగించి మిగుల గారాబముతో పెంచుచుండెను.

రోమపాదుడు ఒకనాడు వనమునుండి ఋష్యశృంగుని నగరమునకు తీసికొని వచ్చిన వారికి కోరిన వొసంగెదనని చాటింపు వేయించెను. ఆ చాటింపు విని సంపూర్ణ కళావతి యను నొక వేశ్యా రత్నము రాజును దర్శించి రాజా ! ఋష్యశృంగుని నేనడవినుండి తీసికొనివత్తును. తమరు అనుమతి నొసంగుడని ప్రార్థింప రాజు సంతసించి ఆమెకు పెక్కు బహుమతు లొసంగి యనుమతి నొసంగెను.

అంత సంపూర్ణ కళావతి చక్కగా నలంకరించుకొని కొందరు పాటి కాంతలను వెంటనిడుకొని మునులున్న వనమునకేగెను. ఋష్యశృంగుని తపోభూమికి సమీపమున పువ్వులు కోయుచు ఆడుచు పాడుచు మెల్ల మెల్లగా ఋష్యశృంగుడు తపము చేయు చున్న ప్రదేశమునుచేరి మహర్షికి మ్రొక్కి చిలుక పలుకులు పలు కుచు అమృతమువంటి సంగీతము పాడుచు మునిపై పూలుజల్లుచు సరసములాడుచు సమీపమున గూర్చుని తాము తెచ్చిన భక్ష్య ములు తినిపించుచు మచ్చికతో కౌగిలించుకొనుచు మెల్ల మెల్లగా వశముచేసికొనజొచ్చిరి. మునియు నా కాంతలు మునులని భావించి మీ రేవనమున తపము చేయుచుండిరి ? అని ప్రశ్నించి నా భాగ్యమువలన దైవము మిమ్మిటకు తోడ్కొని వచ్చెను. మీ వంటి మునులను ఎన్నడును చూచి యెరుగను. నేటికి చూడగల్గితిని అని పలికెను.

ఋష్యశృంగుని యమాయకత్వమునకా కాంతలు కలతచెంది ఈ ముని నే యుపాయమున రాజు కడకు తీసికొని పోగలమా ! అని చింతించుచుండిరి. అంత నా సంపూర్ణ కళావతి యిట్లనెను. చెలులార ! మన మీతని బలవంతముగా తోడ్కొని పోజాలము. కావున నొక యుపాయమాలోచించితిని. అని పలికి మునీంద్రా ! మేము మా గురువును సందర్శింప నేగుచున్నాము. మా యాశ్రమమున తీయని ఫలములు, మృదువైన వసనములు కలవు. అని పలికిన ఋష్యశృంగుడు సంతసించి మిత్రులార ! మీ వనమున తపమొనరించు మీ గురువును సందర్శించి మీరు గానముచేసిన వేదము నాలకించు కుతూహలముకలదు. తొందరగా పయనము కండు అని వేగిరించెను.

తాము కృతార్థుల మైతిమనియు వేశ్యలుసంతసించి ముని నక్కున జేర్చుకొని తీయని పలుకులతో నానందము కలిగించుచు నగరమునకు తోడ్కొని వచ్చిరి. రోమపాదుడు ఋష్యశృంగుని రాక విని భక్త్యాదరముతో నెదురేగి స్వాగతముపలికి లోనికి తీసికొనిపోయి అర్ఘ్యపాద్యము లొసంగి యర్చించి సుఖాసనాసీనుని గావించి యిట్లుపలికెను. మునీంద్రా ! మీ రాకవలన మా గృహము పావనమైనది. మీ పాదధూళిసోకి నా పాపములు నశించినవి అని వినుతించి పూజించెను. నేర్పుగా ఋష్యశృంగుని తోడ్కొని వచ్చిన సంపూర్ణ కళావతి మున్నగు వారికి కోరిన బహుమానము లొసంగెను.

ఋష్యశృంగుడు రోమపాదుని చూచి మహారాజ ! ఈ దేశ ప్రజలెల్లరు సుఖముగా నున్నారా ? అని యడిగిన రోమపాదుడు మునీంద్రా ! పండ్రెండు సంవత్సరములనుండి వానలు లేక దేశమున దుర్భరదుర్భిక్షము తాండవించుచున్నది. మీరు దక్క యనావృష్టిని తొలగించి మమ్ము కాపాడ గలవా రొండొరులు లేరు

అని ప్రార్థింప ఋష్యశృంగుడు ఇంద్రుని ప్రార్థించి వర్షము కురిపించెను. ఆ వాన యెల్ల ప్రాణులకు ఆనందము కలిగించెను. పంటలు బాగుగా పండి భూమికి గల యుర్వరయను నామము సార్థకమయ్యెను.

అప్పుడు శ్రీరాముడు లవుని చూచి బాలకా ! ఋష్యశృంగుడు తలచిన మాత్రమున నింద్రుడు వర్షించుటకు కారణమేమని ప్రశ్నించెను. లవుడిట్లు తెల్పెను. రాజా ! ఆడులేడి కడుపున ఋష్యశృంగుడు జనించిన పిదప తండ్రియైన విభాండకుని చూచి నీటితో తడుపుమనికోరగా విభాండకు డింద్రుని పూజించి మెప్పించి త్రిదశాధిప ! యీ బాలకుడు మేఘ పుష్పములు (జలములు) కోరినప్పు డొసంగి వాని కోరిక తీర్చుమని యాదేశించెను అది మొదలుకొని యింద్రుడు అట్లే చేయుచుండెను. లవుడు తెల్పిన విషయము సభాసదులకు ఆనందము గూర్చెను,

అంతలో లక్ష్మణు డరుదెంచి భోజన సమయమైనదని విన్నవింపగా రాముడు లవుని చూచి భోజనము చేసిన పిదప మిగిలిన కథ చెప్పవచ్చును. కావున భోజనమునకు రమ్మని పలుకగా లవుడు మీ యింట భుజింపను. తండులము లొసంగిన తీసికొని పోదును. ఇవ్వనిచో వెడలిపోవుదునని పలుకగా శ్రీరాముడు వసిష్ఠుని మోము తిలకించెను. వసిష్ఠుడు రాముని మనోభావము గ్రహించి రామచంద్ర ! గురువుగారి యనుమతి లేనిదే యితడు మీ యింట భుజింపడనిన రాముడంగీకరించి లవునకు మంచి బియ్య మొసంగి బాలక ! పురాణము పూర్తిగా చదువనిచో దోషము కావున రేపుదయము తప్పకరమ్ము అని కోరగా, లవుడు రాజేంద్రా ! రేపు సోదరునితో గలిసి వచ్చి రామాయణము గానము చేయుదునని పలికి బయలుదేరి సమీరుని దయవలన వెంటనే మిథిలకు చేరెను.

బిడ్డల రాక కెదురు చూచుచున్న జానకి ఒంటరిగా వచ్చిన లవుని చూచి కౌగిలించుకొని నాయన ! కుశుడేడి యని యడిగిన లవుడు తల్లికి మ్రొక్కి అమ్మా నాతో గొంత దూరము వరకు వచ్చి నాతో వాదులాడి యొంటరిగా నేగెనని చెప్పగా వైదేహి చింతాక్రాంతయై కుశుని కొరకెదురు చూచుచు నొక మఱ్ఱి నీడన గూర్చుని చింతించుచుండెను. ఇంతలో కుశుడునురాగా సీత కౌగిలించుకొని బిడ్డలారా ! మీ రిరువురు వేరువేరు దారులలో నేలయేగిరని యడిగి యేడ్చుచుండెను. జనక వాల్మీకులట కరుదెంచి సీత నూరడించి ఇకముందెన్నడు వేరువేరుగా తిరుగకుడని మందలించి యింటికి తోడ్కొనిపోయిరి. అంత జానకి ఇరువురు కుమారులతో గూడి భోజన మొనరించి రామాయణము వినుచుండెనని మార్కండేయుడు తెలుపగా ధర్మరాజాదు లానందించిరి.

అంత ధర్మరాజు అనంతర వృత్తాంతమును తెల్పుమనగా మార్కండేయు డిట్లు చెప్ప దొడంగెను. ధర్మజ ! మరునాడుదయము లవకుశులు ఉదయ కాలానుష్ఠానము దీర్చికొని యయోధ్యకేగు చున్న సమయమున వాయుదేవుడు క్షణములో నా బాలకులను సాకేత నగరమున చేర్చెను. నగర వీధులలో నడచి వెళ్ళు చున్న లవకుశులను చూచి నగర స్త్రీలు వెంటబడిరి.

శ్రీరాముడును అనుష్ఠానములు నెరవేర్చుకొని కొలువుదీరి లవుని రాక కెదురు చూచుచుండెను. కొంతసేపటెదురు చూచి శ్రీ రాముడు సౌమిత్రిని పిలిచి తమ్ముడా ! నిన్న పురాణము చెప్పిన బాలుడేలనో ఇంకనురాలేదు. కారణమరయుమని యాదేశించిన సౌమిత్రి లవుని గూర్చి రాజమార్గమున నేగుచు తన కెదురు వచ్చు లవకుశుల నారసి వారల రూపలావణ్యాదుల కచ్చెరువంది బాలకులార ! రఘు వీరుడగు రాముడు మీకై యెదురు చూచుచున్నాడు. వెంటనే రండని పలికి వారిని తీసికొని సభలోని కేగెను.

బాల సూర్యులవలె విలసిల్లుచున్న యాబిడ్డల గన్న తల్లి దండ్రు లెట్టి తప మొనరించిరోకదా ! అని రాముడు ముచ్చటపడి చూచు చుండ లవకుశులు వసిష్ఠునకు మ్రొక్కిరి. శ్రీరాముడు ఆ బాలు రను దగ్గరకు చేరబిలిచి కౌగిలించుకొని బంగరు తివాచిపై గూర్చుండజేసి తరువాతి వృత్తాంతమును చదువుడని పలికెను.

లవకుశులు వినాయక స్తుతియు సరస్వతి ప్రార్ధనయు జేసి గురువును స్మరించి రామాయణ మహా గ్రంథమును తెరచి చదువు చుండ సభాసదులెల్లరు తన్మయులై నాలకింపసాగిరి

ధర్మనందనుడు మార్కండేయుని చూచి మునీంద్రా ! ధర్మపరుడగు రోమపాదుని రాజ్యమున ద్వాదశవర్షక్షామ మేర్పడు టకు కారణమేమి ? అనావృష్టి యేల యేర్పడినది ? తెలుపుమనిన మార్కండేయుడిట్లు చెప్ప దొడంగెను. ధర్మజ ! లవుడు తెల్పిన వృత్తాంతమువలన నీ ప్రశ్నకు సమాధానము లభింపగలదు ఆల కింపుము.

రోమపాదుడు మిగుల ధర్మాత్ముడు వేద విదులగు విప్రు లకు పలుదానము లొనరించుచు సంతానము లేనందుకు మిగుల చింతించుచుండెను. రోమపాదు డొనరించు దానములు మిగిలిన రాజుల కాశ్చర్యము కలిగించుచుండెను.

ఒకనాడు రోమపాదుడు వేదవేదుడను నొక విప్రునకు వలసినంత ధనమును దానముగా నిచ్చెను. ఆ విప్రుడు రాజొసగిన ధనము నతికష్టమున నింటికి చేర్చెను. ఆ విప్రుని కుమారుడు తండ్రిని చూచి జనకా ! మహారాజును కోరి యొక పాడియావును తోలుకొని రమ్ము అని మారాము చేయగా నా విప్రుడు కుమా రుని రాజుకడకు తీసికొనిపోయి మహారాజ నా పుత్త్రున కొక పాడి యావును దానమిమ్ము నీకు పుణ్యముండునని పలుకగా రాజు నవ్వి బ్రాహ్మణుల యాశలు దీర్చగల వారెవరైన గలరా ?

అన్ని వస్తువుల కంటెను కొండ పెద్దది. కొండకంటె సముద్రము గొప్పది. సముద్రము కంటె ఆకసము మిన్న ఆకసము కంటె దైవము గొప్పది దైవము కంటె ఆశ మిగుల పెద్దది సుమా! అని సదస్యులతో పలికి యావును కోరిన విప్రుని చూచి విప్రోత్తమ! నీవు కోరినంత ధనమొసంగితిని. కాని నీవు తృప్తిపడక గోవును యాచించితివి. గోవునొసగిన రాజ్యము కోరుదువేమో అని హేళనగా పలికెను.

అపహాస్యము చేసిన రోమపాదుని పలుకు లాలించి యా విప్రుడు రాజ! నా మాట సరకుగొనక నన్ను హేళన చేసితివి కావున నీ దేశమున వానలు కురియక క్షామము సంభవించుగాక అని యాగ్రహముగా శాపమిచ్చి చరచరా పోవుచున్న బ్రాహ్మణుని పాదములపై బడి బ్రాహ్మణోత్తమ! నన్ను మన్నింపుము. అజ్ఞానముతోను గర్వముతోను నిన్నవహేళన మొనరించితిని. ఒక గోవు కాదు వేయిగోవులనిత్తును శాపము నుపసంహరింపుమని ప్రార్ధించెను.

రోమపాదుని ప్రార్ధన యాలకించి రాజ! బ్రాహ్మణ వాక్యమమోఘము. కావున నా శాపము తప్పదు. నీవు ప్రార్థించినందున అనావృష్టి పన్నెండు సంవత్సరములు మాత్రమే నీ రాజ్యమును పీడించును. విభాండక మహర్షి తనయుడగు ఋష్యశృంగుని వలన నీ రాజ్యమున సువృష్టి కలిగి సుభిక్షమేర్పడి ప్రజలు సుఖింతురని పలికి వెడలిపోయెను. అందువలననే రోమపాదుని రాజ్యమున పండ్రెండు సంవత్సరము లనావృష్టి యేర్పడి క్షామ బాధ సంభవించినదని తెలియ జేసెను.

లవుడు చెప్పిన దాని నాలకించి శ్రీరామచంద్రుడు, సభాసదులు సంతసించి యనంతర వృత్తాంతమును తెలుపమనగా

ఆ బాలురు రామాయణము గానము చేసి వివరింప సాగిరి ధర్మజ! నీకా వృత్తాంతమును తెల్పెద నాలకింపుమని మార్కండేయుడు ధర్మరాజునకు చెప్ప దొడంగెను.

రోమపాదుడు విభాండకుని తనయుడగు ఋష్యశృంగుని అత్యాదరమున నింటనుంచుకొని పూజించుచుండెను. ఋష్యశృంగుడొకనాడు రాజ భవనమున నొంటరిగా నున్నప్పుడు అంతఃపుర స్త్రీలు శాంతను వెంటబెట్టుకొని వెళ్ళి ఋష్యశృంగుని పాదములకు మ్రొక్కిరి. శాంతను తీసికొని అంతఃపురస్త్రీలు వెడలిన పిదప రోమపాదు డరుదెంచి ముని పాదములకు మ్రొక్కెను. ఋష్యశృంగుడు రాజును చూచి రహస్యముగా నిట్లనెను. మహరాజ! ఇంతకు పూర్వమే యొక కన్నె యంతఃపుర స్త్రీలతో గలిసి వచ్చి నాకు మ్రొక్కినది. ఆమె యెవరిబిడ్డయో తెల్పుమని యడుగగా రాజిట్లనెను. మునీంద్రా! నీకింతకు పూర్వము మ్రొక్కిన కన్య నా మిత్రుడగు దశరథ మహారాజు పుత్రిక. నేనొక యారుమాసములు, నా మిత్రుడొక యారుమాసములు పెంచుచున్నాము. ఆమె పేరు శాంత అని వివరించెను.

అంత నా ఋష్యశృంగుడు దశరథుని విషయమును, దశరథుని సంతానము విషయమును తెలుపుమని కోరగా రోమపాదుడిట్లు చెప్ప దొడంగెను.

మునీంద్రా! ఎల్ల లోకములు సృజించు నలువకు కశ్యపుడు తనయుడు, కశ్యపునకు త్రిమూర్తి స్వరూపుడగు సూర్యుడు జనించెను. జ్యోతిర్మయుడగు సూర్యుడు లోకములను ప్రకాశింప జేయుటవలన వాని వంశము సూర్యవంశ మని ప్రసిద్ధిబడసెన్వ సూర్యతనూజుడు. వైవస్వతుడు, వైవస్వతుని తనయు డిక్ష్వా. కుడు. ఇక్ష్వాకుడు లోక పూజ్యుడు కావున సూర్యవంశమువారు ఇక్ష్వాకు వంశమువారని పేరందిరి.

ఇక్ష్వాకునకు కుక్షి, కుక్షికి అనరణ్యుడు, అనరణ్యునకు అమరబాహువు. వానికి పృథుడుదయమంది చక్రివర్తి యయ్యెను. పృథునకు త్రిశంకుడు, త్రిశంకునకు హరిశ్చంద్రుడు, హరిశ్చంద్రునకు లోహితాస్యుడు, లోహితాస్యునకు దుంధుమారుడు, వానికి యువనాశ్వుడు, యువనాశ్వునకు మాంధాత, వానికి సంధి. వానికి యుగసంధి, వానికి ప్రసేనజిత్తు, వానికి మహాబలుడు వానికి శత్రుజిత్తు, వానికి ఋతుధ్వజుడు జనియించిరి.

ఋతుధ్వజుడు పాతాళమునకేగి రక్కసులను దునుమాడి మదనసాయక యను కన్యను పరిణయమాడి ఆమెవలన భరతుడను పుత్త్రిని బడసెను. భరతునకు సేతుడు, సేతునకు సగరుడు జనించిరి. సగరునకు పెద్దభార్యవలన అరువదివేలమంది పుత్త్రిలు జనించిరి. వీరు మిగుల బలవంతులై అగస్త్యుని వలన జలములు హరింపబడి పెద్ద గొయ్యిగానున్న సముద్రమును త్రవ్వి మట్టి భుజించిరి. సగర తనయులచేత విస్తరింపబడుట వలన సముద్రమునకు సాగరమను పేరువచ్చెను. కపిల మహర్షి కోపాగ్నికి సగర తనయులందరు నొకేసారి చనిపోయిరి. కొంతకాలమునకు వారి భార్యలకు భగీరథుడు జనించెను. అతడు పితృ దేవతల విముక్తికై సకల లోక పావనియగు గంగను తెచ్చి సాగరమును పూరించెను. భగీరథుడు తెచ్చుటవలన గంగకు భాగీరథియను పేరు వచ్చెను?

సగరుని రెండవ భార్యకు అసమంజుడు, వానికి అంశుమంతుడు అంశుమంతునకు కకుత్స్థుడు జనించెను. ఈ కకుత్స్థుడు సర్వదిగ్విజయము చేసినందున రవివంశజులకు కాకుత్స్థులను పేరు వచ్చెను. కకుత్స్థునకు కల్మాషపాదుడు కల్మాషపాదునకు శంఖుడు శంఖునకు సుదర్శనుడు వానికి అగ్నివర్ణుడు వానికి శీఘ్రగంతుడు వానికి మరుత్తు మరుత్తునకు ప్రశశ్రవుడు వానికి అంబ

రీషుడు జనించిరి. అంబరీషుడు పెక్కుయాగములుచేసి యింద్రా దులను తృప్తి పరచి విష్ణుభక్తునిగా ప్రసిద్ధిగాంచెను. వానికి నహుషుడు, వానికి యయాతి జనించిరి. ఈ యయాతి జితేంద్రి యుడు విష్ణుభక్తుడు. యయాతికి నాభాగుడు, నాభాగునకు దిలీ పుడు. దిలీపునకు రఘువు జనించిరి. రఘువు అన్నిదిక్కులు జయించి విశ్వజిద్యాగముచేసి కీర్తిగాంచెను. కావుననే సూర్య వంశమునకు రఘు వంశమని పేరువచ్చెను రఘువునకు అజుడు అజునకు దశరథుడు జనించిరి.

దశరథుడు సత్యసంధుడు, పరాక్రమశాలి. సూర్యవంశ రాజుల రాజధాని యయోధ్య. సూర్య వంశీయులకు వసిష్ఠుడు పురోహితుడు. కాపుననే సూర్యవంశమువారు వసిష్ఠ గోత్రము వారైరి. అని రోమపాదుడు ఋశ్యశృంగునకు వివరించెను.

లవకుశులు చెప్పినదాని నాలకించి శ్రీరాముడు బాలులారా! అగస్త్యుడు సముద్రోదకమును పానము చేయుటకు కారణమేమి అది వాని కడుపులో నెట్లు జీర్ణమయ్యెను ? సగర తనయులు నీరులేని సాగరము త్రవ్వుటకును మట్టి తినుటకును కారణమేమి? భగీరథుడు సాగరము పూరించుటకు కారణమేమి ? భర్తృ విహీనురాలైనవారికి భగీరథుడెట్లు జనించెను ? అంతయు వివరించి చెప్పుడని కోరగా లవకుశలు తెల్పినదానిని మార్కం డేయ మహర్షి పాండవులకు తెలుపుచుండెను.

సతాపి (ఇల్వలుడు) వాతాపి అను నిరువురు రక్కసులు మునులను చంపి తినసాగిరి. రాక్షసులకు భయపడి మునులు తమ నివాసములు విడిచి దూరదేశములకు పయనమైరి. ఆ రాక్ష సులు మునుల ననుగమించిరి. అది గమనించి మహర్షులు వీలైన ప్రదేశములందు దాగిరి. రక్కసులు మునులను పసిగట్టి చంపు చుండిరి. అట్లు కొంతకాలము గడచినది. రక్కసులంతతో తృప్తి చెందక తపమొనరించి కోరికలు నెరవేర్పు కొందమని

తలచి మిగుల నియమములతో బ్రహ్మనుగూర్చి తపమొనరించు చుండిరి. ఆ రక్కసుల యుగ్రతపమున పుట్టిన భయంకర జ్వాలలకు దేవతలు ఖిన్నులై బ్రహ్మకడకేగి మ్రొక్కి కమలాసనా! రక్కసులుచేయు నుగ్రతపము వలన అగ్నిజ్వాలలు బయలుదేరి లోకములను దహించుచుండెను. రక్కసులచేత తపమును మాన్పించి లోకములను రక్షింపుమని ప్రార్థించిరి.

దేవతల పలుకులాలించి విరించి యిట్లు పలికెను. నన్ను గూర్చి రక్కసులు తప మొనరించి నావలన వరములు పొంది మరల మిమ్మే బాధింతురు. నన్నేమి చేయుమందురు అని పలుకగా బృందారకులు ఇట్లు ప్రార్థించిరి. దేవా! రక్కసుల తపోగ్నిజ్వాలలు సహింపజాలకున్నాము. తరువాత మాట చూడవచ్చును ముందు రక్కసులకు వరమిచ్చి తపము మాన్పించుము లోకములను రక్షింపుము. రాగల యుపకారమున కెవరైన నడ్డుపడకుందురా? అని విన్నవింప బ్రహ్మ సంతసమంది వారిని సాగనంపి సతాపి వాతాపులు తపము చేయుచోటున కేగి. వారికి ప్రత్యక్షమై దైత్యులార! మీ తపమునకు మెచ్చితిని మీ కోరికలు తెలియజేయుడు అని పలుకగా నారక్కసులు బ్రహ్మదేవుని పాదపద్మములకు మ్రొక్కి పితామహా! మేము తలచినప్పుడు మాలో నొకరు మేక యగునట్లు వరమిమ్ము. మాలోనెవరైన మరణించిన రెండవవాడు పిలుపగానే జీవించునట్లు వరమొసంగుమని ప్రార్థించిరి. బ్రహ్మ వారు కోరినట్లుగా వరమొసంగి యంతర్ధానమయ్యెను.

సతాపి వాతాపులు బ్రాహ్మణ వేషములుదాల్చి మునులను పిలచి వారు చూచుచుండ మేకను (సతాపిని) చంపి వండివారికి వడ్డించెను. భోజనముచేసి మునులు (బ్రాహ్మణులు) విశ్రాంతిగా నాసీనులై యున్నప్పుడు తమ్ముడ! రారా! అని పిలువగనే

వాడు మునులయుదరములు చీల్చుకొని బయటకువచ్చును అట్లు వచ్చిన పిదప చచ్చిపడియున్న మునుల నా సోదరులిరువురు తిను తినుచుందురు.

మునులు క్రమముగా నశించుట గమనించిన కొందరు మహర్షులు బ్రహ్మకడకేగి కమలాసన ! రక్కసులు మాయో పాయములచే మునులను విప్రులను జనులను హింసించుచు న్నారు. మా మనవి మన్నించి యా రక్కసులను గడతేర్చు నుపా యము నాలోచించి ప్రతిక్రియ చేయుమని మొరపెట్టు కొనగా పితామహు డంగీకరించి వారిని పంపివేసి క్షణకాలము కన్నులు మూసికొని ధ్యానించుచుండ దైవవశమున ఊర్వశి యెదుట నున్నట్లు తోచి మోహసాగర నిమగ్నుడై వీర్యముస్ఖలించ, ఆ వీర్యము సువర్ణ కుంభమున బెట్టు చుండ సగము వీర్యము రసా తలమునను సగము వీర్యము సువర్ణకుంభమునను పడెను.

రెండు స్థలములందుపడిన శుక్రమువలననిరువురు పుత్త్రులు జనించిరి. వారిని చూచి బ్రహ్మ ఆ పుత్త్రులిరువురును తమంత వారు కాగలరని యెంచి రసాతలమునబడిన వీర్యమువలన బుట్టిన వానికి వసిష్ఠుడనియు బంగరు కడవ(బిందె)లోపడిన వీర్యమువలన జనించిన వానికి అగస్త్యుడనియు నామకరణములు చేసెను. వసి ష్ఠుడు సత్వగుణ సంపన్నుడై వాసిగాంచుననియు అగస్త్యుడు హరిహరాదుల కశక్యమైన శక్తిసామర్ధ్యములు కలిగి యుండు వనియు దీవించెను.

అంతనాబ్రహ్మ అగస్త్యునిజూచి కుమారా ! సతాపి, వాతాపి అని నిరువురు రాక్షసులు మునులను సజ్జనులను చంపుచున్నారు. ఆ రాక్షసులను శిక్షించి లోకమును కాపాడగల సమర్థులు నీవు దక్క అన్యులు లేరు. నీవు శ్రీహరినిగూర్చి తపమొనరించి శ్రీ మన్నారాయణు ననుగ్రహమువలన పొందిన మహిమతో నారక్క

సులను చాపి మునులను విప్రులను సజ్జనులను రక్షింపుమని యాదేశించి యంతర్ధానమయ్యెను.

అగస్త్యుడు తండ్రి యాదేశము ననుసరించి నిరాహారుడై మాధవుని గూర్చి తపము చేయగా శ్రీహరి ప్రత్యక్షమయ్యెను. అప్పుడగస్త్యుడు నారాయణుని పాదపద్మములకు మ్రొక్కి పలు రీతులుగా స్తుతింపగా హరి యిట్లు పలికెను. కుంభసంభవా ! నీ తపమునకు మెచ్చితిని. వరమిచ్చెదను కోరుకొనుము.

అంత నగస్త్యుడు తన కోరిక నిట్లు విన్నవించెను. దేవా ! నేను తినదలచినది త్రాగనెంచినది చేతిలో నుసిరికవలె నిముడున ట్లును నేనుతిన్న దెట్టిదైనను క్షణములో జీర్ణమగునట్లును వరమిమ్ము.

శ్రీహరి యగస్త్యుని చూచి మునీంద్రా ! మునులను విప్రులను రక్షించి లోకములను కాపాడదలచి కోరినందున నీకు వర మొసంగితినని పలికి యంతర్ధానమందెను. అంత నగస్త్యుడు సతాపి వాతాపులను సంహరించెదనని తలంచి యా రక్కసులున్న యెడకేగెను.

ఆ మాయ రక్కసులు మునులవేషములతో నొక పర్ణశాలలో నివసించుచుండిరి. అగస్త్యుడు వారి కడకేగి మునులార ! ఈ పూట నాకాతిథ్య మొసంగుడు అని పలుకగా అగస్త్యుని దివ్య తేజము చూచి యా కపట మునులు మునీంద్రా ! నిమిషములో వంట చేసి యాతిథ్యమిత్తుము. అంతవరకు విశ్రమింపుడని పలికి లోనికేగిరి.

సతాపివాతాపిని మేకగా జేసి చంపి మాంసమును వండి యగస్త్యునకు బెట్టెను. అగస్త్యుడా మేక మాంసమును తిని "జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం'' అని యుదరము నిమురుకొనెను. వెంటనే

వాతాపి యగస్త్యుని పొట్టలో జీర్ణమయ్యెను. తరువాత నగస్త్యుడు కరచరణములు శుభ్రపరచుకొని యొక వేదికపై విశ్రాంతిగా గూర్చుండెను.

ఆ సమయమున సతాపి (ఇల్వలుడు) వాతాపి ! రా ! రా ! లేచిరా ! అని పిలిచెను. ఎంత పిలిచినను వాతాపి రాడయ్యెను అందుకు కారణము తెలియక భీతితో సతాపి అగస్త్యుని మోము చూచెను. అగస్త్యుడు పండ్లు పట పటగొరికి కన్నుల నిప్పులు రాల్చుచు ఓ రక్కసుడా ! నీ సోదరుడు నా జఠరాగ్నికి ఆహుతి అయ్యెను. క్షణములో నీ గర్వమణచెద నాగుము అని పలుకగా సతాపి భయపడి గద్గద కంఠముతో మునీంద్ర ! నన్ను కాపాడుము. ఇక నెన్నడును రాక్షస కృత్యములు చేయను అని ప్రార్థింపగా నగస్త్యుడు కరుణించి మునివై వనములో మంచిగా మెలగిన బ్రతికెదవు. రాక్షసకృత్యములు తలపెట్టిన యెడల తల వ్రక్కలై చనిపోదువని శపించెను.

తరువాత నగస్త్యుడు లోపాముద్రను పరిణయమాడి మిగుల తపమొనర్చి త్రిమూర్తులకు పూజ్యుడై విలసిల్లుచుండెను. కొంత కాలమున కింద్రుడు వృత్రాసురుని చంపి వాని సేనానాయకులగు కాలకేయుడు నివాతకవచుడు మున్నగు వారు సైన్యములతో సముద్రమున నివసించుచు రాత్రి సమయములందు రక్కసులకు బలము హెచ్చు కావున లోకములపై బడి పీడింపుచు పగటివేళలలో సముద్రమున దాగొనుచుండిరి. కాలకేయాది రాక్షసుల నెవ్వరును సంహరింప జాలకుండిరి.

అంత నింద్రాది దేవతలు బ్రహ్మకడకేగి యా వృత్తాంతమును విన్నవింపగా విరించి యోచించి దేవతలార ! మీ రగస్త్య మహర్షి నాశ్రయించిన యెడల ఆ మునీంద్రుడు సాగర జలము త్రాగి యుదరమునదాల్పగలడు అని సలహా చెప్పెను.

దేవతలందు కంగీకరించి పరమేష్ఠి కడ సెలవు దీసికొని యగస్త్యుని కడకేగి సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి నుతింపు చుండ కుంభసంభవుడు చూచిదేవతలార! మీరునన్నే పనికై ప్రార్థించుచున్నారు? అని ప్రశ్నింపగా వారిట్లనిరి. మునిచంద్రా! పెక్కుమంది దానవులు మున్నీటిలో దాగి లోకములను పీడించుచున్నారు. వారిని తెగటార్చు నుపాయము తెలిపి మమ్ము రక్షింపవలయునని ప్రార్థింపగా అగస్త్యు డంగీకరించి మీ రాయుధములు దాల్చి సంసిద్ధులుగా నుండుడు అని పలికి దేవతలను వెంట నిడుకొని సముద్రతీరమున కేగి సముద్రజలముల నాకర్షింప బోవునంతలో సాగరోదకములు కరతలామలకమువలె నగస్త్య మహర్షి చేతిలో (పుడిసలి) నికిరాగా నతడా జలమును పానము చేసెను. సముద్రోదక మంతయు నగస్త్య మునీంద్రుని యుదరమున జీర్ణమయ్యెను.

జల విహీనమైన యా పెద్ద గుంట నుండి దానవులు వెడలి వచ్చిరిచ్చవడి యుండ ఇంద్రాదులు వారిని సంహరించి శత్రుపీడను తొలగించుకొనిరి. అనంతరము దేవత లగస్త్యుని దర్శించి మునీంద్రా ! మీ యనుగ్రహమున దేవకార్యము సఫలమైనది. మరల సముద్రమును జలపూర్ణము జేయుడు అని ప్రార్థింపగా నగస్త్యుడు విబుధులార ! సముద్రజలము నా కడుపున జీర్ణమై పోయినది. ఇక సముద్రము నెట్లు నీటితో నింపుదును ? మీ మీ నివాసములకేగుడని యాదేశించెను.

అంత నా దేవతలు బ్రహ్మను సమీపించి జరిగిన వృత్తాంతమంతయు విన్నవింపగా బ్రహ్మ యిట్లు పలికెను. అగస్త్యుడు చెప్పినది సత్యము. కొంత కాలము సముద్రము జలశూన్యమై మట్టితో నిండియుండును. సగర చక్రవర్తి తనయులు సముద్ర ప్రదేశమును త్రవ్వి ఆ మట్టి భుజించి సముద్రమును విస్తృత

పరచగలరు. సగరుని పుత్త్రుడగు భగీరథుడు గంగచే సముద్ర
మును నింపగలడు.

దేవతలజునకు మ్రొక్కి నిజనివాసముల కేగిరి. అని లవ
కుశులు తెలుపగా రామచంద్రుడు సంతసించి సగర చక్రవర్తి
వృత్తాంతమును తెల్పుమని పలుకగా లవుడిట్లు వచింపసాగెను.

పూర్వకాలము మంచు కొండ సమీపమునగల కణ్వాశ్రమ
మున రెండు నక్కలు నివసించుచున్నవి. భార్యా భర్తలగు నా
నక్కలు రెండును మిగుల ననురాగముతో నివసించుచున్నవి. ఒక
నాడా యడవికి ఘనబాహు డను రాజు వేటకై యరుదెంచెను.
ఆ ఘనబాహుడు జంటగా నున్న నక్కలను జూచి భార్యతోడి
సంగమమును తలచుకొని వీర్యస్ఖలనముకాగా నొక తామరాకు
దొన్నెలోపోసి యొకచోట నుంచి వెడలిపోయెను. అంత నా యాడు
నక్క అచటకు వచ్చి తామరాకులోని వీర్యము చూచి నాకినది.
అది యమోఘ వీర్యమగుటచేత నా నక్క గర్భము దాల్చి
యాడు బిడ్డను ప్రసవించినది.

ఆ నక్కలు ఆ పిల్లను మిగుల గారాబముగా పెంచి పెద్ద
చేసి కణ్వముని శిష్యుడైన హరితకేశునకు కన్యాదానము చేసినవి
ఆ కన్యాదానమునకు పరమేశ్వరుడు మెచ్చి ఆ నక్క సూర్యవంశ
మున మహారాజై జనించి రాజ్యమేలునని వరము నిచ్చెను. ఆ
వరము వలన సూర్యవంశ రాజగు సేతువునకు సగరుడను పేర
జనించెను సగరుడు దినదిన ప్రవర్ధమానుడై పెరిగి పెద్దయై
పూర్వ జ్ఞానము కలుగుటచేత పూర్వ జన్మమునచేసిన యొక్క
కన్యాదానము వలన ఇట్టి యుత్తమ జన్మ లభించినది కదా!
పెక్కు కన్యాదానములు చేసిన నెట్టి యుత్తమగతి సిద్ధించునోకదా
యని భావించి బదరికాశ్రమమునకేగి నారాయణుని గూర్చి మహా
తపమొనరింప జొచ్చెను.

దేవతలు బ్రహ్మను సమీపించి పితామహా ! సగర చక్రవర్తి 60 వేల కుమార్తెలను బడయదలచి తప మొనరించుచుండెను. సగరుని కోరిక నెరవేరిన దేవతలకు ముప్పు కలుగును కావున వాని కోరిక నెరవేరనీయకుడు అని ప్రార్థించిరి. బ్రహ్మ యంగీకరించి దేవతలను సాగనంపి, వాణిని పిలిచి 'సగర చక్రవర్తి తనయుల గోరి తపమొనరించుచుండెను. నీవు వాని మనసున ప్రవేశించితనయులను గోరునట్లు చేయుమని యాదేశించెను.

శ్రీహరి సగరుని తీవ్ర తపమునకు మెచ్చి సాక్షాత్కరింపగా సగర చక్రవర్తి నారాయణునకు మ్రొక్కి పలురకములుగా స్తుతించెను. శ్రీహరి సంతసించి రాజా ! నీ వేకోరికతో తపము చేయుచున్నావో తెల్పుమని పలుకగా సగరుడు వైకుంఠుని పాద పద్మములకు మ్రొక్కి వాణి యొక్క ప్రేరణచేత అరువది వేల పుత్త్రులను ప్రసాదింపుమని కోరగా నారాయణుడు సగరునకు కోరిన వరమొసంగి యంతర్థానమయ్యెను.

సగరుడు సంతసముతో రాజధాని కరుదెంచి యెల్లరు మెచ్చునట్లు రాజ్యమేలుచుండెను. పట్టపురాణి యగు కేశి కడుపున నొక (కోశము) పిండ ముదయింపగా దాని నాజ్యకుంభమున నుంచి కాపాడుచుండిరి. ఆ పిండము నుండి అరువదివేల మంది పుత్త్రులుదయించి పాలిమ్మని తల్లిని వేధింపగా నామె బిడ్డలకు మన్నుతినుట నేర్పెను. సగర తనయులు 60 వేలమందియు శ్రీహరి వర ప్రభావమున జనించినందున దేవ దానవుల కజేయులై యుండిరి.

సగరుని చిన్నభార్య యగు సుమతికి అసమంజుడను తనయుడు జనించి హరిసేనుడను రాజు పుత్త్రిక యగు హర్షమతి యను నామెను పెండ్లాడి అంశుమంతుడను తనయుని బడసెను.

కొంత కాలమునకు సగరుడు అశ్వమేధ యాగము చేయనెంచి దీక్షను స్వీకరించెను. 60 వేల పుత్త్రులను రక్షకులుగా నియమించి సగరుడు యాగాశ్వమును విడిచెను. చతురంగ బలసమే

త్తులై సగర తనయులు యాగాశ్వము వెంటనేగు చుండిరి. ఆ సమయమున నారదుడు యోగమాయచే నశ్వము నాకర్షించి పాతాళ లోకమున తపమొనరించుచున్న కపిలమహర్షి సమీపమున గట్టి యతడరిగెను.

సగర తనయు లశ్వము కొఱకై భూలోకమంతయు వెదకి గుఱ్ఱము కనుపింపక పాతాళమున నుండునేమోయని తలచి పుట్టలలో ప్రవేశించు భుజంగములవలె చేతులు భూమిలో చొనిపి భేదించి మట్టి తినుచున్న సమయమున నారదుడరుదెంచి యూరక నేలయేల భేదింతురు ? మీ యశ్వమును కపిలునికడ చూచితినని పలికి వెడలి పోయెను.

సగర సుతులు కోపముగా కపిలుని కడకరిగి గుఱ్ఱమును చూచి అతి రోషమున కపిలుని జడలు త్రెంచుచు పిడికిలి పోట్లు పొడుచుచు బాధింపజొచ్చిరి. కపిలుడు కోపారుణిత నయనములతో చూడగనే సగరుని తనయులు దగ్ధమైరి. అశ్వము అశ్వము వెంట వెడలిన కుమారులును ఎంతకును తిరిగి రాకపోవుటచేత సగరుడు పౌత్రుడగు అంశుమంతుని పిలిచి అశ్వము రాని కారణము తెలిసికొని రమ్మని పలుకగా అతడు దక్షిణ దిశగా యాగాశ్వమేగెనని తెలిసికొని పాతాళమున నొక చోట అశ్వమును కపిలమునిని చూచి అంశుమంతుడు కపిలమహర్షిని స్తుతింపగా కపిలుడు కనికరముతో నిట్లనెను. సగర పౌత్ర ! అంశుమంత ! నీవు నన్ను స్తుతించుటకు కారణమేమి ? అని ప్రశ్నింపగా అంశుమంతుడు మునీంద్రా ! మా తాతగారి యాగాశ్వము నొసంగుడని ప్రార్థించెను.

అంత కపిలముని దివ్యదృష్టితో అంతయు గ్రహించి నారదముని యాగాశ్వము నిటకు తీసికొనివచ్చి కట్టెనని తెలిసికొని అంశుమంతుని జూచి నాయన ! యాగాశ్వమును తోలుకొని పొమ్మ

గిన అంశుమంతుడు సంతసముతో మునికి మ్రొక్కి అనుమతి గైకొని సగరుని కడకేగెను. సగరుడు యాగాశ్వమును చూచి యెట్లో యాగమును పూర్తి చేసెను. యాగానంతరము చక్రవర్తి పుత్త్రనాశనమునకు దుఃఖించి విరక్తితో పౌత్రుడగు నంశుమంతునకు పట్టాభిషేకము చేసి నర్మదా తీరమున శ్రీహరిని గూర్చి తపమొనరింప నేగెను.

సగరుని కోడండ్రు 60 వేల మందియు భర్తృ వియోగ పరితాపముతో క్రుంగుచు పుత్త్రులు లేనందుకు శోకించి శ్రీమహావిష్ణువును ధ్యానింప జొచ్చిరి. శ్రీహరి యా వనితలయందు దయ కలిగి ప్రత్యక్షమై వారి మనోభావమును గ్రహించి యీ జన్మమునకు భర్తలను బడయుట సాధ్యము కాదని పలుకగా ఆ కాంతలు మాకొక పుత్త్రుని ప్రసాదింపుమని కోరిరి. అంత నా శ్రీహరి వనితలార ! మీరు రజస్వలయైనప్పుడా రక్తము నొక క్రొత్తకుండలో భద్రపరచుడు. మీ కోరిక నెరవేరునని పలికి యంతర్హితుడయ్యెను.

సగరుని కోడండ్రు శ్రీహరి సెలవిచ్చిన రీతిగా తమ రజస్వలా రక్తమును క్రొత్త కుండలో నుంచిరి, అందుండి యొక సుతుడు జనించెను. కాని శుక్రసంయోగము లేనందువలన నాబిడ్డ గట్టియెముకలు లేక చర్మమాంసములు రక్తము మాత్రము కల శరీరముతో నుండెను. దృఢత్వములేని యా బిడ్డడు పడుచు లేచుచు అతి కష్టముగా సంచరించుట చూచి తల్లులు చింతించుచుండిరి. ఒకనాడష్టావక్ర మునీంద్రుడు దైవవశమున నటకరుదెంచెను. అప్పుడు సగరుని కోడండ్రు 60 వేల మందియు అష్టావక్ర మహర్షికి మ్రొక్కి తమ తనయుని చూపిరి. ఆ బాలుడు మాటిమాటికి నేలపై బడి లేచుట చూచి వాడు తనను అపహాస్యము చేయుచున్నాడని యెంచి కోపించి వనితలార ! మీ బిడ్డడు నన్నప

హాస్యము చేయుచున్న యెడల దీర్ఘ నిద్రచెందును. అట్లుగాక వాని నడవడి సహజమైనదేయైన యెడల సుందరాకారుడై బలపరాక్రమములతో దృఢగాత్రుడై విలసిల్లగలడని పలికెను.

అష్టావక్రుని నోటమాట వెలువడగానే యా బాలుడు దృఢ సుందర దేహుడై నిలచి మహర్షికి మ్రొక్కెను తమ పుత్త్రునిచూచి తల్లులు ఆనందపరవశలై భగీరథుడని నామకరణము చేసిరి. అష్టావక్రమునీంద్రుడు భగీరథుని దీవించి యథేచ్ఛగానేగెను.

దిన దిన ప్రవర్ధమానుడగు భగీరథుని చూచి తల్లులు నాయన! దక్షిణ సముద్ర తీరమునకు మాత్రమేగకుము. అచట కపిల మహర్షి మీ తండ్రులను బూడిద గావించెను. అని హితవు గరపిరి. కొంత కాలమునకు భగీరథుడు వేట నిమిత్తమై దక్షిణ సముద్ర తీరమునకేగి కపిలుని క్రోధాగ్నిలో మలమల మాడు చున్న సగర తనయులను చూచెను. ఆ సగర తనయులు భగీరథుని చూచి నాయన! మేము కపిలుని క్రోధాగ్నికి దగ్ధులమై అధోగతి నందుచున్నాము. మా బూడిద రాసులపై గంగను ప్రవహింపజేసి మాకు పుణ్య లోకములు కలిగింపవా! అని దీనముగా వగచుచున్న తండ్రుల మాటవిని జాలిపడి ఇంటి కరుదెంచి తల్లుల కావిషయము తెల్పి గంగను తెచ్చి పితరులనుద్ధరింతునని ప్రతిన బూని కైలాసమునకేగి 12 సంవత్సరము లీశ్వరుని గూర్చి తప మొనరింప నీశ్వరుడు ప్రత్యక్షమై భగీరథ మహారాజ! పూర్వము మహావిష్ణుపు పాదములు కడిగితిని ఆనీటిని బ్రహ్మ కమండలమున దాల్చెను. అని పలుకగా భగీరథుడు బ్రహ్మను గూర్చి తప మొనర్చి ప్రత్యక్షము చేసికొనగా బ్రహ్మ భగీరథుని చూచి రాజ! పూర్వము శ్రీహరి వామనావతారమెత్తి త్రివిక్రముడై యొక్క పాదమున గగన మాక్రమించెను. అప్పుడు నేను శ్రీహరి పాదములు కడుగగా నా కమండలములోని జలము శ్రీహరి గోటిలో

నిమిడి యుండెను. కావున నా దగ్గర గంగ లేదని పలుకగా సగర పౌత్రుడగు భగీరథుడు నారాయణు నారాధింపదలచి నిరాహారుడై మహా తపమొనరించెను.

శ్రీహరి భగీరథుని తపమునకు మెచ్చి జలబిందు వొసంగి యంతర్ధానమయ్యెను. అంత గంగ భగీరథుని చూచి రాజ ! నీవే దారినినడిచిన నేనాదారిని నడచెదను. ముందు నీవు నడువుమనిన భగీరథుడట్లే నడచుచుండ దారిలో మేరుపర్వత మడ్డువచ్చెను. ఆ విషయము నైరావతమునకు విన్నవించుకొనగా అది తన దంత ములతో నాబంగారుకొండను పన్నెండు సంవత్సరములు డీకొట్టెను. దానితో నాకొండ శిఖరము బ్రద్దలయ్యెను. ఆ మార్గమున గంగ వెలువడి యొక ధార ఆకాశగంగ యనియు రెండవ ధార పాతాళ గంగ యనియు ప్రసిద్ధి బడయగా మూడవధార భగీరథుని వెంట భూమికి దిగి వచ్చుచుండెను.

అప్పుడైరావతమా గంగను భార్యగా గైకొనదలచుచుండగా ఆ గంగ వేగముగా ప్రవహించిన ఆ యేనుగాగంగా వేగమునకు నిలువజాలక ప్రవాహములోపడి మునుగుచు తేలుచు దీనాలాప ములు చేయుచు అతి కష్టముపై భద్రనగరమను పేరుగల పుర మున తేలెను. అది మొదలుకొని యానగరమునకు హస్తినాపుర మని పేరువచ్చెను.

అంత నా పరమపావనమైన గంగ భగీరథునివెంట నరిగి అతని తండ్రుల భస్మరాసులపై ప్రవహింపగా సగరతనయు ఉత్తమ లోకములకేగిరి. పితృదేవతల నుద్ధరించి రాజ్యసౌఖ్య ములననుభవించిన భగీరథుడు చివరకు విష్ణు సాయుజ్యమును బడ సెను. అని పలుకగా శ్రీరామచంద్రుడు సంతసించి బాలకులార !

ఋష్యశృంగు డేరీతిగా సాకేత పురమున కేగెను ? దశరథ మహా రాజుచేత పుత్రకామేష్టినే రీతిగా చేయించెను ? తెలియజేయుడని ప్రార్థింపగా ఆ పౌరాణికులు తెల్పిన విధమును తెల్పెద నాలకింపు డని మార్కండేయుడు ధర్మరాజునకు ఈరీతిగా తెలుపదొడంగెను.

ఆ రోమపాద మహారాజు దశరథుని తన నగరమునకు రావించి ఏకాంతముగ నిట్లనెను. మహారాజ ! ఋష్యశృంగమహర్షి శాంతనుచూచి వివాహ వాంఛ వెల్లడించెను. కావున మనము శాంతను ఋష్యశృంగునకిచ్చి పరిణయము చేసిన మంచి దని నా యభిప్రాయము. రోమపాదుని పలుకులకు దశరథుడు సంతసించి తన కుమార్తెయగు శాంతను బ్రాహ్మణున కొసంగి పరిణయము చేయుదునని పరశురామునకిచ్చిన వాగ్దానము నెర వేరుచున్నదని తలంచి వెంటనే విప్రులను రావించి శాంతాఋష్య శృంగుల వివాహమునకు సుముహూర్తము పెట్టించి మహా వైభవముగా పాణిగ్రహణ మహోత్సవము జరిపించెను.

వివాహానంతరము దశరథుడు నవదంపతులగు శాంతా ఋష్యశృంగులను అయోధ్యకురావించి గొప్ప వేడుకలు జరిపించెను. పెండ్లి కుమార్తె యగు శాంత తనకు మ్రొక్కబోగా రాజకాంతలు వారించి ఆలింగన మొనరించుకొని శాంతా ! నీవు మునికాంతవు పూజ్యురాలవు అని సమాధాన పరచిరి.

భూమండల మంతయు తిరిగి సాకేతనగరమున కరుదెంచి పరశురాముని చూచి రాజులెల్లరు గడగడలాడు చుండిరి. అది చూచి వసిష్ఠుడు పరశురాముని సమీపించి పరశురామా ! నీ రాక విని రాజులెల్లరు భయభ్రాంతులై పారిపోవుచున్నారు. దశరథ మహారాజు నీ రాకకు కారణము తెలియుమని నన్ను కోరుటచే నీ కడకరుదెంచితిని. కావున నీవేపని నిమిత్తమై యరుదెంచితివో తెలుపుమనిన పరశురాముడు మునీంద్రా ! దశరథుడు రాజులను

పిలిచి శుభకార్యములు నెరవేర్చుచుండెనని విని దశరథుని సంహరించుట కేతెంచితిని. అనిన వసిష్ఠుడు పరశురామ ! నీయాజ్ఞననుసరించి దశరథుడు తన తనయయగు శాంతను విప్రోత్తముడగు ఋష్యశృంగునకిచ్చి పరిణయమొనరించి ఋష్యశృంగునిచే తన పుత్రకామేష్టి చేయించుకొన నున్నాడేకాని యన్యము కాదనగా పరశురాముడు సంతసించి మునీంద్రా ! దశరథుని పెద్ద కుమారునకు నా పేరు పెట్టుమని దశరథునకు నాయాజ్ఞగా తెల్పుమని పలికి వసిష్ఠు నొడఁబరచి తపోభూమి కేగెను.

వసిష్ఠుడు దశరథుని కడకేగి పరశురాముని మాటలు తెలుపగా పుత్త్రులు కలుగు అదృష్టమున్నయెడల పెద్ద కుమారునకు రాముడని పేరు పెట్టెదనని పలికెను. దశరథుని కోరికననుసరించి వసిష్ఠుడు పుత్రకామేష్టికి ముహూర్తము నిర్ణయించెను. ఋష్యశృంగుని యధ్వర్యవమున దశరథుడు సరయూ తీరమున పుత్త్రకామేష్టి నారంభించెను.

శ్రీహరి యింద్రాది దేవతలనుచూచి నేను సూర్యవంశమున దశరథునకు పుత్త్రుడనై యవతరించి రాముడనుపేరుతో విలసిల్లుదును. మీరు వానరులై యవతరించిన మీ తోడ్పాటుతో రావణాదులను సంహరింతుననిపలికి యదృశ్యమై భూలోకమున కరుదెంచి ఋష్యశృంగునకు వహ్నికుండముల మధ్యమున సాక్షాత్కరించి యజ్ఞ పురుష రూపమునంది పాయసాన్నము బంగరు పాత్రతో తెచ్చి ఋష్యశృంగునకిచ్చి దశరథునిచేత రాజపత్నుల కిప్పింపుమని పలికి యదృశ్య మయ్యెను.

ఋష్యశృంగుడా పాయసపాత్రను దశరథునకిచ్చి రాజ ! నీ భార్యలలో నియమవతులగు వారికి పాయస మొసంగుమని చెప్పి యిచ్చెను. దశరథుడంతః పురమునకేగి కౌసల్యా సుమిత్రా

కైకలను పిలిచి పాయసాన్నమును రెండు భాగములుచేసి కౌసల్యకు కైకకు నొసంగిన పిదప సుమిత్రను చూచి తన తెలివి తక్కువ తనమునకు వగచుచుండ కౌసల్యయు కైకయు భర్త మనసెరింగి తమ తమ పాయసములలో సగము సగముతీసి సుమిత్రకిచ్చిరి. ముగ్గురు రాణులును పాయసాన్నము భుజించి గర్భవతులైరి.

అంతఃపుర కాంతల వలన ముగ్గురు రాణులును గర్భము దాల్చిన విషయమును దశరథుడు తెలిసికొని వసిష్ఠుని రావించి పుంసవనాది కృత్యములను చేయించెను. ముగ్గురు కాంతలకును పండ్రెండు మాసములు నిండి ప్రసవ సమయము సమీపించినది ఆ సమయమున దేవతలెల్లరు శ్రీహరిని పలురీతులుగా స్తుతించుచు అవతరించు సమయమున కెదురుచూచు చుండిరి.

చైత్ర శుద్ధ నవమినాడు మధ్యాహ్నము శ్రీహరి కౌసల్యా తనయుడై యవతరించెను. దేవతలు పూలవాన గురిసిరి. దేవ దుందుభులు మ్రోగినవి. గంధర్వులు గాన మొనరించిరి. అచ్చరలాడిరి. దేవతలు మునులు గుంపులుగా వచ్చి యీ యవతార మూర్తిని పలు రీతులుగా స్తుతించిరి

దశమినాడు పాంచజన్యమను శంఖముయొక్క అంశచే కైక కొక సుతుడు జనించెను. ఏకాదశినాడు శేషాంశమున నొక సుతుడు చక్రాంశమున నొక సుతుడు సుమిత్రకు జనించిరి. దశరథుడు నలుపురు కుమారులకును జాతకర్మాది సంస్కారము లొనరించి పెక్కు దానధర్మము లొనరించెను. వసిష్ఠుడు కౌసల్యా తనయుని జూచి మనసులోనే వందనమాచరించెను. ఇరువదియొకటవ దినమున వసిష్ఠుడు దశరథుని నలుపురు తనయులకును రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులని నామకరణము చేయించెను.

లవకుశులు చెప్పినది శ్రీరాముడాలించి బాలులార ! దశకంఠుడు బ్రహ్మ వంశమున జనించియు రాక్షస ప్రవృత్తి కలిగియుండుటకు కారణమేమని ప్రశ్నించెను. శ్రీరాముని ప్రశ్న విని లవకుశులు ఇట్లు చెప్పదొడంగిరి అని మార్కండేయుడు చెప్పి లవకుశులు తెల్పిన రావణ వృత్తాంతమును ధర్మజాదులకు చెప్ప దొడంగెను.

పూర్వకాలము వాయుదేవుడును సర్పరాజగు శేషుడును మదగర్వితులై ఎవరు బలశాలురో తేల్చుకొననెంచి పంతమూని మేరుపర్వత సమీపముకడ నిరువురు నిలిచి యొండొరులను చూచుచున్న సమయమున శేషుడు వాయువు నీక్షించి యిట్లనెను. ఓ గాలీ ! మనకీపసిడికొండమధ్యవర్తి. నేనీకొండను చుట్టుకొందును. నీవీ కొండను కదలించి నీ బలమును ప్రదర్శింపుమని పలుకగా వాయుదేవు డంగీకరించెను. అంత నా శేషుడు తన పడగలతో కొండ శిఖరములను కప్పివైచి దేహముతో కొండను త్రాడువలె చుట్టెను. పవనుడు రోషముతో విజృంభించి ప్రళయభీకరముగా జవసత్వములు పెంచి విసరుచుండెను. అప్పుడు శేషుడు యథాప్రకారము బిగిసికొని యుండెను. అంతవాయువు కపటాలోచనతో మెల్లగా వీచుచుండెను. అప్పుడు శేషుడు వాయువుయొక్క బలము క్షీణించెనని యెంచి శత్రువగు వాయువుయొక్క మోస మెరుగక పడగల నిటునటు కదలింపసాగెను. అదిచూచి వాయువు విజృంభించి పసిడికొండ శిఖరమొకటి యెగురగొట్టెను ఆశిఖరము నూరు యోజనముల వైశాల్యము నూరు యోజనముల పొడవు కలదు. ఆ శిఖరమట్లు వాయువుచే పెకలింపబడి గాలికెగిరి సముద్రములో పడి సగము మునిగి సగము తేలుచు రెండవ సూర్యుని వలె నొప్పెను. బ్రహ్మయా బంగారు శిఖరమునకు లంకయని పేరిడి యచట తప మొనరింప సాగెను.

నిశ్చల చిత్తుడై బ్రహ్మ చేయు తపమునకు పదునాలుగు లోకములు కలత చెందగా ఇంద్రుడు అచ్చరలను పిలిచి బ్రహ్మ చేయు తపమున కాటంకము కలిగింపుడని నియమించిన వారు బ్రహ్మ కడకేగి యిటునటు తిరుగుచుండగా బ్రహ్మ వారి సౌందర్యము తిలకించి మదనశరపీడితుడై వీర్యము స్ఖలింపగా ఆ వీర్యమువలన నొక సుతుడు జనించెను. అప్పుడశరీరవాణి యాబాలునకు పులస్త్యుడు నామకరణము చేసెను.

అంత బ్రహ్మ తపము చాలించి సత్యలోకమున కేగుచుండగా పులస్త్యుడు వెంట నేగి దేవా! నీ తనయుడనగు నన్ను విడిచి వెళ్ళతగునా? అని యడిగిన బ్రహ్మ వానిని చూచి కుమార! ఇచటకు మూడు యోజనముల దూరమున నున్న రుద్రాక్ష వనమున నొక ముని యున్నాడు. నీవా మునిని సందర్శించిన యెడల అతడు నీవు నా కుమారుడని గ్రహించి యతడు నీకు మేలు కలిగించునని పలికి యంతర్ధానమయ్యెను.

పులస్త్యుడు రుద్రాక్ష వనమున కేగి మునిని సందర్శించిన ఆ ముని యోగదృష్టితో నాబాలుడు బ్రహ్మ కుమారుడని గ్రహించి యోగ సాంఖ్యములుపదేశించి వానికి ప్రియమతియను తనూజ నిచ్చి పెండ్లి చేసెను. కొంత కాలమైన పిదప నాముని కూతును అల్లుని పిలిచి మీరు వేరు చోటునకేగి కాపురముండుడని యాజ్ఞాపింపగా వారు మునీంద్రునానతనే దలదాల్చి భరద్వాజాశ్రమమున కేగి అచట కొన్ని సంవత్సరము లుండిరి, అచట నాదంపతులకు విశ్రవసుడను తనయుడు జనించెను. భార్యను పుత్రుని ఆశ్రమమున విడచి పులస్త్యుడు తపమున కేగెను. భరద్వాజుడు తన పుత్రికయగు శ్యామకాంతను విశ్రవసునకిచ్చి వివాహమొనరించెను కొంత కాలమునకా శ్యామకాంతా విశ్రవసులకు వైశ్రవణుడు విశ్రవణుడు అను నిరువురు కుమారులు జనించిరి.

ఒకనాడు భరద్వాజుని పుత్త్రుడగు జపాంకుడు వైశ్రవణుడు బంతియాట ఆడుచున్న సమయమున బంతి సమీపముననున్న నూతిలో పడెను. జపాంకుడు నూతిలోనిబంతిని బయటకు తీయుమని వైశ్రవణుని నియోగించిన అతడాపని చేయజాలడయ్యెను. జపాంకుడు మేనల్లుని కోపించి మాయింటిలోనుండి మేము చెప్పిన పనిచేయవా ? అనుచు పరుషములు పలుకగా వాడు కన్నీరు కార్చుచు తల్లి దండ్రులకు చెప్పగా వారు కోపించి పులస్త్యునికడ కేగి తమకు జరిగిన యవమానమును తెల్పి మేమెచటనుండవలెనని యడుగగా అతడు కుటుంబమును వెంటనిడుకొని బ్రహ్మకడకేగి జరిగిన వృత్తాంతమును తెలిపి దేవా ! మేమెచట నివసింపవలెనని యడిగిన లంకా ద్వీపమున నివసింపుడని యానతిచ్చెను. ఆ ప్రదేశమెవరి నివాసమని వారడుగ బ్రహ్మయిట్లు పలికెను. తొల్లి మేరు శృంగము పవనప్రేరితమై సముద్రమునపడి కనక ద్వీపమైనది.

తొల్లి సముద్రమున అమృతముదయించిన ఆ యమృతమును కలశమున పట్టి ఆ బంగారు దీవియందు పెట్టి అపార బల సంపన్నుడైన పురుషుని సృజించి అమృత రక్షణకు నియమించితిని. ఆ పురుషుడు రహస్యముగా అమృత పానముచేయుటచూచి కోపముతో రాక్షసుడవు కమ్మని శపించిన వాడురక్కసుడై లంకలోనుండి హరితకేశియను రాక్షసియందు మాలి, సుమాలి, మాల్యవంతుడు అను ముప్పురు కొడుకులను బడసి తనజాతివారితోగూడి లంకలో పురము నిర్మించుకొని త్రిలోకవాసులను పీడింప దొడంగెను. అది చూచి ఇంద్రాదులు శ్రీహరిని ప్రార్థింపగావచ్చి శిరములు ఖండింపగా, చావగా మిగిలినవారు సాగరమున దాగిరి. అచటనుండి పాతాళమునకేగి యచట నివసించుచున్నారు. శ్రీహరి యొక్క సుదర్శన చక్రమునకు భయపడి యారక్కసులు వెలుపలికి రాజాలరు కావున మీరు లంకలో నివసింపుడని నియమించిన

పులస్త్యుడు సకుటుంబముగా లంకలో కొంతకాలము నివసించి భూ ప్రదక్షిణ మొనరింప నేగెను. విశ్రవసుడటనున్న మణివతీ నదీ తీరమున తపమొనరించు చుండెను.

అతని కనిష్ఠకుమారుడగు విశ్రవణుడు స్త్రీలోలుడై క్షయ రోగముతో మరణించెను. అన్నయైన వైశ్రవణుడు తండ్రివలన పంచాక్షరీ మంత్రము నుపదేశమంది చిరకాలము దీక్షతో శంకరుని గూర్చి తపమొనరించెను. శంకరుడు వాని తపమునకు మెచ్చి ఉత్తర దిక్పతిత్వము పుష్పక విమానము నవనిధులు నొసగి సచివుడయ్యెను. కుబేరుడు తండ్రి మాటలననుసరించి లంకలో నివాసముండెను.

పాతాళమున కేగిన సుమాలి పౌష్పవతియను రక్కసిని పెండ్లాడి ఆమెయందు కైకసీ, పుష్పోత్కట. పుష్పమాలయను తనయలను. జంబుమాలియను తనయుని బడసెను. కొన్ని సంవత్సరములు గడచిన పిదప సుమాలి లంకను చూడదలచి పాతాళము వెడలివచ్చి స్వపురమును చూచి వగచుచు సమీపముననున్న యొక మునియొక్క పర్ణశాలను చూచి యచటకేగి యచట విశ్రవసుని కుబేరునిచూచి మీరెవ్వరని ప్రశ్నించిన విశ్రవసుడు ధ్యానములో నుండి మాట్లాడలేదు. అప్పుడు కుబేరుడిట్లుచెప్పెను. ఓయి ! ఇతడు నా తండ్రి బ్రహ్మపౌత్రుడు బ్రహ్మయానతితో నిటనుంటిమనిన ఆ దానవుడు తనకు సమాధానము చెప్పని ముని చెవికడకేగి ప్రళయ మేఘమువలె ధ్వని చేసెను. ఆ ధ్వనికి మూర్ఛిల్లిన తండ్రికి కుబేరుడుపచారములుచేసి సేదదీర్చెను.

అంత నాముని లేచి రాక్షస పుంగవా ! నీ నివాసమేది ? నీవిచ్చటకేల వచ్చితివి ? అని యడిగిన వాడుకోపించి మునీంద్ర, ఇది నా నివాసము శ్రీహరియొక్క సుదర్శన భయమువలన పాతాళముననుంటిని. లంకను సందర్శింపగోరి యిచట కరుదెంచితిని.

నా నివాసమున మీరుండుటకు కారణమేమనిన ముని భీతిచెంది ఈ వృత్తాంతము పూర్వము బ్రహ్మ వలన వింటిని. మేము వేరొక చోటునకేగెదము. నీవు సుఖముగా నుండుమనిన రక్కసుడు సంతసించి కుబేరుని రూపలావణ్యాదులను చూచి వీని తండ్రికి నా కుమార్తె నిచ్చిన కుబేరునివంటి దౌహిత్రులు జనింతురని యోచించి యిట్లనెను. మునీంద్రా! మా స్థలమున నింతకాలము నివసించి మా కపకారము చేసితివి నా మాట విని నా పుత్రికలను వివాహమాడిన క్షమింతును. లేనిచో నిన్ను సకుటుంబముగా మ్రింగి వేయుదును అని బెదిరింపగా మౌని వాని కోరిక నంగీకరించెను.

నిశాచరుడు వెంటనే పాతాళమునకేగి కుమార్తెలను తీసుకొని వచ్చి విశ్రవసునకిచ్చి పరిణయ మొనరించి లంకాద్వీపమున నుండుడని నియమించి తాను పాతాళమునకేగెను. విశ్రవసుడు భార్యలయందు కామాసక్తుడుకాక విరక్తితో తపమొనరించు చుండెను, విశ్రవసుని భార్యలు కామ శరపీడితలై పెద్దక్కయగు కైకసిని సమీపించి యిట్లు పలికిరి. అక్కా భర్త మనలను కన్నెత్తి చూడక ముక్కు మూసికొని తప మొనరించుచుండెను. మనము విషము త్రాగి మరణించుటయో తండ్రికడకేగి మొరబెట్టుకొనుటయో తక్క వేరుదారిలేదు. నీవేమి యుపాయము చెప్పెదువు? అని ప్రశ్నింపగా కైకసి చెల్లెండ్రను చూచి అనుజలార! మనము పతికి హానికలిగించు పనులుచేసిన యెడల నరక కూపమునబడి బయటపడజాలము. తొందరపడి చేయుపనులు హాని కలిగించును. బాగుగా యోచించి పనులను చేయు వారిని సిరివరించును. మనము భర్త మనస్సు వశము చేసికొను నుపాయము నాలో చింతము. అని హితము గరపి తాను చెల్లెండ్రను చక్కగా

సింగారించుకొని భర్త నాకర్షించుటకు పలు ప్రయత్నములు చేయసాగిరి.

తన నాకర్షించుటకై పడతులు పలుకు పలుకులు, చేయు చేష్టలు మహర్షి పరికింపక నిశ్చల చిత్తముతో తప మొనరించు చుండెను. వాని భార్యలు కామరూపముకల దనుజకాంతలు కావున నాథుడు నీటిలో దిగి సూర్యున కర్ఘ్యమిచ్చు సమయమున చిలు కలై నదీతీరమునగల చెట్టు కొమ్మపై గూర్చుండి చెలులార ! ఇచట మనకొక పాపాత్ముడు కనుపించెను కదా ! హరి హరీ ! పాపము శమించుగాక యని తమలో తాము చెప్పుకొనుచుండగా ముని యా చిలుకలను చూచి శుకములార ! ఇచట పాపాత్ములేరి ? అని ప్రశ్నింపగా ఆ చిలుకలు ఇట్లు సమాధానమిచ్చినవి. ఓరి దురాత్మా ! సుగుణవతులు అగ్ని సాక్షిగ పరిణయమాడిన వారును నగు ధర్మపత్నుల నేలుకొనక ముక్కుమూసికొని కూర్చుంటివి. ఇంతకు మించిన పాపమిం కేముండును !

ముని చిలుక పలుకులు విని జాలిపడి భార్యల కోరిక దీర్చుట ముఖ్య కర్తవ్యమని తలచి చిలుకలార ! భార్యల కోరికలను తప్పక దీర్తును అని పలుకగా అవి సంతసముతో తమ నివాస ములు చేరి నిజ రూపములు దాల్చి యుండిరి. మునియు నిజ నివాసమునకేగి తన భార్యల నానందపరచుచు సుఖముగా నుండెను.

కొంత కాలమునకు విశ్రవసుని భార్యలు గర్భవతులు కాగా మహర్షి పుంసవనాది సంస్కారము లొనరించెను. పదవమాసమున కైకసి పది తలలతో ఇరువది చేతులతో రెండు పాదములతో గూడిన పుత్రుని ప్రసవించెను. అని లవుడు చెప్పగా రాము డిట్ల డిగెను. బాలకులార ! కైకసి కుమారుడు పది తలలతో ఇరువది

చేతులతో జనించుటకు కారణమేమని ప్రశ్నింపగా లవుడిట్లు చెప్పెను. రాజా! విశ్రవసుడు కైకసితో నానందముగా నున్న సమయమున ఆ ముని వనితా! శాంత స్వభావులు బ్రహ్మణ్యులు నగు పదిమంది సుతులను నీవు కోరినను ప్రసాదింతుననగా ఆమె నాథా! శాంత స్వభావులై బ్రహ్మణ్యులై జప తపములుచేసి కొనుచు దీనులై యుండి వీరులకు బెదురుచు జీవించు పదిమంది కొడుకులను కనుటకంటె శూరుడగు నొక తనయుని ధైర్యవంతురాలగు నొక కుమార్తెను ప్రసాదింపుమని కోరినది. అంత నా మునీంద్రుడు వనితా! బ్రాహ్మణ వచనము వ్యర్థము కాదు కావున పది తలలు ఇరువది చేతులు రెండు పాదములు కలిగి సురాసురులకు అజేయుడైన యొక తనయుడు ఒక తనయయు నీకు కలుగుదురని యనుగ్రహించెను. ఈ కారణమున దశముఖుడు జనించెను. అనిన లవుని సమాధానమునకు శ్రీరాముడు సంతసించి తరువాతి కథను తెల్పుమనగా ఆ లవకుశులిట్లు తదనంతర కథను వివరింప బొచ్చిరి.

కైకసికి దశముఖుడే కాక ఒక కూతురును జనించెను. రెండవదగు పుష్పోత్కటకు ఒక కన్యయు ముగ్వురు సుతులు కలిగిరి. సుమాల యను మూడవ భార్యకు ఒక కొడుకు ఒక కూతురు జనించిరి కైకసి కన్న దశముఖుడు పుట్టగనే దిక్కులు పిక్కటిల్లునట్లు రావ మొనరించెను. అందువలన వారికి రావణుడని నామకరణము చేసిరి. శూర్పాకారమువంటి నఖములుకల దగుటవలన కైకసి కన్న కుమార్తెకు శూర్పణఖ అని పేరిడిరి. పుష్పోత్కట తనయుడు కుంభాకార కర్ణములు కలవాడు కావున కుంభకర్ణుడని పేరిడి వాని తమ్ముడు ఖరస్వనము కలవాడు కావున ఖరుడని పేరు పెట్టిరి, మూడవవాడు లోకములను దూషించువాడు కావున దూషణుడని పేరు పెట్టిరి. పుష్పమాల తనయుడు విగతభీషణుడు కావున

విభీషణుడనియు వాని సోదరి తారవంటి దేహము కలది కావున తార యనియు పేరిడిరి.

కొన్ని వత్సరములకు విభీషణుడు దక్క విశ్రవసుని రావణాది కుమారులు లోకోపద్రవము కలిగించుచుండ ఆ మహర్షి లోక కంటకులగు పుత్రుల గంటిమని విరక్తి చెంది ఇక నిందుండరాదని తలచి కుబేర రావణులను పిలిచి మీరనుకూలముగా కలిసి బ్రతుకుడని హితవు గరపి తన భార్యలను కుమారులకడ నుండ నియమించి తాను మేరుపర్వత దక్షిణ తటమున తప మొనరింపనేగెను.

ఒకనాడు కుబేరుడు పుష్పక విమానముపై సురలోకమున కేగి దేవేంద్రుని దర్శించి తిరిగి వచ్చుచుండగా రావణుడు చూచి సహింపజాలక వీని నీ పురమునుండి తరిమిన యెడల సుఖముగా నుండవచ్చునని యెంచి తల్లితో చెప్పగా నామె రావణుని చూచి కుమార ! నీ సవతి యన్న నీకు పూజ్యుడు. వానిపై ద్వేషము పూనుట తగునా ? శూలికిని నీ సవతి యన్న కుబేరునకును స్నేహము కావున వానిని జయింపజాలవు సుమాయని పలికిన రావణుడహంకారముతో తల్లీ ! నేనును శంకరుని గూర్చి తప మొనరించి బల పరాక్రమ సంపన్నుడనై వచ్చి కుబేరుని విమానమును గైకొని లంకనుండి పంపివేసి లంకారాజ్యమును స్వేచ్ఛగా ననుభవింతును మానవ ధర్ముడగు కుబేరునకును మానవ భక్షకుల మగు మాకును పొత్తెట్లు కుదురును ? అని పలికి సోదరులతో గూడి శూద్రగిరికేగి శంకరుని గూర్చి ఘోర తప మొనరింపగా శివుడు ప్రత్యక్షమై దశగ్రీవ ! నీ తపమునకు మెచ్చితిని. నీకు కావలసిన వరము కోరుకొనుమని పలుకగా రావణుడు శివుని పాద పద్మములకు మ్రొక్కి దేవా ! హరి హర బ్రహ్మలను సురగరుడాదులను జయించు బల పరాక్రమములు చిరజీవనమును ప్రసా

దింపుమని ప్రార్థింపగా "యుగంభవేద్వత్సర పంచకం''అను వచనము ననుసరించి రెండువందలవేల ఇరువది నాలుగు యుగములు జీవించునట్లు వర మొసంగగా రావణుడు కృత త్రేతాది యుగములుగా నెంచి తపము చాలించెను

అంత శివుడు తప మొనరించుచున్న కుంభ కర్ణునకు ప్రత్యక్షము కాగా సకల లోకవాసులను జయించుటయు నిర్దయయు కోరదలచెను. కాని విధి నిర్ణయము ననుసరించి వాణి నాలుక చివరనుండి నిద్రనొసంగుమని పలికింపగా శంకరుడట్లు వర మొసంగెను పిదప మహేశ్వరుడు శివునకు ప్రత్యక్షమయ్యెను. విభీషణుడు భక్తి పరవశుడై శివునకు మ్రొక్కి చంద్రశేఖరా! రాక్షస కృత్యములు చేయకుండునట్లును హరి భక్తియు చిరజీవనము కోరగా శివుడానందముగా ఆ వరము లొసంగి యంతర్ధానమయ్యెను. అనిన రాముడు విని బాలులార! రావణ కుంభకర్ణులు దేవ ద్వేషులు కావున అనుగుణమైన వరములే కోరిరి కాని విభీషణుడు రాక్షస కృత్యములందు విముఖతయు విష్ణు భక్తియు గోరుట వింతగా నున్నది. అతడట్లేల కోరెను? తెల్పుడనిన నా బాలురిట్లు చెప్పదొడగిరి.

విశ్రవసుడు పుత్రుల దుష్టకార్యములకు మనమున చింతిలి ఆత్మజునకై నారాయణు నారాధించెను. నారాయణుడు విశ్రవసునకు ప్రత్యక్షమై వరము కోరుకొను మనగా నా ముని శ్రీహరికి మ్రొక్కి దేవా! నా పుత్రులలో విభీషణుడు తక్క మిగిలిన వారు తమః ప్రవృత్తితో మెలగుచున్నారు. వారిని సన్మార్గవర్తులుగా చేయుము. నేను నిన్ను నిరంతరము సేవింతుననిన శౌరి నవ్వుచు మునీంద్ర! రావణ కుంభకర్ణులు తొల్లి నా ద్వారపాలకులు. మదాంధులై యుద్ధ కాంక్షతో నుండగా రాక్షసులై జన్మించుడని

శపింపగా వారు నాకు మ్రొక్కి శాపము భరింపజాలము. మన్నింపుము. అని వేడుకొనగా నేను దయదలచి విధి నిర్ణయము తప్పదని భావించి మూడు జన్మలు నాకు వైరులైయుండుడు నేనవతరించి మిమ్ము సంహరింతునని పలికితిని. ఆ ద్వారపాలకులు హిరణ్యాక్ష హిరణ్య కశిపులుగా బుట్టి ప్రజలను పీడించుచుండగా వరాహావతార నృసింహావతారము లెత్తి వారిని సంహరించితిని వారే నీ తనయులగు రావణ కుంభకర్ణులై బుట్టిరి. ఇందుకు విచారింప వలదు. నీ తనయుడగు విభీషణుడు నా భక్తుడు అని చెప్పి మాయ మయ్యెను. అంత నా విశ్రవసుడు మేరుపర్వత శిఖరమున తపము చేసికొన నేగెను.

రావణుడు శివుని వలన వరములు బడసి ప్రబలుడై కుబేరుని పుష్పక విమానమును లాగుకొని కుబేరుని లంకనుండి తరిమివైచెను లంక నాక్రమించిన రావణుడు సురాసురుల నెల్ల రను జయించి రాక్షసాధీశుడై విలసిల్లెను. కుబేరుడు లంకా నగరమును విడిచి యలకాపురమునకేగెను.

పుష్పక విమానముపై రావణుడు అన్ని లోకములు సంచరించి లంకకు తిరిగివచ్చుచు మందరగిరిని చూచెను. మందర పర్వత సమీపమునందలి పూదోటలో నొక వనిత చెలులతో విహరించుట రావణుడు చూచి వనలక్ష్మి వనితా రూపము దాల్చి చెలులతో విహరింపవచ్చినదా ? లేక ఇంద్రుని రాణి భూలోకపు వింతలు చూచుటకరుదెంచెనా ? యని యనుమానించి ఆమె సౌందర్యమునకు ముగ్ధుడై సమీపింప బోగా ఆ వనితలు గుహలో ప్రవేశించిరి. మందోదరి శిలతో గుహా ముఖము మూసి చెలులతో గూడి యాడుచుండెను.

మదనాతురుడగు రావణుడు గుహలోని కేగజాలక సుదతులకై వెదకి విసిగి పర్వతమును చూచి యోగిరాజ ! ఒక సుంద

రాంగి యీ పర్వతమున నెచటనో దాగినది. వెంటనే నీ వామెను నా కప్పగించిన యెడల నేను నిన్ను మన్నింతును. అని బెదిరింపగా మందరము నిశాచరుని చూచి దనుజేంద్రా! నీవు చూచిన వనిత మయుని తనయ యగు మందోదరి. ఆమె తోటిబాలికలతో గూడి నీ వన భూములలో విహరించుట కరుదెంచినది. ఇందు నేను చేయగలదేమున్నది? మీ కిరువురకును మనసు లేకమైన యెడల ఆమె రాగలదు. లేనిచో రాదు. ఈ మాత్ర మెరుగవా? అని పలుకగా రావణుడు కోపించి మందరమా! నా మాట కంగీకరించి యీ వనితను నా కప్పగింపకున్న ఈ వింటితో నిన్ను నుగ్గు నుగ్గు చేయుదును. ఇందనుమానములేదు. అనగా నా మందరము దనుజాధీశా! పర్వత గుహలో వనిత దాగినది. నే నేమి చేయగలను? అని పలికిన పలుకు లాలకించి రావణుడు ఏమియు చేయజాలక గంధమాదన పర్వతమున నుండి విశ్వకర్మ మనుమరాలగు మందోదరికై యెదురుచూచు చుండెను.

ఆ సమయమున వాలి వానర సముదాయముతో గూడి వన విహారమున కరుదెంచెను. రావణుని చూచి వాలి సమీపింపగా రావణుడు వాలిని చూచి వానరమ! ఏమి పనికై యిటకరుదెంచితివి? అని ప్రశ్నించెను. వాలి రావణుని చూచి రాక్షస రాజ! వన విహారమున కరుదెంచి నిన్ను చూచి నీ కడకరుదెంచితిని. నీవేల నిట కరుదెంచితివి? అని యడిగిన రావణుడు వానరమ! విమానముపై నాకశమున నేగుచు మందరగిరిపై నొక సుందరాంగి చెలులతో గూడి తిరుగుటచూచి మదన శరపీడితుడనై యామెను పిలువగా అది చెలులతో గూడి కొండగుహలో దాగినది. ఆమెను పొందు నుపాయము నీకు తెలిసిన నాకు తెల్పుమనగా నా వాలి రాక్షస రాజ! నీ ప్రియురాలు దాగిన చోటు నెరింగింపుమనగా రావణుడు ఒక ప్రదేశమును చూపి యీ ప్రదేశమున తిరుగుచు

హఠాత్తుగా మాయమైనది అని చెప్పగా వాలి రావణుడు చూపిన ప్రదేశమున నొక తాపు తన్నెను. దానితో శిఖరము చూర్ణమై గుహ గోచరించెను.

వాలి రావణుని గుహ ద్వారమున నుండుమని పలికి తాను గుహలో ప్రవేశించి చంద్రకాంత శిలానిర్మితములైన మంటపము లతోవిలసిల్లుభవన సమీపమున చెలులతో విహరించు మయ తనయా యగు మందోదరిని చూచి కుసుమశర శరపీడితుడై మందోదరి నేకాంత ప్రదేశమునకు తోడ్కొనిపోయి యామెతో సుఖించెను. ఆమెకు సద్యోగర్భము కలిగి యంగదుడు జనింపగా వాలి ఆ బిడ్డ నెత్తుకొని మందోదరిని వెంటనిడుకొని బిలద్వారము వెలుపల కరుదెంచెను. గుహలో జరిగిన విషయ మెరుంగక రావణుడు వాలి యొక్క బల పరాక్రమములను కొనియాడెను. వాలి మందో దరిని రావణున కప్పగించి యంగదునితో కిష్కింధ కేగెను. రావణుడు మండోదరిని తీసికొని లంకకేగి మయుని రావించి మందోదరి యందు తనకుగల యనురాగమును వెల్లడించెను. మయుడు మందోదరిని రావణునకిచ్చి పాణిగ్రహణము చేసెను. రావణుడు మయ నిర్మితమైన లంకానగరమునకు రాజుగా పట్టాభి షిక్తుడయ్యెను. ఇంద్రాది దేవతలను జయించి రావణుడు లంకా నగర మేలుచుండెను.

రాముడు కుశలవులు చెప్పుచున్న గాథ నాలకించి బాలు లారా! రావణునెదిరించి యుద్ధము చేయగలవారే లోకములో కరువైరా? అని కుతూహలముతో నడుగగా కుశలవులిట్లు చెప్ప దొడంగిరి. రామచంద్ర! రావణు డొకనాడు నారదుని చూచి మునీంద్రా! నాతో యుద్ధము చేయగల మొనగాడే లేడయ్యెనా? అని ప్రశ్నింపగా నారదుడు రాక్షస రాజ! నీతో యుద్ధము చేయగల వీరుడు వాలి యను కపిరాజొక్కడే కలడు. అని తెల్పెను

రావణుడు వాలికై యన్వేషించుచు సముద్ర తీరమును చేరగా అచట సూర్యున కర్ఘ్యమిచ్చుచున్న వాలినిచూచి రావణుడు మెల్లగా వాలిని సమీపించి వాని తోకను కాలితో తొక్కిపట్టి వీపునకు రొమ్ము చేర్చి చేతులతో గంతము చుట్టెను. వీపుపై బడిన రావణుని వాలి చంకలో చేర్చికొని నాలుగు సాగరములయందును ముంచి యింటి కేగి నాలుగిండ్ల మధ్యవిదలింపగా రావణుడు క్రిందపడి తెలివితప్పి పడియుండెను. కొంత తడవునకు రావణుడు మూర్ఛలేచి తల లెత్తి వాలిని చూడలేక పరుగు పరుగున పోయెను.

ఒకనాడు రావణుడు బలిచక్రవర్తి నివాసమైన పాతాళమున కేగగా అచటివారు రావణునిచూచిఆశ్చర్యపడి పదితలల పురుగని పట్టుకొని యాడించుచుండిరి. రావణుడు ప్రాణములు కడగట్టి తననుపట్టి యాడించుచున్నవారి చేతులను కరవగా వారు ఓరి శుంఠా! అని క్రింద పడవైచిరి. అట్లు కుంటువడిన బలముతో రావణుడు పిక్కబలముచూచి పారిపోయెను. లవకుశులు తెల్పిన రావణ పరాభవవృత్తాంతమును విని యెల్లరు నవ్విరి.

అంతనా లవకుశులు రాముని కోరికపై సీతా జనన వృత్తాంతమును వివరింప దొడంగిరి. రాజ! రామచంద్ర! పూర్వము వేదవరుండను నొక విప్రుడు శ్రీహరి నారాధించి యొక మహా యజ్ఞము చేయనారంభించెను. ఆ యగ్నిగుండమునుండి లక్ష్మీ దేవి యంశతో నొక యాడుబిడ్డ యావిర్భవింపగా నావిప్రుడుచూచి యానందముతో భార్య కప్పగించి యాగము పూర్తిచేసి యింటి కేగి ఆ పిల్లకు వేదవతియని నామకరణము చేసెను.

దినదిన ప్రవర్ధమానయగు నా వేదవతి శ్రీహరియందు మిగుల భక్తి కలిగియుండెను. ఆ విప్రుడు తన బిడ్డవంటి యన

మాన రూపగుణ సంపన్నురాలగు కన్యకు భర్తగా నెవరిని వ్రాసి పెట్టెనో దీని పూర్వపుణ్య మెట్టిదో అనియోచించి పిల్ల మక్కువపడు వరుని తెచ్చి వివాహ మొనరింతునని నిశ్చయించి తనయను చేర బిలిచి అమ్మాయి ! నీకు పెండ్లీడు వచ్చినది కదా ! నీకిష్టమైన వరునిగూర్చి తెల్పుమనగా నావేదవతి తండ్రీ ! మానవులలో వరింపదగు వారెవ్వరును నాకు గోచరించుటలేదు. నారాయణుని గూర్చి తపమొనరింతునని దృఢముగా పలికి యెట్టకేలకు తండ్రి నొప్పించి జాహ్నవీ తీరమున గల వనమున వనదేవతలూడిగములు చేయుచుండ శ్రీధరుని యందు చిత్తము నిలిపి మహా తపమొన రించుచుండెను.

రావణుడు స్వర్గలోకమును జయించి తిరిగివచ్చుచు గంగా తీరమున తపమొనరించుచున్న వేదవతినిచూచి యామె సౌందర్య మునకు ముగ్ధుడై పుష్పక విమానము నాపి క్రిందకు దిగి సమీప మునకేగి యో కాంతా ! తపము చాలించి నన్ననుగ్రహింపుమని పలుకగా శ్రీహరి పదపద్మములు ధ్యానించుచు పరవశురాలైన వేదవతి మారు పలుకదయ్యెను. గర్వాంధుడగు రావణుడు వేద వతి భుజముపై తట్టెను. దానితో వేదవతి యదిరిపడిలేచి రావ ణునిచూచి సమీపమునగల కుటీరములో ప్రవేశించి దశగ్రీవ ! నేను నీకోరిక నెరవేర్పజాలను కావున వెడలిపొమ్ము అనిపలికి పొద రిండ్లలో తిరుగుచుండగా రావణుడుచూచి బ్రహ్మ సృష్టి చాతుర్య మునకు మనసులో మెచ్చుకొని యిట్లు పలికెను. ఓ వనితామణీ ! నేను ముల్లోకములు జయించిన రావణుండను. నన్ను వరించి యలరించిన యెడల సమస్త దేవతా కాంతలు నీకూడిగములు సేయు దురు. నామాటవిని నాయందు మనసు నిలుపుము అనిపలుకుచు వేదవతిని పట్టనుంకించునంతలో వేదవతి ఓసీతిహీనుడ ! శ్రీహరిని పతిగాగోరి తపమొనరించుచున్న నాకు మనస్సెన్నడును నిన్ను

వరింపదు. బలవంతముగా నేవనితనైన పట్టిన యెడల వెంటనే తలప్రబద్ధలై మరణింతువని శపించెను.

అంత నారావణు డోవనితా ! నీవు నా యందు మనస్సు లగ్నము చేసినప్పుడే నిన్ను పరిణయమాడుదునని పలికెను. వేద వతియు మరల తపోభూమికేగి పాపాత్ముడగు రావణాసురుడు తాకిన నా శరీరము హరిసేవకు తగదని యెంచి దేహత్యాగ మొన రించెను. రావణుడు వేదవతి కళేబరమును పుష్పకములోనుంచి లంకానగరమున కేగుచుండగా నారదుడరుదెంచి లోకధర్మములు వివరించి మానవ మృతకళేబరమును తాకిన యమంగళము కలుగు నని పలుకగా విని రావణుడు వింటికొనచే శవమును బయటకు గెంటి తాను లంకకు చేరెను.

రావణుని వింటికొనచే బయటకు త్రోయబడిన వేదవతి మృత కళేబరము కడలిలోని వేయిరేకుల కమలముపై బడెను. అదే సమ యమున వైకుంఠమున శ్రీహరి లక్ష్మినిచూచి యోకాంతా ! నీవు భూలోకమున వనితవై యవతరింపుమని యాదేశింపగా లక్ష్మి నాథా ! గర్భవాస దుఃఖము ననుభవింపజాలను అని విన్నవింప శ్రీహరి ఓ పిరికిదానా ! నీ యంశమున అగ్నికుండమున వేదవతి జనించి నా పాదపద్మములు ధ్యానించుచున్న సమయమున దశ గ్రీవుడా వనితను చేతితో తాకగా ఆమె మరణించెను. వేదవతి కళేబరమును తనతో తీసికొనిపోవుచున్న రావణుడు ఆ కళేబర మును వింటికొనతో క్రిందకు త్రోయగా ఆ కళేబరము సాగరము లోని కమలమున పడెను. ఆ కళేబరమును శిశువుగా చేయుదును నీవా కళేబరమున ప్రవేశింపుము. నేను దశరథ తనయుడనై యవతరించి నిన్ను పరిణయమాడి తండ్రి యానతి ననుసరించి నీతో గలసి యరణ్యమున నివసింతును. ఒంటరిగానున్న నిన్ను రావణుడు లంకకు అపహరించి తీసికొనిపోవును. నీ నిమిత్తమై

నేను రావణుని సంహరించి నిన్నయోధ్యకు తీసికొనిపోదునని వివరించెను.

భర్తయానతి ననుసరించి లక్ష్మి వేదవతి కళేబరమున ప్రవేశించి బాలికా రూపమున నుండెను. రావణుడు శివపూజకై సాగరములోని కమలములను కోసి మహేశ్వరు నర్చించు సమయమున విష్ణుమాయవలన బాలికగామారిన లక్ష్మియున్న కమలము పూజకై తీయు సమయమున ఆ కమలము మిగుల బరువుగా నుండుట గమనించి కమలమును వెదుకగా కమలమధ్యముననున్న బంగారు చాయగల బాలికనుకని రావణుడు ఆమె సౌందర్యమునకు ముగ్ధుడై యా బాలికను పట్టుకొనబోగా ఆకాశవాణి యిట్లు పలికెను. రాక్షస రాజ ! ఈ బాలిక జనించిన సాగరము మథింపబడెను. ఈ బాలిక యిచటనున్న యెడల నీ లంకకు చేటువచ్చును. రావణుడాకాశవాణి పలుకు లాలకించి బంగారు పెట్టెలో నాబాలికనుంచి సముద్రములో విడిచి వుచ్చెను. ఆపెట్టె కడలి కెరటముల వలన మిధిలా నగర సమీప ద్వీపముచేరి యిసుకచే కప్పబడి యుండెను.

మిధిలాధిపతియైన జనకుడు వాసుదేవ ప్రీతికై యాగము చేయదలచి భూమి దున్నుచున్న సమయమున నాగేటి చాలునకు బంగారుపెట్టె తగులగా జనకుడు దానిని తెరచెను. ఆ పెట్టెలో పసిడి తీగవలె మెరయుచున్న బాలికను చూచి యచ్చెరువందుచుండగా ఆకాశవాణి యిట్లు పలికెను. జనక మహారాజ ! ఈ బాలిక లక్ష్మీదేవియొక్క యంశవలన నవతరించినది. ఈమెకు సీతయను పేరిడి నీ యింటియందున్న శివధనుస్సు విరిచినవానికిచ్చి పాణిగ్రహణము చేయుము. శివధనుర్భంగము చేసినవాని తమ్ములకు మిగిలిన పిల్లలనిచ్చి వివాహము చేయుము. జనకుడాకాశవాణి పలుకులాలకించి యానందపరవశుడై పెద్దభార్యయగు సుమేధకా బిడ్డను పెంచుమని యిచ్చి యాగము పూర్తి చేసెను.

యజ్ఞమైన పిదప యజ్ఞపురుషు డొసగిన పాయసము రెండు భాగములుచేసి యొక భాగమును రెండవ భార్యయగు సునయనకిచ్చి రెండవ భాగమును యాగశాలయందున్న తమ్ముడగు కుశధ్వజుని భార్య కొసంగెను. ఆమె యాపాయసమును భుజించి సునయన యున్న యంతఃపురమునకేగగా సునయన తన భర్త తోటికోడలికి పాయసమిచ్చిన విషయమెఱుంగక తన పాయసములో సగము తోటికోడలికొసంగి మిగిలిన సగము తాను భుజించెను. కుశధ్వజుని భార్యయు తనకు రెండవసారి లభించిన పాయస భాగమునుకూడ భుజించెను. జనకుని పెద్దభార్యయగు సుమేధకు లక్ష్మీనిధియను తనయుడుండుట చేతను సీతనుకూడ ఆమెకే పెంచుట కిచ్చుట చేతను పాయసమున నామెకు భాగమొసంగలేదు.

పాయసమున నొక భాగము తిన్న సునయన యొకయాడు బిడ్డను రెండు భాగములుతిన్న కుశధ్వజునిపత్ని యిరువురు ఆడు బిడ్డలను ప్రసవించిరి. సునయన బిడ్డకు ఊర్మిళ యనియు, కుశధ్వజుని బిడ్డలకు మాండవి. శ్రుతకీర్తు లనియు నామకరణములు చేసిరి. జానకికి పెండ్లీడువచ్చుట గమనించి జనకుడు తనయింట నున్న శివధనుస్సు విరచిన సీతనిత్తునని చాటించెను. కాని యెవ్వరును శివుని విల్లెక్కుపెట్టు మొనగాడు రాకుండుటవలన జనకుడు బిడ్డలకు తగు సమయమున పెండ్లి చేయలేకపోతిని. వీరు పుష్పవతులైన ధర్మహాని కలుగును కదా యని విచారించుచుండ సీత విని తమకు పెండ్లియగువరకు పుష్పవతులుకారాదని నిశ్చయించుకొనెను. అని కుశలవులు వివరముగా చెప్పుచుండగా శ్రీరాముడా బాలురగాంచి పౌరాణికులార ! శ్రీరాముడవతార పురుషుడని మీరు చెప్పిరి కదా ! స్వస్వరూప జ్ఞానము లేకుండుటకు కారణమేమని ప్రశ్నింవగా లవకుశులు మరలనిట్లు చెప్పసాగిరి.

రాజ ! విష్ణువర్ధనుడను రాజు హరిభక్తుడై నందున ప్రజ

లను విష్ణుభక్తితో విలసిల్లు చుండిరి. విష్ణువర్ధన మహారాజునకు లక్ష్మీదేవి యంశ వలన యొకపుత్రిక జనించి దిన దిన ప్రవర్ధ మానయగుచున్నది. పర్వతుడు గార్గ్యుడు అను నిరువురు మునీం ద్రులు ఒకనాడు విష్ణువర్ధనుని కడకరుదెంచిరి. మహారాజామును లను అర్ఘ్య పాద్యాదులతో నర్చించి యుచితాసనాసీను గావించి తానును సుఖాసీనుడై యుండగా వాని బిడ్డవచ్చి తండ్రియొడిలో గూర్చుండెను. మిగుల చక్కనిదగు నా పిల్లనుచూచి యా మునులు రాజా ! యీ పిల్లయెవరు ? అని ప్రశ్నింపగా విష్ణు వర్ధనుడు మునీంద్రులార ! ఈమె నాబిడ్డ యని విన్నవించెను. మునులు రాజా! నీ పుత్రికను మాకిచ్చి పెండ్లి చేయుమని కోరిరి. రాజా మునులను చూచి మునిపుంగవులార ! మీరిరువురు నా బిడ్డను కోరిరి. ఇద్దరకును పిల్లనిచ్చుట సాధ్యముకాదు కదా ! అది సాధ్యమైనను లోక విరుద్ధము కదా. రేపుదయము మీరు నా మందిరమునకు దయచేయుడు. నా పుత్రిక పూదండ బూని మీ యిరువురిలో తనకు నచ్చినవారిని వరించును. అని విన్నవిం పగా మునులంగీకరించి విడిదికేగిరి.

మరునాడా మునులు స్నాన జప తపాదులు మాని నిత్య కృత్యములు నెరవేర్చుకొనిబూదిపూసికొని నారబట్టలుగట్టి బంగారు తీగెలవంటి జడలుపైకి గట్టి ఊర్ధ్వపుండ్రములు పెట్టి జపమాలికలు దండ కమండలములు దాల్చి వేదములు చదువుచు స్వయంవర మునకై విష్ణువర్ధనుని నగరికి వేడుకతో వచ్చిరి. విష్ణువర్ధనుడా మునుల కర్ఘ్యపాద్యము లొసంగి యాసీనులుగాజేసి కాగితపు దండను కుమార్తెకిచ్చి పుత్రీ ! నీవీ యిరువురు మునులలో నీకిష్టమైన వాని మెడలో నీ దండ వేయుము. నీవెవరి మెడలో నీ దండ వేయుదువో వానికి నిన్నిచ్చి పెండ్లి చేయుదుననెను.

తండ్రి పలుకులువిన్న యారాజకన్య బ్రాహ్మణుని వరించు

నిచ్చలేక శ్రీహరి పాద పద్మములు మనసులో నుంచుకొని దేవా ! నీ పాద పద్మములనే నమ్మితిని నాకు నీ'పాదపద్మములను సందర్శించు భాగ్యమొసంగుము. నా తండ్రి నన్నీ విప్రులలో నొకనికియదలచెను. నేను నిన్నే వరించితిని. నీవు నన్ను నీకడకు గొనిపొమ్ము అని ప్రార్థించుచుండ శ్రీహరి గరుడ వాహనారూఢుడై వచ్చి ప్రత్యక్షమయ్యెను. విష్ణువర్ధనుని తనయ వైష్ణవర్ధని సభాభవనమున శ్రీహరిని ధ్యానించుచు చేతిలో విరిదండతో నిలచియుండెను. శ్రీహరి వైష్ణవర్ధనిని చేయిపట్టి యాకాశమార్గమున గొనిపోయెను.

అంత నా పర్వత గార్గ్యులు రాజునుచూచి నీవు మమ్ము మోసగించి శ్రీహరికి కన్యనొసంగితివి మాకిచ్చినమాట దప్పి హరి వెంట గూతును బంపితివి. కాన నీవు నీ బలమెరుంగక జ్ఞానహీనుడవు కమ్మని శపించి యా మునులు వెడలి పోయిరి.

అంత నావిష్ణువర్ధనుడు నిరాహారుడై ఆరుదినములు శ్రీహరినిగూర్చి తపమొనరించెను. ఏడవ దినమున శ్రీహరిని మనములో నిలుపుకొని ధ్యానింపుచుండ శ్రీహరి ప్రత్యక్షమయ్యెను. విష్ణువర్ధనుడు చేతులు జోడించి మ్రొక్కి నుతింప విష్ణువర్ధనుని చూచి విష్ణువిట్లనెను. రాజ ! సత్యము గోవులు విప్రులు భక్తులు నా నివాసములు. నిరపరాధివగు నిన్ను మహర్షులు శపించి వెడలిరి లక్ష్మీదేవి అంశవలన వైష్ణవర్ధని నీ యింట నీకు బిడ్డగా జనించినది. నీవు మాకు భక్తుడవు బంధుడవు. విప్రశాపము మరలింపరానిది. మాకు భక్తులు మునులు సమానమే కావున మునులు నీకొసంగిన శాపమును రామావతార సమయమున నేనుభరింతును. నీవు శాపభీతిని విడిచి పరమపదము నందుము. అని పలికి తిరోహితుడయ్యెను.

భృగుమహర్షి భార్య రాక్షసుల అభివృద్ధికై తపముచేయు చుండగా శ్రీహరి దేవతల నిమిత్తమై చక్రముతో ఆమె శిరమును ఖండించెను. రాక్షసు గురువు తండ్రియగు భృగుమహర్షి విష్ణువు చేసిన పనినెరింగి గురువులు శిష్యుల యభివృద్ధిగోరుట ధర్మము శ్రీహరి అధర్మముగా నా భార్యను చంపెను. అని కొంత తడవు చింతించి మాధవుడు నిర్దోషులైన విప్రులను బాధించెను కావున మానవుడై యవతరించి స్వస్వరూప మెరుగక భార్యా వియోగ దుఃఖము ననుభవించుగాక యని శపించెను. ఈ రీతిగా శ్రీరాము నకు స్వస్వరూప జ్ఞానముకొరవడెనని పౌరాణికులుపలికిన రాముడు నిరుత్తరుడై నిర్దోషియగు సీత యందజ్ఞానముచే దోషమాపాదిం చితినని చింతించుచుండెను. వసిష్ఠుడా బాలురు చెప్పు మాటలు మెచ్చుకొని సీతా పరిణయ వృత్తాంతమును పఠింపుడనిన వారలు తదనంతర కథ చదువదొడంగిరి.

శ్రీహరి యొక్కయు శేషుని యొక్కయు నంశచేత రామ లక్ష్మణులు దశరథ తనయులై యవతరించుట విశ్వామిత్రుడు యోగదృష్టిచేత గ్రహించి యయోధ్యా నగరమున కేగెను. దశ రథుడు గాధేయుని స్వాగత సత్కారములతోతీసికొనివచ్చి యర్ఘ్య పాద్యము లొసంగిపూజించియుచితాసనాసీనుని గావించెను. తనకు మ్రొక్కి నిలిచి యున్న దశరథుని చూచి విశ్వామిత్రుడు ఓ రాజేంద్రా ! నే నొక జన్నము తలపెట్టితిని. దానిని సంరక్షించు టకై రామ లక్ష్మణులను నావెంట బంపుము యాగానంతరము నీ తనయులు నీ కడకు క్షేమముగా రాగలరు. అని పలుకగా దశరథుడు రామలక్ష్మణులను వీడియుండుట ఎట్లాయని చింతించి మునీంద్రా ! పసివారగురామలక్ష్మణులు రక్కసులనెట్లు జయింప గలరు ? విల్లు పట్టుటగూడ నెరుగని 12 ఏండ్ల బాలురు ఘోర రాక్షసులతో పోరగలరా ? అనేక యుద్ధము లందారితేరిన నేను

నీ వెంటవచ్చి రక్కసులనుక్కడగించి జన్నము కాపాడుదును. కావున నన్ను నీ వెంట తోడ్కొని పొమ్ము అనెను.

విశ్వామిత్రుడు దశరథుని కోపముగా చూచి మహారాజా! నీ బిడ్డలను నీవు కాపాడుకొనుము. నేను వెడలుచున్నాను. అని పలుకగా దశరథుడు భీతుడై కౌశికుని పాదములకు మ్రొక్కి వినయవచనములు పలికి బాలురను పంపనిచో విశ్వామిత్రుడు శపించునని భయపడి వసిష్ఠునికడకేగి మ్రొక్కి యిట్లు పలికెను. గురువర్యా! విశ్వామిత్రుడు రామలక్ష్మణులను యాగరక్షణకై పంపగోరుట మీరును వినియున్నారు కదా! కాదన్న విశ్వామిత్రుడు ఘోరశాపమొసంగును, పంపిన యెడల రామలక్ష్మణులను వీడి క్షణమైన జీవింపజాలను.

దశరథుని విన్నపమాలించి వసిష్ఠుడు ఇట్లు పలికెను. రాజా! పూర్వజన్మమున నీవు కశ్యపుడవు. కౌసల్య అదితి. అదితి శ్రీహరిని భక్తితో సేవింప శ్రీహరి ప్రత్యక్షమై వరము కోరుకొనుమనగా దేవా! నీవంటి తనయుని ప్రసాదింపుమని వేడెను. మాధవుడు మీ దంపతులను సూర్యవంశమున మీరు జనింపుడు. నేను రాముడను పేర మీకు తనయుడనై జనింతును. అని వరమొసంగెను. తానిచ్చిన వరమును నెరవేర్చుటకై శ్రీహరి నీకు కుమారుడై రాముడను పేర అవతరించెను. కావున ముని వెంట నీ తనయులను అనుమానింపక బంపుము. మేలగును అని హితవు గరపగా దశరథుడు వసిష్ఠుని హిత వచనముల ననుసరించి కౌశికుని వెంట రామలక్ష్మణులను బంపుట కంగీకరించెను. విశ్వామిత్రుడు సంతసముతో దశరథుని దీవించి వసిష్ఠుని యానతి గైకొని వెడలుచుండగా రామలక్ష్మణులు ధనుర్బాణములు చేతబట్టి విశ్వామిత్రుని వెంటనేగిరి.

వనములో వెడలునప్పుడు విశ్వామిత్రుడు ఆకలిదప్పులు లేకుండుటకును నిద్ర అలసట మున్నగునవి దరిజేరకుండుటకును బల అతిబల అను విద్యలను రామలక్ష్మణుల కుపదేశించెను.

విశ్వామిత్రుడు రామలక్ష్మణులు గంగా తీరము జేరి నిత్య కృత్యములు దీర్చికొని యిసుక తిన్నెపై గూర్చుండిరి. దేవేంద్రుడు బ్రాహ్మణ వేషమున వచ్చి విశ్వామిత్రుని రహస్యముగా కలిసికొని మునీంద్రా! రామలక్ష్మణులకు సకల శస్త్రాస్త్రములుపదేశింపుమని పలికి బ్రహ్మదత్తమైన విల్లును రామునకొసంగి తిరోహితుడయ్యెను. అంతనా విశ్వామిత్రుడు అనుష్ఠానములు పూర్తి చేసికొని రామలక్ష్మణులను పిలిచి సురాసురులను శత్రువులను సులభముగా జయించుటకు దివ్యాస్త్రములువదేశింతును స్వీకరింపుడు అని పలికి యమోఘాస్త్రములనుపదేశించి యక్షయతూణీరముల నొసంగెను. ఆ యస్త్రములు మూర్తిమంతములై రామునకు మ్రొక్కి రామా! మీ యాజ్ఞానువర్తులము నీ చిత్తము వచ్చినట్లు మమ్ము వినియోగించుకొనుము. అని విన్నవించిన శ్రీరాముడు సంతసించి కౌశికునకు మ్రొక్కి అస్త్రములు గ్రహించి మునీంద్రా! వీని ప్రయోగమునే కాక ఉప సంహారమును గూడ ఉపదేశింపుమని కోరగా విశ్వామిత్రుడట్లే చేసెను. మూర్తిమంతములైన యస్త్రములను తాను తలచినప్పుడు వచ్చునట్లాజ్ఞాపించి యొప్పించెను.

బ్రాహ్మణ వేషధారియగు ఇంద్రుడొసంగిన విల్లు చేబూని యెక్కుపెట్టి ధనుష్టంకారము చేసి తనకు తగిన విల్లని సంతసించి విశ్వామిత్రునితో నిట్లనెను. బ్రాహ్మణుడొసంగిన యీ విల్లు శత్రు సంహార యోగ్యమైనది. ఈ విల్లునెవరు నిర్మించిరి? దీనిని దాల్చి రిపుసంహారమొనరించిన వారెవరు? నాకీ విల్లు నొసంగిన బ్రాహ్మణు

నకీవిల్లెట్లు లభించినది ? ఈ విషయములు తెలియజేయుమని కోరగా విశ్వామిత్ర మునీంద్రుడు నవ్వుచు ఇట్లనెను. రామా ! మేరు పర్వత సమీపమున ప్రవహించు గంగలో బ్రహ్మ స్నానము చేయు చున్న సమయమున మధువను రక్కసుడు గట్టుపై నున్న దండ మును విరచివేసెను. బ్రహ్మ మధువును చూచి రాక్షసాధమ ! నీవు నా దండమును దుర్బుద్ధితో విరచినావు కావున పసిడికొండపై ముప్పదిమూడు కోట్ల సంవత్సరములు వెదురుగడపై పడియుండు మని శపించెను. శాపము విన్న మధువు గడగడ వణుకుచు బొంగురు గొంతుతో దేవా ! లోకజనకుడవగు నీవు నాపై నాగ్రహింపదగునా? బిడ్డ నేరము చేసిన తండ్రి సైచునేకాని హాని చేయునా? దయతో నన్ను రక్షింపుము. నీ పాదములకు మ్రొక్కెదనని పలికి కాళ్ళకు మ్రొక్కెను పాదములపై బడిన మధు రాక్షసునిపై విరించి కరు ణించి రాక్షసుడ ! మూడు మనువుల వరకు మాత్రము శాపమనుభ వింపుము. పిదప విశ్వకర్మ శివుని కొఱకై విల్లు చేయబూని నా యానతిచే నిన్ను (వెదురును) ఖండించును. దానితో నీకు శాప విముక్తి కలుగును అని పలికి బ్రహ్మ అంతర్ధానమయ్యెను.

బ్రహ్మ శాపముననుసరించి మధువు మూడు మన్వంతరముల వరకు పసిడికొండపై వెదురుగా పడియుండెను. కొంతకాలమునకు శివుడు త్రిపురాసుర సంహారమునకై యుద్ధము చేయుచు తన ధనుర్బాణములు దైత్యునేమియు చేయజాలకుండుట చూచి బ్రహ్మను చూచి పితామహ ! ఈ విల్లు నిస్సారమైపోయినది. సార వంతమగు మరియొక విల్లును తెమ్మనగా బ్రహ్మ విశ్వకర్మను పిలిచి మేరు పర్వతమున గల పెద్ద వెదురును తెచ్చి ధనుస్సులు నిర్మింపుమనగా నతడు వజ్రముగైకొని మేరు పర్వతమున గల వెదురును నరికి తెచ్చెను.

ఆ వెదురు ముక్కలు చేసి మొదటి నొక విల్లు నిర్మించి శివునకొసంగెను. పినాకిని యను పేర నది శివుని చేతినలంకరించెను. పినాకిని లభింపగానే శివుడు ప్రాత విల్లును విసిరివేయగా అది వాయువేగముతో మిధిలకు చేరెను. పినాకినితో శివుడు త్రిపురాసురులను సంహరించెను.

విశ్వకర్మ యీ వెదురు యొక్క రెండవ ముక్కతో విల్లు చేసి శార్ఙమని పేరిడి మాధవునకొసంగెను. మూడవ ముక్కతో మరి యొక విల్లుచేసి విశ్వకర్మ బ్రహ్మదేవునకొసంగెను నాల్గవ ముక్కతో మరియొక విల్లుచేసి విశ్వకర్మ గాండీవమని పేరిడి యగ్నిదేవునకొసంగెను. ఆ వెదురు యొక్క చివరి భాగముతో మురళి గావించి యగ్నిదేవునికడ నుంచెను

ఈ విధముగా విశ్వామిత్రుడు చెప్పుచుండగా శ్రీరాముడు మునీంద్రా! గాండీవమును మురళిని అగ్ని దగ్గర ఉంచుటకు కారణ మేమని యడుగగా విశ్వామిత్రుడిట్లు చెప్పెను. రామా! నర నారాయణులు భూభారహరణార్థము కృష్ణార్జునులై యవతరించి నప్పుడు వారి కొసంగుటకై గాండీవము మురళియు అగ్ని దగ్గర దాచిరి. రామా! విశ్వకర్మ నిర్మించి బ్రహ్మకొసంగిన విల్లునే ఇంద్రుడు బ్రాహ్మణ రూపమున తెచ్చి నీ కొసంగెను అని విశ్వామిత్రుడు రాముని సందియము తొలగించెను.

విశ్వామిత్రుని వెంట మహారణ్యములో నరుగుచు రామలక్ష్మణులొక చోట నాగిరి అప్పుడు విశ్వామిత్రుడు దశరథ తనయులారా! ఇచట నుండి మా యాశ్రమమునకు రెండు మార్గములున్నవి. అందొకటి దగ్గరదారి కాని యీ దారిని రాక్షసులాక్రమించిరి. దగ్గర దారిని ప్రయాణించిన మూడు రోజులు పట్టును.

రెండవది దూరము. ఈ దూరపు దారిని పయనించిన ఆరు మాసములు ప్రయాణమునకు పట్టును. ఏ దారిని పయనింతమో చెప్పుడు అని ప్రశ్నింపగా రాముడు ముని చంద్రమా! క్షత్రియ వంశమున జనించి శత్రువులకు భయపడి చుట్టు దారిని పయనించిన నెల్లరు నగరా ? కావున రాక్షస పరివేష్టితమైనను దగ్గర దారినే పోదుమనిన విశ్వామిత్రుడు సంతసించి రాజకుమారులను వెంటగొనుకొని దగ్గర దారిన పయనమయ్యెను.

ఘోరారణ్య వాసులైన దానవులు సేవింప మారీచసుబాహులు పెడబొబ్బలు పెట్టుచు విశ్వామిత్రుని రామలక్ష్మణులను చుట్టుముట్టిరి. ఆ రక్కసునకంటె ప్రళయ భీకరముగా గర్జించుచు తాటక మృత్యు దేవతవలె నరుదెంచుచుండెను. కొండవంటి నల్లని దేహముతో నెత్తురోడుచున్న జంతువులను నోట గరచుకొని పురుగులు పట్టిన శవముతో, కట్టబడిన జుట్టు విరబోసికొని పరుగు పరుగున వచ్చుచున్న తాటకను చూచి విశ్వామిత్రుడు రాముని చాటునకు చేరెను. రాముడు విల్లెక్కువెట్టి ధనుష్టంకారము చేసి మీద కురుకుచున్న తాటకపై బాణము ప్రయోగించి నేలగూలనేసెను. రాముడు చేసిన వీరోచిత కృత్యమును విశ్వామిత్రుడు ప్రశంసించి రామా !మారీచ సుబాహులు విజృంభింపకముందే కూర్రాస్త్రములు ప్రయోగించి కూల్చివేయుము అని పలుకగా రామలక్ష్మణులు గాధేయుని యానతినే తలదాల్చి కూర్రాస్త్రములు ప్రయోగించిరి. మారీచ సుబాహులును రామలక్ష్మణులపై బాణ వర్షము గురియ సాగిరి. శ్రీరాముడు సుబాహుని సంహరించి వాయువ్యాస్త్రముతో మారీచుని సాగరమున బడవేసెను. లక్ష్మణుడు మిగిలిన రక్కసులను సంహరించెను. విశ్వామిత్రుడు రామలక్ష్మణులను కౌగిలించుకొని మీరు తక్క అన్యులీ పనులు సాధింపజాలరు అని నుతించి రామలక్ష్మణులతో తన యాశ్రమమునకు చేరెను.

ఆశ్రమ వాసులగు మునులు విశ్వామిత్ర మహర్షిని రామ లక్ష్మణులను చూచి మిగుల నానందించిరి. ఒక శుభముహూర్తమున విశ్వామిత్రుడు యాగమారంభించెను. యాగధూమమును చూచి యాగమును ధ్వంసము చేయుటకై రాక్షసులు గుంపులుగా వచ్చిరి మునులు భీతితో రామలక్ష్మణుల చాటునకు చేరిరి. రామలక్ష్మణులు ధైర్య సాహసములతో నా రాక్షసుల నెదిరించి యుక్కడగించిరి. హతశేషులగు రాక్షసులు జనస్థాన వాసులగు ఖరదూషణాదుల పాలివు జేరిరి. విశ్వామిత్రుడు శ్రీరామలక్ష్మణుల తోడ్పాడుతో యాగము పూర్తిచేసియవబృథ స్నానము చేసి ఋషులతోడను రామలక్ష్మణుల తోడను గూడి పర్ణశాలలో విశ్రాంతిగా కొన్ని దినములు గడపెను.

విశ్వామిత్రుని యాశ్రమమున రామలక్ష్మణులుండుట గౌత ముడు విని రామలక్ష్మణులను తన యాశ్రమమునకు తోడ్కొని రమ్మని శిష్యుని బంపెను. అతడు విశ్వామిత్రుని దర్శించి రామ లక్ష్మణులతో గూడి తమ యాశ్రమమునకు దయచేయవలసినదని మా గురువుగారు సెలవిచ్చిరి, అని విన్నవింపగా విశ్వామిత్రుడు సంతసించి రాజకుమారులార ! గౌతమమహర్షి మీ యాగమనమును కోరుచున్నాడు. మహర్షి సందర్శనము శుభప్రదము అని తెలుపగా రామలక్ష్మణులు మీ యాజ్ఞ యనిరి. విశ్వామిత్రుడు వెంటనే రామ లక్ష్మణులతో గూడి గౌతమాశ్రమము దిశగా మహారణ్యమున నిర్భ యముగా పయనింపసాగెను. దారిలో స్త్రీ సమానమైన పాషాణ మొకటి పడియుండెను. శ్రీరాముని పాదపంకజపరాగము ఆ పాషాణముపై బడి శాపవిముక్తి బడసి స్త్రీగా మారెను. ఆ వనిత శ్రీరాముని పాద పద్మములకు మ్రొక్కి యాకాశగమనమున దేవ లోకము చేరి గంగా స్నానమొనరించి భర్తృ సన్నిధానమును చేరెను. అంతలో మహర్షియు రామలక్ష్మణులును గౌతమ మహర్షి

యాశ్రమమును చేరగా గౌతముడు ముువ్వురకును స్వాగత సత్కారములొనరించి విందు చేసెను. భోజనానంతరము విశ్వామిత్రుని వలన రామలక్ష్మణులు చేసిన రాక్షస సంహారమును విని యెల్లరు సంతసించిరి.

నాటి రాత్రి యెల్లరు నిద్రించుచున్న సమయమున రామలక్ష్మణులేకాంతమున విశ్వామిత్రుని కలిసికొని మునీంద్రా! రాయి నాతిగా మారుటకు హేతువేమి ? అని యడిగిన విశ్వామిత్రు డిట్లు వివరించెను. రామా ! స్త్రీగా మారిన యా పాషాణము ఈ గౌతమ మునీంద్రుని భార్యయే. ఆమె చేసిన నేరమునకు గౌతముడు కోపించి శపించెను. అ శాపము వలన గౌతముని భార్యయగు నహల్య రాయియై నీ పాద ధూళిసోకి నిజ రూపము దాల్చి భర్తను చేరెను.

అంతనా రాముడు మునీంద్రా ! అహల్య చేసిన యపరాధ మెట్టిది ? గౌతముడు భార్యనేల శపించెను ? వివరించి చెప్పమని కోరగా విశ్వామిత్రు డిట్లు చెప్పదొడంగెను. రామా ! గౌతమ మహర్షి భార్యయగు అహల్య యతిలోక సుందరి ఆమె దివ్య సౌందర్యము పరపురుషుల కంటబడిన ప్రమాదమవి మహర్షి భావించి స్నానాద్యనుష్ఠానములు దీర్చుకొను నిమిత్తము బయట కేగునప్పుడు తన తపోమహిమ చేత ప్రాణములు వెంట తీసికొని పోయి మరల నాశ్రమమును చేరగానే భార్యకు ప్రాణములొసంగి జీవింపజేయువాడు. ఈ రీతిగా చాలకాలము గడచెను.

కొంతకాలమునకు అహల్యాగౌతములకొక ఆడుబిడ్డ పుట్టెను. దివ్య సౌందర్యోపేత యగు నహల్యను చూచి ఇంద్రుడును సూర్యుడును కామపీడితులై ఆమెను పొందగోరి సమయమున కెదురు చూచు చుండిరి. ఒకనాటి రాత్రి ఇంద్రసూర్యులు మానవ రూప

ములు దాల్చి ఆకాశ మార్గమున వచ్చి ముని స్నానము చేయుట కెప్పుడు వెళ్ళునాయని యెదురు చూచుచు ఆశ్రమ సమీపమున పొంచి యుండిరి. మాయజేసి మునిని బయట కంపినగాని తమ పని నెరవేరదని చింతించి యింద్రుడు కోడివలె నైదారుసార్లు కూసెను. తెల్లవారు జామైనదని స్నానమునకేగుచు భార్య ప్రాణములు వెంటబెట్టుకొని వెళ్ళుచు భార్య కట్టెకడ కూతురి నుంచి నదిని చేరెను.

ఇంద్రుడు సూర్యుడు అహల్య కడకేగి చైతన్యములేక నేలపై బడియున్న యహల్యను చూచి విస్మితులై ఆమెను విడువలేక ఆ యిరువురిలో నొకడామె యందు ప్రవేశించి చైతన్యము (పరకాయ ప్రవేశము) కలిగింపగా రెండవ వారామెననుభవింపవచ్చుననియు తరువాత రెండవ వారామె యందు ప్రవేశింప మొదటి వారామె ననుభవింపవచ్చుననియు నిర్ణయించుకొనిరి.

ఆ నిర్ణయము ననుసరించి సూర్యుడహల్య శరీరమున ప్రవేశించి చైతన్యమును కలిగింపగా ఇంద్రుడు మోహాంధుడై పర కాంతయను శంక విడిచి యహల్యననుభవింపబోగా ఆమెయు నింద్రుని దివ్య రూపముచూచి మోహ పరవశయై రతి సుఖముననుభవించెను. పిదప సూర్యుడాయహల్య నుండి తన చైతన్యమునుప సంహరించుకొనుటయు ఇంద్రుడామె యందు తన చైతన్యమును ప్రవేశపెట్టుటయు జరిగెను. అహల్య ననుభవించుటకు సూర్యుడు సమీపించగా సూర్యతేజమువలన తల్లి (అహల్య) దగ్గరనున్న పిల్ల కన్నులు పోయి గ్రుడ్డిదయ్యెను. సూర్యుడహల్య వలన సురత సౌఖ్యమనుభవించిన పిదప నింద్ర సూర్యులు అహల్యను విడిచి యథేచ్ఛగా వెడలిపోయిరి.

కొంత సేపటికి గౌతముడు వచ్చి యహల్యకు ప్రాణము లొసంగెను ఇంద్ర సూర్యుల వలన అహల్య గర్భవతియై పదవ మాసమున ఇరువురు పుత్రులను కన్నది. ఆ బిడ్డలిరువురును దిన దిన ప్రవర్ధమానులగుచుండిరి. గౌతముడొక పర్వదినమున అహల్య ప్రాణములను తీసికొని కుమారుల నిరువుర నెత్తుకొని కూతురు చేయి పట్టుకొని స్నానము చేయుటకు వెళ్ళుచుండెను. సూర్య తేజమునకు వేడెక్కిన ఇసుకపై నేగునప్పుడా బాలిక కాళ్ళు కాలుచుండ తండ్రిని చూచి నాయన ! నీ బిడ్డనైన నన్నీ వేడి యిసుకలో నడిపించుచు పరుల బిడ్డలనెత్తుకొని తీసుకొని వచ్చుచుంటివి. ఇది నీకు ధర్మమా! అని ప్రశ్నింపగా గౌతముడు కుమార్తె పలుకులకు చింతించి సముద్ర తీరము చేరి పుత్రులను చేతితో పట్టుకొని వీరు నా పుత్రులైన యెడల సుందర రూపములతో తిరిగివత్తురు. కానిచో వానరులగుదురని పలికి కొడుకుల నిరువురను సముద్రములో పడవైచెను వెంటనే యా బాలురిరువురును వానర రూపములు దాల్చి గట్టెక్కి సమీప వనమునకు వెడలిపోయిరి.

గౌతముడు పుత్రిక నెత్తుకొని యింటికేగి అహల్యకు ప్రాణము లొసంగెను. అంతనా వనిత లేచి పుత్రులేరని యడిగిన గౌతముడు దుష్టురాల ! పిల్ల చెప్పిన మాట విని పుత్రుల జననము తెలియగోరి సాగరమున పడవేయగా ఆ పిల్లలు వానరులై గట్టెక్కి వనములోనికేగిరి. అని చెప్పగా అహల్య కోపముతో పుత్రికను చూచి తండ్రితో నేరములు చెప్పి నా కొడుకులను దూరము చేసితివి కావున నీ కడుపున కోతి పుట్టును గాక అని శపించెను. గౌతముడు భార్యను చూచి నీవు పాషాణ హృదయముతో కన్నబిడ్డను శపించితివి కావున పాషాణమై పడియుండుమని శపించెను. అంతనహల్య నాథా ! నా ప్రాణములు మీ యధీనములోనున్నవి కదా ! నేను తప్పెట్లు చేసి

తిని ? అని యేడ్చుచు ప్రశ్నింపగా గౌతముడు దివ్యదృష్టితో ఇంద్రుడు సూర్యుడు చేసిన మోసము గ్రహించి కామాంధులై నా భార్యను పొందిన యింద్రుడు సహస్రయోని యగుగాక అనియు సూర్యుడు సహస్రాండుడౌగాక అనియు శపించి వనితా ! శ్రీహరి సూర్య వంశమున రాముడై యవతరించును. రాముని పాదధూళి సోకిన పిదప నీవు నిజరూపము దాల్తువని శాప విమోచనము నను గ్రహించెను.

రామా ! అది మొదలు అహల్య రాయివై పడియుండి నీ పాదధూళి సోకి శాపవిముక్తి బడసెనని విశ్వామిత్రుడు చెప్పగా శ్రీరాముడు మునీంద్రా ! గౌతముని శాపము నింద్రసూర్యులెట్లను భవించిరి ? సముద్ర తీరమున గల యడవిలో చేరిన అహల్య తన యులును, తల్లి శాపమందిన పిల్లయు నేమి చేసిరో వివరింపుమని యడిగిన విశ్వామిత్రుడిట్లు చెప్పదొడంగెను. రామా ! ఇంద్రుడు సహస్రయోనియై సిగ్గుతో చీకటింటిలో దాగియుండగా దేవతలెల్లరు తల్లడపడి ఇంద్రుని వ్యథ మాన్పగల వారెవరా యని చింతింప జొచ్చిరి. సూర్యుని దేహమున వేయి అండములు (వృషణములు) పుట్టగా దైన్యముతో మేరు పర్వత గుహలో దాగెను. దానితో లోక ములన్నియు నంధకారబంధురమయ్యెను. ప్రళయ కాలము దాపు రించినదేమోయని యెల్లరు నంధకారమున అన్ని కార్యములుడిగి పడియుండిరి. నిశాచరులు విజృంభించి దేవతలను పీడింప జొచ్చిరి అంత దేవతలెల్లరు పరమేష్ఠిని సందర్శించి మొరపెట్టుకొనిరి. దేవా! ఇంద్రసూర్యులు మానవరూపధారులై చేసిన కృత్యముల కలిగి గౌతముడు శపింపగా వారు పర్వత గుహలలో దాగిరి. రక్కసులు సర్వలోకములను పీడించుట చేత గందరగోళము వ్యాపించెను.

దేవతల పలుకులాలకించి బ్రహ్మ యిట్లు పలికెను. దేవత లారా! ఇక నుండి ఇంద్రునికి యోనులుగను ఇతరులకు కన్నులు

గను గోచరించును. అట్లే సూర్యునికి అండములుగను ఇతరులకు కిరణములుగను గోచరించును. అని వరమొసంగెను నాటినుండియు ఇంద్రుడు సహస్రాక్షుడనియు, సూర్యుడు సహస్ర కిరణుడనియు పేరందిరి. అంత నా యింద్ర సూర్యులు యథా ప్రకారము విధి నిర్వహణమొనరింపజొచ్చిరి.

విశ్వామిత్రుని పలుకులాలించి శ్రీరాముడు మునివర్యా! సముద్ర తీరమునకేగిన కోతిపిల్ల లేమయ్యెనని ప్రశ్నింపగా విశ్వామిత్ర మహర్షి యిట్లు చెప్పదొడంగెను. రామా! ఋక్షుడను మృగరాజు సముద్ర తీరమునకరుదెంచి యచట తిరుగుచున్న వానర కిశోరములను చూచి బిడ్డలార! రండని పిలిచి చేరదీసెను. పుత్రహీనుడగు నా మృగరాజు వానిని పెంచుకొనదలచి కిష్కింధకు తీసికొనిపోయెను. అట్లు తీసికొని పోవునప్పుడింద్రుని బిడ్డ వాలము మీదను, సూర్యుని బిడ్డ (మెడ) గ్రీవము మీదను కూర్చుండిరి. వారినింటికి తీసికొనిపోయి ఋక్షుడు తన వాలముపై గూర్చున్న వానికి వాలి యనియు, తన గ్రీవముపై గూర్చున్న వానికి సుగ్రీవుడనియు నామకరణములు చేసి పెంచి పెద్ద చేసెను. వాలి సుగ్రీవులిరువురు నమిత బల పరాక్రమములతో విహరించుచుండిరి. ఒకనాడు వాలి సుగ్రీవులు మందర పర్వతమున విహరింపనేగినప్పుడచటనున్న తారయను కన్య వాలిని వరించెను. అటకు దగ్గరలోనున్న రుమను సుగ్రీవుడు పెండ్లాడెను. వాలి సుగ్రీవులు తరువాత కిష్కింధకేగి నివసింపజొచ్చిరి. అంత రాముడు విశ్వామిత్రునకు మ్రొక్కి అహల్య శాపముచే అంధురాలైన పిల్ల యేమైనదో తెల్పుమనగా విశ్వామిత్రుడిట్లు పలికెను రామా! అంధురాలైనందున గౌతముని పుత్రికకు పెండ్లి కాలేదు. ఆమె శ్రీహరిని గురించి నిరంతరము తపమొనరించెడిది. కొంతకాలమునకు కేసరి యను వాడామెను పరిగ్రహించెను.

తరువాత నామె మందరగిరిపై శ్రీహరిని గూర్చి తపము చేయగా బ్రహ్మ యచటికరుదెంచి ఆమె తపము చూచి సంతసించి వాయుదేవుని పిలిచి ప్రతిదినము ముగ్గిన పండ్లు తెచ్చి ఆమె దోసిలిలో వేయుమని యాజ్ఞాపించెను. అంజలి పట్టి తపమొనరించుచున్నది కావున ఆ వనితకు అంజనియని ప్రసిద్ధి కలుగునని పలికి యంతర్ధాన మొందెను.

వాయుదేవుడు తన దోసిలిలో వేయుచున్న పండ్లు తిని యంజనీదేవి తపమొనరించుచుండెను. అట్లు చిరకాలము గడచెను. ఒకనాడు పార్వతీ పరమేశ్వరులా మందరగిరిపై విహరించుట కరుదెంచిరి. ఆ సమయమున నొక మర్కట మిధునము కలిసియుండుట నా పురాణ దంపతులు చూచిరి. వారును వానర రూపములు దాల్చి క్రీడించుచుండగా వీర్యస్ఖలన సమయమున పార్వతి ముందునకు జరుగుట చేత కోతి రూపమున నున్న శివుని వీర్యము ఒక పత్రముపై బడెను. తరువాత నాది దంపతులు నిజ రూపములు దాల్చి అమోఘమగు శివుని వీర్యము వ్యర్థము కారాదని వాయువును పిలిచి దీని నీ కొండపై తపమొనరించుచున్న యంజని కొసంగుమని యాజ్ఞాపించిరి అప్పుడు వాయుదేవుడు శివునకు మ్రొక్కి దేవా ! ఈ వీర్యము స్వీకరించిన అంజనికి జనించిన బిడ్డ నంజనీ తనయుడందురు. మరి నాకేమి ఫలమున్నది ? అని ప్రశ్నింపగా శివుడు ఇట్లు పలికెను ఓ వాయుదేవా ? అంజనీ తనయుడు వాయు పుత్త్రుడనియు ప్రసిద్ధి బడయగలడని వరమొసంగి పరమేశ్వరిని వెంటనిడుకొని వెడలిపోయెను.

అంత వాయుదేవుడు ఆకులోనున్న శివ వీర్యము నంజనీదేవి దోసిలిలో వేయగా నామె పండని మ్రింగివైచినది. శివ వీర్య ప్రభావము వలన అంజనీదేవి గర్భవతియై కోరికలధికమై తపము చాలించి తిరుగజొచ్చినది. అటునిటు తిరుగుచున్న యంజనిని

చూచి మందర పర్వతము బెదురుతో నిట్లనెను. ఓ యంజనీ! నీ గర్భమున గల బాలుని భారము దుస్సహముగానున్నది. నా మనవి విని నీవు వేరొక చోటునకేగుమని వలుకగా అంజని వాయు దేవుని సహాయమున మేరు పర్వతము చేరి యొక సానువున గూర్చుని మాధవుని పాదపద్మములు హృదయమున నిల్పుకొని ధ్యానించుచు నొకనాడొక వానర కిశోరమును ప్రసవించెను.

శ్రీహరి వెంటనే యామెకు ప్రత్యక్షమై దివ్యపదమొసంగెను అంజనీదేవి విమాన మధిరోహించి వైకుంఠమునకేగుచుండగా ఆమె బిడ్డఆకలితో బాధపడుచు తల్లిని విడువక ప్రార్థింపగా ముగ్గిన పండ్లు తిని యాకలి తీర్చుకొనుమని చెప్పి యామె వైకుంఠమునకేగెను.

అంత నా వాయునందనుడుదయించుచున్న సూర్యబింబ మును చూచి పండని భ్రమించి తినుటకై మింటికెగయగా సూర్యుడు బెదిరి బ్రహ్మను ప్రార్థింపగా విరించి సూర్యున కడ్డ ముగా నిలిచెను. ఆంజనేయుడు తన కడ్డముగా నిలిచిన బ్రహ్మను తోకతో కట్టివేసి సూర్యుగి పట్టబోవుట చూచి యిందుడ్రుడు వజ్ర ముతో నాంజనేయుని కొట్టెను. వెంటనే యాంజనేయుడు తెలివి తప్పి నేలగూలగా వాయుదేవుడు చూచి దుఃఖముతో పర్వత గుహలో దాగెను. అన్ని లోకములకు ప్రాణము వంటి వాడైనం దున జగత్ప్రాణుడని పిలువబడు వాయుదేవుడు చలనము మాని గుహలో ప్రవేశింపగా సమస్త ప్రాణికోటియు చలనముడిగి యుండెను.

దేవతలెల్లరును బ్రహ్మతో గూడి కైలాసమునకేగి యీశ్వరు నకు మ్రొక్కి దేవా! వాయువు సంచారము మాని పర్వత గుహలో దాగి యుండుట వలన లోకములోని ప్రాణులన్నియు దుఃఖించుచు దీనాలాపములాడుచున్నవి. ఆలింపుమని ప్రార్థింప శివుడు దేవతలారా! మీరు వాయు కుమారుని బాధించిరి. కావున

వాయువా రీతిగా జేసెను. మీరు వాయుసుతుని కడకేగి యుపచారములు చేసి తెలివి రప్పించి వరములిచ్చి వృద్ధి పొందింపవలెను. వాయుసుతుడు రామకార్యము నిమిత్తమై రక్కసులను దునిమి దేవతలకు మేలు గూర్చునసిన వెంటనే బ్రహ్మాది దేవతలు వాయుసూనుని మూర్ఛదేర్చి తీసికొని రావలెనని తలచి వచ్చుసరికి అతడు చైతన్యము కోల్పోయి రాతిపై పడియుండెను. అంత దేవతలు వానిపై నమృతము చిలికిరి. వెంటనే అంజనేయుడు నిద్రలేచినట్లుగా కదలి లేచి కొండపై గూర్చుండెను.

బ్రహ్మేంద్రాది దేవతలు సంతోషముతో వాయుదేవుని కుమారుని దీవించి పెక్కు వరములొసంగిరి, వాయుదేవుడు సంతసముతో గుహ వెలువడి వచ్చెను. జనన సమయమున రాతిపై బడి హనువు (దవడ) నలుగుట వలన హనుమంతుడనియు నామకరణము చేసిరి. బ్రహ్మ హనుమంతుని దగ్గరకు పిలిచి శ్రీహరి సూర్య వంశమున శ్రీరాముడై యవతరించును. నీవు రాముని బంటువలె సేవించి దేవతలకును లోకములకును మేలు చేయుము అని పలికి కవచకుండలముల నొసగి కిష్కింధకేగి సుగ్రీవుని కడ నుండుము. అచటకు శ్రీరాముడరుదెంచును. ఈ కవచకుండలములు రామునకు దక్క యన్యులకు గోచరింపవు. నీ తోకతో నన్ను బంధించితివి కావున నీవొకానొక సమయమున బ్రహ్మాస్త్రము చేత నిమిష కాలము బంధింపబడుదువు. నీ కవసరమైనపుడు మధువు, ఫలములు నీ దగ్గరకే వచ్చునని వరమొసంగెను. తరువాత బ్రహ్మేంద్రాది దేవతలు తమ తమ నిలయములకేగిరి. అని కౌశికుడు చెప్పగా విని శ్రీమురాడు సంతసించెను. రాజకుమారులారా! ఈ కథలతో చాల ప్రొద్దు పోయినది విశ్రమింపుడని పలికి తానును విశ్రమించెను.

ఉదయముననే లేచి విశ్వామిత్రుడును రామలక్ష్మణులును నిత్యకృత్యములు దీర్చికొని కూర్చుండిరి. ఆ సమయమున కొందరు బాటసారులు తమలో తాము చెప్పుకొను మాటల వలన మిథిలాధిపతి యగు జనక మహారాజు తన యింటనున్న శివుని విల్లును విరచిన వానికి సీతనిచ్చి పరిణయమొనరింతునని చాటించిన విషయమును విశ్వామిత్రుడు గ్రహించి రామలక్ష్మణులను చూచి మనము మిథిలకేగి శివుని విల్లు చూచి వత్తమని పలికెను. రామలక్ష్మణులు ధనుర్బాణములు చేతబూని విశ్వామిత్రుని వెంట పయనమైరి.

మిథిలకు రామలక్ష్మణులతో విశ్వామిత్రుడరుదెంచుట విన్న జనక మహారాజు విశ్వామిత్రుని దర్శించి మొక్కి దశరథ తనయుల మొక్కులందుకొని నిజ మందిరమునకు తోడ్కొనిపోయి యర్ఘ్యపాద్యాదులొసంగి సుఖాసనాసీనుల గావించి యిట్లు పలికెను మునీంద్రా! చిరకాలము నుండి మా యింట పూజలందుచున్న శివుని విల్లు విరచిన వానికి నా తనయ యగు జానకినిచ్చి పరిణయ మొనరింతునని యెల్లెడల చాటించితిని పెక్కు మంది రాజకుమారులరుదెంచి యా విల్లు చేతులతో కదల్చనైన కదల్చలేక పోయిరి. అని పలుకగా విశ్వామిత్రుడు మిథిలాధీశ! సూర్య వంశ సంజాతులైన యీ దశరథ తనయులు మేటి విలుకాండ్రు, నేను చేయు యాగమున నెత్తురు చల్లి మాంసము వేసి జ్వాలలార్పి దుష్ట రాక్షసులు యాగమునకు విఘ్నము కలిగించుచుండనా క్రూర రాక్షస సంహారమునకై యీ రామలక్ష్మణులను తోడు తెచ్చితిని. గుణశాలురు భుజబల సంపన్నులు నైన యీ రాజకుమారులు రక్కసుల జంపి నా యాగమును కాపాడి నాకును మిగిలిన మునులకును మోదము గూర్చిరి.

ఈ రాముడు శిలగా పడియున్న యహల్యనకు శాప విమోచనము కలిగించి యానందము గూర్చెను. సీతా స్వయంవరము గూర్చి విని రాజకుమారులను తోడ్కొని వచ్చితిని. జనక మహారాజ! శివ ధనుస్సును నీవు ఈ సభలోనికి తెప్పించిన యెడల రాజకుమారులు వీక్షింతురని పలుకగా జనకుడు సంతసించి భటులను పిలిచి శివ ధనుస్సు తెండని యాజ్ఞాపింపగా పది వేల మంది కింకరులేగి విల్లు దెచ్చిరి. జనకుడా శివుని విల్లునకు మ్రొక్కి మునీంద్రా! ఈ విల్లు విరిచిన వానికి జానకి నిత్తునని ప్రతిన జేసితిని. అని పలికెను.

అంత శ్రీరాముడు విశ్వామిత్రుని యనుమతి గైకొని శివ ధనుస్సునకు మ్రొక్కి విల్లు పైకెత్తి నారి సంధించి ఏనుగు చెఱకును విరచినట్లు అవలీలగా విల్లు విరచెను. ఆ ధ్వనికి భూమి కంపించినది. సభ్యులదిరిపడిరి. జనకుడు పట్టరాని యానందముతో రాముని కౌగిలించుకొని కౌశిక మునీంద్రునకు మ్రొక్కి పలు రీతులుగా వినుతించెను.

సీతా రాముల కల్యాణమునకై జనకుడు విశ్వామిత్రునితో మంతనములాడి దశరథుని బంధు మిత్ర పరివారముగా నాహ్వనించి తీసికొని వచ్చుటకై తగిన బ్రాహ్మణుల నయోధ్యకు బంపెను. దశరథ మహారాజు జనకుని యాహ్వనమునంది వసిష్ఠాది మునులతో బంధుమిత్ర పరివారముతో తరలి పదునేడు దినములకు మిధిలా సమీపోద్యానమున కరుదెంచిరి. పెండ్లివారి రాక విని జనకుడు ఎదురు సన్నాహములు చేసి మంగళవాద్యములు మ్రోగుచుండ నగరములోనికి తోడ్కొనివచ్చి తగిన విడిదులేర్పాటు చేసెను. అట్లు విడిసియున్న దశరథుని గాధేయుడును రామలక్ష్మణులును దర్శించిరి. దశరథుడు విశ్వామిత్రునకు మ్రొక్కి తనయుల నాలింగనము చేసికొని యమితానంద భరితుడై యుండగా

విశ్వామిత్రుడు రామలక్ష్మణులను తీసికొని వనమునకు బయలు దేరినప్పటినుండియు జరిగిన వృత్తాంతమును దశరథునకు వివరించి చెప్పి సంతసము కలిగించెను.

సీతను రామునకు ఊర్మిళను లక్ష్మణునకును మాండవిని భరతునకును శ్రుతకీర్తిని శత్రుఘ్నునకు నొసంగి జనక చక్రవర్తి మహా వైభవముగా పరిణయము లొనరించెను. వివాహానంతరము దశరథుడు విశ్వామిత్రుని యనుమతి బడసి కొడుకులతో కోడండ్రతో నయోధ్యకు బయలు దేరెను. మార్గ మధ్యమున పరశురాము డడ్డువచ్చి నిలచెను. దశరథుడు రథముదిగి దీనుడై పరశురామునకు మ్రొక్కి నీవు చెప్పినట్లుగా నా పెద్ద కుమారునకు నీ పేరే పెట్టితిని. మాపై నాగ్రహింపకుము అని మరల మరల మ్రొక్కుచున్న తండ్రిని చూచి శ్రీరాము డిట్లు పలికెను. తండ్రీ! ఆయుధము దాల్చిన విప్రుని పూజింపరాదు. కాన పరశురాముని పూజింపకుమని పలికెను. రాముని పలుకు లాలకించి పరశురాముడు పండ్లు పటపట కొఱకుచు కన్నుల నిప్పులు రాల్చుచు రాముని చూచి ఓయి చీకిపోయిన శివధనుస్సు విఱచుట గొప్ప కాదు, ఈ విల్లు విరిచి నీ సామర్థ్యము నిరూపించుకొనుము. దీనిని విరువజాలనిచో నిన్ను సంహరింతునని పలుకగా శ్రీరాముడు పరశురాముని చేతినుండి విల్లు దీసికొనుచు మున్ను విష్ణు వొసంగిన బలమంతయు లాగుకొనెను. భార్గవరామ! విప్రులపై బాణము ప్రయోగింపరాదు. అమోఘమైన నా బాణమునకు లక్ష్యము చూపుమని పలుకగా చేతులు జోడించి పరశురాముడు నవ్వుచు భువినుండి దివికి నేను వేసిన మార్గమును నీ బాణ ప్రయోగముతో తొలగించివేయుము అని విన్నవింపగా రాముడట్లే చేసెను.

అంత పరశురాముడు రామునకు మ్రొక్కి రామచంద్ర! నీవు నా తపమునకు మెచ్చి విష్ణురూపమున నొసంగిన బలమంతయు మరల గైకొంటివి. నే నింక తపమొనరింతు ననుమతి నిమ్ము అని పలికి శ్రీరాముని యనుజ్ఞ బడసి వెడలిపోయెను.

దశరథాదు లెల్లరును రాముని సామర్థ్యమును కనులార జూచి ముదమంది వేనోళ్ళ గొనియాడుచు నయోధ్యానగరము చేరిరి అని చెప్పునంతలో మధ్యాహ్నమైనది. అంత నా బాలుడు గురుసన్నిధికేగ వలెనని పలుకగా శ్రీరాముడు వారికి మంచి బియ్యము నిప్పించి యుదయము తప్పక రావలెనుసుమా! యని మరల మరల పలుకుచు సెలవొసంగెను. బాలురందు కంగీకరించి వాయుదేవుని తోడ్పాటుతో క్షణములో మిథిలకేగి తాము తెచ్చిన బియ్యమును గురువగు వాల్మీకి మహర్షి కొసంగి అనుమతి బడసి తల్లి కడ కేగిరి. జానకి బిడ్డల కెదురేగి కౌగిలించుకొని తోడ్కొని వెళ్ళి భోజనముచేసిరని మార్కండేయుడు పాండవులకు తెల్పెను.

# విచిత్ర రామాయణము

## అయోధ్యాకాండము

అనంతర వృత్తాంతమును తెల్పుమని ధర్మనందనునకు మార్కండేయుడిట్లనెను. ధర్మజ ! సీతా తనూజులగు లవకుశులు ఆ రేయి గడిపి యుదయకాలమున నిత్యకృత్యములు దీర్చుకొని సాకేతపురమున కేగుచున్న సమయమున వాయుదేవు డాబాలురను క్షణములో నయోధ్యకు చేర్చెను. శ్రీరాము డంతకుముందే నిత్య కృత్యములు దీర్చుకొని సోదరులతోడను పురోహితామాత్యాదుల తోడను పేరోలగముండి సింహాసనారూఢుడై పౌరాణికుల కొఱ కెదురు చూచుచున్న సమయమున కొలువుకూటమున ప్రవేశించిన జానకీ తనయులనుగని దగ్గరకు పిలిచి యాలింగనము చేసికొని యుచితాసనాసీనులుగా నియోగించిన ఆ బాలురు వసిష్ఠమునీం ద్రునకు మ్రొక్కి యనుమతి గైకొని యాసీనులై యున్న సమ యమున వసిష్ఠ మునీంద్రుడిట్లనెను. బాలకులార ! దశరథాదు లయోధ్యాపురముజేరి. సకల సౌఖ్యము లనుభవించుచుండిరని పురాణము మీరు చెప్పితిరికదా ! తరువాతి కథాక్రమ మెట్టిదో వివరింపుడనిన ఆ బాలురిష్టదేవతా ప్రార్థనములుచేసి రాజేంద్రా ! కొన్ని దినంబులకు దశరథుడు శ్రీరాముని అయోధ్యాధిపతిగా చేయదలచి మంత్రులను రావించి శ్రీరామ పట్టాభిషేకమునకు వసి ష్ఠులవారు సెలవిచ్చిన రీతిగా అన్ని ప్రయత్నములు చేయుడని యాజ్ఞాపింప సుమంతుడను మంత్రి వసిష్ఠునిచేత ముహూర్తము నిర్ణయింపజేసి యన్ని సంభారములు సిద్ధపరచి యయోధ్య నలం కరింప జేసెను,

ఆ యలంకరణము చూచి మంథర యాశ్చర్యచకితయై యొక చెలినిచూచి యో చెలీ! అయోధ్యానగరము నింత చక్కగా నలంకరించుటకు కారణమేమని ప్రశ్నింపగా ఆమె కుబ్జయగు మంథరను చూచి కుబ్జా! శ్రీరామచంద్రునకు యువరాజ పట్టాభిషేకమట. అందుకే నగరమంతయు నలంకరించిరి. అని చెప్పగా మంథర కన్నీరు కార్చుచు మేడపై నున్న కైక కడకేగి సీవిక కౌసల్యకు దాస్యము చేయవలసిన దినము దాపురించినది నీ రూప వయోగుణ సంపదంతయు వ్యర్థమైనది. రాతిని నాతిగాచేసిన సీతాపతి చెప్పిన మాటలకు లొంగి నీతో మాట మాత్రమైన చెప్పకుండ నీ భర్త శ్రీరామునకు పట్టాభిషేకముచేయ నున్నాడు. రాముడయోధ్యాపతి కాగలడు. నీ కుమారుడు భరతుడును నీవును సేవచేసికొని జీవింపవలయును. ఇంతకును మహారాజ్ఞి యగుటకు సీత పసిడి పూలతో పూజచేసినది. సవతి కొడుకు రాజై రాజ్యమేలుచుండ తగుదుమని నీవును నీ కొడుకును జీవచ్ఛవములవలె జీవించుట కంటె చచ్చుట మేలు. అని పలుకుచున్న మంథర దుర్బోధలు తల కెక్కిన కైక మంథరను చూచి రాజు తలపెట్టిన శ్రీరామ పట్టాభిషేకమునకు ఆటంకము కలిగించు నుపాయమును తెలుపుమని కోరగా మంథర యిట్లు పలికెను.

అమ్మ! కైక! నీ మగడు నేటి సాయంకాలము నీ మందిరమున కేతెంచినప్పుడు నిబ్బరముగా నుండుము. నీవు మరచితివేమో! గుర్తుచేయుచున్నాను. వినుము ఒక పర్యాయము మహారాజు వెంట నీవు యుద్ధభూమికేగితివి దేవతలకు సహాయముగా నీ భర్త దైత్యులతో సమరము చేయుచుండగా రథ చక్రము సీల విరిగి రథము కూలనున్న సమయమున నీ యెడమ చేతి చిటికెన వ్రేలు సీలగాజేసి రథము పడిపోకుండా జేసితివి. శత్రువులను సంహరించిన పిదప నీ భర్త నిన్ను మెచ్చుకొని

రెండు వరములు కోరుకొనుమనగా నీ వప్పుడు కోరిక, అవసరమైన
ప్పుడు కోరుకొందునని పలికితివి. ఆ రెండు వరములలో నొక
వరముగా రాముడు 14 సంవత్సరము లరణ్యావాసము చేయుట
రెండవ వరముగా నీ కుమారుడగు భరతునకు రాజ్యాభిషేకమును
కోరుకొను మని బోధించెను.

మంధర చెప్పిన మాటలంగీకరించి కైక యాభరణములు
తీసివైచి మాసిన వలువలు దాల్చి కన్నీరు మున్నీరుగా విలపిం
చుచు చీకటింటిలో నేలపై పరుండెను. సాయంకాలము కైక మంది
రమునకు దశరథుడరుదెంచి కైక నెందును గానక వెదికి చీకటిం
టిలో కటిక నేలపై పడియున్న కైకను చూచి సమీపించి పలుకరిం
పగా కైక కోపముతో మారాడదయ్యెను. దశరథుడు కైకను పలు
రీతులుగా బ్రతిమాలెను. అంత కైక నాథ! నీవు పూర్వము నా
కొసగిన రెండు వరములు నా కిప్పుడొసగవలయును. అందుకు
నీ వంగీకరింపనిచో వెంటనే విసము ద్రావి ప్రాణత్యాగ మొనరిం
తునుఅనగా దశరథుడు కాంతా! ఇంతమాత్రమున కలుకయేల?
నీకు కావలసిన రెండు వరములు ననుమానింపక యిప్పుడే కోరు
కొమ్ము ఇచ్చెదననెను. అంత కైక నాథ! మొదటి వరముగా
శ్రీరాము డరణ్యమున 14 సంవత్సరము లుండవలెను. రెండవ
వరముగా నా కుమారుడగు భరతుని రాజుగా చేయవలెనని కోరెను.
ఆ కోరికలు విన్నంతనే దశరథుడు తెలివితప్పి పడిపోయెను. కొంత
సేపటికి దశరథుడు లేచి నిశ్చేష్టుడై కూర్చుండెను.

అంత కైక రాజాజ్ఞయని చెప్పి రాముని రావింపగా
శ్రీరాముడు తండ్రికి మ్రొక్కి నిలబడెను. కైక శ్రీరాముని
చూచి రామ! నీవు 14 సంవత్సరము లరణ్యావాసము చేయవలె
ననియు భరతునకు పట్టాభిషేకము చేయవలెననియు మీ తండ్రి

నిశ్చయించి నీ ముఖముచూచి చెప్పలేక యూరకుండెను అని పలుకగా శ్రీరాముడు చిరునవ్వు నవ్వి తండ్రి పాదపద్మములకు మ్రొక్కి సెలవు తీసికొని కైకతోడను కౌసల్యా సుమిత్రలతోడను తానుపదునాలుగేండ్లు అరణ్యవాసమున కేగుచున్నట్లుతెలిపి యనుమతి పొంది నారబట్టలుకట్టి ధనుర్బాణములు చేతబట్టి వనమున కేగనున్న సమయమున సీతయు లక్ష్మణుడును రాముని వెంట నడవికి బయలుదేరిరి: రాముడెంత వారించినను సీతా లక్ష్మణులు దాశరథివెంట నడవికేగుట మానలేదు. వారును నారబట్టలు కట్టి రాముని వెంట నరణ్యవాసమున కేగిరి. సీతా రామ లక్ష్మణులు అరణ్యమున ప్రవేశించి గంగా నదిని సమీపించి చల్లని నీరుగ్రోలి విశ్రాంతిగా నొక చెట్టునీడను గూర్చుండిరి.

కొంతసేపటి కచటకు గుహుడరుదెంచి సీతా రామ లక్ష్మణులను చూచి యాశ్చర్యపడి దగ్గరకు వెళ్ళి మ్రొక్కి నిలబడెను. రాముడు గుహునిచూచి మేము గంగా నదినిదాటి యావలి యొడ్డున కేగవలెను నావను సిద్ధము చేయుమని యాదేశింపగా గుహుడు రామ ! నీ పాదధూళిపడి యొకరాయి స్త్రీగా మారినదట నీవు నావనెక్కినయెడల నీ పాదధూళిపడి నావ స్త్రీగా మారిన యెడల నా వృత్తి పడిపోవును కావున నీ పాదములు కడిగి దుమ్ములేకుండ చేయుదు ననగా రాముడు ముసి ముసి నవ్వులు నవ్వుచు నంగీకరించెను. అప్పుడా గుహుడు స్వచ్ఛమైన గంగా జలముతో రాముని పాదములు కడిగి యాజలము శిరముపై చల్లుకొనెను. అప్పుడు శ్రీరాముడు గుహుని చూచి యిట్లు పలికెను. ఓయి ! నేను కృష్ణావతారమెత్తినప్పుడు నీ వుద్ధవుడవై పుట్టి నన్ను సేవించి ముక్తిబడయగలవని వరమొసంగెను. అంత నాగుహుడు సీతా రామ లక్ష్మణులను నావలోని కెక్కించి యావలి యొడ్డునకు చేర్చెను.

సీతారామలక్ష్మణులు నాటిరాత్రి భరద్వాజాశ్రమమునుండి మరునాడు చిత్రకూట పర్వతము సమీపమునగల వాల్మీకి మహర్షి యొక్క ఆశ్రమము చేరిరి. వాల్మీకి సీతా రామ లక్ష్మణుల కాతిథ్యమిచ్చి వారివృత్తాంతమును తెలిసికొని యచటకొంతకాలము నివసింపుడని కోరెను. సీతా రామ లక్ష్మణులు వాల్మీకి మాటను మన్నించి పర్ణశాలలు నిర్మించుకొని యచటే నివసింప జొచ్చిరి.

అక్కడ నయోధ్యలో దశరథమహారాజు పుత్ర వియోగ పీడితుడై నేలబడి దుఃఖించు చుండెను. అంతఃపుర స్త్రీలు అట కరుదెంచి దశరథుని చూచి దుఃఖింప జొచ్చిరి. కౌసల్య విలపించు చున్న దశరథ మహారాజునుచూచి నాథ ! క్షత్రియ ధర్మమును మరచి భార్యమాట కాదనలేక రాముని అడవికి పొమ్మని పంపివైచి యిప్పుడేడ్చుట యెందుకు ? అని ప్రశ్నింపగా దశరథుడు సాధ్వీ ! మండుచున్న కొఱవినెగద్రోయుట తగునా ? పూర్వము జరిగిన యొక వృత్తాంతముమ తెల్పెదను వినుము గురుభక్తుడు(శ్రావణుడు) అను ముని కుమారుడు దప్పికతో బాధపడుచున్న తల్లి దండ్రులకు నీరుదెచ్చుటకై కొలనునకేగి కమండలమును ముంచగా బుడ బుడమని ధ్వని కాగా అడవి యేనుగుల వేటకై వెళ్ళి పొదల మాటున పొంచియున్న నేను ఆ రాత్రి సమయమున కొలనులోదిగి యేనుగు నీరు త్రాగుచున్నదని భ్రమించి శబ్దభేది విద్యతో బాణమును ప్రయోగింపగా నా బాణము తగిలిన ముని బాలు డయ్యోయనుచు నేలకూలెను. వెంటనే నేనటకేగి మునివర! ఏనుగు నీరు త్రాగుచున్నదని తలంచి నిన్నుపడగొట్టి బ్రహ్మ హత్యచేసితిని. నన్ను మన్నించి శపింపకుమని ప్రార్థించితి ....

అంత నా మునిబాలుడు మహారాజ ! నేను దప్పికతో బాధపడుచున్న తల్లిదండ్రులకు నీరు తెచ్చి యిచ్చుట కరుదెంచి

యిచట కూలిపోతిని. నీవు వెంటనే మంచినీరు తీసికొనిపోయి నా తల్లిదండ్రులకిచ్చి దాహము దీర్చుము లేనిచో వారునిన్ను శపింతురు. భాధ సహింపజాలకున్నాను. కావున రొమ్మున గ్రుచ్చుకొన్న బాణమును తీసివేయుము. దానితో నాప్రాణములుపోయి బాధావిముక్తి కలుగును. అని నన్ను కోరగా నేనా ముని కుమారుని రొమ్మున గుచ్చుకొన్న బాణమును తొలగించితిని వెంటనే యతడు ప్రాణములు విడిచెను. నేను కమండలముతో జలము తీసికొని యంధులగు ముని దంపతులను సమీపింపబోగా అడుగుల సవ్వడినిబట్టి కొడుకరుదెంచెనని యెంచి నేనిచ్చిన జలము గ్రోలి నాయన ! ఇంత జాగుచేసితివేల ? అని ప్రశ్నించిన నేనా దంపతుల పాదములపై బడి పుణ్య దంపతులార ! నేను మీ కుమారుడను కాను. సూర్యవంశ క్షత్రియుడనగు దశరథుడను. ఏనుగు నీరు త్రాగుచున్నదని భ్రమపడి నీ కొడుకును పడగొట్టితిని. తెలియక చేసిన నా యపరాధమును మన్నించి నన్ను శపింపకుమని ప్రార్థించితిని.

నా ప్రార్థన మాలకించిన యా వృద్ధ దంపతులు తమను వెంటనే కుమారుని కట్టెకడకు తీసికొని పొమ్మని నన్ను కోరగా నేనట్లే యా వృద్ధులను పిల్లవాని మృత కళేబరముకడకు తీసికొని పోగా వారా బిడ్డ మృతదేహమును చేతులతో నిమురుచు రాజ ! దశరథ ! చితి పేర్చి మా కుమారునితోబాటు మమ్మును దహనము చేసి పున్నెము మూటగట్టుకొనుము. చివరి దశలో మేమెట్లు పుత్ర శోకపరితప్తులమై మరణించుచున్నామో అట్లే నీవును అవసాన కాలమున పుత్ర దుఃఖముతో పలవరించుచు మరణింతువని శపించి ప్రాణత్యాగ మొనరించిరి.

ఆ శాపమనుభవింపక తీరదని పలికి హా పుత్ర ! హా రామ!

అనుచు దశరథు డసువులు విడిచెను. దశరథుని భార్యలు భర్త కళేబరముపై బడి తలలు బాదుకొనుచు రొమ్ములు కొట్టుకొనుచు విలపింపసాగిరి. బంధుమిత్రులెల్లరరుదెంచి యా యిల్లాండ్ర నూరడించుచుండిరి. ఇంతలో వసిష్ఠుడరుదెంచి యుపశమన వచనములు పలికి మంత్రులను పిలిచి వెంటనే భరత శత్రుఘ్నులను రావింపుడని యాదేశించి దశరథుని కళేబరమును చెడిపోకుండ తైల ద్రోణిలో బెట్టించెను.

మంత్రులు గోప్యకుడు మున్నగు భటులను పంపి భరత శత్రుఘ్నులను రావించిరి. భరతుడు తల్లికడకేగి అమ్మా! రాజేడి? ఇల్లంతయు కళాకాంతులు లేకుండుటకు కారణమేమి? అని ప్రశ్నింపగా కైక కుమార! తొల్లి దేవదానవులకు సమరము సంభవించినప్పుడు మీ తండ్రి దేవతలకు సహాయముగా యుద్ధమున కేగుచు నా యభ్యర్థనమునంగీకరించి నన్నును రణభూమికి తోడ్కొనిపోయెను. ఆ యుద్ధమున నేను చేసిన సహాయమునకు సంతసించి మీ తండ్రి నాకు రెండు వరము లొసంగెను. నా కవసరమైనప్పుడు వరములు కోరుకొందునని నాడు వరములు కోరనైతిని. ఇప్పుడు ఆరెండు వరములలో నొక వరముగా రాముడకు 14 సంవత్సరములు వనవాసము రెండవ వరముగా నీకు పట్టాభిషేకము కోరితిని. రాముడు నా వరము ననుసరించి సీతాలక్ష్మణులతో వనవాసమున కేగెను. శ్రీరామునియందలి ప్రేమాతిశయముతో మీ తండ్రి తనువుచాలించెను. అని తల్లి చెప్పగా విని భరతుడు అయ్యో! తండ్రి! అని నేలబడి మూర్ఛపోయెను.

తల్లి చేసిన శైత్యోపచారములకు భరతుడు తెలివి తెచ్చుకొని

తేచెను. అప్పుడు కైక భరతునిచూచి కుమార ! పితృ కార్యములు నెరవేర్చి రాజ్యము నేలుము అని పలుకగా భరతుడాగ్రహోదగ్రుడై తల్లిని చూచి దురాత్మురాలా ! దైవ నిర్ణయము ననుసరించి నీ కడుపున బుట్టుట నా దురదృష్టము భర్తృఘాతిని వగునిన్ను చంపి ధర్మదేవతకు తృప్తిపొందింపవలెను కాని తల్లిని చంపుట మహాపాపమని పెద్దలందురు. కాన నిన్ను ప్రాణములతో విడుచుచున్నానని తీవ్రముగా పలికి కౌసల్యా సుమిత్రలున్న యెడకేగి పాదములపై బడి దుఃఖించుచుండ వసిష్ఠుడు సుమంత్రుడు మున్నగు పెద్దలరుదెంచి సాంత్వన వచనములు పలికి భరత శత్రుఘ్నుల నూరడించిరి.

అప్పుడు వసిష్ఠుడు తైలద్రోణిలోనున్న దశరథుని శవమునకు దహన సంస్కారములుచేసి శ్రాద్ధకర్మములు చేయుడనిపలికి యథావిధిగా శ్రాద్ధ కర్మలు జరిపించెను. పదునైదవ దినమున వసిష్ఠుడు భరతుని పిలిచి పట్టాభిషేకము చేసికొనుమని పలుకగా భరతు డంగీకరింపక సీతా రామ లక్ష్మణులను తోడ్కొని వత్తునని పలికి పురోహితామాత్య బంధు మిత్ర పరివారముతోడను తల్లుల తోడను వసిష్ఠాది మునిపుంగవుల తోడను బయలుదేరి గంగా తీరముచేరి గుహునివలన రామచంద్రుడేగిన మార్గము తెలిసికొని గంగదాటి యారేయి భరద్వాజాశ్రమమున నుండి భరద్వాజు డొనరించిన విందు స్వీకరించి మహర్షికడ సెలవు గైకొని చిత్రకూటాద్రి కరిగి వాల్మీకి మహర్షియొక్క ఆశ్రమ సమీపమున గల పర్ణశాలలోనున్న సీతా రాములను చూచి పాదములపైబడి నమస్కరించి లక్ష్మణు నక్కునజేర్చుకొని కన్నీరు మున్నీరుగా విలపించుచుండగా రామలక్ష్మణులును తండ్రి మరణవార్త విని మిగుల దుఃఖించిరి. వసిష్ఠుడు వారల నూరడించి రామ లక్ష్మణులచే పితృకర్మలు చేయించెను.

భరతుడు రాముని సమీపించి రామా ! మీ రయోధ్యకు తిరిగివచ్చి పట్టాభిషేకము చేసికొనుడు. మా తల్లిచేసిన నేరమును సైరింపుడుఅని వేడుకొనెను. రాముడు భరతునిచూచి తమ్ముడ ! సూర్యవంశమున జనించి మాటదప్పిన నెల్లరనిందలకు పాత్రము కాగలను. కావున నేను అయోధ్యకువచ్చి పట్టాభిషేకము చేసికొనను. నీవేగి రాజ్యమేలుము అని పలుకగా భరతుడెంత బ్రతిమాలినను రాముడు రాజ్యమేలుట కంగీకరింపకుండయ్యెను. అంత భరతుడు శ్రీరాముని పాదుకలు అడిగి తీసికొని గొడుగుపట్టి చామరములతో వీచుచు తెచ్చి రథముపై నుంచి రాముని యనుమతి గైకొని యయోధ్యకు బయలుదేరెను. రాజధానిని చేరి పాదుకలు సింహాసనమున నుంచి యయోధ్యలో శత్రుఘ్నునుంచి తాను నంది గ్రామమున నివాస మేర్పరచుకొని నారబట్టలుకట్టి జడలు దాల్చి ప్రజాపాలనము నిర్వహించుచుండెను.

అయోధ్యావాసులు తమను దర్శించుటకు తరచుగావచ్చుట చూచి శ్రీరాముడు సీతా లక్ష్మణులతోగూడి యాప్రదేశమునువిడిచి చిత్రకూట పర్వతమునకు దక్షిణ భాగమునగల గహనారణ్యమున పర్ణశాలలు నిర్మించుకొని నివసించుచుండెను. లక్ష్మణుడు నిద్రాహారములు విడిచి సీతారాములు నివసించు పర్ణశాల యెదుట నొకమంచె నేర్పరచుకొని ఖడ్గము ధనుర్బాణములుదాల్చి శార్దూలాది క్రూర మృగముల భీతిలేకుండునట్లు చేయుచు కాపాడుచుండెను. ఉదయముననే స్నానాది కృత్యములు నెరవేర్చుకొని యడవిలో తిరిగి మధుర ఫలములు మున్నగునవి తెచ్చి సీతారాముల కిచ్చుచుండెను. ఈ విధముగా లవకుశులు చెప్పుచున్న వృత్తాంతమును భరతుడాలకించి యాశ్చర్యముతో నిట్లు ప్రశ్నించెను. బాలులార ! లక్ష్మణుడు నిద్రాహారములు విడిచి 14

సంవత్సరము లెట్లుండెను ? లక్ష్మణునకు పెట్టక సీతారాము లాహారమెట్లు భుజించిరి ?

భరతుని ప్రశ్నవిని లవకుశులిట్లు సమాధానమిచ్చిరి. సీతారామ లక్ష్మణులు చిత్రకూటాద్రిపై నివాసమేర్పరచుకొన్న తొలి రాత్రి సీతారాముల రక్షణకై లక్ష్మణుడు కూర్చుని నిద్రా చిహ్నములుచూచి నిద్రకు కారణము కనురెప్పలేయని తలచి ఖడ్గము దీసి కనురెప్పలు కోసికొనబోవునంతలో వనదేవతలువచ్చి ఆ పని తగదని పలుకగా లక్ష్మణుడిట్లు ప్రశ్నించెను, వన దేవతలారా! నేను నిద్రించిన సీతారాముల నెవరుకాపాడుదురు ? సీతారాముల నట్లు విడిచి నేను నిద్రించిన లోకులు నవ్వరా ? అది సేవక ధర్మమా ?

లక్ష్మణుని ప్రశ్నవిని వనదేవతలు సౌమిత్రి ! సృష్టికర్త అన్ని ప్రాణులకును ఆహారనిద్రాదులు సమానముగనే కల్పించెను. ఆహారమొక్కటి విడిచిన మిగిలినవి లొంగిపోవును. అని పలుకగా సౌమిత్రి చిరునగవుతో నేను భోజనము మానివేయుదునని పలుకగా వనదేవత లిట్లనిరి. లక్ష్మణా ! నీవీ యరణ్యవాసము పూర్తి చేయు వరకును నీకాహార నిద్రాది వాంఛలు లేకుండునట్లు వర మిచ్చుచున్నాము. అట్లు వరమొసంగి వనదేవతలు మాయమైరి. అందువలన లక్ష్మణుడు నిద్రాహారాదులయం దేవిధమగు వాంఛ యులేకుండ నరణ్యవాసము చేయగల్గెను. తమకు లక్ష్మణుడు ఫలాదులు తానుభుజించిన తరువాతనే తెచ్చియిచ్చుచుండెనని భావించుటచేత సీతారాములు లక్ష్మణున కాహార మొసంగరైరి. లవకుశులు చెప్పిన వృత్తాంతము విని భరతుడు సౌమిత్రిని కౌగిలించుకొని సోదరా ! నీ భ్రాతృభక్తి యనన్య సామాన్యమైనది. నీ జీవనము ధన్యమైనది. అని ప్రశంసించెను. అని మార్కండేయుడిట్లు చెప్పదొడంగెను.

ధర్మజ ! లవకుశులు అనంతర కథ నిట్లు శ్రీరామ చంద్రు నకు వినిపించిరి. శ్రీరాముడు సీతాలక్ష్మణులతోగూడి తారాక్షు డను ముని ఆశ్రమమునకేగి పర్ణశాలలు నిర్మించుకొని సుఖముగా నుండిరి. చిత్రసేనుడను గంధర్వుడు సీతనుచూచి మనసులో వికారముపుట్టి కాకియై చెట్టుపై పొంచియుండి యవకాశముచూచి సీత రొమ్ములు గోళ్ళతో రక్కెను. నెత్తురుగారుచుండ సీత విల పించుచు రాముని కడకు పరుగిడెను. రాముడు కారణమడుగగా సీత కాకినిచూపి దానివలన తనకీ కష్టమువచ్చినదని చెప్పెను.

శ్రీరాము డాగ్రహముతో ప్రక్కనున్నగడ్డిపరకదీసి బ్రహ్మా స్త్రముగా నభిమంత్రించి కాకిపై ప్రయోగించెను. బ్రహ్మాస్త్రము నుండి భయంకరాగ్నిజ్వాలలు బయలుదేరి కాకిని చుట్టుముట్టినవి. కాకి రూపముననున్న యా గంధర్వు డింద్రాది దేవతలను సమీ పించి కావు కావు (రక్షింపు రక్షింపు) అని యరచుచుండెను. అప్పు డింద్రాది దేవతలు కాకినిచూచి కాకమ ! రాముడు తప్ప నిన్ను కాపాడగల వారెవ్వరులేరు, కావున రామునే శరణువేడుమని సలహా చెప్పిరి. అంత నాకాకి రాముని సమీపించి పాదపద్మము లపైబడి శరణువేడగా రాముడా కాకిని చూచి నీవు కపటమువిడిచి నీ నిజవిషయమును వివరించి చెప్పుమని యడిగెను. రామచంద్ర! నేను చిత్రసేనుడను గంధర్వుడను. వన విహారమునకై వచ్చి సీతా సౌందర్యము జూచి ముగ్ధుడనై మన్మధ వికారమునకులోనై యపచారము చేసితిని. నా యపరాధమును మన్నించి వేరుగా దలంపక నన్ను కాపాడుము అని వేడుకొనగా శ్రీరాము డోయి ! అమోఘమైన బాణమునకు నీ యిష్టమువచ్చిన యింద్రియమొకటి సమర్పించిన ప్రాణదానము చేయుదును. నీవు పిండప్రదానము చేసిన యన్నమును తిని జీవింపుము అని యాదేశింపగా కాకి

తన కన్ను సమర్పించెను. అప్పటినుండియు కాకులొంటికన్నుతో బ్రతుకు వెళ్ళబుచ్చుచున్నవి.

కొంతకాలమునకు తారాక్ష మౌని శ్రీరాముని సందర్శింప నరుదెంచెను శ్రీరాము డెదురేగి మునీంద్రునకు స్వాగత సత్కార ములుచేసి అర్ఘ్యపాద్యాద్యు లొసంగి పూజించెను. శ్రీరాముని పూజలు స్వీకరించి మునిచంద్రు డిట్లు పలికెను. రామ ! దాన వులు మాయావులు, పలు రూపములు దాల్చి మోసగింతురు. నే నీ విషయమున నొక కథ తెల్పెద నాలకింపుము.

తొల్లి సూర్యవంశమున శత్రుజిత్తను దొడ్డరాజు కలడు. వానికి సర్వ లక్షణ సంపన్నుడైన కొడుకు పుట్టెను. వానికివశిష్ఠుడు ఋతుధ్వజుడని నామకరణము చేసెను. ఋతుధ్వజు డరువది నాలుగు కళలందు నైపుణ్యము సంపాదించెను. మిగుల సుందరు డగు నతడు తనకు నచ్చిన పిల్లను కాని పరిణయ మాడనని భీష్మించెను.

పాతాళ లోకమున అశ్వస్థుడను సర్పరాజునకు శోక విశోకు లను నిరువురు కుమారులు కలరు. కామరూపులగు నా శోకవిశోకులు బ్రాహ్మణ రూపము దాల్చి భూలోకమున తిరుగుచు ఋతుధ్వజుని గాంచి వాని గుణములు మెచ్చుకొని ప్రతిదినమును ఉదయమున విప్రరూపమున ఋతుధ్వజుని సందర్శించి సాయంకాలమునకు పాతాళముచేరి తల్లి దండ్రులకడకేగు వారు.

గాలవుడను మునీంద్రు డొకనాడు కువలయమను నొక యశ్వమును శత్రుజిత్తుకడకు తెచ్చెను. శత్రుజిత్తు గాలవముని కర్ఘ్యపాద్యము లొసంగి పూజించి యుచితాసనా సీనుగావించి యిట్లనెను. మునీంద్రా ! బ్రాహ్మణు లెల్లరు సుఖముగా నున్నారా ? రాక్షస బాధలేదుకదా ! యాగములు నిరంతరాయ

ముగా సాగుచున్నవా ? ఆ మాటలు విని గాలవుడు రాజ! రాక్షస బాధ మిక్కుటముగా నున్నందువలన మునులు తమ తమ యాశ్రమములు విడిచి పర్వత గుహలలో దాగిరి. నా తపశ్శక్తి వలన రాక్షసులను నాశనముచేయగలను కాని తపము వ్యయమైపోవునని యాలోచించుచుంటిని. పరమేశ్వరుడు బ్రాహ్మణ ధర్మ పరిరక్షణకే క్షత్రియులను సృజించెను. మీ కుమారుని నా కప్పగించిన యెడల నీ కుమారునకొక యశ్వము నొసంగి వానిచే రాక్షసులను నాశనము చేయింతునని పలుకగా శత్రుజిన్మహారాజిట్లు వచించెను. మునివర్య! ఈ యశ్వము మీకెట్లు లభించినది ? దీని నధిరోహించిన శత్రువులను దునుమగల శక్తి యెట్లు లభింపగలదు ? నా సందియము దీర్పుము.

అంత నా గాలవుడు రాజ: రాక్షస బాధ మిక్కుటమైనది కదాయని నిట్టూర్చుచు నాకాశమును చూచుచుండగా నా నిట్టూర్పు వలన నీ హయము జనించినది. నా తపశ్శక్తివలన దీనికి మనో వేగముతో ముల్లోకములు సంచరించగల శక్తి లభించినది. దీని నారోహించిన వారి కపజయము కలుగదు. అని వివరింపగా శత్రుజిత్తు సంతసించి అత్మజుడైన ఋతుధ్వజుని పిలిచి యీ మునీశ్వరుని యానతి ననుసరించి మునీశ్వరుడు చెప్పిన కార్యమును నెరవేర్చి రమ్ము అని యాదేశింపగా ఋతుధ్వజుడు విల్లమ్ములుదాల్చి యశ్వారూఢుడై మునివెంట వాని యాశ్రమమునకేగి ఆ వనగిరి దుర్గంబులందును మునుల యాశ్రమంబులందునుగల నిశాచరుల నెల్లరను నైదు దినములలో దునిమివైచెను. రాక్షస బాధ విరగడైనందుకు గాలవాది మునులు సంతసించి ఋతుధ్వజుని ప్రశంశించి తపస్స్వాధాయనిరతులై సుఖముగా నుండిరి.

తాళకేతుడను దైత్యుడు కోటిమంది దైత్యులను వెంటనిడు కొన్ని పాతాళమునుండి మునుల గుండెలు బెదరునట్లుగా వచ్చి ఋతుధ్వజున్ని చూచి ఓహో రాజ! యుద్ధముచేయగల నేర్పుగలదని గర్వించి గుఱ్ఱమెక్కి తిరుగుచుంటివా? నాకు చిక్కితివి. ఎందు బోగలవు? నిన్నుపట్టి వధింతును నిలచి నా శక్తి సామర్థ్యములు రుచిచూడుము అనుచు పెక్కు బాణములు ప్రయోగించెను. ఋతుధ్వజుడు తాళధ్వజుని దేహమున వాడి బాణములు నాటెను. అంత నా రక్కసుడు పందియై నేల బ్రవేశించెను.

ఋతుధ్వజుడు రాక్షససైన్యమంతయు సంహరించి అశ్వారూఢుడై తాళకేతుడేగిన మార్గమున పయనించి సాహసముతో పాతాళమున ప్రవేశించెను. తాళకేతుని కొఱకు పాతాళము నంతయు పెక్కు పర్యాయములు వెదకి కానలేక యొక వనములో బడి తిరుగుచు పసిడి మంటపము మధ్యనున్న మణిమయ సింహాసనముపై అసీనురాలై యున్న యొక కన్యను చూచి మోహపరవశుడై యామెను సమీపించి వనితా! నీ వెవ్వరిదానవని ప్రశ్నించెను. ఆ వనితయు మన్మధాకారుడగు నారాజును చూచి మోహపరవశురాలై యీ రాజెవ్వడో కదాయని చింతించి దిగ్గనలేచి సిగ్గుతో మోమువంచి సమాధానమీయజాలక చేరువనున్న చెలికత్తెకు కనుసైగ చేసెను.

ఆ చెలికత్తె రాజుతో నిట్లనెను రాజ! ఈ కాంత విశ్వావసువను గంధర్వుని తనయ ఈమె రూపగుణ సౌశీల్యములుచూచి విరించి యీమెకు సాటియగు బోటి యీ రేడు లోకములలోలేధని యెంచి యీమెకు మదనసాయక యని నామకరణము చేసెను. నేను సుమేరు పర్వతమున అనంతునకు జనించితిని, నా పేరు కుండలి. ఈ దమనసాయకతో చెలిమిచేసి పరిణయ పర్యంతము వెంటనుందునని మాట యిచ్చితిని. అది యిప్పుడు నెరవేరునని

తోచుచున్నది. ఈ మదన సాయకకు నీయందనురాగ మున్నట్లు తోచుచున్నది. నీకును ఈమె యందనురాగమున్న యెడల నీ నివాసము కుల గోత్రములు మున్నగు వివరములు తెల్పుమనిన కుండలికి ఋతుధ్వజు డిట్లు సమాధాన మిచ్చెను.

వనితా ! సూర్యవంశీయుడగు శత్రుజిత్తను రాజు సాకేత పురము నేలుచుండెను. అతడు నా తండ్రి. నా పేరు ఋతు ధ్వజుడు. గాలవ మునీంద్రుడు రాక్షసబాధ నివారణకై మా తండ్రి నడిగి నన్ను తోడ్కొని వచ్చెను. నేను శత్రువులగు రక్కసులను పరిమార్చుచుండ తాళకేతుడను రాక్షసుడు భూమిలో ప్రవేశించి పాతాళమున కరుదెంచెను. వానిని వెదకుచు నేనిచటకు వచ్చితిని. అ దానవుడు కానరాలేదు. కాని మీ రిరువురు కనుపించిరి.

ఋతుధ్వజుని పలుకు లాలకించి కుండలి రాజేంద్ర ! మదన సాయకకును నీకును పరిణయమొనరించి తీర్థయాత్ర కేగుదును. అని పలుకగా ఋతుధ్వజు డిట్లని పలికెను. వనితా ! పితృదత్త యగు కన్య సకల వ్రతములకు పంచ మహా యజ్ఞములకు దేవ తార్చనలకు ముని సపర్యలకు దానాది సత్కార్యములకు యోగ్య రాలగునని పెద్దలు పలుకుదురు. కావున మదనసాయకను పరిణయ మాడుటకు నా మనసు సందియ పడుచున్నది. అని పలుకగా కుండలి రాజ ! ఈ మదనసాయక తండ్రియగు విశ్వావసువు కుల గురువగు తుంబురుడిపు డిచటనే యున్నాడు. నేను తుంబురు నిటకు రావింతును. తుంబురుడు మీ కిరువురకును పాణిగ్రహణము చేయును అని పలికి యామె తుంబురుని ముమ్మారు తలచినంతనే యతడరుదెంచెను. రాజా మునికి మ్రొక్కి నుతించెను. కుండలి తుంబురునకు నమస్కరించి విషయ మంతయు వివరించెను. తుం

బురుడు సంతసించి మదనసాయకను ఋతుధ్వజునకిచ్చి యథా విధిగా పెండ్లిచేసి వెడలిపోయెను. కుండలియు మదనసాయకకు హితోక్తులు పలికి తీర్థ యాత్రల కరిగెను.

ఋతుధ్వజు డశ్వారూఢుడై మదనసాయకను వామాంక మున గూర్చుండబెట్టుకొని స్వస్థానమున కరుగుచుండెను. ఆ విష యమును తాళకేతుడు తెలిసికొని యుద్ధ ప్రయత్నములతో వచ్చి యెదిరింపగా ఋతుధ్వజు డతితీవ్రమైన వేయి బాణములు ప్రయో గించి వానినిదునిమి, పాతాళము వెలువడి భూలోకమున కరుదెంచి గాలవమునీంద్రుని చూచి జరిగిన వృత్తాంతమును తెలిపిన ముని సంతసించి రాజేంద్ర! నీ వయోధ్యకేగి ఆరుమాసముల కొక పర్యాయము నా సన్నిధికి వచ్చుచుండుమని సెలవిచ్చి వీడ్కొలు పగా అతడు భార్యా ద్వితీయుడై సాకేతనగరమునకేగి తండ్రికి మ్రొక్కెను. శత్రుజిత్తు కుమారుని వలన విషయమంతయు విని సంతసమును వెలిబుచ్చెను. మదనసాయక అత్తయగు పద్మరేఖకు నమస్కరింపగా ఆమె కోడలిని గ్రుచ్చి కౌగిలించు కొనెను. ఎల్ల రును సుఖముగా నుండిరి.

తాళకేతుని తమ్ముడగు తుల్యకేతుడను దైత్యునిచేరి బంధు వులు తమ యన్నను చంపిన ఋతుధ్వజుని చంపుమని ప్రోత్స హించిరి. అంత నా తుల్యకేతుడు బంధువులతో నిట్లు పలికెను. నా యన్నను కయ్యమున సంహరించిన ఋతుధ్వజునకు దైవమే యడ్డువచ్చినను సంహరించి తీరుదును. అని ప్రతినజేసి తాను ముని వేషము దాల్చి గాలవుడు తపమొనరించుచున్న యాశ్రమ సమీపమునందలి తటాకతీరమున ఆశ్రమము నిర్మించుకొని నియమ నిష్ఠలతో గూడిన మునివలె తపమొనరించు చుండెను.

కొంతకాలము గడచిన పిదప ఋతుధ్వజుడు గాలవ మునీంద్రు నొక పర్యాయము దర్శించి రావలెనని నిశ్చయించు

కొని మంత్రులకు తెలిపి యశ్వారూఢుడై గాలవ మునీంద్రుని యాశ్రమమునకేగి మునీంద్రుని పాద పద్మములకు మ్రొక్కెను. గాలవ మునీంద్రుడు తనను సందర్శించిన ఋతుధ్వజునిచూచి కుశల సమాచారమడిగి యతిథి మర్యాదలుచేసి వన్యాహారమిడెను. ఆ రాత్రి యచట నిద్రించి మరునా డుదయమున కొలనులో స్నానముచేసి అనుష్ఠానములు నెరవేర్చుకొని మునీంద్రుని సెల వడిగెను. గాలవ మునీంద్రుడు రాజుని దీవించి జాగరూకుడై యేగుమని పలికెను.

ఋతుధ్వజుడు హయారూఢుడై వెడలుచు నరణ్య మధ్య మున మునివేషమున తపమొనరించుచున్న దానవునిచూచి గుఱ్ఱము దిగి పూర్వమిచట మున్యాశ్రమము కాని మునీంద్రుడు కాని కాన రాలేదు దైవానుగ్రహమున క్రొత్త మున్యాశ్రమమును క్రొత్త మునీంద్రుని చూడగల్గితిని అని సంతసించి కపట మునియని తెలి యక భక్తితో మ్రొక్కెను. మాయామౌని ఆదరము నటించుచు నేర్పుతో నిట్లనెను. రాజ ! నీ గుణములకు సంతసించితిని. నీ వంశము నీ నివాసము నీ నామధేయము తెలియజేయుమనిన రాజిట్లనెను. మునీంద్రా ! నేను సూర్యవంశ రాజును నా పేరు ఋతుధ్వజుడు. నివాసమయోధ్యఅని వినయముగా విన్నవించెను.

అంత నా కపటముని రాజ ! వరుణుని కడ నాకొకపని వచ్చినది. నేను వెళ్ళెదను. నేను తిరిగి వచ్చువరకును ఈ యాశ్రమమును ఇచటనుండి నీవు కాపాడవలయును. అని కోరగా ఋతుధ్వజుడు సంతసముతో మునీంద్రా ! నీవు తిరిగి వచ్చువర కును నీ యాశ్రమమును నేను జాగ్రత్తగా కాపాడెదను. నీ పనిని చక్కజేసికొని రమ్ము అని పలికెను. అంత నా కపటముని రాజ ! నీ కంఠహారమును నా కిమ్ము. వరుణుని సందర్శించి వచ్చిన పిదప నీ హారమును నీ కిత్తును. అని పలుకగా వెంటనే ఋతు

ధ్వజుడు తన మెడలోని కంఠహారమును కపటమునికొసంగెను. కపటముని యా హారమును మెడలోదాల్చి కొలనులో ప్రవేశించెను

ముని వేషమునువీడి తుల్యకేతుడు కొలనుయొక్క పడమటి దిక్కునుండి బయటకువచ్చి బ్రాహ్మణవేషము దాల్చి సాకేతనగర మేగి భర్త రాక కెదురుచూచుచున్న మదనసాయక కడకేగి సాధ్వీ! నీనాథుడు దానవులతో సమరమొనరించి నిహతుడయ్యెను. మరణ సమయమున దగ్గరనున్న నన్ను చేరబిలిచి యీ హారమునాకిచ్చి తన మరణ వృత్తాంతమును నీకు తెల్పుమని కోరగా వచ్చి ని. నీవు పతివ్రతవు. కావున పతికి పరలోక కృత్యములు చేయింపు మని యానవాలుగా హారమును చూపగా మదనసాయక భర్త మెడలోనుండు హారము మునికడచూచి మూర్ఛపడి ప్రాణములు విడిచి గౌరీలోకమును చేరెను, రాజగు శత్రుజిత్తు కోడలగు మదనసాయకకు దహన సంస్కారము గావించెను.

అంత నా కపట బ్రాహ్మణుడు చని కొలనునుండి వెలువడి ఋతుధ్వజుని సమీపించి రాజ! నీ దయవలన నా కార్యము నెరవేరినది. నీ హారము నీవు తీసుకోమని యొసంగిన రాజు హారమును మెడలో ధరించి ముని దగ్గర సెలవు తీసికొని యశ్వా రూఢుడై తన నగరమును చేరెను.

పుత్త్రుని రాకచూచిన శత్రుజిత్తు పోయిన ధనము చేజిక్కి నట్లును, పేదకు పెన్నిధి లభించినట్లును సంతసించి పురోహితా మాత్యులతోగూడి యెదురేగి కుమారునింటికి తోడ్కొనివచ్చి జరిగిన విషయమును పూసగ్రుచ్చినట్లు వివరించిరి. భార్య సహగమన వార్త విన్న ఋతుధ్వజుడు మూర్ఛపోయి వసిష్ఠుని యుపదేశము వలన తెలివి తెచ్చుకొని కన్నులు తెరచి కన్నీరు కార్చుచుండెను.

ఋతుధ్వజుని దుఃఖమునుచూచి సర్పరాజు కుమారులగు

శోకవిశోకు లెప్పటివలె విప్రాకారములతో వచ్చి యతని వెతజూచి తామును వగచి ధైర్యవచనములు పలికినను ఋతుధ్వజుడూరట చెందక తన దుఃఖమును మరల మరల వెలిబుచ్చుచుండ ఆ శోక విశోకులు సాయంకాలము వరకు ఋతుధ్వజుని దగ్గర నుండి రాత్రికి నాగలోకముచేరి యాహారముమాని పవళించిరి.

శోక విశోకుల తండ్రియగు నశ్వస్థుడు తిండిమాని పరుండిన తన కుమారులను చూచి కారణమేమని యడిగిన వారుతండ్రితో ఋతుధ్వజుని వృత్తాంతమును తెలిపి తండ్రీ! భార్యా వియోగముచే బాధపడుచున్న మా మిత్రుడు ఋతుధ్వజుడు జీవించుట దుర్లభము. మా కతడత్యంతాప్తుడు కావున మేమును వాని తోడివారమే యని విలపించుచున్న తనయుల నూరడించి మదన సాయకను తెచ్చి ఋతుధ్వజున కిచ్చెదనని నమ్మబలికి భుజింప జేసెను.

అశ్వస్థుడు కైలాసమేగి యేకాగ్రచిత్తుడై ఇరువది యేడు దినములు మహాదేవుని నుతింపగా పార్వతీపరమేశ్వరులు ప్రత్యక్షమైరి. అంత నా సర్పరాజు సాష్టాంగ దండ ప్రణామములుచేసి చేతులు జోడించి నిలబడగా శంకరుడిట్లనెను. సర్పరాజ! నీ భక్తికి మెచ్చితిని వరము కోరుకొనుమని పలుకగా పన్నగపతి యిట్లనెను. దేవ! అయోధ్యాధిపతియగు ఋతుధ్వజుని భార్య యగు మదనసాయకను తుల్యకేతుడను రక్కసుడు మాయోపాయముతో ప్రాణములు దీసెను.

అందువలన ఋతుధ్వజుడు చింతాక్రాంతుడై నిద్రాహారములు విడిచి జీవితముపై విరక్తిచెందియుండెను. పరమేశ్వర! మదనసాయక నొసంగిన ఋతుధ్వజుడు స్వస్థత చెందగలడని ప్రార్థించెను. సర్పరాజు పలుకులకు శివుడు సంతసించి పరోపకారార్థ మిదం శరీరమను వాక్యము ననుసరించి స్వార్థబుద్ధితో గాక

పరోపకారార్థమై నీవు నన్ను కోరితివి కావున మదనసాయకను తప్పక యిత్తునని పలికి గౌరీ భవనముననున్న మదనసాయకను రావించి తొల్లిటి శరీరము అందచందములు నొసంగి యశ్వస్థున కప్పగించి శివుడంతర్ధానమందెను.

అశ్వస్థుడు మదనసాయకను ఇంటికి గొనిపోయి యంతఃపురముననుంచి తనయులను బిలిచి ఋతుధ్వజుని తోడ్కొని రమ్మనిన వారెప్పటివలె వెళ్ళి తాము నాగేంద్ర తనయులమని చెప్పి జరిగిన విషయమంతయు వివరించి మాతండ్రి మీదుఃఖము పోగొట్టగలడని చెప్పి రమ్మని కోరగా ఋతుధ్వజుడు మహాత్ములార! మీ స్నేహము వలన ధన్యుడనైతినని పలికి వారలతోగూడి నాగలోకమున కేగెను.

సర్పరాజగు నశ్వస్థుడు ఋతుధ్వజునిచూచి యుచితసత్కారములుచేసినను ఋతుధ్వజుడు ప్రీతిచెందడయ్యెను. అశ్వస్థుడు ఋతుధ్వజుని మనోవేదన గ్రహించి వెంటనే నాగకన్యను పిలిచి యంతఃపురమున నున్న మదనసాయకను తీసికొనిరమ్మని యాదేశింపగా నాగకన్య వెంటనే మదనసాయకను తీసికొనివచ్చి ఋతుధ్వజున కానందము కలిగించెను. అప్పు డశ్వస్థుడు మదనసాయకా ఋతుధ్వజులకు మరలపాణిగ్రహణముచేసి అనర్ఘ్యములైన వస్త్రాభరణము లొసంగి సత్కరింపగా వినూత్న దంపతులగు మదనసాయకా ఋతుధ్వజులు హయారూఢులై యయోధ్యానగర మేగి శత్రుజి న్మహారాజ దంపతులకును అయోధ్యాపుర వాసులకును మిగుల ఆనందము కలిగించిరి.

అని మునులు శ్రీరామునకు తెల్పి రామా ! రాక్షసమాయ లిట్టివి. నీ వప్రమత్తుడవై వనవాసము పూర్తి చేయవలయును సుమా యని హితవు గరపి తమ యాశ్రంబులకు వెడలిరని లవకుశులు చెప్పినట్లుగా మార్కండేయుడు ధర్మరాజునకు వివరించి చెప్పెను.

# విచిత్ర రామాయణము

## అరణ్య కాండము

ధర్మరాజు మార్కండేయుని చూచి మునీంద్రా! తదనంతర కథ తెలియజేయుమని కోరగా మార్కండేయుడిట్లు చెప్పదొడంగెను. రాజేంద్రా! రాముడా పౌరాణికులనట్లు ప్రశంసించి తదనంతర వృత్తాంతమును తెలుపగోరగా లవకుశ లిట్లు చెప్పదొడంగిరి. మహారాజ! అంత నారాముడు సీతారామ లక్ష్మణ సహితుడై అత్రి మహర్షి యాశ్రమున కేగెను. అత్రి మహర్షి సీతా రామ లక్ష్మణుల నుచితరీతిని సత్కరించి యాతిథ్యమొసంగెను. భోజనానంతరము విశ్రాంతిగా గూర్చున్న సమయమున అనసూయ జానకినిచూచి యిట్లనెను. సీతా! ఛాయ సూర్యునివలె నీవు నీ భర్తను విడువక అనుసరించుచు కందమూలములు తినుచు మిగుల సేవచేయుచున్నావు. నీవలెనే పతిని సేవించి సుమతియను పతివ్రత జగద్విఖ్యాతి గాంచినది. అని యనసూయ చెప్పిన పలుకులువిని సుమతి చరిత్రను తెలియజేయుమని జానకి కోరగా అనసూయ యిట్లు చెప్పదొడంగెను.

జానకీ! సరస్వతీ తీరమున మకరధ్వజుడను పండితుడగు విప్రుడు కలడు. వానికి మిగుల గుణవతియగు సుమతి యను కూతురు కలదు. మకరధ్వజుడను నా బ్రాహ్మణుడు సుమతిని కౌశికుని తనయుడగు శశికరుడను వానికిచ్చి పరిణయము చేసెను. శశికరుడు వేశ్యాలోలుడై పితార్జితమైన యాస్తి పాస్తులన్నియు వ్యయము చేసెను. అయినను వాడు రేయింబవళ్ళు వేశ్య

యింటనే నివసించుచుండెను. సుమతి దైవ నిర్ణయమట్లున్నదని ధైర్యమవలంబించి వంటజేసి యన్నమును వేశ్య యింటనున్న భర్తకు తీసికొనిపోయెను. వాడు భార్యనుచూచి నిర్భాగ్యురాల! ఇంటపడి యుండక ఏలవచ్చితివి? నిన్ను పెండ్లాడిన నాటి నుండియు అంతయుపోయినది. నీవంటి యేబ్రాసి యింట పాదము పెట్టినందువలన కాసుకూడ పుట్టకున్నది. దూరముగా పొమ్ము అనగా నాథా! సాయంకాల మగుచున్నను మీరు భోజనమునకు రాలేదని అన్నము తెచ్చితిని భుజింపుడని బ్రతిమాలగా వేశ్య సలహాపై నతడు భోజనము చేసెను. పతి తినగా మిగిలిన యన్నము నింటికి తీసికొనిపోయి భుజించినది. అట్లు కొంత కాలము గడచినది. శశికరుడు వేశ్యలనిమిత్తమైచేసిన యప్పుల బాధ సహింపజాలక దేశాంతరము వెడలిపోయెను. సుమతి యీ వార్త విని భర్త వెళ్ళిన దారినే పయనింప సాగినది.

శశికరుడు కొన్ని దినములకు హరిసేనుని రాజధానియగు పద్మపురమున కేగగా సుమతియు మరికొన్ని దినములకు పద్మపురము చేరినది. తన జాడ తెలిసికొని వచ్చిన సుమతిని చూచి శశికరుడు రోషారుణితనేత్రుడై నా వెంట నేలవచ్చితివని తిట్టికొట్టి పొమ్మని గెంటివైచెను. సుమతి భర్తకు మ్రొక్కి నాథా! మన కిరువురకును అగ్నిసాక్షిగా వివాహమైనది. మిమ్ము విడిచి నేనెచ్చట కేగెదను. ఈ నగరములోని బ్రాహ్మణ గృహములలో సంపాదించిన ధాన్యమును దంపి ఆ బియ్యము వండి మీకుపెట్టి మీరుతినగా మిగిలినది తిని మీ పాదసేవ చేయుదును అనుగ్రహింపుము అని ప్రార్థింపగా శశికరు డంగీకరించెను. సుమతి ప్రతిదినమును బ్రాహ్మణ గృహములకేగి బిచ్చమెత్తి తెచ్చి వండి భర్తకు పెట్టి తాను తిని పాదసేవ చేయుచుండెను.

కొంత కాలమునకు శశికరునకు నూదిమొన మోపశక్యము కాని రీతిగా కురుపులు వేసినవి సుమతివైద్యుల నడిగి మందు తెచ్చి భర్తకు సేవలు చేయుచుండెను.

ఒకనాడు శూద్రకరుడను రాజభటుడు నగరమువెలుపల నున్న కుటీరములో సుమతిని చూచెను. ఒకనా డా శూద్రకరుడు సుమతి యింటికేగి శశికరుడు పలుకుచున్న పరుష వచనములువిని దూరముగా పిలిచి సుందరీ ! నీ భర్త శరీరమెంత కంపుగొట్టు చున్నదో చూడుము. లేవలేడు ఎప్పుడును తిట్టుచుండుటయే కాక కొట్టుదునను. ఒకపూట గ్రాసమైన సంపాదించి తేజాలడు కత్తులవంటి పలుకులతో నీ మనసెప్పుడును గాయపరచుచుండును. అసహ్యమనునది యెరుగక చీముకారుచున్న పుళ్ళు కడిగి చాకిరీ చేయుచుందువు. అయినను నీకు మెప్పులేదు.

నీ మనసును నీ భర్తనుండి మరలింపుము. నా మాట వినుము. ఈ నగరమేలు హరిసేనుడు మిగుల చక్కనివాడు ఐశ్వర్య సంపన్నుడు. నీ మనసు వానిపై మరలింపుము. నేను మీ యిద్దరకును పొత్తు కూర్తును. అని పలికెను.

శూద్రకరుని పలుకులు సుమతివిని హరి హరీ ! యని చెవులు మూసికొని రాజును శపించిన పాతివ్రత్యము తరిగిపోవు నని భావించి శూద్రకరా ! నా మాటవిని మీ రాజునకి పని తగ దని చెప్పుము. దుష్ట వర్తనులగువారిని దండింపవలసిన రాజే దుష్టవర్తనుడైన యెవరితో చెప్పుకొన వలయును ? తండ్రివలె ప్రజలను పాలింపవలసిన రాజు చెడు పనులు చేసిన జనులు మెత్తురా ? బిచ్చమెత్తుకొని యెట్లో జీవించుచున్నాము. నీవు పెద్దవాడవు కావున సోదరునిగా నెంచి యింతవరకు మాట్లాడితిని.

ఇక మాట్లాడిన దైవము మెచ్చడు. నీ వెప్పుడు నిట్టి పలుకులు పలుకకుము. వచ్చిన దారినే పొమ్ము అని మందలించి పతికడ కేగి చరణసేవ చేయుచు వైద్యులు చెప్పిన మందులు అతి ప్రయాసతో సంపాదించి తెచ్చియిచ్చి నిత్యకృత్యము లెప్పటి వలె నిర్వర్తించుచుండెను.

శూద్రకరుడు రాజుకడకేగి సుమతి పలికిన పలుకులు తెలుపగా రాజు భటుని చూచి పతివ్రతను కానిపలుకు లందువా? ఆమె శపించిన సర్వనాశనమగును. మన పూర్వపుణ్యము వలన ఆమె మనలను క్షమించినది. పతివ్రతను కానిపలుకు లనుటకు నీకు నోరెట్లువచ్చినది? దుర్మార్గుడ! నీవు కఠినశిక్ష కర్హుడవు. అని మహోగ్రుడై శూద్రకరుని శిక్షించి పురోహితుని ద్వారా సుమతి నివసించు కుటీరమునకు బియ్యము మున్నగునవి పంపు నేర్పాటు గావించెను. శశికరుడు భార్యతెచ్చియిచ్చు మందుల వలనను సేవలవలనను రోగవిముక్తుడై క్రమక్రమముగా కోలుకొనెను.

రాజుత్సవములు చేయదలచి వారాంగనా నృత్యము నేర్పాటు చేసెను. శశికరు డాపలుకులు విని తననటకు తోడ్కొని పొమ్మని భార్యను వేధించెను. సుమతి భర్తను మెల్లగా నడిపించి తీసుకొనివచ్చి నాట్యప్రదేశమునకు దూరముగా భర్తను గూర్చుండబెట్టి నాట్యావసానమున నింటికి తీసికొనివచ్చెను. అది మొదలుకొని నిద్రాహారములు మాని చింతాక్రాంతుడై యుండగా సుమతి గమనించి భర్తను సమీపించి నాథా! నీ చిత్తము అన్యాక్రాంతమై యుండుటకేమి కారణమనివేడుకొనగా శశికరుడిట్లనెను. వనితా! ఒకదుర్ఘటకార్యము కలదు. దానిని తెలిపిన నీవు కోపింతువని యూరకుంటిననిన సాధ్వి చేతులు జోడించి నాథ! మీ యానతి నేతలదాల్చి నాకు సాధ్యమైన యెడల మీ కార్యము నెరవేర్తును ఆనతీయమనిన పద్మాక్షియను వేశ్యపై నాకు మనసు

లగ్నమైనది. అని తన మనోభీష్టమును తెలుపగా సుమతి నవ్వి స్వామి ! ఇంతమాత్రమునకు చింతింప నేల ? మీ కోరిక తప్పక నెరవేర్తునని నమ్మించి సుమతి పద్మాక్షి యింటికేగి ఆమెను కలిసికొనెను.

పద్మాక్షి సుమతినిచూచి లేచి యుచితాసనాసీన గావించి తల్లీ ! ఎవ్వతెవమ్మా నీవు ? నీవు వచ్చినపని యేమి ? కుల స్త్రీలు వేశ్యలయింటి కేగిన చెడువచ్చును. దారితెలియక మా యింటి కరుదెంచితివా ? అని ప్రశ్నింపగా ఆ సాధ్వి పద్మాక్షీ ! నా పేరు సుమతి. నన్ను నీ సోదరిగా భావింపుము. శశికరుడను బ్రాహ్మణుడు నా భర్త. నీతో చెలిమి చేయ వచ్చితిని అనిచెప్పి వెడలిపోయెను. అది మొదలుకొని సుమతి ప్రతిదినమును పద్మాక్షి యింటి కరుదెంచి రకరకముల ముగ్గులు పెట్టుచుపాటలు పాడుచు సంతసము కలిగించుచుండెను.

సుమతి మంచి వివేకవతియగు పతివ్రతయని పురజనులు చెప్పుకొను మాటలవలన విన్న పద్మాక్షి తమ యింటికొకనాడు యథాప్రకారము వచ్చిన సుమతినిచూచి యిట్లు పలికెను తల్లీ ! నీవు బ్రాహ్మణ వనితవు. మిగుల పతివ్రతవు. నన్నాశ్రయించు టకు కారణమేమియో సెలవిమ్ము. నేను నీకు చేయగల పని యేమియో సెలవిమ్ము అని కోరగా సుమతి అక్కా ! నా పతికి నీయం దనురాగము జనించినది. నీవు నాయందు దయవుంచి నా భర్తయొక్క కోరికను నెరవేర్చుము అని కోరగా పద్మాక్షి పక్కున నవ్వి సుమతీ ! భర్త పరకాంతలపై మక్కువ జూపిన పడతులు సైపరు కదా ! నీ భర్త మనసు నొచ్చునని కాబోలును నీ విట్టి పనికి పూనుకొంటివి. పతివ్రతా శిరోమణివగు నీవాగ్రహిం చిన దేవతల కైనను కీడు కలుగును. నీ దీవనలు పడసినవారికి

మేలగును. నేను నగరాధిపతి యధీనములోనున్నదానను నేను నీ యింటి కరుదెంచిన యెడల రాజు పసిగట్టి నన్ను శిక్షించును. నీ భర్త నీ రాత్రికి మా యింటి కడకు తీసికొని వచ్చిన యెడల కోరికదీర్తునని పలుకగా సుమతి సంతసించి యింటికేగి భర్త కావిషయమును తెలిపి మోదము కలిగించెను.

రాత్రి సమయమున సుమతి భర్త చేయిపట్టుకొని మెల్లగా నడిపించి తీసుకొని వెళ్ళుచుండెను. కొంత దూరమేగుసరికి హఠాత్తుగ గాలి వాన కురిసి దారంతయు బురదయ్యెను. అంతనా సుమతి భర్తను మూపున గూర్చుండబెట్టుకొని చీర చెరగు తలపై గప్పి పద్మాక్షి యింటికి తీసుకొని పోవుచుండెను. అంతకు ముందు రోజు రాజభవనమును దొంగలు దోచుకొనదలచి వెళ్ళుచు నదీ తీరమున నాగిరి. నదీ తీరమున శ్రీహరిని ధ్యానించుచు గూర్చున్న మాండవ్య మునీంద్రునిచూచి వాని పాదములకు మొ్రక్కి. రాజభవనమున దొంగతనము వలన లభించిన దానిలో కొంత ఈ మహానుభావుని పాదపద్మములకు సమర్పింతుమని మ్రొక్కుకొని దొంగతనము చేసిరి. ఆ దొంగలకు బంగారు పాత్రలు లభింపగా సంతసించి మునిపాదములచెంత నైదుపసిడి పాత్రలుంచి వెడలిపోయిరి.

రాజ భటులుదొంగల అడుగుజాడలను బట్టి వెదకుచువచ్చి నదీతీరమున మాండవ్యముని పాదములచెంతనున్న పసిడి పాత్రలను చూచి రాజు కడకాపాత్రలను తీసుకొనిపోయి చూపిరి. మహారాజగు హరిసేనుడు ఆగ్రహపరవశుడై మాండవ్యుని శ్మశానమునకు గొనిపోయి కొఱతవేయుడని యాజ్ఞాపించెను. రాజాజ్ఞ ననుసరించి భటులు మాండవ్య మునీంద్రునకు గొఱత వేసిరి. కొంత సేపటికి మహర్షి సమాధి చాలించి తన కిట్టి శిక్షవిధించిన వారెవరో

కదాయని చింతించి దివ్యదృష్టిచే విషయమంతయు గ్రహించి ప్రారబ్ధ మనుభవింపక తీరదని తలంచి యూరకుండెను.

సుమతి చీకటిలో గాలి వేగమునకు దారితప్పి శ్మశాన మార్గమున పోవుచున్న సమయమున ఆమె మూపున గూర్చున్న శశికరుని శిరమునకు మాండవ్యుని పాదము తగిల మెడలుకదలి బాధ భరింపలేక నా శరీరము కదిలించి యిట్లుబాధించినవాడు సూర్యోదయముకాగానే మరణించుగాక యని శపించెను, ఆ శాపవచనములు విన్న సుమతి మాండవ్య మునీంద్రునిచూచి తన విషయమంతయు వివరించి నీ వెవ్వడవు ? ఎందువలన నీ విట్లుంటివని యడిగిన అతడు నేను మాండవ్యుడను. బాల్యమున తూనీగలను పట్టి ముళ్ళుగుచ్చితిని. దాని ఫలితముగా నాకు రాజదండన యి కలిగినదని చెప్పి ఎవరుచేసిన పుణ్యపాపముల ఫలమును వారనుభవింపక తీరదు. అని చెప్పెను. తన భర్తకు శాపవిమోచన మనుగ్రహింపుమని సుమతి కోరినను మునీంద్రు డమితమైన బాధ ననుభవించుచున్నందున సమాధానమీయ జాలడయ్యెను.

దైవనిర్ణయము దప్పింప నెవ్వరికిని తరము కాదనితలంచి సుమతి భర్తను మెల్లగా పద్మాక్షియింటికి తీసికొనిపోయెను. అచట శశికరుడు పద్మాక్షితో సుఖించి యొడలు మరచి నిద్రించుచుండగా సుమతి పతిని భుజములపై గూర్చుండబెట్టుకొని తమ కుటీరమునకు తీసికొనిపోయి భర్తను పరుండబెట్టి తాను భర్త పాద పద్మములనే నమ్ముకొనియున్న పతివ్రతనైనచో సూర్యోదయము కాకుండు గాక యని భావించెను. సుమతియొక్క ప్రభావము వలన సూర్యు డుదయింప డయ్యెను.

ఎంతకును సూర్యోదయముకాక లోకములన్నియు చీకట్లలో

మునిగి మంచుతో కప్పబడి చలికి గజ గజ వణకి పోవుచుండెను. ఇంద్రాది దేవతలు శ్రీహరిని సందర్శించి పలురీతులుగాస్తుతించిరి. శ్రీహరి ప్రత్యక్షమై మీరెల్ల రరుదెంచిన కారణమేమని ప్రశ్నింపగా దేవతలు శ్రీమన్నారాయణునకు మ్రొక్కి దేవ దేవ ! సూర్యోదయ మైనంతనే తననాథుడు మరణించునని మాండవ్య మునీంద్రుడు శపించుటచేత సుమతియను మహాసాధ్వి సూర్యోదయము కాకుండు గాక యని శపించెను. అందుచేత సూర్యోదయము కాక లోకము లన్నియు అల్లకల్లోల మగుచున్నవని విన్నవించిరి.

అంత నాహరి దేవతలనుచూచి సుమతి యెవరని ప్రశ్నింపగా దేవతలిట్లు విన్నవించిరి. ప్రభూ ! అత్రి మహాముని భార్యయగు అనసూయాదేవి సహచారిణి సుమతి. ఆమె మనసునకు నొప్పికలిగిన లోకములకు హానికలుగునునని సూర్యుడుదయింపడయ్యెను. శ్రీహరి పరమేష్ఠిని పరమేశ్వరుని చూచి యో దేవతాశ్రేష్ఠులార ! మనము ముగ్వురము ఆ మహాసాధ్వి చెంతకేగి యామె మనసు గ్రహించి యామె కష్టమును తొలగించి సూర్యునుదయింపజేసి లోకములకు మేలుచేయుదమని పలికి కూడబలుకుకొని త్రిమూర్తులు సుమతి కడకేగి మహాసాధ్వీ ! నీవు చింతాక్రాంతవై పతికడయుండుటకు కారణమేమని యడిగిన ఆమెసమాధాన మీయదయ్యెను. అంత విరించి సుమతి స్నేహిరాలగు అనసూయ కడకేగిన పనిచక్కబడునని యెంచి నా కడకరుదెంచిరి.

త్రిమూర్తులు నాకడకు వచ్చి నన్నుచూచి జరిగిన విషయమంతయు తెలిపి నీ స్నేహితురాలగు సుమతి యుద్దేశమును తెలిసికొనుమనిన నేను త్రిమూర్తులనుచూచి మీరు నాకు తనయులగుట కంగీకరించిన యెడల సుమతి యభిప్రాయమును తెలిసికొందు నంటిని. అందుకు వారంగీకరించిరి. అప్పుడు నేను సుమతి కడ

కేగి యూమె భావము నడుగగా సుమతి యిట్లనెను. చెలీ! నా భర్త ప్రాణములను మించి నేను కోరునదేమియు లేదని పలికిన నేను బ్రహ్మకు సుమతి మనోభావము తెల్పితిని అప్పుడు త్రిమూర్తులు తమలో తామాలోచించుకొని. నీ భర్తను జీవింపజేయుదుము. సూర్యోదయ మగునట్లు చేయుమని పలుకగా సుమతి సూర్యునుదయింప ప్రార్థించెను.

వెంటనే సూర్యు డుదయింప. శశికరుడు ప్రాణములు కోల్పోయెను. త్రిమూర్తులు శశికరుని జీవింపజేసి దీర్ఘాయుర్భాగ్యమును ప్రసాదించిరి. అని అనసూయ చెప్పగా సీత విని సాధ్వీ! త్రిమూర్తులను కుమారులుగా జనింపవేడితివి కదా? ఆ కోరిక యెట్లు నెరవేరినదని ప్రశ్నింపగా అనసూయ జానకీ! బ్రహ్మాంశచే అత్రియు విష్ణువు యొక్క అంశచేత దత్తాత్రేయుడును రుద్రాంశచే దుర్వాసుడును నాకు తనయులై జనించిరి. అని పలికి సీతకు అమూల్యమైన వస్త్రములు అంగరాగములు బహూకరించెను, వారచట నైదు సంవత్సరములుండి మహర్షి దంపతుల యనుమతినంది దుర్గమారణ్యమున పయనింప సాగిరి.

విరాధుడను రక్కసుడు సీతను పట్టదలచి సమీపించుట రాముడు చూచి వాడి కోలలు ప్రయోగించెను, విరాధుడు రాముని మ్రింగుటకై వచ్చుచుండెను. వెంటనే రాముడింద్రాస్త్రముచే రక్కసుని గూల్చెను. అచటినుండి వారు అగస్త్యమహర్షి ఆశ్రమమును ప్రవేశింపగా నగస్త్యుడు వారికెదురేగి ఆశ్రమమునకు తోడ్కొని పోయి యతిథి సత్కారము లొనరించెను. రాముడగస్త్య మహర్షికి మ్రొక్కి తమ కష్టములువివరింపగా నగస్త్యుడు శ్రీరామునకు హరిశ్చంద్రోపాఖ్యానమును తెల్పి మీరు సత్య సం

ధులు ధర్మపరులు కావున కష్టములు గట్టెక్కి సుఖము అనుభవింతు రని పలికెను.

ఒకనాడు శ్రీరాముడు అగస్త్య మునీంద్రునకు మ్రొక్కి మునిశ్రేష్ఠ ! మీ యాశ్రమమున కొంత కాలము సుఖముగా నుంటిమి. మరియొక చోటునకేగెదమని పలికి యనుమతినిమ్మని వేడగా, ముని రామా ! దండకారణ్యమున పంచవటియను ప్రదేశము కలదు అది సత్యలోకమున కెనయైనది. అటకు సమీపములో జనస్థానమను ప్రదేశమున ఖరదూషణ త్రిశిరాది రాక్షసులు 14 వేలమంది కలరు. వారు మాయావులు. అచట నెంత స్వల్ప కాలము తపమొనరించినను కార్యసిద్ధికాగలదు. అనిన రాముడు సీతా లక్ష్మణులతో దండకారణ్యమునకు చని పంచవటియందు నివ పింప సాగిరి.

అచటనున్నప్పుడు జానకి ప్రతి సాయంకాలమును పర్ణశాల సమీపమున గల పొదలలో పూవులుకోసి యలంకరించుకొనెడిది. ఒకనాడు యథాప్రకారము సాయం సమయమున జానకి పూలు కోయుచుండగా సూర్పణఖ చూచి యామెవెంట పర్ణశాల కడకేగి రామ లక్ష్మణులను చూచి వారి చక్కదనమునకు విస్మయమంది ఈ పురుషులు చేపట్టిన కాంతదే భాగ్యము. అని తలచి కామరూప కావున సుందరాంగియై యొక చెట్టుక్రింద దీనముగా గూర్చుండ సీత చూచి సమీపించి ఓ వనితా ! దీనముగా నుంటివేల ? అని ప్రశ్నింపగా ఆమె కన్నీరు కార్చుచు మగువా ! నా నాథుడు పరకాంతా వ్యామోహముతో నన్ని టినుండి గెంటివై చెను. ఆద రించు వారులేక యిట్లు వచ్చితి'' ఇంతకు నీ వెవతవు ? పతి యెవరు ? నీ నివాస మెచ్చట ? అని యడిగిన సీత తన విషయ మును తెలియజేసి యా సుందరాంగి మాయావియని యెరుగక

ఆమెనూరడించి మా నివాసమునకు రమ్మని పర్ణశాలకు తోడ్కొని వచ్చి రామలక్ష్మణులకు పరిచయము చేసెను. లక్ష్మణుడేకాంతమున అన్నను దర్శించి ఈ కాంత యిచట నుండ తగదని పలుకగా రాముడు తమ్మునితో సీత కాడు తోడుండునని నచ్చజెప్పి సూర్పణఖ యుండుట కంగీకరించెను.

రాత్రి సమయమున సూర్పణఖ సీతను సమీపించి రాముని యందు తనకు గల కోరికను తెలుపగా జానకి హాస్యముగా చెల్లీ ! రాముని సేవించుటకు నేనుంటిని. మా మరిది లక్ష్మణుడొంటరివాడు వాని సేవకరుగుమనిన ఆమె లక్ష్మణుని చెంతకేగి తన కోరిక నెరింగించెను లక్ష్మణుడు పొమ్ము అని తిరస్కరింపగా సూర్పణఖ రోషముతో భీకరాకారము దాల్చి గుహవంటి నోరు తెరచి సౌమిత్రిని మ్రింగబోవగా నతడు నాగపాశముచే బంధించెను.

ఆ గందరగోళము విని సీతారాములు అటకు వచ్చి ఘోరాకారము చూచి యాశ్చర్యపడుచుండగా లక్ష్మణుడు జరిగిన విషయమును తెలుపగా నీచుప్పనాతి ముక్కు చెవులు కోసి విడుపుమని యాదేశించెను. లక్ష్మణుడు అదే రీతిగా ముక్కు చెవులు కోసి విడిచిపెట్టగా నది యేడ్చుచు భర్తయైన త్రిశురుని పాదములపై బడినది. వెంటనే త్రిశిరుడు మున్నగువారు సైన్యసహితులై సమరమునకరుదెంచుట రాముడు చూచి సీతను రక్షింపుమని లక్ష్మణుని నియమించి తాను ధనుష్టంకారము చేసెను. పదునాలుగు వేల మంది సైనికులతో ఖరదూషణాదులు తనపై బాణవర్షము కురిసినను రాముడు జంకక క్షణములో నెల్లరక్కసులను సంహరించి పర్ణశాలకేగెను.

అంత సూర్పణఖ దండతాడితభుజంగమువలె రోజుచు లంకానగరము చేరి కన్నీరు మున్నీరుగా నేడ్చుచు ఖరదూషణాదుల

సంహారము రాముని బల పరాక్రమములు రావణునికి వివరించి లోకోత్తర సుందరి యగు జానకిని తీసికొనివచ్చుటకు తానేగుటయు తనను విరూపను చేయుటయు వివరించి చెప్పి కోయబడిన ముక్కుచెవులు చూపి విలపింప సాగినది.

రావణుడు దుఃఖించుచున్న చెల్లెలి నూరడించి రామలక్ష్మణులను మాయచేసి జానకిని తెత్తునని శపథము చేసి తపమ్మొనరించుచున్న మారీచుని కడకేగి సీతాపహరణమున తోడ్పడుమనియు తన వెంట దండకారణ్యమునకు రమ్మనియు కోరగా మారీచుడిట్లనెను. రాక్షసరాజా ! రామలక్ష్మణులు దేవదానవులకు గూడ అజేయులు. వారలతో వైరము వలదనిన రావణుడాగ్రహముతో చంద్రహాసము తీసి ఖండించబోగా మారీచుడు తనకెట్లును మరణమాసన్నమైనదని గ్రహించి పరాత్పరుడైన రాముని చేతి మరణము ముక్తిహేతువని తలంచి నీ యానతి పరికారము చేయుదునని లోకోత్తర సుందరమైన పసిడి లేడియై పర్ణశాల దగ్గర చెంగు చెంగున గంతులు వేయుచుండెను.

పర్ణశాల సమీపమున తిరుగుచున్న పసిడి లేడిని చూచి జానకి అబ్బురపడి నాథ ! పసిడి లేడిని తెచ్చి యిచ్చిన దానితో ఆడుకొనుచు కాలము గడుపుదుమ అని ప్రార్థింపగా రాముడు తమ్ముని చూచి సోదరా ! ధనుర్బాణములు చేబూని జానకి సమీపమున నుండుము. నేనేగి లేడిని తెచ్చెదను. సీతను విడిచి యెచటకును వెడలకుము సుమా ! అని హెచ్చరించి వెడలెను కాంచన మృగము చేతి కందినట్లే యంది దూరముగా పారిపోవుచు రాముని దూరముగా తీసికొని పోవుచుండెను. రాముడు చెమటలు గ్రక్కుచు లేడి వెంట వెళ్ళివెళ్ళి విసుగెత్తి బాణము సంధించెను. రామ శరాహతిచే లేడి హా లక్ష్మణా ! యని యరచుచు నేలగూలెను.

హా లక్ష్మణా యను ఆర్తనాదమును విన్న సీత భర్త యాపదలో చిక్కుకున్నాడని భావించి లక్ష్మణ ! మీ యన్న ఆపదనొంది దీనముగా నరచెను. నీవు వెంటనే మీ యన్న కడకేగి విషయము తెలిసికొనుము. అని పలుకగా సౌమిత్రి వదినకు మ్రొక్కి మా యన్న యగు శ్రీరామునకు దేవదానవుల వలనగాని మరి యెవ్వరి వలన గాని యెట్టి ప్రమాదమును లేదు. మా యన్న జయమునే కాని యపజయము నెరుగడు, అని ధైర్యవచనములు పలుకగా సీత వినిపించుకొనక నిష్ఠుర వచనములు పలుక జొచ్చినది. ఓయి లక్ష్మణ! నీవు రాముని తమ్ముడవ! ఆపదలో చిక్కుకొన్న అన్నను కాపాడుటకేల వెళ్ళకున్నావు ! అని కన్నీరు మున్నీరుగా కార్చుచు హా నాథా ! రాక్షస మధ్యముననెట్లు బాధపడుచుంటివో కదా! యనుచు నేలగూలి కైక కోరిక నెరవేరినది. లక్ష్మణుని సోదర ప్రేమ వెల్లడైనది. వనములో భీతి చెంది లక్ష్మణుడు తోడు రాకుండుట చేత రాముడు ఏమని భావించునో కదా ! ఏమి చేతును? అని వగచుచు నిష్ఠురముగా పలుకుచున్న జానకిని చూచి లక్ష్మణుడు మిగుల దుఃఖించి నలుదెసలు చూచి రాముడేగిన దిశగా వెడలెను.

లక్ష్మణుడు వెళ్ళగానే రావణుడు మాయా ముని వేషమును దాల్చి సీత యున్న పర్ణశాల కడకేగి "భవతి భిక్షాందేహి" యని యరచెను. రావణుడు వెళ్ళుసరికే సీత తాను పర్ణశాలలో నున్న యగ్నిలో ప్రవేశించి తాను ఛాయా రూపము దాల్చి యుండెను.

భిక్షు రూపమున వచ్చిన రావణుడు పర్ణశాలలో సీతను చూచి వనితా ! బిచ్చమిడుమనగా సీత బిచ్చము తెచ్చి రావణుని నిజ రూపము చూచి మూర్ఛపోయెను. రావణుడు సీతను పుష్పక విమానమున గూర్చుండబెట్టుకొని లంకకు బయలుదేరెను. కొంత సేపటికి

సీత మూర్ఛ తెలిసి విలపించుచుండగా జటాయువువిని రావణుని దారికడ్డముగా నిలిచి పాద ప్రహారములతో పుష్పకము శిధిలమగు నట్లు చేసిన అది నేలపై పడెను. అంతతో నాగక ముక్కుతో, గోళ్ళతో రావణుని ముఖములు పొడిచిన రక్తసిక్త దేహుడై చితాగ్ని వలె మండిపడుచు చంద్రహాసముతో జటాయువు రెక్కలు ఖండించి నేలగూల్చెను. రావణుడు కిరీటములు సవరించుకొనుచు మరల పుష్పక విమాన మెక్కి ఆకాశ మార్గమున లంకకేగుచుండగా సీత చీర చెంగు చింపి నగలు మూటగట్టి ఋష్యమూక పర్వతమున నున్న సుగ్రీవుడు హనుమంతుడు మున్నగువారిని చూచి నగల మూటను జారవిడచి వనచరులార ! రాముని యిల్లాలిని. సీత యను దానను దాశరథులు లేని సమయము చూచి రావణుడు నన్నపహరించి తీసికొనిపోవుచున్నాడు. ఈ నగలు రామునకొసగుడు. అని మెల్లగా పలికెను. రావణుడు సీతను లంకకు తీసికొనిపోయి అశోకవనములో నుంచి త్రిజటమున్నగు దానవ స్త్రీలను కాపలాగా నుంచి మందిరమునకేగెను.

రాముడు మాయలేడిని కూల్చినప్పుడు హా లక్ష్మణా : యని పిలుచుట వలన శంక కలిగి పర్ణశాల దిశగా వెడలుచుండగా అనేక దుశ్శకునములు వచ్చి చింత కలిగెను తనకెదురుగా వచ్చుచున్న సౌమిత్రిని చూచి సమీపించి తత్తరపాటులో నిట్లనెను. లక్ష్మణ ! జానకి నొంటరిగా వదిలి నీవేల వచ్చితివి ? అని యడుగగా హా లక్ష్మణా యన్న కేకవిని వదిన బాధపడి దనుజుల వలన మీ యన్న కష్టములో పడెనేమో వెంటనే వెళ్ళిచూడుమని నన్ను తొందరపెట్టినది మా యన్న కెవరి వలనను భయము లేదనియు నిన్నొంటరిగా విడిచి యెక్కడకును కదల వలదని యాజ్ఞాపించె ననియు చెప్పి నేను వెడలనని పలికితిని. అందుకు వదిన కోపించి నన్ననరాని మాటలని వెళ్ళుమనగా వచ్చితిని. అని పలుకగా

రాముడు లక్ష్మణునితో గూడి తొందరగా పర్ణశాలకు చేరి జానకీ ! జానకీ!యని పిలుచుచు వెదుకగా జానకి కనుబడదయ్యెను. కారణము తెలియక పర్ణశాలలో ప్రవేశించి సీత కొఱకు గాలించిరి కాని ప్రయో జనము లేకపోయినది. దుఃఖభారముతో రాముడు మూర్ఛపోగా చూచి యడలిపోవుచు లక్ష్మణుడు పచారములు చేసెను. కొంతవ ఱికి రాముడు మూర్ఛలేచి సోదర ! సీత నొంటరిగా విడిచి రావ ద్దంటిని కదా ! నా మాట లెక్క చేయక నీవేల వచ్చితివి ? ఇచట సీత లేదు. దానవులు మోసపుచ్చిరో ? క్రూర మృగముల వాత చిక్కెనో ? అని ధైర్యము కోల్పోయి వగచుచుండగా సౌమిత్రి యిట్లనెను. అన్న ! విధాతకైనను దైవగతి తప్పదు. దానవులు సీత నీవనములో నెచటనైన దాచిరేమో వెదుకవలయును. విప త్తులు వచ్చిపడునప్పుడు ధైర్యమవలంబింపవలయునని పలికెను.

రామలక్ష్మణులు సీతను వెదకుచు తిరుగుచుండగా ఒకచోట యోజన బాహుడను దైత్యుడు దీర్ఘ బాహువులు చాచి దొరికిన జంతువులను పట్టి తినుచుండెను. రామలక్ష్మణులు కూడ ఇతర జంతువులతోబాటు వాని బాహువులకు చిక్కిరి. రాముడు ధైర్యమ వలంబించి ఖడ్గముదీసి వాని బాహువులు ఖండించెను. వెంటనే వాడు శాప విముక్తిబడసి నిజ రూపము దాల్చి రామునకు మ్రొక్కి యను మతి గైకొని వెడలిపోయెను.

అట నుండి రామలక్ష్మణులు మరికొంత దూరమేగి నేల గూలి కొనయూపిరితోనున్న జటాయువును చూచిరి. జటాయువును రామునకు మ్రొక్కి రామ ! రావణుని బాణ ఘాతముచే రెక్కలు విరిగి నేల గూలితిని నన్ను రక్షింపుమని వేడుకొనగా రాముడు జటాయువును సమీపించి పక్షిరాజా ! రావణుడు నీ ఱెక్కలు నరికి నేలగూల్చుటకు కారణమేమి ! అని యడిగిన జటాయువిట్లు పలి కెను. రామ ! నా పేరు జటాయువు రావణుడు సీతనపహరించి

యాకాశ మార్గమున తీసికొని పోవుచుండగా సీత చేసిన యార్త నాదము వింటిని. ఓ పుణ్యాత్ములార ! దశరథుని కోడలను. జనకుని తనయను. శ్రీరామచంద్రుని యిల్లాలిని. రావణుడు నన్ను బలవంతముగా తీసికొని పోవుచున్నాడు వెంటనే వచ్చి నన్ను రక్షింపుడు. అనుచు సీత వేయు కేకలు విని నేను రావణుని మీదికి పోరాటమున కేగి విమానము నేలగూల్చి గోళ్ళతోడను ముక్కు తోడను రావణుని మోములు రక్కిపొడిచి, బాధింపగా రావణుడు క్రోధముతో చంద్రహాసము తీసి రెక్కలు నరుకగా నేలగూలితిని. అయినను లెక్కచేయక అతి కష్టముపై లేచి సమరమునకు సిద్ధపడుచుండగా తీవ్రమగు శరమును ప్రయోగించి యురమున గొట్టెను. నేలగూలిన నన్ను చూచి జానకి జరిగిన వృత్తాంతమును రామునికెరింగింపుమని కోరుటయే గాక రామునకు విషయమెరంగించు వరకు జీవింతువని వరమొసంగెను. అంతలో రావణుడు సీతను తీసికొని పుష్పక విమానముపై వెడలిపోయెను. అని విన్నవించి జటాయువు ప్రాణములు వీడెను. రాముడు సౌమిత్రినిచూచి మన తండ్రి యగు దశరథుని ప్రాణ స్నేహితుడగు జటాయువు మనకొఱకై యసువులర్పించెను కావున ఉత్తరక్రియలు చేయుదమని పలికెను. లక్ష్మణుడెండు కట్టెలు తెచ్చి యివ్వగా శ్రీరాముడు దహనాది క్రియలను నెరవేర్చెను.

అంతనా దాశరథులు పయనము కొనసాగించి ఋష్యమూక పర్వత సమీపమునగల పంపా సరోవర తీరమునగల చెట్టు నీడలో విశ్రమించిరి. ఆ సమయమున శబరి వన్య ఫలములు తెచ్చి రామునకు భక్తితో సమర్పించెను. శబరి యొక్క భక్తి శ్రద్ధలకలరిన శ్రీరాముడా బోయ వనితకు మోక్షమొసంగెను. సీతా వియోగ దుఃఖముతో నలసిన శ్రీరాముడు సౌమిత్రి తొడపై తలనుంచుకొని పవళించెను.

* * *

# విచిత్ర రామాయణము

## కిష్కింధా కాండము

దేవా ! అవధరింపుము. అంత రామచంద్రుడు పౌరాణికులను చూచి బాలులారా ! రామలక్ష్మణులచట నెంత కాలముండిరి? అట నుండి యెటకేగిరి ? తదనంతర కథ తెలియజేయుడనిన పౌరాణికులిట్లనిరి. తొల్లి సుగ్రీవుడు అన్నయగు వాలితో విరోధము వచ్చుట వలన జాంబవంతుడు హనుమంతుడు మున్నగు మంత్రులను గూడి ఋష్యమూక పర్వతముపై నివసించుచుండెను. ఒక నాడు సుగ్రీవుడు జాంబవంతుని చూచి యిట్లు పలికెను సచివోత్తమా ! వాలికి భయపడి మనమిచట నుండుట తగదు. సమర మొనరించి వాలిని చంపవలెను. అది సాధ్యము కానిచో వాలి చేతిలో మరణింపవలెను. ఇంతకన్న వేరు మార్గము లేదు. అని లేచి కొండ దిగి రామలక్ష్మణులను చూచి వాలి పనుపున తనను చంపుటకరు దెంచిరని యెంచి భీతితో తొందరగా కొండనెక్కి జాంబవంతుని చూచి మా యన్న పనుపున మనలను సంహరించుటకై యిరువురు పురుషులు ధనుర్ధారులై యేతించి కొండక్రిందనున్నారు చూడుము ఇక మనమిచట నుండ తగదని పలుకుచున్న సుగ్రీవుని చూచి యాంజనేయుడిట్లనెను. వానరరాజ ! బాటసారులను చూచి బెదర తగదు. నేను వెళ్ళి నిజమారసి వత్తును. స్వస్థచిత్తముతోనుండుము అని ధైర్యము గరపి కొండ దిగి పిల్లి వలె చిన్న రూపము దాల్చి యాకాశమార్గమున దాశరథులున్న చెట్టుకొమ్మను చేరి తియ్య మామిడి కొమ్మలలో దాగి, విల్లమ్ములు దాల్చిన రామలక్ష్మణుల దివ్య సౌందర్యమును ముగ్ధుడై చూచుచు ఆనందపరవశుడయ్యెను.

రాముడు చెట్టు కొమ్మలపై తిరుగుచున్న యాంజనేయుని చూచి లక్ష్మణ ! చెట్టుపైనొక వానరము తిరుగుచున్నది. అది కవచకుండలములను దాల్చినది. ఎంత వింత ! యని యాశ్చర్యముగా పలుకగా హనుమంతుడాలకించి పూర్వము బ్రహ్మ పలికిన పలుకులు గుర్తునకు వచ్చి యతడు విష్ణువని గ్రహించి సంతసించెను

మారుతి వెంటనే చెట్టు నుండి క్రిందకు దిగి భక్తితో రెండు చేతులు జోడించి సాగిలపడి మ్రొక్కి దేవా ! శరణు శరణు ప్రభువుల వారీ యడవిలో తిరుగుటకు కారణమేమి ? మీ వంశమెయ్యది? మీరెవరి తనయులు ? మీ నామధేయములెయ్యవి ? తెలిపిన సంతసింతుననగా రాముడిట్లనెను. వానరోత్తమ ! మాది సూర్యవంశము మా నివాసమయోధ్య. అజమహరాజు పుత్రుడగు దశరథ మహారాజు మా తండ్రి. నన్ను రాముడందురు. ఇతడు నా తమ్ముడు లక్ష్మణుడు. తండ్రి యాజ్ఞననుసరించి యరణ్యవాసము చేయుటకై యరుదెంచితిమి. అని వివరించి వనచరోత్తమా ? నీ యునికి యెచ్చట ? నీ నామధేయమేమి ? నీకు మాతో నేమి పని ? జానకి జాడ తెలిసినదా ? యని యడుగగా మారుతి యిట్లనెను రామా! నా పేరు హనుమంతుడందురు. వాయుతనయుడను. సుగ్రీవుని సచివుడను. సుగ్రీవుడు తన యన్నయగు వాలికి భయపడి ఈ ఋష్యమూక పర్వతముపై నివసించుచుండెను. ఇల్లు ఇల్లాలు అన్న కప్పగించి తామరాకుపై నీటి బిందువువలె నుండెను.

ఒకనాడు నేను సుగ్రీవుడు జాంబవంతుడు ఒక రాతిపై గూర్చుని వాలిని సంహరించునుపాయమును యోచించుకొనుచుండగా రావణుని పుష్పక విమానముపై నొక తల్లి విలపించుచు నేను భూ తనయను. రావణుడు నన్ను మోసగించి తీసికొని పోవుచున్నాడు ఈ నగలు రామునకొసంగుడు అని యరచుచు నగల

మూట క్రింద పడవైచినది. ఆ మూట తీసి నేను సుగ్రీవున కొసం గితిని. సుగ్రీవుడు మీకా మూటనొసంగ గలడు.

పూర్వమొకనాడు పరమేష్ఠి నన్ను చూచి వాయుసుతా ! శ్రీహరి రవి వంశమున శ్రీరాముడై యవతరించును. నీవు వానిని సేవింపుము పలుకగా నేను బ్రహ్మను చూచి తాత ! శ్రీరాముని గుర్తించుటెట్లు ? అని ప్రశ్నించితిని. అప్పుడు విరించి నన్ను చూచి నాయన ! నీవు దాల్చిన కవచకుండలములు శ్రీహరికి దక్క అన్యులకు గోచరింపవు నీ కవచ కుండలములను చూడగల్గిన వాడే శ్రీహరి యని గుర్తింపుమని బోధించెను నీవు లక్ష్మణునితో పలికిన పలుకుల వలన నా కవచ కుండలములు నీకు గోచరించినట్లు గ్రహించితిని. రామ ! నా మనస్సు నీ పాదపద్మములపై లగ్నమైనది. నేను నీ పాదదాసుడను. నిన్ను సేవించు భాగ్యము నాకు ప్రసాదింపుము. నీ కృపారసముచే నా తాపములు పోగొట్టుము. దేవా ! నీ నామమజ్ఞానికి గూడ కలుషమును తొలగించి జ్ఞానమొసంగి ముక్తి ప్రసాదించును అని పరమేశ్వరుడొకప్పుడు పరమేశ్వరికి బోధించెను.

రామ ! రావణాది రాక్షసులను సంహరించుటకై దశరథ తనయుడవై యవతరించిన శ్రీహరివే కానీ నీవన్యుడవు కాదు. శ్రీరామ జయరామ జయ జయ రామ అని యను దినమును ఇరువది యొక్క పర్యాయములు చర్చించు వారి కలుషములు నిప్పురవ్వపడిన దూదివలె దగ్ధమగును. సృష్టిస్థితిలయములకును ముక్తికిని మూల కారణమైన నీవు దుర్మార్గులను సంహరించుటకై యవతరించి యీ మార్గమున నరుదెంచితివి.

శ్రీరాముడాంజనేయుని పలుకులాలకించి సుగ్రీవుని తోడ్కొని రమ్మనెను. వెంటనే హనుమంతుడు సుగ్రీవుని సమీపించి చెట్టుక్రింద కూర్చున్న వారు రాజకుమారులు. వారిలో పెద్దవాడు రాముడు తన భార్యయగు సీతనన్వేషించుచు తమ్మునితో వచ్చెను. అంతియేకాని మీ యన్నయగు వాలి పనుపున వచ్చిన వారు కారు. నీవు సూర్య తనయుడవు. ఆ రాజకుమారులు సూర్యవంశీయులు. అంతియ కాక వారును నీవును కార్యార్థులే కావున మీరిరువురును మైత్రిచేయదగును అని పలుకగా జాంబవంతుడు ఇట్లు పలికెను. సుగ్రీవా! శ్రీహరి శ్రీరాముడై యవతరించి రావణ సంహారము చేయునని బ్రహ్మ సభలో చెప్పుచుండగా వింటిని. శ్రీహరియే శ్రీరాముడనియు లక్ష్మణుడు రాముని సోదరుడనియు సీత భార్యయనియు మునులు పురాణములు చదువుచుండగా నాలకించితిని. శ్రీరాముడు వాలిని సంహరింప గలడనియు బ్రహ్మ సభలో వింటిని.

సుగ్రీవుడు వెంటనే జాంబవంతుని హనుమంతుని వెంటనిడుకొని రామలక్ష్మణులున్న కడకరుదెంచి రామచంద్రుని పాదపద్మములకు సాగిలపడి మ్రొక్కెను. ఆంజనేయుడు సుగ్రీవుడర్క తనయుడని రామునకు పరిచయము చేసెను. శ్రీరాముడు సుగ్రీవుని కౌగిలించుకొని తన గాఢానురాగమును వెల్లడించి కూర్చుండ నియమించి యిట్లు పలికెను. సుగ్రీవా! నీ చరితమును ఆంజనేయుని వలన వింటిని. గౌతముని శాపము వలన వానరుడవైతివే కాని అధిక సుగుణ బల సంపన్నుడవని తీయని పలుకులు పలికి యాదరించెను.

సుగ్రీవుడు చేతులు జోడించి దేవా! క్షేమా కొండగుహలో నివసించుచున్నాము. మీరిరువురు నటకరుదెంచి మమ్ము కృతకృత్యులను చేయుడని వినయముగా ప్రార్థించెను. రాముడు

లక్ష్మణునితో గూడి కొండపైకేగి చంద్రకాంత శిలపై గూర్చుండెను. జాంబవదాదులును ఆయా ప్రదేశములందాసీనులైరి. అప్పుడు సుగ్రీవుడు రాఘవులను చూచి మీరీ వనమున తిరుగుటకేమి కారణమని ప్రశ్నింపగా రాముడు జరిగిన వృత్తాంతమంతయు వివరించి సీతను వెదకుచు నిచటికరుదెంచి దైవ వశమున మిమ్ము చూడగల్గితిమి. అని నిట్టూర్చిన సుగ్రీవుడిట్లనెను. రావణుడు పుష్పకవిమానముపై నాకాశ మార్గమున వెళ్ళునప్పుడు ఒక యువతి హా రామ ! హా రామ ! అని విలపించుచు ఈ కొండపై నున్న మమ్ము చూచి పయ్యెద కొంగు చింపి అమూల్యాభరణములను మూటగట్టి కొండపై పడవైచినది, నేనామూట తీసి దాచితినని గుహలోనికేగి సీత యాభరణముల మూట తెచ్చి రాముని యెదుట బెట్టెను. సీత నగలను రాముడు గుర్తించి దుఃఖాతిశయముతో మూర్ఛిల్లి కొంత తడవునకు లేచి విలపించుచుండగా సుగ్రీవుడును విలపింపసాగెను. జాంబవంతుడూరడింపగా కొంత సేపటికి ఊరడిల్లిరి.

అప్పుడు సుగ్రీవుడు దేవా ! మీరేల విచారింతురు ? కామరూపులగు నీ జాంబవదాదులలో నేయొక్కరైనను వందమంది రావణులను పరిమార్చగలరు. నేను వాలిచే పీడింపబడి సుక్కిపోతిని కాని లేనిచో రావణుడు నాకు తృణప్రాయుడు. ఒక్క క్షణములో రావణుని గూల్చి జానకిని తీసికొని రాగలను కాని వాలి భయము వలన ఈ గుహను విడువజాలను. అనిన రాముడు వానరరాజా ! మీకింత బలపరాక్రమములు కలిగియు వాలికి వెరువనేల ? అని ప్రశ్నించెను.

సుగ్రీవుడు రామలక్ష్మణులను తిలకించి యిట్లు చెప్ప దొడంగెను. ప్రభు ! రామచంద్ర ! పూర్వము దుందుభియను దైత్యుడింద్రునిపై దండెత్తెను. దుందుభిని గెలువలేక ఇంద్రుడు

భయపడి నీలగిరికి చేరెను. దుందుభి ఇంద్రుని సంపద కొల్లగొట్టి తన నెదురించు వారెవ్వరును లేరని భావించి గంధమాదనమున కేగెను. మాయావి యను సోదరునితో గూడి కదలివెళ్ళి దుందుభి వృషభరూపము దాల్చి కొమ్ములతో కొండ శిఖరములను పొడిచెను అంతనా కొండ దానవునకు మ్రొక్కి నీతో పోరాడగల వీరుడు వాలి యను వానరరాజు కిష్కింధలో నున్నాడు నీకు రణము చేయు కుతూహలమున్న యెడల అటకేగుము. అనిన వాడు కిష్కింధకేతెంచి వాలిని సమరమున కాహ్వానింపగా వాలి దుందుభితో పెనగి పడగొట్టి విజయమునందెను. పెద్ద ధ్వనితో కొండ వలె దుందుభి నేలగూలగా వాని రక్తము ఏరువలె ప్రవహించెను.

ఇరువురి పోరాటము వలనను రెండు క్రోసుల దూరమున గల పెక్కు చెట్లు కూలినవి. మతంగముని యా ధ్వని విని రక్తపు టేరు చూచి ఈ చెట్లను కూల్చిన వాడు ముప్పది దినములకు నేల కూలి మరణించును అని శపింపగా వాలి భీతితో మతంగ మునీంద్రుని దర్శించి మహర్షి సత్తమ ! దేవ బ్రాహ్మణులను పీడించు దనుజుని చంపి సజ్జనులకును లోకమునకును మేలు గూర్చితిని. కావున దయయుంచి శాపమునుపసంహరించి రక్షింపుమని ప్రార్థింపగా మతంగముని వానరరాజ ! నా యాశ్రమమునిట్లు కల్లోల పరచినందున కోపముతో శపించితిని. అని పలుకగా వాలి మతంగ ముని పాద పద్మములకు మరల మరల మ్రొక్కి శాపవిమోచన మనుగ్రహింపుమని దీనముగా వేడుకొనగా మతంగుడు వానరరాజ! నీవీ దినము మొదలుకొని ఈ ఋష్యమూక పర్వతమును చేరిన తల బ్రద్దలై చనిపోదువు. ఇతర స్థలములలో మాత్రము నా శాపము నిన్ను బాధింపదు అని యనుగ్రహించెను.

అది మొదలుకొని వాలి యిటకరుదెంచుటకు వెరచుచుండెను తన శత్రువును సంహరించినందుకు దేవేంద్రుడు మిగుల సంత

సించి వాలికి ప్రత్యక్షమై కుమార ! నా శత్రువును నీవు సంహ రించి నన్ను కృతార్థుని జేసితివి. నీ కభీష్టమైన వరమును కోరు కొనుమనిన వానరేంద్రుడు సురేంద్రునకు మ్రొక్కి దేవా ! నా యెదుట నిలిచి యుద్ధము చేయు వాని బలములో సగము నాకు లభించునట్లు వరమొసంగుమని కోరగా ఇంద్రుడు తథాస్తు అని పలికి వరమిచ్చి యంతర్ధానమయ్యెను.

రామ ! ఇంద్రుని వరము వలన వాలి అజయుఁడయ్యెను అని విన్నవించిన రాఘవుడో కపివరా ! సోదరునితో నీకింత వైరము కలుగుటకు కారణమేమని ప్రశ్నింపగా సుగ్రీవుడిట్లు వివ రించెను. రామ ! ఆ దుందుభి యను రాక్షసరాజు దానవ వీరు లతో గూడి కయ్యమునకు కాలు దువ్వుచు కిష్కింధకరుదెంచి సింహనాదము చేసెను. ఆ సింహనాదము విని వాలి యుద్ధమున కరుదెంచెను. నేనును అన్నకు తోడుగా వానర వీరులతో గూడి సమరమునకరుదెంచితిని.

దుందుభి వాలితో సమరమొనరింపలేక పర్వత గుహలో ప్రవేశించెను. వాలియు దుందుభి వెంట పర్వత గుహలో ప్రవే శించి యుద్ధము చేయసాగెను. పర్వత గుహలో వాలియు దుందు భియు నొడలెరుగక సంవత్సర కాలము పోరాడిరి. నేను గుహ వెలుపల నుంటిని. సంవత్సరమునకు గూడ వాలి గుహ వెలువడి రానందున సమరాంగణమున మరణించి యుండునని భావించితిమి. గుహ వెలువడి వచ్చి దుందుభి మీద పడునని మేము భయపడి పెద్ద బండరాయి శ్రమపడి గుహకడ్డముగా పెట్టి అచటనున్న ప్రమాదమని భయపడి వానర వీరులమందరము యోచించుకొని యటనుండి వెడలి పోవలెనని నిశ్చయించితిమి. అంతియేకాక మర ణించిన వాలికి శ్రాద్ధకర్మలు చేయవలెనని వానర వృద్ధులు చెప్పగా వారిని వెంటబెట్టుకొని కిష్కింధకేగి శ్రాద్ధకర్మలు నెరవేర్చితిని.

అనంతరము వానరులెల్లరును నన్ను కిష్కింధకు రాజుగా నుండవలెనని చెప్పగా నంగీకరించి పట్టాభిషిక్తుడనైతిని. వాలి దుందుభిని సంహరించి గుహ వెలువడి రాదలచి గుహాముఖమున గల రాతిని చూచి రాతినడ్డముగా పెట్టి వానరులు గుహ వెలుపల కాపలాగా నున్నారేమోయని తలచి తమ్ముడా ! యని పిలిచినను సమాధానము రాదయ్యెను. ఆగ్రహ పరవశుడైన వాలి అడ్డముగానున్న రాతిని పిడికిలిపోటుతో చూర్ణము చేసి బయటకరుదెంచెను. బయటకు రాగానే నలుదెసలు చూచి తమ్ముని పిలిచెను. తమ్ముడు కనుపించక అచ్చటచ్చట తమ్ముని కొరకై వెదకి వానరులెవ్వరును కనుపించని కారణమేమా యని మనసులో చింతించి రాక్షసులు హాని కలిగించిరేమోయని భావించెను. కాని యొక వానరుని వలన విషయమంతయు గ్రహించి వెంటనే కిష్కింధ కరుదెంచి సింహాసనాసీనుడై యున్న నన్ను చూచి రోమ్మున పొడిచెను. ఆ సమయమున ఇరువురకును పెద్దపోరయ్యెను.

వాలి వర బలముచేత బలాధికుడై కొట్టిన దెబ్బలు సహింపలేక ఇట కరుదెంచితిని. ఈ వానర వీరులు నాకు మిగులనాప్తులు కావున నాతో వచ్చి నాతోబాటుగ నిట నివసించుచున్నారు. నా సంపదంతయు వాలి స్వాధీనపరచుకొనెనని సుగ్రీవుడు కన్నీరు మున్నీరుగా వగచుచుండ రాముడిట్లనెను. తమ్మునకు పాలొసంగక ఇంటినుండి తరిమి గృహదారాదికము వశపరచుకొన్న దుర్మార్గుడగు వాలిని చంపి నిన్ను రాజుగా చేయుదును. సుగ్రీవుడు రాముని పలుకులాలకించి రామా ! వరప్రభావ గర్వితుడైన మాయన్న యెదుట నిలిచి పోరాడుట శంకరునకైనను సాధ్యముకాదు మరి యేమి యుపాయమున్నదని పలికిన జాంబవంతుడిట్లనెను. వీరులారా ! చాటునుండి బాణ ప్రయోగము చేసి వాలిని కూల్పవలెనే కాని వాలిని చంపుటకు వేరుపాయము లేదని పలికెను.

రాముడు సుగ్రీవుని చూచి కపివర ! నీవు వాలితో పోరాడుచున్నప్పుడు చెట్టుచాటు నుండి వాలిని కూలనేసెదను. కావున నీవు కిష్కింధకేగి వాలిని సమరమున కాహ్వానింపుమని చెప్పెను. సుగ్రీవుడు కిష్కింధకేగి సింహనాదము చేసెను. తారతో గూడియున్న వాలి తమ్ముని సమరాహ్వానము విని అజ్యము పోసిన అగ్నిజ్వాల వలె మండిపడుచు యుద్ధమునకై రాగా వాలిసుగ్రీవులిరువురును తలపడి భయంకరముగా పోరు సల్పిరి. సోదరులగు వాలి సుగ్రీవులేక రూపమున నుండుట వలన ఇరువురకును భేదము తెలియక రాముడు వాలిపై శరము ప్రయోగింపడయ్యెను. వాలి సుగ్రీవుని పడగొట్టి రొమ్మున పొడువగా సుగ్రీవుడు నెత్తురు క్రక్కుకొనుచు లేచి పరుగు పరుగున ఋష్యమూక పర్వతమును చేరెను. వాలి ఋష్యమూక పర్వతము వరకు తమ్ముని తరిమి తరిమి నగరము చేరెను.

సుగ్రీవుడు కొనయూపిరితో జాంబవదాది వీరులజేరి కన్నీరుగార్చుచు మా యన్నను రాముడు కూల్చునని మీరు పలుమారు పలుకగా విని మోసపోతిని. ఇంద్రుని జయించిన, దుందుభిని చంపిన వాలిని కూల్చుట మానవమాత్రుని వలన సాధ్యము కాదని గ్రహింపజాలకపోతిని. అన్న కొట్టిన దెబ్బలకు మిగులబాధపడితినే కాని వాలినేమియు చేయజాలనైతిని. ఇంతకును నా నుదుటి వ్రాత యిట్లుండ రామునననవలసిన పనియేమి ? అని వగచుచున్న సుగ్రీవునూరడించి జాంబవదాదులు రాముని చూచి దేవా ! వాలిని చంపకుండుటకు కారణమేమని యడుగగా రాముడిట్లనెను. వానరశ్రేష్ఠులారా ! వాలి సుగ్రీవులేక రూపమున నుండుటచేత బాణము విడువజాలనైతిని. బ్రహ్మ హత్య చేసిన వానికి కాశికేగిన ముక్తి కలుగును కాని మిత్రద్రోహి కెచ్చటికేగినను విముక్తి లేదని యుపే

క్షించితిని. నా బాణమమోఘము కావున ఏకరూపులైన వాలిసుగ్రీవులలో వాలికి బదులుగా సుగ్రీవునకు హాని కలుగవచ్చును కదా। అని యోచించి బాణము ప్రయోగింపనైతిని. అని సుగ్రీవునూరడించి సుగ్రీవా! "గతంనశోచామి కృతంస్మరామి" అను సూక్తి ననుసరించి జరిగిపోయిన విషయమును విస్మరించి జరుగబోవు విషయమును గూర్చి యోచింపుము. వాలితో సమరమొనరించునప్పుడు నిన్ను ప్రత్యేకముగా గుర్తించుటకు ప్రత్యేక చిహ్నమును దాల్చుము. దానితో వాలిని సులభముగా గుర్తించి కూల్చి వేయుదును.

రాముని పలుకులు విని సుగ్రీవుడు ఇట్లు పలికెను. రామా! వాలిలేక అన్న నన్ను పలురీతులుగా రణభూమిలో బాధించుచుండ నూరకుండి ఇప్పుడు వాలిని చంపుదననుట తగునా? వాలిచేత చావు దెబ్బలు తిని నెత్తురు కక్కుకొంటిని నీకేమి? నిన్ను నమ్మిన వారికి పుట్టగతులుండవను పండితుల పలుకులు నా యెడ ఋజువైనవి కదా!

సుగ్రీవుని పలుకులు విని శ్రీరాముడు శాంతము వహించి సుగ్రీవుని చూచి వానరోత్తమ! నీవు మరియొకసారి వాలిని సమరమునకు పిలిచి పోరాడుము. నేను వానిని తప్పక కూల్తును. అనుమానింపకుము అనగా సుగ్రీవుడిట్లనెను. రామ! వాలి దుందుభి నవలీలగా నెత్తిపడవైచెను. దుందుభి కళేబరమిటనున్నది. నీవు దానినెత్తిన నేను నీ మాట తప్పక విశ్వసింతును. అంతియే కాక ఒకే బాణముతో ఏడు తాటిచెట్లను కూల్చిన యెడల వాలిని కూల్చ గలవని నమ్ముదును.

రాముడు కాలిబొటనవ్రేలితో దుందుభి కళేబరమును మీటగా అది అయిదామడల దూరమున పడినది. వెంటనే విల్లెక్కుపెట్టి

రాముడు బాణమును ప్రయోగింపగా అది యొకేసారి ఏడు తాటి చెట్లను కూల్చి పాతాళమున ప్రవేశించి మరల నమ్ముల పొదిలో ప్రవేశించెను. సుగ్రీవుడు సంతసించి రాముని పాదపద్మములకు మ్రొక్కి రామ ! నీ మహిమ తెలియలేక ఏమేమో యంటిని. హను మంతుడును జాంబవంతుడును నీవు పరాత్పరుడవని చెప్పగా వింటిని. దేవా ! నీవు మాధవుడవని గ్రహింపక నిందించితిని. మా యన్న వలన పలుబాములు పడియుంటిని కావున భీతితో నేమియో నంటిని. నన్ను మన్నించి నాయందు కోపముంచకుము. నా మాటలు తప్పుగా నెంచక దయగా జూడుము తెలియక పలుకు పిల్లవాని మాటలను తండ్రి సహింపడా ? తెలియక ఏదియో ప్రేలి తిని. నిన్ను మించిన దైవము వేరుగా లేదని తెలిసికొంటిని. నన్ను బ్రోవుము. అని సుగ్రీవుడు రాముని పాదములపై బడెను.

శ్రీరాముడు సుగ్రీవుని లేవదీసి చేతులతో నిమురుచు లక్ష్మ ణుని పిలిచి సోదరా ! ఒక పూలమాల తెచ్చి సుగ్రీవుని మెడలో వేయుము. అని పలుకగా సౌమిత్రి యట్లే చేసెను.

అంత రాముడు సుగ్రీవుని చూచి నీవు వాలితో రణమొన రించునప్పుడు వాలిని కూల్చివేయుదును. నిర్భయముగా సమర భూమికేగుము అని ధైర్యము గరపి తానును ధనుర్బాణములు చేత బూని సోదర సహితుడై కిష్కింధ సమీపమున గల యుద్యానవన మున చెట్టుచాటుననుండెను.

సుగ్రీవుడు కిష్కింధకేగి అన్నను యుద్ధమునకు పిలిచెను. తమ్ముని పిలుపు విని వాలి యుద్ధమునకు బయలుదేరబోగా తార యిట్లనెను. నాథ ! యుద్ధ ప్రయత్నములు మానుము. వన ములో తిరుగుచున్న అంగదాదులకు తమ్మునితో గూడి భార్యను వెదకుచున్న రాముడు గోచరించెననియు సుగ్రీవుడును రాము

డును మైత్రి చేయుచున్నారనియు వింటిని. రాముడు వాలిని కూల్తునని ప్రతిన చేసెనట. కావున సుగ్రీవునితో సమరమునకు తలపడుట తగదు. నిన్న యోడిపోయిన సుగ్రీవుడీనా డేప్రోత్సాహకము లేనిదే మరలనేల సమరమున కరుదెంచునో యోచింపుడు.

వాలి తార హితవచనములాలించి కాంతా! వీరుడనగు నేను యుద్ధమునకాహ్వానింపబడియు వెళ్ళనిచో నెల్లరు నగరా? సుగ్రీవునే కాక వానికి ప్రాపుగా వచ్చిన వానిని కూడ దునిమి వచ్చెద నని ధైర్యవచనములు పలికి తారను వెనుకకు బంపి తాను వేగముగా పోయి సుగ్రీవుడి రొమ్మున పొడిచెను. సుగ్రీవుడన్న తలపై పిడుగువంటి పోటుపొడిచెను. అన్నదమ్ములిరువురును ఒకరి కొకరు తీసిపోకుండగ ఘోరముగా పోరాడుచుండిరి.

చెట్టు చాటున గూర్చున్న శ్రీరాముడు విల్లు చేతబట్టి శరము సంధించి వాలిపై ప్రయోగింపగా వజ్రాఘాతము చేత రెక్కలు తెగిన కొండవలె నేలగూలెను. సుగ్రీవుడు వెంటనే అన్నను చేరి ముఖమంతయు వ్యాపించిన చెమట బిందువులు తుడుచుచు దుఃఖింపజొచ్చెను.

మారుతి మున్నగు వారును రామలక్ష్మణులును సుగ్రీవునూ రడించిరి. వాలి మూర్ఛదేరి రాముని చూచి నీవెవరవు? నీ నివాస మెయ్యది? ఇటకేల వచ్చితివి? ముగ్ధయైన వాడు ధనుర్బాణములు దాల్చునా? నీ పేరేమి? తండ్రి యెవరు?

చెట్టుచాటున పొంచియుండి, పోరాడుచున్న వారిలో నొకనిని పడగొట్టుట దుర్మార్గము కాదా? రాముడు వాలి ప్రశ్నకిట్లు సమాధానమిచ్చెను. మాది సూర్యవంశము. నన్ను రాముడందురు. మా తండ్రియగు దశరథ మహారాజు నానతిచే 14 సంవత్సరములు అరణ్యవాసము చేయుటకై భార్యతోను సోదరుడితోను

కలసి వచ్చితిని. మా నివాసము యోధ్య మేము ముగ్గురము అర ణ్యములో నివసించుచుండగా రావణుడు నా భార్యయగు సీతనప హరించెను. తమ్ముడగు సౌమిత్రితో కలిసి యరణ్యములో సీతను వెదుకుచుండగా సుగ్రీవుడు మాకు కనిపించి రావణుడు తీసికొని పోవుచుండగా సీతను చూచితిమని చెప్పెను. అంతియేకాక అసు రులనుదుంచి సీతను తెచ్చుటకు తోడ్పడెదనని ప్రతిన చేసెను. సుగ్రీవుని గృహమును వశపరచుకొనుటయే కాక భార్యను కూడ అపహరించి పెక్కు రీతులుగా బాధించితివని నాతో మొరపెట్టు కొనెను.

అంత వాలి యిట్లు సమాధానమిచ్చెను. రామ ! నిజముగా నీవు రాజువా ? చెట్టుచాటునుండి పడగొట్టుట రాజనీతియా ? కొందరు మాంసమునకై వానరులను వేటాడుదురు. నీవట్లు వేటాడుటకు రాజువు కావా ? సీతను తీసికొని రమ్మని నాతో నన్నైతివి కదా ? రావణుడు సీతను తెచ్చి యిచ్చునట్లు క్షణములో చేయుదును కదా!

రాముడు వాలి పలుకులు విని వానరోత్తమ ! నేను సూర్య వంశరాజునై యుండియు రాజధర్మమును వీడి ఒక దానవుని గెలువలేక సీతను తెచ్చి యిమ్మని వేడుటయు నీవు సీతను తెచ్చి యిచ్చుటయు నేను స్వీకరించుటయు విన్న యెడల రాజులు నవ్వరా ? రావణుని కంటె వాలి మహాబలశాలి కావున రాముడు యాచించెననియు వాలి దయతో సీతను తెచ్చి యిచ్చెనే కాని రావ ణుని జయించి రాముడు సీతను తెచ్చుకొనలేక పోయెననియు లోకులాడు మాటలు సహించుటెట్లు అంతియేకాక రావణునితో సమాన బలశాలియగు సుగ్రీవుడు భార్యా విరహితుడై వనమున నుండెను. వాని తోడ్పాటుతో దశముఖుని కూల్తును. సుగ్రీవుడి తోడ్పాటుతో రావణుని చంపి సీతను తెచ్చుకొంటినను కీర్తి లభించును. కూతురు

చెల్లెలు కోడలు సోదరుని భార్య సమానమని యెంచక ద్రోహము చేసితివి కావున నిన్ను శిక్షించితిని అని పలుకగా వాలి దీనముగా రాముని చూచుచు రామ ! బాధ సహింపలేకున్నాను. బాణమును తీసివేయుమని కోరెను.

వాలి మరణ వార్త విన్న తార మున్నగు నంతఃపుర స్త్రీలు అంగదుడు మున్నగు వారితో నరుదెంచిరి. బాణమును తొలగించున ప్పుడు రాముని కరము తాకి దివ్యజ్ఞానము కలిగిన వాలి రాము డాది నారాయణుడని గ్రహించి రామచంద్ర ! అజ్ఞానము చేత నిన్ను దూరిన నన్ను మన్నింపుము. పుట్టిన వారు గిట్టక తప్పదు. కావున నీ చేతిలో మరణము లభించుట వలన నాకు ముక్తి లభిం చునని పలురీతులుగా నుతించి అంగదుడి చేతిని రాముని చేతిలో నుంచి యప్పగించి రామనామము స్మరించుచు దివ్యధామమును చేరెను.

ఆ సమయమున తారాది కాంతలు, సుగ్రీవాంగదాది వానర ప్రముఖులు విలపించుట చూచి రామలక్ష్మణులు జాంబవదాది వృద్ధ వానరులు ఊరడింపు పలుకులు పలికి వాలికి దహనాది సంస్కారములొనర్చుటకు తగిన యేర్పాట్లు చేయుడని హెచ్చ రించిరి. సుగ్రీవుడంగదు నూరడించి వాలికి దహన సంస్కారము శ్రాద్ధకర్మలు చేయించెను.

పదునైదవ దినమున రాముడు సుగ్రీవుని కిష్కింధాధి పతిగా పట్టాభిషేకము చేయించెను. సీతను వెదకుటకై వానర వీరు లను సంసిద్ధము చేయుమని సుగ్రీవునకు చెప్పి యింతలో వర్షా కాలమరుదెంచుట వలన ప్రవర్షణ పర్వత గుహలో రామలక్ష్మ ణులు నివసింపజొచ్చిరి. సీతా వియోగమునకు మిగుల పరితపిం చుచు శ్రీరాముడు వర్షాకాలము నతి కష్టముగా గడపెను.

వర్షాకాలమేగి ప్రకృతిలో కనుపట్టు శరత్కాల చిహ్నము లను శ్రీరాముడు తిలకించి తమ్మునితో సౌమిత్రీ ! వానలు వెనుక బడినను సుగ్రీవుడు రాని కారణమేమైయుండును ? సీతాన్వేషణకై వానరుల నెప్పుడు బంపును? అని ప్రశ్నింపగా లక్ష్మణుడుధనుర్బా ణములు చేబూని అన్నా ! సుగ్రీవునిటకు తోడ్కొనివత్తును. అను మతినిమ్ము. అని మ్రొక్కి సెలవు తీసికొని ఆగ్రహముగా కిష్కిం ధకేతెంచి సుగ్రీవుని గృహ సమీపమునకు రాగా వానరులు సుమిత్రా తనయుని చూచి భీతితో మారుతి చాటునకు చేరగా మారుతి లక్ష్మణుని సమీపించి నమస్కరించెను.

లక్ష్మణుడాంజనేయ ! సుగ్రీవుడు రాజ్యమదమున భార్యా లోలుడై రామకార్యము మరచి యింట కులుకుచున్నాడు కాబో లును బ్రహ్మవ్రాత తప్పినను రాముని బాణము గురి తప్ప దనియు, వాలిని గూల్చిన శరమింకను తుప్పు పట్టలేదనియు మీ రాజునకు తెలియజేయుము అని పలుకగా మారుతి లక్ష్మణా ! అన్ని దిక్కులందును గల వానరులను రావించుటకు సుగ్రీవుడు దూతలనంపెను. వారందరును నేడు రాగలరు అని చెప్పి వెంటనే సుగ్రీవుని సమీపించి లక్ష్మణుని మాటలను వినిపించెను. సుగ్రీ వుడు భీతిచెంది లోపలి గృహమునకేగుచున్న సమయమున తార చూచి రాఘవులు ఆపదచే మిగులగుందుచుండిరి. వారికిచ్చిన మాట తప్పిన యెడల వాలికి పట్టిన గతియే నీకును పట్టుట తథ్యము ఇప్పుడు లోనికేగిన ముప్పు తప్పదు అని చెప్పగా సుగ్రీవుడు ధైర్యము తెచ్చుకొని జాంబవదాది వానర వీరులతో కలిసి లక్ష్మ ణుని సమీపించి మ్రొక్కి అన్ని చోట్లగల వానరులను తోడ్కొని వచ్చుటకు దూతలేగిరి. నేడో, రేపో రాగలరు. వారి కొరకెదురు చూచుచుంటిని. కొందరు వచ్చిరి. కొందరు రానున్నారు, మీ ప్రయత్నముననే యుంటిని రక్షింపుమని మ్రొక్కెను.

లక్ష్మణుడు సుగ్రీవాదులను కూడి రాముని సమీపించు సమయమున సముద్రము పొంగి వచ్చుచున్నదేమో యని యోచించి వానర సైన్యమని నిర్ణయించి యుత్సుకతతో నుండెను. సుగ్రీవుడు రాముని యెదుటకేగుటకు వెరచి వెనుకకొదిగి యుండ వాని భావమెరింగిన లక్ష్మణుడు రామునకు మ్రొక్కి యిట్లనెను. అన్నా నీవు కోపింతువని వెరచి యిచట సుగ్రీవుడొదిగి యున్నాడని విన్నవింపగా రాముడు సుగ్రీవుని చేర బిలిచెను.

సుగ్రీవుడు రాముని పాదపద్మములకు మ్రొక్కి నిలబడగా రాముడు జాంబవదాదుల గూర్చుండ నియమించెను. ముప్పది యోజనముల వైశాల్యము గల వానర బలములో గొందరు తెల్లవారును కొందరెర్రవారును కొందరు నీలవర్ణము వారును కొందరు పాటల వర్ణమువారును కాగా మరి కొందరు చిత్రవర్ణముల వారునై మిన్నుముట్టునట్లు పైకెత్తబడిన తోకలు పర్వతాకారములు కలిగి ఆకాశము దద్దరిల్లునట్లు సింహనాదములు చేయుచు రాఘవులకు మ్రొక్కి సుగ్రీవునాజ్ఞననుసరించి యరుదెంచిన మేము లోకములను లోకేశులను కట్టి మీ పాదముల చెంత బెట్టెదమని వీరాలాపములు చేయు వానర పుంగవులను చూచి సంతసించి శ్రీరాముడు సుగ్రీవాదులను చూచి సీతయున్న చోటు తెలిసిన కాని సైన్యములు పంపుటతగదని పలికెను,

రామలక్ష్మణులును సుగ్రీవుడును యోచించి తూర్పునకు సుషేణుని, యుత్తరమునకు గంధమాదనుని పశ్చిమంబునకు దధిముఖుని పంప నియమించి సీత విశ్వసించుటకు తగిన సంకేతములు తెలిపి జానకిని దర్శించిన యెడల సీతనడిగి శిరోరత్నమును తెండని యానతిచ్చి పంపెను.

దక్షిణ దిక్కున రావణుడు కలడు కావున ప్రజ్ఞా ధైర్యసాహసాది గుణములు కలవారిని పంపవలెనని నిశ్చయించి అంగదుడు ఆంజనేయుడు నలుడు నీలుడు జాంబవంతుడు మున్నగు వానర శ్రేష్ఠులను పిలిచి మీరు మిగుల బలశాలురు కామరూపులు రావణుని లంకలో జానకి యుండవచ్చును కావున జాగు సేయక దక్షిణదిశగా నేగుడని నియమించిన పిదప శ్రీరాముడాంజనేయుని ఏకాంత స్థలమునకు పిలిచి రహస్యముగా నిట్లనెను. మారుతీ ! నీవు నా భక్తులలో అగ్రేసరుడవు. ధైర్యసాహసాది గుణములలో సాటిలేనిమేటివి నీవు సీతను చూచిన యెడల కాకముపై బ్రహ్మాస్త్రమును ప్రయోగించుట గుర్తు చేయుము. ఈ నా యుంగరము ఆనవాలుగానిచ్చి సీత శిరోరత్నము ఆనవాలుగా నడిగి తెమ్మని యానతిచ్చెను. అంత జాంబవదాదులు శ్రీరామలక్ష్మణుల యొక్కయు సుగ్రీవుని యొక్కయు అనుమతిని స్వీకరించి దక్షిణ దిశగా పయనమైరి.

తూర్పు పడమరలకును ఉత్తర దిశకును వెడలిన వానర వీరులు దిగంతముల వరకేగి సీతను కానక వెనుకకు తిరిగి వచ్చి యా విషయమును సుగ్రీవునకు విన్నవించిరి.

దక్షిణ దిశకేగిన వారు కొండలు గుట్టలు వనములు సీతకై గాలించి సీత కనుపింపక సముద్రతీరము చేరి యొకచోట గూర్చుని తమలోతామిటు తర్కించుకొనిరి. సీతను దర్శింపకయే వెనుకకు మరలి వెళ్ళిన యెడల మనలను శిక్షింతురో లేక రామలక్ష్మణులు ప్రాణత్యాగమొనరింతురో కావున మనము కిష్కింధకేగి సీత జాడ తెలియజాలక పోతిమని తెలుపుట కంటె నిచ్చట ప్రాణత్యాగమొనరించుట మంచిదని యెంచి ప్రాయోపవిష్టులై కుశాసనములందుపవిష్టులై యుండగా సమీప గుహలోనున్న సంపాతియను పక్షిరాజు వానరులను చూచి చిరకాలమునకు నాకు దైవమాహారము

కల్పించెనను సంతోషముతో గుహ వెలువడి వచ్చుచుండగా వానర వీరులు చూచి రాక్షసరాజా ? లేక యముడా ? ఆ వచ్చునది. మన లనిట నుండి పోనీయక చంపి తినేయునేమో ? ఎట్లైనను చావు తప్పదు. అని నవనీలాంగదాదులు పలుకుచుండగా జాంబవంతు డిట్లు పలికెను. కైక రాముని పట్టాభిషేకమునకేల విఘ్నము కల్గించెను ? రాముడు భార్యను వెంటబెట్టుకొని యడవులకేల వచ్చెను ? రావణుడు సీతనేల యపహరించెను ? రావణుని బారి నుండి జానకిని విడిపించుటకు పోరాడుచు జటాయువేల మరణించెను ? రామ సుగ్రీవులకేల చెలిమి కలిగెను ? సీతనన్వేషించుటకు మనలనేల బంపిరి ? సీతను దర్శించి రామకార్యము నిర్వహింపలేకపోతిమి, దీనికాహారమగు గతి మనకు పట్టినది కదా !

సంపాతి జాంబవంతుని పలుకులాలకించి వానరులారా ! జటాయువు నా సోదరుడు. నన్ను సంపాతి యందురు. రావణుడు నా తమ్ముని యుద్ధములో చంపెనంటివి కదా ! ఆ వివరములు నాకు తెలియజేయుమని కోరగా జాంబవంతుడిట్లు సమాధానమిచ్చెను సంపాతీ ! రావణుడపహరించి తీసికొనిపోవుచుండగా సీత చేసిన యార్తనాదము విని జటాయువు రావణునితో పోరాడి విడిపింతునని వెళ్ళగా రావణుడు జటాయువు రెక్కలు నరికి కూలగొట్టెను.

సంపాతి తమ్ముని మరణవార్త విని శోక సాగరమున నిమగ్నుడై రావణునిపై పగబూని వానరులను చూచి మిత్ర భావముతో నిట్లు పలికెను. వానర శ్రేష్ఠులారా ! లంకలో సీతయున్నట్లు నా కండ్లకు కనుపించుచున్నది. నేనెగురగల్గిన యెడల సీత నర నిమిషములో తెచ్చేడివాడను. అంతనంగదుడిట్లు అడిగెను పక్షిరాజువగు నీకు నేలపై నడువ పలసిన గతి యేల కలిగినది ? 'సంపాత యిట్లు సమాధానము చెప్పెను. నేనును, నా తమ్ముడు

జటాయువును ఒకనా డడవిలో విహరించుచుండగా మా యిద్దరిలో నెవరు బలశాలురా యను జిజ్ఞాస కలిగి సూర్యమండలము ప్రవేశించి మరలి వచ్చువాడు మిగుల బలవంతుడని పందెము వేసికొని గగన విహారమునకు బయలుదేరితిమి. ఇరువురము 96 వేల ఆమడల దూరమేగితిమి. నా తమ్ముడు సూర్యుని వేడికి మూర్ఛపోగా నేను రెక్కలు చాపి తమ్మునకు గొడుగువలె పట్టితిని. నా రెక్కలు సూర్యుని వేడికి కమిలిపోయి క్రింద కూలితిని. నా తమ్ముడెచ్చట కూలెనో, ఏమయ్యెనో తెలియక చింతించుచున్న నేను మా తమ్ముని రావణుడు సంహరించుట మీ వలన వింటిని. ఇప్పుడేమి చేయగలను ? అని దుఃఖించుచున్న సంపాతిని చూచి అంగదాదులు ఇట్లూరడించిరి. పక్షిరాజ ! శ్రీరామచంద్రుడు నీ తమ్మునకు దహనాది సంస్కారములు చేసి కైవల్యమొసంగెను కావున వానిని గూర్చి చింతింపబనిలేదు.

సంపాతి వానరులను చూచి అయ్యలారా ! నన్ను సముద్ర తీరమునకు తీసికొనిపొండు. తమ్ముని మరణవార్త వింటిని కదా ! స్నానమొనరించి యిన్ని నీళ్ళు విడిచిపెట్టెదను. అని కోరగా నొక్క వానరుడంగదుని యనుమతి గైకొని సంపాతిని సముద్ర జలము కడకు తీసికొని వెళ్ళెను. సంపాతి సముద్రములో స్నానముచేసి తమ్మునకు తర్పణ చేసి గట్టున గూర్చుని శ్రీరాముని పాదపద్మములను ధ్యానించుచుండెను. వానరులు మరల సముద్ర తీరమును చేరిరి.

* * *

# విచిత్ర రామాయణము

## సుందర కాండము

శ్రీరామచంద్రుడు పౌరాణికులను చూచి బాలకులార! అంగదజాంబవదాదులు సీత నేరీతిగా నన్వేషించిరో వివరముగా తెలియజేయుడని పలుకగా లవకుశలు తదనంతర కథనిట్లు చదువ సాగిరి. అంగదుడు వానర వీరులను చూచి మనలో నెవరు సముద్రము దాటి తొందరగా రాగలరో తెలుపుడని ప్రశ్నింపగా నా వానరులొక్కొక్కరిట్లు తెలుపజొచ్చిరి. మైందుడు యువరాజా! నేను పది యోజనముల వరకు సముద్రమును దాటగలనని పలుకగా వృషభుడు ఇరువది యోజనము లెగురగలననెను. గవయుడు ముప్పది యోజనములని చెప్పగా గజముఖుడు నలుబది యోజనముల వరకేగుదుననెను. ద్వివిదుడు అరువది యోజనములనియు నలుడు డెబ్బది యోజనములనియు నీలుడెనుబది యోజనములనగా జాంబవంతుడు తొంబది లేక నూరు యోజనముల వరకు వెళ్ళగలను కాని తిరిగి రాజాలననెను.

అంతనంగదుడు జాంబవంతుని చూచి నూరు యోజనముల సముద్రమును దాటియు తిరిగి రాజాలనని నిరుత్సాహపడుటకు కారణమేమని ప్రశ్నింపగా జాంబవంతుడిట్లు పల్కెను. అంగదా! ఒక పర్యాయము భూప్రదక్షిణము చేయునప్పుడొక కొండ పిక్కలో చిక్కుపడినది. బరువైన వస్తువునెత్తునప్పుడు కాని దూర మెగురునప్పుడు కాని కాలిలోని కొండ బెణికి కలుక్కుమని కదల నీయదు. కావున నేదో రీతిగా సాగరమును దాటినను తిరిగిరాజాలను.

జాంబవంతుని పలుకులు విని అంగదుడు సముద్రము దాటి లంకలో సీతను చూచి రాగలనో లేక అచట చిక్కుపడుదునో యని జంకుచున్నాననగా జాంబవంతుడు రాకుమార ! మన మీపనికి సమర్థులము కాము. హనుమంతుడు మనకు కొండంత యండగా నుండగా ఇతరులను వేడవలసిన పని లేదు. అని పలుకగా వానరు లెల్లరును హనుమంతుని చుట్టును చేరి అంజనేయ ! సాగరమును దాటి సీతను దర్శించి వచ్చుటకు కార్యమును సఫలము చేయుటకు నీవలె నెవ్వరును సమర్థులు కారు. అని పలు రీతులుగా ప్రోత్స హించుచుండగా అంగదుడు హనుమంతుని చూచి మారుతీ ! నీవు వానరులలో పెన్నిధి వంటివాడవు. సముద్రము లంఘించి లంకలో ప్రవేశించి సీతను సందర్శించి వచ్చి మమ్ము బ్రతికింపుము. ఇకనే మాత్రమాలసింపక పయనమై వెళ్ళి కార్యమును సాధించి మహా యశమునార్జింపుము అని కోరెను. అంతనాంజనేయుడు నూరు యోజనముల సాగరమును దాటి సీతను చూచి రాగలనని పలికి యాకసమునకెగుర బోవగా నా పర్వతము కృంగినది. సాగరము లన్నియు కలగినవి. ఒక ముని నన్ను పుడిసిటబట్టెను. ఒక కోతి నన్ను దాటిన నాకింక పరువేముండును ? అని సాగరమెంచి పొంగెను. పొంగుచున్న సాగరమును చూచిన దాటుటెట్లాయని నా మనసూగులాడుచున్నది. అని హనుమంతుడు భావించి రాముడు నా పాలనుండ సాగరము దాటుటొక లెక్కా యను దృఢ నిశ్చయ ముతో విజృంభించి పాదములు నేలపై గట్టిగా నొక్కిపట్టి భుజములు చాపి లంకపై దృష్టి ప్రసరింపజేసి చేతులు జోడించి కొండ క్రుంగు నట్లాంజనేయుడెగిరెను. గగన మార్గమున లంకకు పయనించు చున్న ఆంజనేయు ననుసరించి కొండపై గల చెట్లుగాలి వేగమున పోవుచు దూరదేశమేగు మిత్రుని సాగనంపు మిత్రుల వలె విల విల్లి మిత్ర వియోగమును సహింపజాలనట్లు సాగరములో పడినవి.

ఆకాశ మార్గమున పయనించు వాయు తనయుని చూచి కడలి ఆంజనేయునితో చెలిమి మేలని తలంచి మైనాకుని పిలిచి పర్వతోత్తమా ! నీవు గగనమునకెగసి హనుమంతుని దర్శించి క్షణ కాలము విశ్రమించి వెళ్ళుమని కోరుమనగా మైనాకుడు వాహినీపతి యగు సముద్రుని చూచి హనుమంతుడెవడు ? ఆకాశ మార్గమున లంకకు పయనించుటకు కారణమేమని ప్రశ్నించెను.

సాగరుడు పర్వతరాజ ! సూర్యవంశీయులగు సగర తనయుల వలన నేను వృద్ధినందితిని. అట్టి సూర్యవంశ దీపకుడైన శ్రీరాముని పని నిమిత్తమై వాయు తనూజుడైన హనుమంతుడేగుచుండెను. రామదూత మనకును బంధువే వానిని సత్కరించుట మన ధర్మమని వివరించి చెప్పగా మైనాకుడంగీకరించి పది యోజనముల పొడవు, పది యోజనముల వెడల్పు కలిగి హనుమంతుని దారికడ్డుగా నిలబడెను.

వేగముగా పోవుచున్న హనుమంతుడు దారికడ్డుగా నిలిచిన మైనాకుని చూచి దానవుడని తలంచి రొమ్ముతో తాకెను ఆ తాకిడికి మూర్ఛపడిన మైనాకుడు కొంతసేపటికి తెలివివచ్చి లేచి హనుమంతుని చూచి మహాభాగ ! నేను పర్వత రాజగు హిమవంతుని తనయుడను. నన్ను మైనాకుడందురు. దేవేంద్రుడు వజ్రముతో పర్వతముల రెక్కలు నరకుచుండగా చూచి నేను భయపడి సముద్రుని శరణు జొచ్చితిని. అతిథివగు నీకు తగిన మర్యాదలు చేయుటకై సముద్రుడు నన్ను నియమించెను. నీవిచట నొక నిమిషము విశ్రమించి ఫలములు భుజించి దాహము తీర్చుకొని వెళ్ళుము. అని ప్రార్థింపగా మారుతి చేతితో స్పృశించి మైనాకుని మన్నించి వెడలిపోయెను.

అంతనింద్రుడట కరుదెంచి మైనాకుని చూచి ఆంజనేయునకు మర్యాదచేసి దేవకార్యమునకు తోడ్పడితివి కావున నీవు రెక్క

లతో స్వేచ్ఛగా సంచరింపవచ్చునని వరమొసంగి స్వర్గమునకు చేరి నాగమాత యగు సురసను చూచి ఆంజనేయుడొంటరిగా లంక కేగుచున్నాడు. అట రక్కసులు పెక్కుమంది కలరు. కావున నీవేగి హనుమంతుని బలపరాక్రమములరసి రమ్మని యాజ్ఞాపించెను.

అంతనా సురస ఆకాశ మార్గమున హనుమకడ్డముగా నిలిచి పది యోజనముల వెడల్పున నోరు తెరచి ఓయీ వానరమ ! నీవు నాకాహారమగుము, అని పిలువగా అది తనపని కాటంకము కలి గించు రక్కసియని తలచి యో రక్కసీ ! లంకలో సీతను చూచి వచ్చిన పిదప నీకాహారమగుదును నన్ను పోనిమ్ము అని పలుకగా గుహవలె నోరు తెరచి మ్రింగబోగా హనుమ తన దేహము నిరువది యోజనములు పెంచెను.

సురస ముప్పది యోజనములు నోరు తెరువగా నాంజ నేయుడు నలుబది యోజనముల దేహము పెంచెను. నాగమాత ఏబది యోజనముల దేహము పెంచగా హనుమంతుడు అరువది యోజనముల దేహము పెంచెను. సురస 80 యోజనముల నోరు పెంచగా హనుమంతుడు తొంబది యోజనములు దేహము పెంచెను అంత సురస తన నోరు నూరు యోజనములు పెంచెను. అప్పు డాంజనేయుడు తన దేహము కుంచించి సురస కడుపులో ప్రవేశించి మరలివచ్చి యిట్లనెను. ఓ వనితా ! నేను బయలుదేరిన పనిని పూర్తి చేసికొని తిరిగి వచ్చునప్పుడు నీ యాకలి దీర్తునని చెప్పి నను నీవు వినిపించుకొనవైతివి. నీ కడుపులో ప్రవేశించి తిరిగి వచ్చితిని నీ యాకలి తీరినదా ? అని ప్రశ్నింపగా నాగమాత నిజ రూపము దాల్చి యో వానరవీర ! నీ మహిమ వర్ణింపదరముకాదు దేవతలు నీ దృఢమైన మనస్సును బలోపాయములను తెలియు టకు పంపగా వచ్చితిని. రామదూతవగు నీకు జయమగుగాక ! అని దీవించి సురస వెడలిపోయెను.

అనంతర మావాయుతనూభవుడు మరల గగన మార్గమున నేగుచుండగా ఛాయాగ్రాహి యను జలచరము కోపముతో హనుమంతుని నీడనొడిసిపట్టి మింగెను. హనుమ దాని యుదరము చీల్చి సూర్యాస్తమయ సమయమునకు వేలాద్రి చేరెను. ఆ కొండపై నున్న వృక్షములు హనుమంతునిపై పూలవాన కురిసినవి. హనుమంతుడచట నుండి లంకను పరిశీలనగా చూచి లంకాప్రాకారములు దాటుటకు శక్యము కాకున్నవి. లంకలో నెట్లు ప్రవేశింతును ? జానకినెట్లు వెదుకుదును ? లక్షోపలక్షలు రాక్షసులు హుంకారములు చేయుచున్నారు. వారు కానరాకుండ నగర ద్వారమున ప్రవేశింతును అని యాలోచించి శరీరము తగ్గించి కార్యతత్పరుడై లంకలో నెడమ పాదముంచెను. అంతలో లంకిణి యను రక్కసి హనుమంతుని చూచి యిట్లనెను. ఎవడవురా నీవు ? ఏ పనికై నీవిటకరుదెంచితివి ? క్రొవ్వణచి యమసదనమున కనిపెదను. నా దెబ్బరుచి చూడుమని మారుతి రొమ్మున కొట్టెను.

హనుమంతుడు పిడికిలి బిగించి నీ వెవ్వతెవు ? అని యొక్క గ్రుద్దుగుద్దెను. అంతనా లంకిణి వజ్రాఘాతముచే గూలు కొండవలె నేలగూలి దొర్లుచునిట్లనెను. కపికుంజర ! నీ బలము మెచ్చితిని. తొల్లి బ్రహ్మ నన్ను సృజించి లంకను పాలించుమని యానతీయగా బ్రహ్మను నుతించి పితామహ ! నన్ను రాక్షసుల పంచనుంచుట తగునా ? దయజూపుమని ప్రార్థింపగా కొంచెము యోచించి ప్రారబ్ధమనుభవింపక తీరదని యూరడించి శ్రీహరి మానవుడై యవతరించి రావణుని దుంపగలడు. రామదూతయగు నాంజనేయుని దెబ్బతిన్న పిదప నీకు లంకనుండి విముక్తి కలుగగలదు అంతవరకు వేచియుండుము. హనుమంతుని చేత నీవు దెబ్బతిన్నప్పటి నుండియు లంక నశింపగలదని యాదేశించెను. అప్పటినుండియు నీ కొరకు వేచియుంటినని విన్నవించెను.

అంతనాంజనేయుడు లంకలో ప్రవేశించి యంతటను సీత నన్వేషించి యెచ్చటను సీత జాడ కనబడక యర్ధరాత్రి సమయమున రావణుని యంతఃపురమున ప్రవేశించి యచటి వనితలను చూచి తనను తాను నిందించుకొని అటనుండి రత్న స్తంభ మంటపమున పలు రకములగు వాద్యములు మ్రోగించి యలసట చెంది నిద్రించుచున్న దేవ దానవ కాంతల నడుమ హంసతూలికా తల్పమున మినుముల రాశి వలె శయనించియున్న దశగ్రీవుని కౌగిలిలో నిద్రించుచున్న మందోదరిని చూచి సీత యని భావించి కొంత తడవు యోచించి రాముని ల్లాలు ప్రాణములైన విడుచును కాని పర పురుషుల నంగీకరింపదు ఈ దురాత్ముని యందనురాగము కలిగి సుఖించునా ? హరి హరీ ! ఇంత దురాలోచన చేసితినేమని తనను తాను నిందించుకొని మెల్ల మెల్లగా బయటకేగి యొక చైత్యమున గూర్చుని సీతను చూడలేకపోతినే యని యొక క్షణము చింతించెను.

అచటకు సమీపమున గల యశోకవనము నుండి వినిపించు శుకపికాలాపము లాలకించి హనుమంతు డా ప్రదేశమునకేగి జానకి నన్వేషించుచుండ రాక్షస స్త్రీ పరివేష్టితంబగు నొక యశోక వృక్షము క్రింద ఇందిరవలె సుందరియు ధూళి ధూసరిత గాత్రియు కృశోదరియు ఏకవేణియు మలినాంబరయునై కన్నీరు గార్చుచు నిట్టూర్పులతో కమలి యెండిపోయిన పెదవులు మాటి మాటికి తడుపుకొనుచు నిద్రాహారములు మాని రామచంద్ర పదారవింద ధ్యానతత్పరయై రామ రామ యని విలపించుచు తల యొంచుకొనియున్న యొక కాంతను చూచి ఆ చెట్టెక్కి సీతయని గ్రహించి యెట్లు మాట్లాడుటాయని యోచించుచుండెను.

శయనాగారమున నిద్రించుచున్న రావణుడు నిద్రలేచి సీతను తలచుకొని కాంతామణులు వెంటరాగా రెండు ప్రక్కల కర

దీపికలు ధరించి భటులు దారి చూపుచుండగా యశోక వనమున కరుదెంచి జానకిని చూచి కాంతామణీ! కందమూల ఫలాదులు భుజించుచు దిక్కుతోచక వనములో కృశ్శుచున్న రామునికై చింతింపనేల? సముద్రము దాటి వచ్చుట సురాసురులకైనను సాధ్యము కాదు. ఇక మానవులకెట్లు సాధ్యమగును? ఇంద్రాదుల కజేయుడనైన నన్ను జయించి నిన్నెట్లు గొనిపోవును? అనవసర శ్రమనొందక నన్ను చేబట్టి స్త్రీలెల్లరూడిగములు సేయుచుండ అఖండ సామ్రాజ్య వైభవముననుభవింపుము. చింతయుడిగి లేవి రమ్మని యనేక విధముల ప్రార్థించుచుండెనని కుశలవులు తెలుపగా దాశరథులు సభలోనున్నవారు కన్నీరు మున్నీరుగా విలపించుచు కర్మఫలమనుభవింపక తీరదని పలుకజొచ్చిరి.

రాముడు లవకుశులను చూచి బాలులార! ఆదిలక్ష్మి సీతయయ్యెనని తొల్లి మీరు వచించితిరి. లోకమాతను రావణుడెట్లపహరించెను? దురాలాపము లెట్లాడెను? ఇందిరాదేవి యిట్టి యవమానము ఏల సహింపవలసివచ్చెను? అని ప్రశ్నింపగా లవకుశులిట్లు చెప్ప దొడంగిరి.

పూర్వమింద్రాది దేవతలు విష్ణువుకడకేగి దుర్మార్గుడగు రావణుడు దేవతలను బాధించి వారిని వారి స్థానములనుండి తొలగించి యాస్థానములలో దనుజులను నియమించెను. నీ భక్తులమగు మమ్ము కానలకు తోలెను. మమ్ము కాపాడుమని పాదములపై వ్రాలి మొరపెట్టగా శ్రీహరి వారికి ధైర్యము గరపి దేవతలారా! శివుడు రావణునకు ప్రసాదించిన జీవిత కాలమున్నదా? లేదా? బాగుగా యోచించి తెల్పుడనగా పరమేష్ఠి యిట్లనెను. దేవా? పరమేశ్వరుడు రావణునకొసంగిన యాయుర్దాయములో సగము గడచిపోయినది. అని పలికి రహస్యముగా తండ్రీ!

మాయమ్మ ఇందిరమ్మ భూమిపై నవతరించి రావణునిచే నపహరింపబడి రావణుని కఠినోక్తులు సహించిన, రావణుడు చనిపోవును అని విన్నవింపగా శ్రీహరి బ్రహ్మను చూచి మీరందుకు లక్ష్మిని ప్రార్థింపుడని పలికెను.

బ్రహ్మ శ్రీమహాలక్ష్మిని చూచి తల్లీ ! నీ కరుణా కటాక్షామృతమును మాపై ప్రసరింపజేసి మా తాపములు తొలగింపుము రావణుని యకృత్యములు సహింపుము బలశాలియగు రావణుడు దేవతలను పీడించి బయటకీడ్చుచుండెను. తల్లీ ! నీవు భూ సుతవై భూమిపై నవతరించి రావణ సంహారమునకు తోడ్పడుమని ప్రార్థింపగా మహాలక్ష్మి యిట్లు పలికెను. కుమార ! నా తనయుడవగు నీవు పరోపకారార్థమై నన్ను వేడితివి. నీవు చెప్పినట్లు చేయుటకు నాకొక సందియము కలదు. దుష్ట రాక్షసావాసంబైన లంకలో వసించి దుర్మార్గులగు రక్కసుల పలుకు లాలకించిన నా శరీరమపవిత్రము కాగలదు కదా ! పుండరీకాక్షుడగు శ్రీరామచంద్రుడు గ్రహించుటకు మరల నా శరీరమెట్లు అర్హంబగును ? అనిన బ్రహ్మ యిట్లనెను జననీ ! నీవు త్రిలోకమాతవు. స్థావరజంగమాత్మకమైన యీ ప్రపంచమెల్ల నీయందే ప్రభవించి నీయందే లయము కాగలదు కదా ! నీ శరీరమునకు పవిత్రాపవిత్రతలు కలవా ? అయినను రావణుని సంహరించిన పిదప లోకనింద బాపుటకై అగ్ని ప్రవేశము చేసిన యెడల దివ్య శరీరధారిణివై అగ్ని మధ్యము నుండి వెలువడిన నిన్ను శ్రీరాముడు మరల స్వీకరింపగలడు. అని వివరింపగా లక్ష్మీనారాయణులు ముసిముసి నవ్వులు నవ్వుచు అన్యోన్యము ఒకరి ముఖములొకరు భావయుక్తముగా చూచుకొని యంగీకారము తెల్పి వానరులై పుట్టుడని దేవతల నాదేశించిరి. బ్రహ్మాది దేవతలెల్లరును వారి యానతి నౌదలదాల్చి

తమ తమ స్థానములకేగిరి. దేవతల కోరికననుసరించి రమాంశ సంజాత యగు జానకి రావణాదుల నిష్ఠుర వచనములను సహింప వలసి వచ్చినది. అని బాలకులు వివరించిరి.

అంత నారాముడో బాలకులార ! రావణునకును జానకికిని జరిగిన సంభాషణమును తెలియజేయుడని పలుకగా లవకుశులిట్లు తెలుపజొచ్చిరి. రాజ ! రావణుని దురాలాపములకు సీత గడగడ వణకుచు ముడివీడి నేలపై పొరలుచున్న కురులచేత నొడలుగప్పు కొని చలింపక ప్రాణత్యాగమునకు తెగించి ధైర్యమవలంబించి యొక గడ్డిపరక మధ్యలో నుంచి యిట్లు పలికెను. రావణ ! అందని పండ్లు కరుత్రిలు చాచుట వ్యర్థము. రామునకును నీకును ఏనుగున కును దోమకును గల యంతరము కలదు. కరుణామూర్తియగు రాముడు సురాసురుల కజేయుడు. వానికి సాటి వచ్చువారు ముల్లో కములలో నెవ్వరునులేరు. వనము వెలువడి వచ్చి సముద్రమునుదాటి లంకను సముద్రములో కలిపి రాక్షసుల నెల్లరును గూల్చి నన్ను తీసికొనివెళ్ళి రాముడు శాశ్వత యశస్సు నార్జించును. అని సీత పలుకగా రావణుడు ఆగ్రహ పరవశుడై కత్తిదూసి జానకిని సంహ రింపబోగా యొక వనిత రావణుని కౌగిలించుకొని రాక్షసాధిప ! నీ వంటివీరుడు స్త్రీని వధించుట తగదు అని పలికి స్త్రీలు దురాగ్రహము చూపిన విరక్తి చెందుదురేకాని మనసునర్పింపరు. వేరుగా తలంప కుము. సీత వంటింటి కుందేలు వంటిది. బెదిరించికాని, మనసు కరి గించు మంచి మాటలతోగాని మనసు మార్చెదము. మనమిరువు రము పోయి సుఖింతము రమ్ము అని తీసికొని పోవుచుండ, నా రావణుడు త్రిజటను చూచి రెండు మాసములు వ్యవధినిచ్చు చున్నాను. గడువు లోపల సీత మనసు మార్చుటకు ప్రయత్నిం పుడు. మారనిచో ముక్కలుముక్కలుగా కోసి భుజింపుడు అని యాదే

శించి ధాన్యమాలిని (మందోదరి) మున్నగు వనితలతో కలిసి వెడలి పోయెను.

అంతనా రాక్షస స్త్రీలు సీతను చేరి కఠినోక్తులతో నొప్పించు టకై యిట్లు పలుకజొచ్చిరి. జానకీ! నీవు రావణుని యందను రాగము చూపుము. మా మాట విననిచో నిన్ను మ్రింగి వేయు దుము. అని దురాగ్రహముతో పలుకుచున్న రాక్షసాంగనల పలు కులు విని పెనుగాలికి కదలాడు అరటిచెట్టువలె నేలగూలి కన్నీరు మున్నీరుగా విలపించుచుండ నిద్రించి లేచిన త్రిజట సీత కడకేగి పరుష వచనములాడుచున్న రాక్షస స్త్రీలను పిలిచి సీతను నిందింప వలదని మందలించి నాకు వచ్చిన స్వప్నమును వివరింతు నాలకిం పుడు. శ్రీరాముడు కాంచనాంబరధారుడై మంచిగంధము పూసికొని తెల్లగొడుగు చేతబట్టి లక్ష్మణుడు వెంటరాగా సీతకడకరుదెంచి మల్లెపూల దండను సీత మెడలో వేసి కన్నీరు తుడిచి సీతతోగూడి శ్వేతగజాధిరూఢుడై యుత్తరాభిముఖముగా అయోధ్యకేగెను. విభీషణుడు శ్వేతమాల్యానులేపనుడై తెల్ల యేనుగునెక్కి తూర్పు దిశగా వెళ్ళెను. రావణ కుంభకర్ణాదులు రక్తమాల్యానులేపనులై దక్షిణ దిశగా నేగుచున్న సమయమున నల్లని కొండవంటి యొక స్త్రీ జుట్టు (త్తు) విరబోసికొని వచ్చి రావణాదులను పట్టుకొని గోమయహ్రదములో ముంచెను. లంకా నగరము సముద్రములో మునిగిపోయెను. నా స్వప్నము యదార్థమైనది త్వరలో రాక్షస కులము నాశనము కాగలదని హెచ్చరించి సీతను బాధింపరాదని నచ్చజెప్పి యా రాక్షస స్త్రీలతో గలిసి దూరముగా పోయి యొడలు మరచి నిద్రించెను.

హనుమంతుడు సూక్ష్మరూపమును దాల్చి చెట్టుపై గూర్చుని రావణుని మాటలు రాక్షస స్త్రీల కఠినోక్తులు విని సీతకు కలిగిన కష్ట

మునకు మిగుల చింతించెను. నేనే రూపముతో సీతతో మాట్లాడ వలయును ? రాముని సేమము నెట్లు తెలియజేయుదును ? సీత నా పలుకులు విశ్వసించునో, రాక్షసమాయ యని విశ్వసింపదో యని యోచించి రామ ! నీ పాదపద్మములు నమ్మి నేను వచ్చితిని. నీకార్యము నిర్వహింపగలవాడవు నీవే. జానకిని సందర్శించితిని. సీతతో మాట్లాడు సమయమరుదెంచినది. రామ! నన్ను విశ్వసించి జానకి నాతో మాట్లాడునట్లు చేయుము. అని రాముని పాద పద్మములు తలచి మ్రొక్కెను.

రామనామమిచట వినబడుచున్నది. ఏమి చోద్యమా యని తలయెత్తి సీత చూచి వానరుడు కనుపించగా కలలో కోతి కనుపించినది రామునకు కీడేమోయని శంకించి అగ్నిని వాయువును ఇంద్రుని వరుణుని కుబేరుని శివుని మదిలో తలచుకొని పతికి కీడు తొలగుటకై తృణమును త్రుంచివైచి నిద్రలేని నాకు కల యెక్కడిదని మరల భావించుచుండగా, హనుమంతుడు క్రిందకు దిగి తల్లీ నీ దాసుడనని పలికి సీత పాదాలకు మ్రొక్కెను. రావణుడు వానర రూపమున వచ్చియుండునని సీత యెంచి రాక్షసరాజా ! ఇక నీ మాయలు చాలింపుము. నా హృదయము రాముని దక్క యన్యుని చేరదు అని పలుకగా మారుతి అమ్మా ! నేను రాక్షస రాజును కాను వాయుసుతుడను. నా తల్లి యంజనీదేవి. సుగ్రీవుని ప్రియ సచివుడను. రామ సేవకుడను. నేను వానరుడను ఇందు మాయ యే మాత్రమును లేదు. నిజము. నన్ను నమ్ముము. రాముడు నీ జాడ నరయుటకై అన్ని దిశలకు వానరులను బంపెను. నలనీలాంగదాదులతో గూడి నిన్నరయుటకై యరుదెంచితిమి. నేను సముద్రము దాటి నీ కొఱకై లంకాపుర మంతయు వెదికి నిన్నిటగని కృతార్థుడనైతిని. అని విన్నవింపగా సీత నరులకు వానరులకు మైత్రి యెట్లు పొసగినదని పలుకగా వాయుసూనుడు అమ్మా ! సూర్యవంశీయులగు రామలక్ష్మణులను వనములో చూచి సుగ్రీవుడు అన్నపైగల పగ

చేత రామునాశ్రయించెను. అని పలుకగా జానకి వానరోత్తమ ! రామలక్ష్మణులను నీవెరిగిన యెడల వారి గుర్తులుతెలుపుమని పలుకగా హనుమంతుడిట్లు వివరించెను సింహమధ్యము, అజానుబాహులు మబ్బు వంటి మేనిచాయ పద్మపత్రముల వంటి కన్నులు చంద్రుని వంటి మోము బలిసిన రొమ్ము పూవిల్లు వంటి కనుబొమ్మలు శంఖము వంటి కంఠము అమృత వాక్కులు కలవాడు శ్రీరాముడు. వానికి మరి సాటి యెవ్వరును లేరు. లక్ష్మణుడు మిగిలిన వానిలో నన్నకు సమానుడేకాని శారదనీరదగాత్రుడు అగుట మాత్రము విశేషము. అన్న మాట జవదాటడు. నన్ను అంజనేయుడు అందురు. నీకు నమ్మకము కలుగుటకై శ్రీరాముడానవాలుగా నుంగరమిచ్చెను. దీనిని స్వీకరించి నన్ను సందర్శించినందుకు గుర్తుగా రామునకాన వాలునొసంగుము అని ప్రార్థింపగా జానకి శోకమోదాశ్రువులు నిండిన కనులతో శ్రీరామ ముద్రిక నక్కున జేర్చుకొని భర్తను చూచినట్లు సిగ్గుపడి దుఃఖింపసాగెను.

అంతనాంజనేయుడు తల్లీ ! దుఃఖింపకుము. కయ్యమున పగఱను గూల్చి రాముడనతి కాలములో నిన్ను బ్రోచును. అని పలుకగా సీత విని ధైర్యమువలంబించి వానరుని పలుకులు విశ్వసించి యో యాంజనేయా ! సాగరము దాటి లంకలో ప్రవేశించి నన్ను కలిసికొని శ్రీరాముని సేమమును తెలియజేసితివి. నీ జవసత్వములు తెలియుటకింద్రాది దేవతలకు కూడ సాధ్యము కాదు. నీవు చేసిన మహత్కార్యము దేవదానవులకు సాధ్యపడునది కాదు. నా కష్టమును శ్రీరామునకు తెలిపి వేగముగా తోడ్కొని రమ్ము. రామునితో రహస్యముగా అభిజ్ఞాన (గుర్తును గూర్చిన) వచనములు తెల్పుము. వనవాస సమయమున చిత్రసేనుడను గంధర్వుడు వాయస రూపమున దుర్బుద్ధితో నా యురమున గోళ్ళతో గీరెను. రాముడది చూచి వెంటనే బ్రహ్మాస్త్రమును ప్రయోగిం

చెను. కాకి శరణు వేడగా కరుణా సముద్రుడగు శ్రీరాముడు దానిని కాపాడెను. ఈ విషయము గుర్తుచేసి శ్రీరామునకు సంతసము కలిగింపుము. ఓ ఆంజనేయా! నీ దయచే బ్రతికితిని. నీవే బంధుడవు నీవే దైవమవు. నా బాధ తొలగించితివి నా నాథునెప్పుడు చూపుదువు? ఈ చూడామణిని రామున కానవాలుగా నొసంగి నా క్షేమ సమాచారమును తెల్పుము. నాకొక సందేహము కలుగుచున్నది. అల్ప దేహుడవైన నీవీ మణినెచట దాచెదవు? విభునకెట్లొసగుదువు? సముద్రము లంఘించు సమయమున చూడామణి కడలిలో జారిపడకుండనెట్లు భద్రపరతువు?

సీత పలుకులు విని హనుమంతుడు సీతకు మ్రొక్కి శరీరమును పెంచెను. ఆ సమయమున ఆకసమునందలి తారకలు ఆంజనేయుని తలయందు పూవులవలె విలసిల్లినవి. త్రివిక్రముని వలె విశ్వరూపధారియైన హనుమంతుని గాంచి జానకి యిట్లు పలికెను. ఆంజనేయా! భూమ్యాకాశము లావరించి యున్న నీకు సాటి యెవరు? నీ రూపము చూచుట కష్టసాధ్యముగా నున్నది కావున మహాకాయము నుపసంహరించుకొని యథా ప్రకారమగు రూపమును దాల్చుము. అని కోరెను.

వెంటనే అంజనానందనుడు తొల్లిటి రూపమును దాల్చి చేతులు జోడించి తల్లీ! వెళ్ళి వచ్చెదను. అనుమతి నొసంగుము అని పలుకగా సీత చూడామణిని తీసి వాని దోసిలిలో నుంచి మారుతీ! నిన్ను విడువ జాలనని కొంతసేపు వగచి యెట్టకేలకు ధైర్యమవలంబించి విభునకు నా పాట్లు తెలియజేయుము. నా జీవితమునకు రెండు మాసములు మాత్రము వ్యవధి కలదనియు పిదప నసువులు వీడుదుననియు రామునకు విన్నవింపుము. నీవు శీఘ్రముగా పోయి శ్రీరాముని తోడ్కొని వచ్చి నాకు ప్రాణ

దానము చేయుము అని పలికి యనుమతినొసగంగా బుద్ధిమంతు డగు హనుమంతుడు దొంగవలె లంకలో ప్రవేశించి దొంగవలె వెడల రాదు కావున లంకను దహించి వెళ్ళుదునని మనసులో నిశ్చయిం చుకొని ఒక చెట్టు మీదినుండి మరియొక చెట్టుమీదకు దూకి చెట్లు కూల్చుచు చిగుళ్ళు మొగ్గలు పువ్వులు గుత్తులు గుత్తులుగా రాల్చుచు గంతులు వేయుచుండెను. తోకతో చెట్లు పెకలించి మింటికి గిరవాటు వేయును. అశోక వనమున గల వృక్షములు దక్క మిగిలిన వృక్షములన్నియు గూల్చివేసెను.

వన పాలకులు వచ్చి వాయుసుతుని బాణ వర్షమునముంచిరి వెంటనే హనుమంతుడు చేతితో నొక వృక్షమును పెకలించి వారిని మోదెను. ఆ దెబ్బలకు మరణించగా మిగిలిన వనపాలకులు రావ ణుని సమీపించి ప్రభూ ! ఒక వనచరుడరుదెంచి వనమంతయు భగ్నమొనరించెను. వనపాలకులు వాని నెదిరింపగా దారుణరణ మయ్యెను మహారాజ ! తామభయ మొసంగిన యెడల నొక విశే షము తెల్పుదుము అనిన రావణుడిట్లు పలికెను. భటులార ! మీ కభయమొసంగుచున్నాను. నిర్భయముగా మీరు చెప్పదలచినది చెప్పుడు. అని యానతీయగా వారిట్లు విన్నవించిరి. ప్రభూ ! నిజమో ! కాదో ! తెలియదు కాని యొక కోతి వచ్చి సీతతో ముచ్చ టలాడి యుంగరమిచ్చెను. ఆ కొండముచ్చే మన వన పాలకులను పెక్కుమందిని మట్టుపెట్టెను.

దశగ్రీవుడు వారి పలుకులు విని ప్రళయ భీకరమూర్తియై అక్షయ కుమారుని పిలిచి వన భంగము చేసిన వానరునితో పోరాడి సంహరింపుమని యాజ్ఞాపించెను. వెంటనే చతురంగ బలసమేతుడై యక్షయ కుమారుడు హనుమంతునిపై దండయాత్రకు బయలు దేరెను. అప్పటికే హనుమంతుడు తోరణ స్తంభమెక్కెను. అది చూచి యక్షయ కుమారుడు సైన్యములను చూచి కోతిని పట్టుడు.

కొట్టుడు అని యాదేశించెను. వారు బాణ వర్షము కురిపించి హను మంతుని ముంచెత్తిరి. అంతనా మారుతి యొక చెట్టు పెకలించి తోకతో గిరగిర త్రిప్పి దానితో సైనికులను గూల్చెను. దానితో నాగ్రహోదగ్రుడగు నక్షయ కుమారుడు విల్లెక్కువెట్టి బాణవర్షము కురిసెను. బాణవర్షము చూచి హనుమంతుడు మింటికెగయగా దాన వుడు బాణమేసెను.

గరుత్మంతునివలె నాకసమున నెగురుచున్న హనుమంతుని చూచి అక్షయ కుమారుడు తన యరదము నాకసమునకు దోలుమని రథసారధి నాదేశించెను. వెంటనే యక్షయ కుమారుడు గగనమున రథముపై పయనించుచు హనుమంతుని శరీరమున పలు బాణ ములు ప్రయోగించెను. హనుమంతుడా బాణ ఘాతములను సరకు చేయక యరదముపై పిడుగువలె నురికి పై కెగురగా తేరు నేలపై గూలి నుగ్గునుగ్గయ్యెను

రాక్షసవీరుడగు అక్షయకుమారుడు ఖడ్గమును చేతబూని పంజరమును విడిచివెళ్ళు పక్షివలె రథమును వీడి హనుమంతుని తోక పట్టుకొని మింటి కెగసెను. అప్పుడాంజనేయుడు తన తోక పట్టికొని వెంట వచ్చుచున్న దానవ రాజసుతుని చూచి వాలముతో పైకెత్తి గిరగిర త్రిప్పి వాని శిరము వ్రక్కలగునట్లు నేలనేసి బాది చంపి తోరణ స్తంభము కడనున్న ఇనుప రోకలి తీసికొని చావగా మిగిలిన దానవులను గూల్చి భూమ్యాకాశములు దద్దరిల్లునట్లు సింహ నాదము చేసి తోరణ స్తంభమెక్కెను.

హత శేషులైన రక్కసులు రావణుని చేరి అక్షయ కుమారుని మరణవార్త తెలుపగా దశముఖుడు మూర్ఛిల్లి కొంతసేపటికి తెప్ప రిల్లి దుఃఖించుచుండగా తగువార లోదార్పగా ధైర్యమవలంబించి పంచసేనా నాయకులను పంపిన ఆంజనేయుడు క్షణములో వారిని గూల్చివైచెను.

ఆ సేనా నాయకుల మరణవార్త విన్న దశకంఠుడు వెంటనే కొలువుదీర్చి యింద్రజిత్తును రావించి కుమార ! రాముని పనుపున నొక వానరుడరుదెంచి వనమంతయు ధ్వంసము చేసి వనరక్షకులను గూల్చుటయేకాక దేవదానవుల కజేయుడైన నీ సోదరుడగు అక్షయ కుమారుని గూడ గూల్చెను. అని పలికి కన్నీరు గార్చుచు దుర్మార్గుడగు నా వానరుని బంధించి నా కడకు తీసికొని రమ్ము అని చెప్పగా అతడట్లే సేతునని పలికి సెలవు గైకొని చతురంగ బలసమేతుడై హనుమంతునిపై దండయాత్రకరిగెను. తనపై బాణ వర్షము కురియుచున్న రాక్షస సైనికులపై మారుతి శిలావృక్ష వర్షము గురిపించెను. తోరణ స్తంభము కడనున్న యినుపగద గైకొని రాక్షసమూకపై బడి క్షణములో సైన్యమును గూల్చి ఇంద్రజిత్తు సారథిని గూల్చి ఇంద్రజిత్తు యొక్క విల్లును ముక్కలుముక్కలుగా చేసెను.

అంతతో నాగక మారుతి తోరణ స్తంభముపై నెక్కి పండ్లు పట పట గొఱకుచు తోక పైకెత్తి వైరులపై నురకబోవు సమయమున ఇంద్రజిత్తు తోరణ స్తంభముపై మారుతిని గని నుదుట మూడమ్ములు భుజములపై పదునాల్గు బాణములు వేసి గర్వోద్ధతుడై విజృంభించెను. వాడి బాణముల వలన కలిగిన గాయముల నుండి వెలువడు నెత్తురు చేత తడిసిన దేహముతో పూచిన మోదుగుచెట్టు వలె హనుమంతుడు విలసిల్లెను.

అంతనా హనుమంతుడు పెద్ద చింతచెట్టును పెకలించి యింద్రజిత్తుపై వేయగా రావణి నడుమనే దాని నొక బాణముతో నేలగూల్చెను. అప్పుడు హనుమంతుడు కొండ శిఖరమును విరచి దనుజ వీరునిపై వేయగా వాడా శిఖరమును మధ్యలో తుంచి

హనుమంతునిపై వాడి బాణమును వేసెను. హనుమంతుడు పైకెగసి బాణ ఘాతములు తప్పించుకొని గరుత్మంతుని వలె ఆకసమున తిరుగుచుండగా ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. దానితో హనుమంతుడు నేలగూలి బ్రహ్మ తనకు పూర్వమానతిచ్చిన వచనమును తలంచుకొని బ్రహ్మాస్త్రమునకు కట్టువడియుండి రాక్షసరాజును చూచి మాట్లాడి వెళ్ళెదనని నిశ్చయించుకొని కంఠగతాసుడైనట్లు పడియుండెను. అప్పుడింద్రజిత్తు వానిని సమీపించి వీనిని బంధించి తీసికొని దైత్యేంద్రుని కడకు కొనిపొండని చావగా మిగిలిన రక్కసుల నాజ్ఞాపించి తాను గృహమునకేగెను.

అంతనా రక్కసులు రాకుమారుని యానతి ననుసరించి హనుమంతుని బంధించి మోకాళ్ళతో కుమ్ముచు పిడికిళ్ళతో పొడుచుచు చేతులతో చరచుచు దండములతో మోదుచు వానరాధమా ! దొరికితివి. ఇకనెందు పోగలవని పలు రీతులుగా దురాలాపములాడుచు రావణుని సభలోనికి కొనిపోయి వాని యొక్క యుద్ధపద్ధతులను రావణునకు విన్నవించిరి. అప్పుడు ప్రముఖుడను మంత్రి రావణుని యనుమతితో హనుమంతుని చూచి ఈ వానరుడెవడో ? ఈ నగరమునకేల వచ్చెనో ? వీనిని పంపిన వారెవరో ? నివాసమెచటనో ? చక్కని వనమును ధ్వంసము చేసి రక్కసులను చంపుటకు గల కారణమేమి ? అని ప్రశ్నించుకొని నీ నామమెయ్యది ? అని ప్రశ్నింపగా హనుమంతుడిట్లు పలికెను. దశకంధరా ! శ్రీరాముడు రణ విశారదుడు. అతడంపిన చారుడను. వానరుడను. వాయుసుతుడను. నా పేరు హనుమంతుందురు. సీత కొఱకై సముద్రమునుదాటి లంకనంతయు వెదకి అశోకవనములో జానకిని సందర్శించి రాముని సేమమును తెలియజేసితిని. చెట్లమీద దుముకగా నవికూలిపోయినవి నన్నుకొట్టిన రక్కసులను కొట్టితిని. దొంగవలె జానకి నపహరించి తెచ్చితివా ? రాముని గెలిచి

సీతను తెచ్చిన వీరులు మెచ్చుదురు కదా! సీతాపహరణమే నీ మరణమునకు కారణము కాగలదు. పరమ పవిత్రమైన బ్రహ్మ వంశమున జనించి తపమున పరమశివుని మెప్పించి దేవతలకజేయుడవై సకల సామ్రాజ్యాధిపతివై యుండియు సీతను చెరబట్టుట నీకు చేటు కదా ? దొరలకల్పబుద్ధులు కలిగిన సిరులు తొలగిపోవును సుమా! రావణా! బలపరాక్రమాది సంపదలకు దిక్పతులను మించినవాడవు. గొప్ప కుటుంబమున జనించితివి. చేజేతుల కొఱవితో తల గోకికొనుట తగదు. బుద్ధిమంతుడవై నా హిత వచనములాలింపుము శ్రీరాముడు దుష్కృతములు పోగొట్టును. దాసోహమన్న వారిని తప్పక కాపాడును. అఖండ పరాక్రమశాలియు అరిజన భీకరుడును దీనజన రక్షకుడును నగు కోదండరాముని గెలుచువాడు ముల్లోకములలో నెవ్వడును లేడు. శరణాగత తత్పరుడగు శ్రీరాముడు ఎట్టి శత్రువైనను శరణన్న మాత్రమున క్షమించి కాపాడును. కావున సీతను రామునకొసంగి శరణు వేడుము. నిన్నును నీ వారలను మన్నించి రక్షించును. లేనిచో నిన్ను రణభూమిలో రాముడు కూల్చివేయుట నిశ్చయము. నిన్నొక గ్రుద్దుగుద్ది చంపి సీతను రామునకప్పగించుటకు నేనే సరిపోవుదును. కాని రామాజ్ఞ లేనందున యూరకుంటిని.

హనుమంతుని పలుకులాలకించి రావణుడు పండ్లు పటపట కొరికి కన్నుల నుండి నిప్పులు రాల్చుచు మారుతిని సంహరించుటకు కత్తిదూసెను. అంతలో విభీషణుడడ్డము వచ్చి అన్నా! దూతను చంపుట ధర్మ విరుద్ధము. దూతను యతిని స్త్రీ సంగతుని భూసురుని వృద్ధుని బాలుని యుద్ధ విముఖుని గోవును హితవుగఱపు వానిని గురువును చంపదగదు. అని పెద్దలందురు. వానరులకు వాలము ప్రాణ సమానము అని యుక్తియుక్తముగా పలికిన సోదరుని పలుకులాలకించి దానవులను పిలిచి వానరులకు వాలము

మిగుల ప్రీతిపాత్రమైనది కావున ఈ వానరుని తోకకు గుడ్డలు చుట్టి నూనెలో ముంచి నిప్పు ముట్టించి ప్రజలెల్లరు వీక్షించునట్లు నగర వీధులలో నూరేగించి ప్రాణావశిష్టుని చేసి విడిచి పెట్టుడని యానతీయగా నా రక్కసులు హనుమంతుని తోకకు గుడ్డలు చుట్టి నూనెలో ముంచి పురవీధులలో త్రిప్పుచు చేతులతో మొత్తుచు దండములతో మోదుచుపిడికిళ్ళతో పొడుచుచుండగా విభీషణుని భార్య సరమ జానకితో నా విషయము తెలుపగా నామె మిగుల దుఃఖించి కొంతసేపటికి ధైర్యమవలంబించి పావకుని నుతింపసాగెను. అగ్నిదేవ ! రామ కార్యార్థమై వచ్చి రణమున దనుజులచే పట్టుబడిన వాయుపుత్రునకు చల్లదనము గూర్చుము. అని ప్రార్థింపగా అగ్ని తన మిత్రుడగు వాయుదేవుని తనయుడగు ఆంజనేయునిపై వేడిమి చూపక చల్లగా నుండెను.

సీత ప్రార్థన వలన మంచువలె చల్లగా మారిన అగ్నిని చూచి వాయుసుతుడిట్లు చింతించెను. నా తండ్రియందు గల స్నేహభావము వలననో ? రాతిని నాతిగా జేసిన శ్రీరాముని కృప చేతనో ? సీతామాత పాతివ్రత్య మహిమ చేతనో కాని అగ్ని చల్లగా మారినది.

హనుమంతుడట్లు చింతించి సంతోషముతో విభీషణుని గృహమును విడిచి మిగిలిన లంకా నగరమంతయు దగ్ధముచేసి, వచ్చిన పని పూర్తియైనది. రాముని సందర్శించి జరిగిన వృత్తాంతమును విన్నవింతునని తలంచి శరీరమును చిన్నదిగా చేసెను. పాము కుబుసమును విడిచినట్లు మారుతి కట్లనుండి విముక్తినొంది తనను కట్టి పట్టుకొన్న దనుజులను చేతి దెబ్బలతో జంపి సముద్ర జలమున తోక ముంచి మంటల నార్పివైచెను.

లంకయంతయు తగులబడగా రావణాది రాక్షసులు స్త్రీ బాలవృద్ధులతో భవనములు వెలువడి వచ్చి తోటలలో ప్రవేశించిరి.

కొందరు సముద్రోదకముతో నిప్పార్పుచుండిరి. మరికొందరు దశవదనుడు సీతను తెచ్చి మన కొంపలు ముంచెనని గుజగుజలు పోవుచుండిరి. కొందరు అగ్నిజ్వాలలకు దేహములు కాలి బాధపడు చుండగా మరికొందరు ధనధాన్యాది సంపదలు బూడిదయ్యెనని దురపిల్లుచుండిరి. ఈ విధముగా లంక అలక్ష్మీ ప్రవేశము వలన కళా విహీనమై హృదయ విదారకముగా నున్నది.

అంతనా మారుతి అగ్నిజ్వాలల వలన సీతకెట్టి కీడు మూడెనోయని భయపడి యశోక వనమునకరుదెంచి సురక్షితముగా నున్న జానకిని చూచి సంతసముగా నమస్కరించెను. జానకి హనుమంతుని దీవించి యాంజనేయా! ఇట్టి సాహసములు చెల్లునా? శిరోరత్నమిచ్చితిని కదా! ఏమి చేసితివి? అని యడిగిన, పావని యిట్లు విన్నవించెను. తల్లీ! మీ కృప నాకున్న యెడల మీ యనుమతితో రావణాదులను గూల్చి లంకను సాగరములో కలిపివేయుదును. ఇట్లు పలికి సీత యొసంగిన శిరోరత్నమును సీతకు చూపి యనుమతి బడసి యాకాశమార్గమున సాగరమును దాటి యావలి గట్టునకరుదెంచెను.

అంగద జాంబవదాదులు సముద్రమును దాటి తమ కడకరుదెంచుచున్న హనుమంతుని చూచి యెదురేగి కౌగిలించుకొనిరి. హనుమంతుడు సంతసముగా సీతా సందర్శన వృత్తాంతమును వారికి వివరించి చెప్పగా నెల్లరు నానంద పరవశులై తోకలెత్తి గంతులు వైచుచు వేగముగా సుగ్రీవుని మధువనమున ప్రవేశించిరి. తియ్యని పండ్లు తినుచు సీత క్షేమసమాచారము తెల్పిన హనుమంతుని ప్రశంసించుచు పూవులుగోసి హనుమంతునిపై జల్లుచు మధుపాన మొనరించుచు నానందపరవశులై యుండిరి.

వానరులెల్లరు కోరిక దీరునట్లు మధుపాన మొనరించిన వనమంతయు నల్లకల్లోలము చేయుట చూచి వనపాలకుడు కినుక

వహించి భటులతో గూడి మధువు గ్రోలు వానరులపై రాళ్ళురువ్వు చుండగా నీలుడు మున్నగు వానర ప్రముఖులు వనపాలుడు మున్నగువారిని మోది దూరముగా నీడ్చివైచిరి. అంతనా వన పాలుడు సుగ్రీవాదులున్న యెడకరిగి రాజా : సుగ్రీవా ! దక్షిణ దిశగా నేగిన వానరులు పువ్వులు కాయలు మొగ్గలు పండ్లు మున్నగు వానితో కలకలలాడుచున్న వనమంతయు పాడుచేసిరి. వలదని వారించిన మమ్ము కొట్టిరి. అని విన్నవింపగా సుగ్రీవుడు వాని ననునయించి రాముని చూచి రామా ! హనుమదాదులు జాన కిని దర్శించి వచ్చిరి. లేనిచో మన వనము జోలికేల వత్తురు ? అని పలుకుచుండగానే అంగద జాంబవదాదులు హనుమంతుని ముంది డుకొని వచ్చి శ్రీరాముని చరణారవిందములకు మ్రొక్కిరి.

అప్పుడు హనుమంతుడు రాముని సమీపించి పాదములకు మ్రొక్కి రామచంద్ర ! సీతను సందర్శించితిని. మీరిచ్చిన యుంగరమును జానకి కొసంగితిని. చిక్కిశల్యమైన జానకికా యుంగరము కంకణమయ్యెను. రామ ! రాక్షస స్త్రీల నడుమ సీత మిగుల కుందుచున్నది నీ పాదపద్మములనే నిరంతరము చింతిం చుచున్నది. తనకిక రెండు మాసములు మాత్రమే జీవితావధి యున్నదని సీత నీతో చెప్పుమన్నది. సీత యానవాలుగా నొసం గిన చూడామణి యిదిగో ! చూడుము. అని పలికి యొసంగిన చూడామణి నాదరముతో స్వీకరించి సీతను చూచినట్లే భ్రాంతిచెంది దుఃఖ వివశుడై మూర్ఛపోయెను. అప్పుడు సుగ్రీవాదులు రాముని చేరి ధైర్యవచనములు పలికి యూరట గలిగించిరి.

* * *

# విచిత్ర రామాయణము

## యుద్ధ కాండము

అంత ధర్మనందనుడు మార్కండేయుని చూచి మునీంద్రా! హనుమంతుని వలన ధాత్రీసుత వృత్తాంతము నాలకించి శ్రీరాముడు రావణుని సంహరించి మైథిలినెట్లు తీసికొని వచ్చెనో వివరముగా తెలియజేయుమని కోరగా మార్కండేయుడిట్లు చెప్ప దొడంగెను.

కుశలవు లారాత్రి గడిపి యుదయముననే లేచి నిత్యకృత్యములు నెరవేర్చుకొని మిథిలనుండి బయలుదేరి వాయుదేవుని సహాయమున రాముని సభకు వెళ్ళి సుఖాసీనులైరి. రాముడా పౌరాణికులను చూచి బాలులార! జానకి సందేశము విని రామలక్ష్మణులు సుగ్రీవుడు జాంబవంతుడు ఆంజనేయుడు మున్నగు వారితో లంక కేరీతిగా చేరి రావణాదులను వధించిరో తెలుపరా యని యడిగిన పౌరాణికులు ఇష్టదేవతా ప్రార్థన చేసి యో రాజ! రాముడాంజనేయుని వలన సీత విషయమును తెలిసికొని వానర రాజగు సుగ్రీవుని చూచి వానర సైనికులు వేగముగా అనుచరులై వచ్చునట్లు ఆజ్ఞాపింపుము. అభిజిన్ముహూర్తమున దండయాత్రకు బయలుదేరిన వారు శత్రువులను జయించి శుభంబు పొందుదురని ధనుర్బాణములు ధరించి లంకాభిముఖుడై సముద్రతీరమునకరుగుచున్నప్పుడు సుగ్రీవుడు జాంబవంతుడు ఆంజనేయుడు నలుడు నీలుడు కుముదుడు అంగదుడు సుషేణుడు మున్నగు పెక్కుమంది వానర సైనికులు వెంటరాగా సముద్రతీరము చేరెను.

సముద్రపు పొంగును చూచి రామలక్ష్మణులు వానరులు చకితులై లంకకు చేరుదారి యేదని యోచించుచుండగా జాంబవంతుడు రాముని చూచి రామచంద్ర! సముద్రుని ప్రార్థింపుము. సముద్రుడు మార్గమొసంగును అని పలుకగా రాముడు సముద్రతీరమున కుశాసనమున ఆసీనుడై వరుణుని ధ్యానించుచుండెను. సముద్రతీరమున విడిది చేసిన వానరు లిసుక వేసిన నేల రాలనంతమంది యుండిరి. ముప్పది యామడల పొడవు, ముప్పది యామడల వెడల్పుగల సముద్ర తీరమును వానర సైన్యములాక్రమించి యుండుటను రావణుడు గూఢచారుల వలన గ్రహించెను.

అంత రావణుడు మంత్రులను సేనా నాయకులను ఇంద్రజిత్తు, విభీషణుడు మున్నగు బంధుమిత్రులను ఆహ్వానించి కొలువు దీర్చి యిట్లు పలికెను. రాముడు వానర సముదాయముతో సముద్రమున కావలి యొడ్డున విడిసియున్నాడట. నా వారగు మీరెల్లరును మీ పౌరుష బలపరాక్రమములు చూపదగు సమయమాసన్నమైనది. మీరు బాణవర్షము కురిపించి వానరుల నుక్కడగింపుడు. అని యాజ్ఞాపింపగా విని విభీషణుడు దశముఖున కభిముఖుడై అన్న! నీవు బ్రహ్మ వంశమున జనించితివి. సర్వసంపద్విరాజితుడవు. సాటిలేని శివభక్తుడవు. వేదశాస్త్రము లభ్యసించిన వాడవు. మేలు గలిగించు నా పలుకులాలకింపుము. రాముడు సామాన్య రాజు కాడు. శ్రీహరియే రాముడై యవతరించెను. నీవు నా పలుకులు విశ్వసింపుము. రామునితో పోరాడుటకు బ్రహ్మకును శంకరునకును సాధ్యము కాదు. దురాగ్రహము విడిచి జానకిని రామునకప్పగించి శరణువేడిన నీకు మేలగును. అని హిత వచనములు పలికి మరియు నిట్లనెను.

అన్నా ! నాల్గు సముద్రములలో నిన్ను ముంచి యుక్కిరి బిక్కిరి చేసిన వాలిని ఒకే బాణముతో రాముడు సంహరించెను శివ ధనుర్భంగము చేసిన శ్రీరాముడు సామాన్యుడు కాడు. కుడిచి కూర్చొనలేక బలవద్విరోధము తెచ్చుకొనుట తగదు. రాముని మోస గించి దొంగతనముగా సీతను తీసికొని వచ్చితివే కాని రాముడుం డగా తీసికొని రాగల్గితివా ?

అట్లు పలుకుచున్న తమ్ముని పలుకులు ములుకులవలె మన సును నొప్పింపగా దశగ్రీవు డాగ్రహోదగ్రుడై తమ్ముని జూచి "జ్ఞాతియున్న నిప్పేల"యను ఆర్యోక్తి యేల యసత్యమగును ? నా పరాక్రమ సంపదలను చూచి సహింపలేక రాముని గెలువలేనని బెదిరించుటకరుదెంచితివా ? రాముడు వాలిని కూల్చెనని నీవు మాకు చెప్పవలెనా ? అన్నదమ్ముల చెలిమికి వాలి కథయే నిదర్శనము. నీవిక్కడనున్న ప్రమాదము. నిన్ను లంకలో నుండనిచ్చిన యెడల లంకకు ముప్పు వచ్చును. అని పలికిన యగ్రజుని పలుకులాలించి విభీషణుడిట్లు పలికెను. అన్నా ! "పితృసమోజ్యేష్ఠః" అను వచ నముననుసరించి అన్నతండ్రితో సమానమని యెరుగుదును. నేను నీకు కీడు తలచువాడను కాను. కావున మనమున ననుమానమునకు తావీయక నేను తెల్పుగాథ నాలకింపుము. తనవారు చెడుదారి నేగుచున్నారని తెలిసినప్పుడు వలదన్నను తెలియజెప్పుట సజ్జ నుల ధర్మము కావున తెల్పుచున్నాను ఆలకింపుము.

హిరణ్యకశిపుడను రాక్షసరాజు బ్రహ్మను గూర్చి తపమొన రించి ప్రత్యక్షమైన విరించికి మ్రొక్కి రాత్రి సమయమున కాని పగటి వేళకాని నేలపై గాని ఆకాశమునగాని చావు లేకుండునట్లును మానవుల వలన కాని దేవతల వలన గాని మృగముల వలన గాని సర్పముల వలనగాని ఆయుధముల వలన గాని జలాగ్నుల వలన

గాని రక్కసుల వలన గాని చావు లేకుండునట్లును వరము పొందెను వరగర్వితుడగు హిరణ్యకశిపుడు న్యాయాన్యాయములు లెక్కింపక మునులను విప్రులను దేవతలను సజ్జనులను పీడింపజొచ్చెను. అంతియేకాక శ్రీహరిని భజించు తన కుమారుడగు ప్రహ్లాదునిపై విరోధ భావమును పెంపొందించుకొనెను.

ఒకనాడు హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని చూచి కుమారా ? శ్రీహరి మనకు పగవాడు కావున స్మరింపదగదు. నీవు నా మాట మన్నించి హరిభజన మాననిచో పుత్త్రప్రేమను పరిగణింపక మొగ మాటములేక నిన్ను చంపి వేయుదును సుమా ! అని జ్ఞానియు విష్ణుభక్తుడును పుణ్యాత్ముడును నగు ప్రహ్లాదుని పలురీతులుగా బాధింపదొడగెను. తండ్రి పుత్త్ర ప్రేమను పరిగణింపక యెంతగా బాధించుచున్నను ప్రహ్లాదుడు హరినామ స్మరణము చేయుచునే యుండెను.

హిరణ్యకశిపుడాగ్రహము పట్టజాలక ఓరి డింభక ! నీ శ్రీహరి యెక్కడున్నాడురా ? అన్ని దిక్కులందును హరికై వెదకి వేసారితిని. వైకుంఠమున ముమ్మారు వెదకితిని. ఎచ్చటను శ్రీహరి కానరాలేదు. నాకు భయపడి పారిపోయినాడు కాబోలును. అని యింకను శ్రీహరిని గూర్చి తిరస్కార వచనములు పలుకుచుండగా ప్రహ్లాదుడిట్లు పలికెను. తండ్రి ! శ్రీహరి యంతటను కలడు నీ యందు నాయందు చరాచర ప్రపంచమంతటి యందు నిండి యున్నాడు. అని పలుకగా రాక్షసరాజు తోక త్రొక్కిన త్రాచు వలె సింహాసనము నుండి లేచి ఓరి ! నీ చేష్ట లెంతకని సహింతును? కన్నబిడ్డడవని యింతవరకు సహించితిని. నీవా స్తంభమున నీ శ్రీహరిని చూపుము అని స్తంభమును చేతితో చరచెను. వెంటనే యా స్తంభము నుండి నృసింహ రూపమున శ్రీహరి వెలువడి

వచ్చెను. రాక్షసరాజు గద చేతబూని గిరగిర త్రిప్పుచు నరహరి రొమ్మున గొట్టెను. ఆ వ్రేటు లెక్కసేయక సర్పరాజు నొడిసిపట్టు గరుడునివలె నృకేసరి హిరణ్యకశిపుని పట్టెను.

ఈ రీతిగా మానవ రూపము మృగరూపము కాని నరహరి రూపము దాల్చి పగలును రాత్రియు కాని సంధ్యా సమయమున లోపలి ప్రదేశము వెలుపల ప్రదేశము కాని సభాద్వారమున భూమి కిని ఆకాశమునకును చెందని గడపపై జీవము కలవియు జీవము లేనివియు కాని గోళ్ళతో హిరణ్యకశిపుని వధించి ప్రళయ జ్వాలా భీకరుడును కరాళవదనుడును నాగేంద్రునివలె భీకరమైన నాలుక కలవాడును రక్తముతో తడిసిన కేసరములు కలవాడును దనుజుని ప్రేవులు కంఠహారముగా దాల్చిన వాడునై మదపుటేనుగు కుంభ స్థలమును చీల్చిన మృగరాజువలె దనుజకుంజర గర్వనిర్భేదము చేసి రక్తములో తడిసిన గోళ్ళు సంధ్యారుణములైన చంద్రరేఖల వలె విలసిల్లుచు యుద్ధసన్నద్ధములై వచ్చు సైన్యములను దును మాడి సభా మధ్యమున గల సింహాసనముపై ఆసీనుడై నలువైపుల చూచుచున్న నరసింహమూర్తిని దర్శించు సామర్థ్యము లేక బ్రహ్మేంద్రాది దేవతలు మునీంద్రులు మూలమూలల దాగి దోసిలియొగ్గి నుతించినను శాంతించని యుగ్రనరసింహుని యెదుట కేగజాలక ప్రహ్లాదుని చూచి విష్ణు భక్తాగ్రేసరా ! నీ జనకునిపై గల క్రోధము శాంతించుటకై ప్రార్థింపుమని కోరగా ప్రహ్లాదుడు నిశ్చలుడై యనేక విధముల స్తోత్రము లొనరించి దేవా ! మా తండ్రి చేసిన యపరాధమును మన్నించి పిన్నవాడనగు నా మొఱ నాలకించి నాయందు దయయుంచి శాంతింపుము. అని ప్రార్థించు ప్రహ్లాదుని చూచి శాంతించి నరహరి నవ్వుచు దగ్గరకు చేరదీసి చల్లని చూపులతో జూచి యభయమొసంగెను.

అన్నా ! రావణా ! కపట నాటక సూత్రధారియగు శ్రీహరి లీలలు బ్రహ్మాదులు కూడ తెలియజాలరు. తమోగుణుడవైన నీ వెట్లెరుగ గలవు ? శ్రీహరి మాయచేత లోకమాతయగు సీతయందు నీకు మోహము కలిగి తీసికొని వచ్చితివి పతివ్రతా శిరోమణియగు సీతను దుర్భాషలాడితివి. కావున శివుడొసంగిన జీవితకాలము ముగిసినదని గ్రహింపుము. రామబాణమునకు పుత్త్రమిత్ర కళత్రములతో గూడి యెరయగుట తగదు. నా హిత వచనములాలించి జానకిని రామునకొసంగి ప్రాణములు కాపాడుకొనుము. ఈ విధముగా హితవు గఱపుచున్న విభీషణుని వచనములాలించి దశగ్రీవుడు కోపముతో మండిపడుచు దిగ్గునలేచి తమ్ముని తన్ని చంద్రహాసము దీసి యనుజుని శిరము ఖండింపబోగా ప్రహస్తుడును ఇంద్రజిత్తును అడ్డముగా వచ్చి తగదని వారించిరి. అంత రావణుడు విభీషణుని లంకా నగరమునుండి బహిష్కరింపుడు. లేనిచో వీని శిరము ఖండింతునని శపథములు పలుకగా ప్రహస్తుడు మున్నగువారు విభీషణుని సభ నుండి వెడలించిరి.

విభీషణుడు పంచభూతములు సూర్యచంద్రులు సాక్షులుగా పేర్కొని నలువురు మంత్రులతో గూడి లంకానగరమును విడిచెను. రాముడు సముద్ర తీరమున వరుణ ప్రార్థనము ప్రారంభించి మూడహోరాత్రములు గడచినవి. సముద్రమున్నంటు కెరటములతో భీకరముగా నుండెను. ఆ సమయమున భండనభీముడైన రాముడాగ్రహోదగ్రుడై ఆగ్నేయాస్త్రమును ప్రయోగించిసముద్ర జలములనింకించి కాలినడకను వానరసైన్యమును లంకకు తీసికొని పోవుదునని నిశ్చయించుకొని ధనుర్బాణములు దీసి కోదండము సంధించెను. అంత సముద్రుడు మానవ రూపము దాల్చి వచ్చి రాముని పాదపద్మములకు మ్రొక్కి శరణువేడి రామా ! రక్షింపు రక్షింపుమనుచు ప్రార్థించెను.

రాముడు సముద్రుని చూచి యో సాగరుడా ! రావణుని సంహరించుటకై నేనును నా సైన్యమును లంకకేగవలయును. కావున మార్గమొసంగుము అని వలుకగా సాగరుడు రామ ! నీ యానతి నే దలదాల్చి నీకు నేను దారి యొసంగిన యెడలనెల్ల రకు నిదియే లంకకు చేరు దారియగును. కావున మరియొక యుపాయ మొనరింతును. విశ్వకర్మసుతుడగు నలుడను వానరుడు రాలను నీటిలో వేసిన అవి తేలును. కావున ఆ శిలలతో సేతువు నిర్మింపజేయుము అని పలుకగా రాముడు సముద్రుని జూచి నా శరము వ్యర్థము కారాదు. కావున లక్ష్యము చూపుమనిన సాగరుడిట్లనెను. రామా ! దానవులు సాగరమున దాగి నన్ను హింసించుచున్నారు. కావున ఎక్కుపెట్టిన బాణము వారిపై ప్రయోగించి నాకు శాంతి చేకూర్చుము. నాతో చెలిమి చేయుము అని పలికెను.

రాముడు సముద్రుని కోరిక దీర్చి సాగనంపి వానరవీరుల రావించి సాగరుడు చెప్పిన మాటలు తెలిపి నలునిచే సేతువు నిర్మింపజేయుడని యాజ్ఞాపించెను. ఆ ప్రకారముగానే సుగ్రీవాదులు నలునిచేత పది యోజనముల వెడల్పు నూరు యోజనముల పొడవు గల సేతువును మూడు దినములలో నిర్మింపజేసిరి.

అంతలో విభీషణుడు నలువురు మంత్రులతో లంక వెడలి వచ్చి రామలక్ష్మణులను వానర సైన్యమును చూచి యాకసమున నిలిచి యిట్లు పలికెను. నేను రావణుని తమ్ముడను. విభీషణుడను రావణునకు హితవు గఱపగా నా పలుకులాలింపక కోపించి నన్ను లంక నుండి బహిష్కరించెను. నేను నీ పాదపద్మములను శరణువేడ వచ్చితిని. శరణు శరణనుచు ఆకాశముననుండి వేడుచున్న విభీషణుని జూచి రాముడు హనుమంతునితో నిట్లు పలికెను. ఆంజనేయ ! మన విరోధి యగు

రావణుని తమ్ముడు నన్ను శరణు వేడవచ్చెను. కారణమేమో కదా ! లంకలో వీనిని జూచితివా ? వీని నడవడి యెట్టిది ? తెలియు జేయుమనెను. మారుతి చేతులు జోడించి దేవా ! విభీషణుడు రావణుని సవతి తమ్ముడు మిగుల ధార్మికుడు. ఇతడు పలికిన హిత వచనములు రావణుడు లెక్కచేయడు అని పలుకగా రాముడాంజనేయుని చూచి 'అభయమిచ్చితినని తెల్పి విభీషణుని తోడితెమ్ము'' అని పంపగా అతడు విభీషణునకు రాముడభయ మొసంగుట తెల్పి తోడ్కొని వచ్చెను.

విభీషణుడు మంత్రులతో గూడి రామునకు సాష్టాంగ దండ ప్రణామములాచరించి నిలిచి చేతులు జోడించి యిట్లు పలికెను. రామ ! నిన్ను దర్శించి ధన్యుడనైతిని. నీ పాదపద్మ సందర్శనము వలన నా పున్నెము పండినది. భార్యాపుత్రులయందు మమకారము వీడితిని. రక్షింపుము రాముడు విభీషణుని పలుకులాలకించి చిరునగవుతో జూచి విభీషణా ! దనుజులలో నీవు పుణ్యాత్ముడవని హనుమంతుడు నాకు ముందే తెలియజేసెను. నీకు కావలసిన వరమొసంగుదును. కోరుకొనుమనెను. అంత విభీషణుడు రామ ! నీ దాసుడను. నీ దర్శనమున కృతార్థుడనై శుభంబులు బడసితిని. నీ పాదములందు నిరంతరము భక్తి నిలిచియుండునట్లను గ్రహింపుము. అంతకంటె మరియొక కోరిక నాకు లేదు. అని పలుకగా శ్రీరామచంద్రుడు దయార్ద్ర చిత్తుడై విభీషణుని చూచి ఓ భక్తాగ్రేసరా ! విష్ణుభక్తులు వీతరాగులు శాంతచిత్తులునైన మునుల హృదయములందు నిరంతరము సీతాసహితుడనై నివసింతును. కావున నీవు నాయందు మనసులగ్నము చేసి సేవించి మోక్షమందుము అని పలికి లక్ష్మణుని పిలిచి సోదరా ! నన్ను దర్శించిన ఫలము విభీషణునకు వెంటనే యొసంగవలయును. రావణుని లంకకు విభీషణుని రాజుగా జేయుదును. జలములు తెమ్ము

నగా వెంటనే లక్ష్మణుడు సాగర జలములు తెచ్చెను. రాముడు వెంటనే విభీషణుని లంకకు రాజుగా పట్టాభిషిక్తుని గావించి విభీషణా! రవిచంద్రులు, రామకథ లోకమున నున్నంత కాలము లంకా రాజ్య మేలుదువు అని వరమొసంగెను.

అంత రామచంద్రుడు సుగ్రీవుడు జాంబవంతుడు మున్నగు వారిని చూచి లంకకు సైన్యము నడిపింపుడని యానతిచ్చెను. విభీషణుని మంత్రులు సేనా నాయకులు ముందు భాగమునను రామ లక్ష్మణులు సుగ్రీవ విభీషణులు మధ్య భాగమునను ఆంజనేయుడు అంగదుడు జాంబవంతుడు మున్నగువారు వెనుక భాగమునను సేతువుపై నడిచి సువేలాద్రి చేరిరి.

విభీషణుని సలహానను సరించి తూర్పున ఆంజనేయుడు దక్షిణమున అంగదుడు పడమట సుషేణుడు ఉత్తరమున నీలుడు మధ్యభాగమున సైన్యములు సైన్య మధ్యంబున రామలక్ష్మణ సుగ్రీవులు విడిసిరి. రాముని సమీపమున విభీషణుండ నియమించి విల్లమ్ములు దాల్చి లక్ష్మణుడు రాత్రిందినములు తిరుగుచుండెను.

రావణుడు చారుల వలన ఈ వృత్తాంతమును విని అదిరి పడి ఆశ్చర్యమునొంది ప్రహస్తుడు విద్యుజ్జిహ్వుడు మున్నగు వారిని పిలిచి మంతనములాడి వానర సైన్యముతో రాఘవులగు రామలక్ష్మణులు సువేలాద్రి చేరిరి. ఉపాయమేమనిన మేఘనాథు డిట్లనెను. తండ్రీ! సుగ్రీవాది వానర సైన్యమును రామలక్ష్మణులను పరిమార్చి వచ్చెద ననుమతి నొసంగుడు అనిన రావణుడిట్లనెను. లంకాపుర ద్వారములు మూసి నలుదెసలందును అతికాయుడు మహాకాయుడు మహా పార్శ్వుడు మున్నగువారిని చతురంగ బలసమేతముగా నుంచిన యెడల అభేద్యమైన లంకాపుర

మును చేరజాలక వచ్చిన దారినే వెడలిపోవుదురు అని పలికి మహోన్నతమైన సౌధమునెక్కి శుక సారణులను రావించి సువేలాద్రినున్న రామలక్ష్మణాదుల గూర్చి వివరింపుమని యాదేశించెను. వారా విధముగా చేతితో నొక్కొక్కరినే చూపుచు వారి వారి బల పరాక్రమాదులను వివరించుచుండగా విభీషణుడు రామాదులకు రావణాది వీరులను గూర్చి వివరించెను.

రాముడు రావణుని ఛత్రచామరాది వైభవమున కాశ్చర్యపడి విల్లెక్కువెట్టి అర్ధచంద్రాస్త్రముతో ఛత్రసహితముగా రావణుని కిరీటములు పదియు పాతాళమున పడవైచెను. రాముని ధైర్యసాహసములకు ధనుర్విద్యా నైపుణ్యమునకు మెచ్చుకొని రావణుడు సిగ్గుతో మేడలోనికరిగెను.

విభీషణుడు తన మంత్రుల వలన రావణుని విషయమెరింగి రామునకు విన్నవించెను. రాముడంగదుని పిలిచి యిట్లు పలికెను. వానరకుంజరా ! లంకా ప్రాకారము దాటి రావణుని కడకేగి యుపాయ చతుష్కములో మొదటిదగు సామోపాయము ముఖ్యము కావున రామునకు సీత నప్పగించి ప్రాణములు కాపాడుకొనుము. అందుకొడంబడనిచో రామబాణాగ్నికి పుత్రమిత్ర కళత్ర పరివారముతో గూడి యెర కాగలవని హెచ్చరించి రమ్మని యాదేశింపగా అంగదుడాకాశ మార్గమున రావణుని సమీపించి చంద్రకాంత శిలపై రావణునకభిముఖముగా గూర్చుండెను.

రావణుడంగదుని చూచి వానరుడా ! నీవెవడవు ? ఇటకేల వచ్చితివి ? రాక్షసులు నిన్ను చూచిన నీ ప్రొవ్వణచెదరు. ఇంతకు ముందొక వానరుడు వచ్చి లంకను కాల్చి సీతతో మంతనములాడి వెళ్ళెను. ఆ వానరుడు మరల వచ్చెనా ? అని ప్రశ్నించెను.

అంగదుడు చిరునవ్వు నవ్వి రావణా ! పూర్వ కాలమున నిన్ను నాలుగు సముద్రములలో ముంచిన వాలి తనయుడను. నన్నంగదుడందురు. అసురులు తోక కాల్చిరా ? అని వేళాకోళ మాడుచు వానరులు ఆంజనేయునిచిట్టిమొట్టికాయలు వేయగా సిగ్గుతో నెటకేగెనో ! శ్రీరామ సుగ్రీవులు ధర్మమాలోచించి సామోపయము ప్రథమోపాయమని యెంచి నన్ను నీ కడకంపిరి. లంక కధిపతివ య్యును కూటికి గతిలేని వానివలె వేషము వేసి రాముని భార్యనేల దొంగిలించితివి ? చెట్టు చెడు కాలమునకు కుక్కమూతి పిందెలన్నట్లు నీకు బుద్ధి పుట్టినది. పరమ సాధ్వియగు సీతను పట్టి తెచ్చిన ఫలము తప్పక నీవనుభవింతువు. అని పలుకుచుండగా రావణుడు దిగ్గునలేచి క్రోధతామ్రాక్షుడై కత్తితో నంగదుని రొమ్మున పొడి చెను. అంగదుడు వెంటనే రావణుని రొమ్మున గుద్దెను. రావ ణుడు నెత్తురు క్రక్కుకొనుచు నేలకొరిగెను.

అంగదుడు రావణుని సౌధాగ్రమునకెగసి సౌధాగ్రమును కాలితో గూల్చి ఆకాశమార్గమున రాముని సమీపించి జరిగిన విషయ మును విన్నవించెను. అప్పుడు శ్రీరాముడు హనుమజ్జాంబవదంగద సుషేణాదుల జూచి మీరు వానర సైన్యముతోనేగి లంకా ద్వారము భేదించి రావణుని సైన్యమును పరిమార్చుడని యాజ్ఞాపింపగా వారు సేనా సమేతులై లంకా నగరము చుట్టుముట్టి పాద ప్రహా రములతోను పిడికిలిపోట్లతోను ద్వారకవాటాదులను తుత్తునియలు చేసి లంకలో ప్రవేశించి సేనా నాయకులతో యుద్ధమొనరించు చుండగా మరికొందరు సౌధాదులను గూల్చుచుండగా, కొందరిం డ్లలో ప్రవేశించి రక్కసులను దునుముచుండిరి. హనుమంతుడు వృక్షమును పెకలించి ఇంద్రజిత్తుని గొట్టగా ఇంద్రజిత్తు మూరమ్మ లేసెను. సుగ్రీవుడు ప్రహస్తునితో తలపడి భయంకరముగా గర్జన

చేసి రథముపై కురికి సారథిని గూల్చి ప్రహస్తుని చేతిలో గల ధనుర్బాణములు లాగి పారవైచెను. అంత సుగ్రీవుడును ప్రహస్తుడును మల్లయుద్ధమునకు పూనుకొనిరి. అంగదుడు మహోదరుని పైనను సుషేణుడు మహాపార్శ్వుని పైనను బడి రథములు భగ్నము గావించిరి.

అంతలో సూర్యాస్తమయము కాగా విభీషణుడు శ్రీరాముని చూచి నిశాచరులకు రాత్రి సమయములందు బలమధికము కావున సుగ్రీవాదులను యుద్ధము విరమించి రమ్మని పిలిపింపుమని సలహానిచ్చెను. వెంటనే రాముడు వానర వీరులను పిలిపింపగా వారెల్లరు రక్తసిక్త దేహులై యరుదెంచి మ్రొక్కిరి. రాముడు వానరవీరుల నెల్లర నాదరించి సుఖాసీనులుకండని పలికి నాటి యుద్ధ విశేషములను ముచ్చటించెను.

రావణుడు తొలినాటి యుద్ధమున వానరుల వలన రాక్షసులు పెక్కుమంది గాయపడిరని విని కొంత తడవు వగచి యెట్టకేలకు ధైర్యమవలంబించి శీఘ్రముగా మంత్రులను తీసికొని రమ్మని యొక భటునాదేశించెను. ఆ భటుడు మంత్రులను దర్శించి దశగ్రీవుని యానతిని తెలుపగా వారెల్లరు రావణుని దర్శించి ప్రభూ! ఏమి సెలవు ? అని పలికిరి ?

రావణుడుత్సాహము తెచ్చిపెట్టుకొని రాక్షస శ్రేష్ఠులార ! ఇంద్రాదులతో పోరాడునప్పటి యుత్సాహమెందు పోయినది ? మీ బల పరాక్రమము లేటికి ? కాల్పనా ? నేడు మీ బల పరాక్రమము లెరింగించి శత్రువులను చీల్చి చెండాడక ఇండ్లలో గూర్చుని భోగభాగ్యము లనుభవించుచుండిరా ? రేపు నేనే సంగ్రామమున కేగి రణమొనరింతును అని పలికి అందుకు తగిన సన్నాహములొనరింపుడని యాజ్ఞాపించెను.

రావణుదయమే లేచి దేవాంతకుడు నరాంతకుడు విద్యుజ్జిహ్వుడు మున్నగు నాయకులతో చతురంగ బల సమన్వితుడై సమరమునకు పయనమయ్యెను. దనుజుల కోలాహలము విని వానరవీరులు రాముని కడకు చేరిరి. రాముడు విభీషణుని చూచి యీ గందరగోళ మేమని ప్రశ్నింపగా అతడిట్లు తెల్పెను. దేవా ! రాక్షస రాజగు రావణుడు సమరమున కరుదెంచుచుండెను. రావణుని వెంటవచ్చు సైన్యము చేయు గందరగోళమే యది. రావణుడు బలగర్వితుడు. మహాశూరుడు. మాయావి. దేవతలను పెక్కుమారులోడించి ధనరాసులు తెచ్చెను. మన సైన్యమును డీకొనుటకు దైత్యులను పురికొల్పెను. దానవులు వానర సైన్యమును మిగుల పీడింతురు కావున ముందు జాగ్రత్త చర్యగా రాక్షస సైన్యమును మట్టుపెట్టుము. రామా ! వానరులకు ధైర్యస్థైర్యములు గరపి రావణుని జయించి కీర్తిని బడయుము. శ్రీరాముడు విభీషణుని పలుకులు విని ధనుర్బాణములు దాల్చి యుద్ధసన్నద్ధుడయ్యెను.

ఎదురుగా హనుమత్సుగ్రీవాది యోధులను దాపల అంగద విభీషణాదులను గవాక్ష ప్రతివింద ముఖ్యులను వెలుపలను నిలబెట్టి శిలాద్యాయుధములు దాల్చియుండుడని నియమించెను. రావణుడు ఇరువది చేతులందును ధనుర్బాణములు దాల్చి మేఘనాదుడు ప్రహస్తుడు మున్నగు వారెదుట ధూమ్రాక్షయూపాక్షాదులను వెలుపలను, భద్రాసుర, సర్పరోమ మయాసురులను దాపలను కుంభనికుంభులు కాలకేతుడు మున్నగువారు వెనుక భాగమునను వెంటనంటి రాగ ఉభయ సైన్యములు మోహరించియుండెను.

వానరులు విజృంభించి వృక్షములు శిలలు శైలములు పెకలించి విసరుచుండిరి. రాక్షసవీరులు కుంత ప్రాసాదులచే వానరవీరు

లను నొప్పించుచుండిరి. ఏనుగులచే తొక్కించుచు వారువములచే తన్నించుచు కరవాలముతో శిరములు ఖండించుచు చేతులు నరకుచు పాదములను ఖండించుచు బొమ్మలను చీల్చుచు వదనములందు శరంబులు నింపుచు తోకలు పట్టి గిరగిర త్రిప్పుచు నేల గూల్చిరి. కొందరు వానరులు రణభూమిలో నిలువలేక సేనా నాయకుల మరుగుజొచ్చిరి.

సుగ్రీవాంగద జాంబవదాది వానరవీరులు వృక్షములు రాళ్ళు కొండలుదాల్చి సింహనాదములు చేయుచు రాక్షస సైన్యముపై గురిసిన వానరుల ధాటికాగలేక హతశేషులైన దానవవీరులు పలాయన మంత్రము పఠించుచుండగా వానరశ్రేష్ఠులు రక్కసుల యరదములపై కురికి సారధుల గూల్చుచు గుఱ్ఱముల జంపుచు గజములను పట్టి గిరగిర ద్రిప్పి నేలపై మోదుచు ఘోరముగా యుద్ధమొనరింప రక్కసులు నిలువలేక ఇంద్రజిత్తు మున్నగు రాక్షస వీరులను శరణువేడిరి.

అంత మేఘనాథ దశగ్రీవాదులు తమ రథములను సేనా ముఖమునకు నడిపి సింహనాదములు చేసి ధనుష్టంకారములు చేయుచు రామునకు రావణుడు సౌమిత్రికి మేఘనాథుడు విభీషణునకు అతికాయుడు అంగదునకు మహోదరుడు హనుమంతునకు మహాకాయుడు సుగ్రీవునకు ప్రహస్తుడును ఎదురు నిలిచి భయంకరముగా పోరాడసాగిరి.

అంతలో మధ్యాహ్నమయ్యెను. ఇంద్రజిత్తు లక్ష్మణునిపై పది బాణములు ప్రయోగింప లక్ష్మణుడొక్క బాణముతో ఖండించెను. రావణి (ఇంద్రజిత్తు) పర్వతాస్త్రమును ప్రయోగింప సౌమిత్రి వజ్రాస్త్రమును ప్రయోగించెను. మేఘనాథుడాగ్నేయాస్త్రమును ప్రయోగింప లక్ష్మణుడు వారుణాస్త్రమును ప్రయోగించి పది బాణములతో నింద్రజిత్తు గుఱ్ఱములు గూల్చి రథ

మును ముక్కలు చేసి కవచమును చీల్చి విల్లు ఖండించెను. ఇంద్రజిత్తు వెంటనే మరియొక రథమధిరోహించి వేరొక విల్లు దాల్చి సౌమిత్రిపై నిరువదియైదు బాణములనేసి నొప్పించి యిట్లనెను. లక్ష్మణ ! నీవు వయసులో నున్నావు కావున పారిపోయి ప్రాణములు రక్షించుకొనుము. మీయన్న నిమిత్తమై యేల ప్రాణములు పోగొట్టుకొందువు ?

లక్ష్మణుడు మేఘనాథుని పలుకులాలించి ప్రళయాంతకుని కైవడి భయంకరుడై యారు వాడి బాణములతో సూతుని గూల్చి మూడమ్ములతో అశ్వములను పతాకమును పడగొట్టెను. అంతనా దానవేంద్రుని సుతుడు ఆకసమునకెగసి శత్రువులను గూల్చ దలచి సౌమిత్రిపై బాణవర్షము గురియగా లక్ష్మణుడు మంచు కొండవలె నిశ్చలుడై యుండెను. రావణి సైన్యమును మూర్ఛ పడనేసి యింటికేగెను.

వానరవీరులును నిశాచర వీరులును ఘోర సమరమొనరించు సమయమున దశగ్రీవుడు వాడియైన వేయి బాణములు రామునిపై బ్రయోగింపగా రాముడు అర్థచంద్రాస్త్రమున వేయిబాణములను ఖండించెను. రావణుడు దానవాస్త్రమును ప్రయోగింప రాముడు వైష్ణవాస్త్రమునడ్రించి రావణుని విల్లు ముక్కముక్కలుగా ఖండించెను. వెంటనే రావణుడిరువది చేతులతోను ధనుర్బాణములు దాల్పగా రాముడా ధనుర్బాణములన్నియు ఖండించి అగ్ని సదృశములైన శరములతో శరీరమును విదళింపగా రావణుడు నేలగూలిపోయిన ధైర్యపరాక్రమములను మరల కూడదీసి కొని వేరు రథమధిరోహించెను. రాముని బాణములు రావణుని మేనున చొచ్చుకొనిపోయి దిగంతములకేగి మరల రాముని యమ్ముల పొదిలో ప్రవేశించుచుండెను. రావణుడెట్లు కయ్యమొనరింపవలెనో తెలియక యరదము మరలించి యింటికేగి దిగులుతో మంచముపై బడి దొర్లుచుండెను.

శ్రీరామచంద్రమూర్తి జాంబవంతుడు సుగ్రీవుడు సుషేణుడు నీలుడు ఆంజనేయుడు నున్నగు వీరులను చూచి యో వీరులారా ! పరాక్రమశాలియగు నింద్రజిత్తుడు మన సైన్యమును పడగొట్టి వెళ్ళెను. వారిని మరల జీవింపజేసి రావణుని సైన్యమును కూల్చుటకు తగు నుపాయము తెలియజేయుడు అని కోరగా సుషేణుడు రామచంద్రునకు మ్రొక్కి దేవా ! వాయుసుతుని బంపి చంద్రద్రోణ గిరిపైనున్న ఓషధులను తెప్పించిన కూలిన వానర వీరులను జీవింప జేయవచ్చునని విన్నవించెను. రాముడు సుషేణుని చూచి నీవు పేర్కొన్న యోషధుల పేర్లు తెల్పుమనగా సుషేణుడిట్లు చెప్పదొడంగెను.

రామ : సంజీవకరణి యను నోషధి మృతి చెందిన వారిని పునర్జీవితుని గావించును విశల్యకరణి శల్యములందలి (గాయములను) ఛిద్రములను మాన్పును. సంధానకరణి విరిగిన శల్యముల నతుకును. సంజీవకరణి తెల్లని యాకులతో బంగరు వన్నె చిగుళ్ళతో నల్లని పువ్వులతో ఎఱ్ఱని తొడిమలు ఎఱ్ఱని పండ్లతో నొప్పును తెల్లని తొడిమలు పాటల వర్ణము చివుళ్ళు మొగ్గలు పువ్వులు ఆకులు కాయలు (పళ్ళు) తెల్లని కొమ్మలు కలిగి విశల్యకరణి విలసిల్లును. నల్లని యాకులతో ఎఱ్ఱని చివుళ్ళతో తెల్లని తొడిమలు తెల్లని పువ్వులు తెల్లని మొగ్గలు తెల్లని కాయలు (పండ్లు) కలిగి సంధానకరణి యుండును.

సుషేణుని పలుకులు విన్నంతనే రాముడు మారుతాత్మజుని చూచి యాంజనేయ ! రాక్షసులు మన సైన్యమును రణరంగమున గూల్చిరి. కూలిన వానరవీరులను జీవింపజేయుటకై వెంటనే యేగి సుషేణుడు చెప్పిన యోషధులను తేవలయును అని పలుకగా మారుతి యంగీకరించి జాంబవంతుని వలన మార్గమును గ్రహించి రామునకు మ్రొక్కి యనుమతి గైకొని ఆకాశ మార్గమున నేగి

సముద్ర మధ్యనున్న చంద్రగిరిని చూచి యా కొండపై సుషే ణుడు తెల్పిన ఔషధులను పరికించి సమీపించునంతలో నవి మాయమయ్యెను. హనుమంతుడు కోపము పట్టజాలక సముద్ర మధ్యనున్న కొండను తోకతో నవలీలగా పెకలించి చేతబూని లంకకు పయనమగునంతలో పర్వత రక్షకులగు దేవతలు హను మంతునితో పోరాటమునకు పూనుకొనిరి.

హనుమంతుడు తోకతో దేవతల నెల్లవారించి కొండను గుత్తి వలె దాల్చి గగన మార్గమున పయనమగుట నింద్రుడు చూచి కోపముతో బాణవర్షము కురిపించిన వాయుసూనుడు లెక్కచేయక యేగుచున్న సమయమున ఇంద్రుడు హనుమంతునిపై వజ్ర మును విసరెను. తన మీద కరుదెంచుచున్న వజ్రాయుధమును తన వాలముతో కొట్టగా నది మరల నింద్రుని చేరెను.

అంతనా వాయుసూనుడు నిరపాయముగా కొండను రాముని కడకు తీసికొనిపోయి క్రింద దించి రామునకు మ్రొక్కి నిలబడెను. రాముడు జాంబవంతుడు సుషేణుడు సుగ్రీవుడు సంత సముతో నొకేసారి చంద్రగిరి నధిరోహించిరి. సుషేణుడు సంజీవిన్యా ద్యౌషధులను తెచ్చి సైన్యమునకొసంగగా సైనికులెల్లరును నిద్ర లేచిన రీతిగా నొక్కుమ్మడిగా లేచి జయజయ ధ్వానులు చేయుచు వృక్షములను శిలలను చేతులలో దాల్చి యుద్ధ సన్నద్ధులై నిలచిరి రాముడు సౌమిత్రిని చూచి సోదరా ! వాయుసూనుడు చేసిన యుపకారము వలన మన వానరవీరులు పునర్జీవితులైరి. అని సంతసముతో పలికి హనుమంతుని జూచి చంద్రగిరిని యథా స్థానమున నుంచి రమ్మని యానతీయగా హనుమంతుడా ప్రకా రము చేసెను.

ఆ రాత్రి రావణునికెటు జూచిన రాముడే గోచరించుచుం డెను భీతితో మంచము మీది నుండి లేచి మరియొక గదిలోనికేగి యాకసము వంక జూచి నక్షత్రముల వలన రెండు జాములు గడచె వని గ్రహించి సభాస్థలికేగి మంత్రులను రావించి ప్రహస్తాదులను చూచి రామలక్ష్మణులను చంపు నుపాయము తెలియజేయుడని కోరగా వారు లేచి నిలిచి జోహారులర్పించి యిట్లు విన్నవించిరి. దానవేంద్ర ! రాముడు యముడా ! త్రినేత్రుడా ! వానికి భయపడ నేల ? మానవ మాత్రుడు మనలనేమి చేయగలడు? మా బలపరాక్రమములెరుగవా ? నీవానతిచ్చిన క్షణములో రాముని హత మార్చమా ?

అప్పుడు దేవాంతక నరాంతకాదులిట్లనిరి. రాక్షసరాజ ! రామునకు బెదరనేల ? రామలక్ష్మణులను వానర సైన్యమును రేపు మట్టుపెట్టి మీకు ప్రీతిగూర్తుము మా మాట నమ్ముము అని ధైర్యము గలుపగా దశగ్రీవుడాలించి దానవ వీరులార ! రేపు రామ లక్ష్మణులను సంహరించి నాకానందము గూర్చుడని మీకానతి నొసంగితినని పలికి రాక్షసవీరులను సాగనంపెను.

మరునాడు రాక్షస వీరులు చతురంగ బల సమన్వితులై సముద్రము పొంగి పొరలుచున్నదో యనునట్లు కదలి లంకా నగరము వెలువడి వానర సైన్యముపై బడి బాణవర్షము కురియసాగిరి అంత సుగ్రీవాది వానరవీరులు తమ సైనికులను పురికొల్పిన నుభయ సైన్యములు సంకుల సమరము చేయదొడంగెను.

ఆ సమయమున అంగద మహోదరాదులు వాతాత్మజ మహా కాయులును సుగ్రీవ ముష్ట్యాసురులును జాంబవన్మహా పార్శ్వులును రామ దేవాంతకులును సౌమిత్రి నరాంతకులును తలపడి పోరు చుండ మిగిలిన వానరులు రాక్షస వీరులను డీకొని పోరసాగిరి రావ

ఱుడత్యున్నతమైన సౌధాగ్రమును చేరి దేవదానవుల వలె పోరు చున్న వానర నిశాచర సమరము చూడసాగెను. ఆ సమయమున వానరవీరులు రాక్షసవీరుల నవలీలగా గూల్చుట రావణుడు తిల కించెను. వాయుసూనుడు మహాకాయుని జాంబవంతుడు మహా పార్శ్వుని అంగదుడు మహోదరుని గూల్చుట రావణుడు గమనిం చెను.

ఆ సమయమున దేవాంతకుడు వేయి యేనుగులు నూరు రథ ములు పదివేల యశ్వములు ౬0 వేల కాల్బలము తనకు తోడు రాగా సకలాస్త్రధారియై కల్పాంతకునివలె రాముని డీకొనెను. రాముడు దేవాంతకుని కిరీటము పడనేయగా ఆ రక్కసుడు రాము నిపై బాణవర్షము గురిసెను. రాముడాగ్రహముతో దేవాంతకుని విల్లు ఖండింపగా వాడు వేరొక విల్లు గైకొని శైలాస్త్రమును ప్రయో గింప రాముడు వజ్రాస్త్రము నేసి శైలాస్త్రమును ఖండించి యాగ్నే యాస్త్రముతో దేవాంతకుని గూల్చెను.

నరాంతకుడు భయంకర బాణములను ప్రయోగించుచు సౌమిత్రీ ! నా చేతిలో జిక్కితివి. ఎందు పోగలవు ? అని బీర ములు పలుకుచుండ లక్ష్మణుడు విల్లమ్ములు పూని ధనుష్టంకార ములు చేయుచు దిగ్గజములను కంపింపజేయుచు తీవ్రమైన యొక బాణమును నరాంతకుని రొమ్ముపై నాటి మూర్ఛపడగొట్టెను. నరాంతకుడు క్షణములో మూర్ఛదేరి ధనుర్బాణములు దాల్చి లక్ష్మణుని నుదుట మూడమ్ములు శిరమున నైదు బాణములు చేతులపై రెండమ్ములు ప్రయోగింపగా లక్ష్మణుడు ధీరుడై భయంకర శరముచే నరాంతకుని విల్లు ఖండించి యొక బాణముతో సారథిని రెండు బాణములతో గుఱ్ఱములను గూల్చెను.

విరథుడైన నరాంతకుడు వేరొక విల్లుదాల్చి బాణములతో లక్ష్మణుని వక్షస్థలమున గొట్టెను. లక్ష్మణుడాగ్రహ పరవశుడై వాడి బాణములు ప్రయోగించి నరాంతకుని పడగొట్టెను. అంత వానరవీరులు దేవాంతక నరాంతకుల సైన్యముపైబడి చెట్లతో మోదుచు చేతులతో చరచుచు మోకాళ్ళతో పొడుచుచు పలు రీతులుగా చతురంగ బలములను రూపుమాపజొచ్చిరి.

అట్టి సమయమున అతికాయుడు బాణవర్షము గురియుచు రామునాక్షేపించుచు రామ ! నిన్నును, నీ వారిని గూల్చి నాకీర్తి నెల్లెడల వ్యాపింపజేయుదును. అని పలికి అయిదు బాణములు రామునిపై నేసెను. అతికాయుని పలుకులకు లక్ష్మణుడాగ్రహించి రాక్షసాధమ ! క్షణములో నిన్ను సంహరింతును అని పలుకగా అతికాయుడు సౌమిత్రీ ! నీవు చిన్నవాడవు. యుద్ధమన నెట్టిదో నీకేమి యెరుక ? నా బాణాగ్ని కేల యాహుతి యగుదువు ? పారిపొమ్ము. యుద్ధమనగా ధనుర్బాణములు దాల్చి యడవులలో తిరుగుట కాదు

లక్ష్మణుడతికాయుని పలుకులాలించి ప్రళయాంతకుని వలె భయంకరాకారుడై ఆరు వాడి బాణములచే సారథిని ద్రుంచి మూడమ్ములచేత విల్లు ద్రుంచి రెండు వందల బాణములచేత రథమును గూల్చెను అంతనతికాయుడు మరియొక రథమెక్కి వేరొక విల్లందుకొని కాలసర్పముల వంటి నూరు శరములచే సౌమిత్రి నొప్పించి బాణవర్షము గురియసాగెను. లక్ష్మణుడు క్రోధాగ్నిచే నెరవడిన కన్నులు కలవాడై అతికాయుడు ప్రయోగించు బాణములను ఖండింపసాగెను. అన్యోన్య జయ కాంక్షతో లక్ష్మణాతికాయులు పోరాడు సమయమున కొండతో గొండయు కొలవితో కొలవియు ఏనుగుతో నేనుగును పోరుచున్నట్లుండెను. ఈ రీతిగా అతికాయుడు లక్ష్మణుడు పోరాడుచున్న సమయమున

లక్ష్మణుడు క్రోధావేశముతో బ్రహ్మాస్త్రము ప్రయోగించెను. ఆ బ్రహ్మాస్త్రము మంటలు గ్రక్కుచు నతికాయుని గూల్చెను.

అంతనా వానరవీరులు సింహనాదములు చేయుచు రాక్షస సైన్యమును పరిమార్చుచుండిరి. దేవాంతక నరాంతకుల మరణ వార్త విని రావణుడు కొంత తడవు చింతించి సభా భవనమునకేగి మంత్రిలను రావించి యొడలెరుగక నిద్రించుచున్న కుంభకర్ణుని లేపుడని యాదేశించెను.

రావణుని యాదేశానుసారము కుంభకర్ణుని నిద్ర లేపుటకై రాక్షస వీరులు భేరీపటహకాహళాది వాద్యములు మ్రోగించుచు 19 ఏనుగులను తోలుకొనిపోయి కుంభకర్ణుని త్రొక్కించి యెట్టకేలకు నిద్రలేపగా కుంభకర్ణుడు చంద్రకాంత శిలావేదికపై గూర్చుండి ఏబది బండ్లపై వచ్చిన మాంసము భుజించి వేయి కుండలతో దెచ్చిన కల్లు ద్రావి రెక్కలు గల కొండవలె చేతులు చాచి అన్న యున్న సభా భవనమునకేగి యుచితాసనాసీనుడై జరిగిన వృత్తాంతమును విని యట్టహాసము చేసి రావణునితో నిట్లనెను.

దనుజేంద్రా ! రాముడు కేవలమయోధ్యాధిపతియని నమ్మితివా ? దేవతలను మునులను సజ్జనులను రక్షించుటకై శ్రీ మహావిష్ణువు రాముడై యవతరించెనని నారదుడు నాకు తెలియజేసెను. అదియు గాక కడలికి సేతువు గట్టుట రామునకుగాక మరియొకరికేల సాధ్యమగును ? సామాన్య వానరులకు రక్కసులను చంపుట యెట్లు సాధ్యమైనదో గ్రహించితివా ? అంతయు యోచించిన మనకు చేటు కాలము దాపురించినట్లు తోచుచున్నది. తడబాటు లేక యోచింపుము. రామునితో మనకు వాద వివాదములేల ? సీతాదేవి నొసంగిన రాముడు లంకను విడిచి యడవుల వెంట తిరుగును.

కుంభకర్ణుని పలుకులు విని రావణుడిట్లనెను తిండిపోతా ! నీవు నాకడ నుండదగవు. పోయి హాయిగా నిద్రపొమ్ము. తిండి పోతువు నిద్రాళుడవునగు నీకు యుద్ధమేమిటి ? నిద్రించు కొండ చిలువవలె పడియుండుము.

రావణుని నిష్ఠురోక్తులు విని కుంభకర్ణుడు పండ్లు పటపట కొరుకుచు గదను గైకొని వెంటనే సమర భూమిలో నురికెను. భయంకరాకారుడైన కుంభకర్ణుడసహాయ శూరుడై మదగజము తామరపూలను పెకలించునట్లు వానరులను ద్రుంచుచు నిర్భయముగా రణరంగమున విహరించుచున్న సమయమున వానరులు భీతితో పలాయన మంత్రము పఠింపసాగిరి కుంభకర్ణుడు రెండు చేతులు చాచి తనవారు పరాయివారు అను విచక్షణ లేక దానవులను వానరులను చంపుచు ఏనుగుల నెత్తురు ద్రావుచు విజృంభించుచుండ విభీషణుడరుదెంచి యన్నతో నిట్లనెను. అన్నా ! కుంభకర్ణా ! నేను నీ తమ్ముడగు విభీషణుడను. రాజసత్తముడగు రామునితో వైరముడిగి సీతను సమర్పింపుమని రావణునకు పెక్కు పర్యాయములు హిత వచనములు పలికితిని. నా పలుకులు తప్పుగా నెంచి యన్నయగు రావణుడు నన్ను మోది సభ్యులెల్లరు వలదన్నను వినక లంకాపురము నుండి బహిష్కరించెను. నేను వెంటనే మంత్రివరులతో బయలుదేరి రాముని శరణు పొందితిని. నన్ను రాజద్రోహిగా భ్రాతృద్రోహిగా నెంచకుమని సాష్టాంగ నమస్కారము చేయుగా కుంభకర్ణుడు తమ్ముని కౌగిలించుకొని సేమమడిగి నీవు రాక్షస రాజువు కాగలవని దీవించి వెంటనే రాముని కడకరుగుమని విభీషణుని సాగనంపి వానరులపైబడి సర్వనాశన మొనరించు చుండెను.

ఆ సమయమున పెనుభూతమరుదెంచెనో, కృతాంతుడీ రీతిగా వచ్చెనో అన్నట్లు వానరులు రాక్షసులు అను మొగమాటమి

లేకదునుమాడుచున్నాడు. మన మీదు రాత్మునితో పోరాడజాలమని వానర వీరులు సుగ్రీవునితో మొరబెట్టుకొనిరి. అంత సుగ్రీవాదులు రాముని జేరి మ్రొక్కి రామా! రక్షించు! రక్షించు! అనివేడుకొనసాగిరి. సుగ్రీవుడు రామచంద్ర! రావణుని తమ్ముడగు కుంభకర్ణుడే తెంచి ప్రళయకాలరుద్రునివలె సమరమొనరించుచుండెను. పోరాడ లేక వానరులు భీతిచెందుచున్నారు.

రామలక్ష్మణులు సుగ్రీవుని పలుకు లాలించి రోషారుణిత నేత్రులై ధనుర్బాణములు చేబూని యుద్ధోన్ముఖులై వానర వీరులారా! భీకరాకారుడైన కుంభకర్ణుని రణ భూమిలో కూల్తుము భీతి చెందకుడు అని ధైర్యము గరపి వెంటనే యుద్ధ భూమి కేగి శూలము చేబూని భయంకరముగా విహరించుచున్న కుంభకర్ణునిపై బాణ వర్షము గురిసిరి.

కుంభకర్ణుడుగ్రుడై రామలక్ష్మణులనుపట్టి వధించుటకై వేగముగావచ్చుట చూచి లక్ష్మణుడు వామహస్తమును ఖండింప శ్రీరాముడు దక్షిణ హస్తమును ఖండించెను. ఇంద్రుని వజ్రహతిచే రెక్కలు తెగిన గిరిరాజువలెనున్న కుంభకర్ణుడు పెద్దనోరు తెరచి రాముని మ్రింగుటకువచ్చుట జూచి శ్రీరాముడు వాడియమ్ములనేసెను శ్రీరాముని బాణ వర్షమునకు కుంభకర్ణుడు సింహనాదము చేయుచు రాహువు సూర్యుని మ్రింగబోవునట్లు నోరుతెరచి రాముని మ్రింగుటకు ద్యుక్తుడయ్యెను. అదిచూచి రాముడు కొపముతో మండిపడుచు ధనుస్సున ఇంద్రాస్త్రము సంధించి యాకర్ణాంతము లాగివిడిచిపెట్టి కుంభకర్ణుని కంఠమును ఖండించి శరపరంపరను ప్రయోగించి యాశిరమును సముద్ర మధ్యమునపడునట్లు చేసెను అప్పుడు దేవదుందుభులు మ్రోగినవి. ఆకసమునుండి పూలవాన కురిసినది. అచ్చరలాడిరి. గంధర్వులుపాడిరి. వానరులు సంతోషాతి

శయముతో సింహనాదములు చేయుచు శ్రీ రామునకు మ్రొక్కి నుతింపసాగిరి.

రావణుడు కుంభకర్ణుని వధను విని మూర్ఛిల్లి కొంత తడవునకు మూర్ఛదేరి విలపించుచుండ మేఘనాథుడే తెంచి దుఃఖోపశమనవచనములు పలికి ధనుర్బాణములు గైకొని తండ్రియనుమతి బడసి పర్వత శిఖరముపై కురుకు సింగపుగొదమవలె రథముపై కురికి చతురంగబలవములు వెంటరాగ లంకాపురోపకంఠముచేరి సైన్యమును గుండ్రముగా నిలిపి మధ్యభాగమున తాను ప్రవేశించి విశాల వేదికపైనగ్ని గుండము లేర్పరచి మేడి రావిజువ్విమున్నగు సమిధలును నువ్వులుమినుములు మున్నగు ధాన్యములును మేక ఎలుగు బంటి కోతి కుందేలు పులి నక్క పిల్లి మనుజుడు పంది మున్నగు ప్రాణుల రక్త మాంసములును, తేలు, పాము మున్నగునవియు. కాకి, గుడ్లగూబ, మొదలగు పక్షుల రెక్కలును కల్లు పెరుగు, తేనె, నెయ్యి మున్నగునవియు తెచ్చి అభిచారక్రియా హోమములు చేయుచున్న సమయమున హోమధూమమాకాశమున మేఘము వలె వ్యాపించుచుండెను.

వానరులాపొగచూచి రామునితో విన్నవింప రాముడు విభీషణుని చూచిదనుజశ్రేష్ఠా! లంకలో పొగలులేచుటకు కారణమేమి? అని యడిగిన విభీషణుడిట్లనెను. రామ! రావణుని తనయుడునికుంభిలాహోమము చేయుచున్నాడు. అదినిర్విఘ్నముగా పూర్తియైన యెడల అగ్నికుండము నుండి రథము, గుఱ్ఱములు, కవచములు, శరశరాసనములు పుట్టును. వానిని గ్రహించి యుద్ధమున కరుదెంచిన యెడల నింద్రజిత్తును దేవదానవులు కూడ జయింపజాలరు. కావున ఆ హోమమునకు విఘ్నమొనరించి వానిని తెగటార్చుటకై సైనికుల నిచ్చి సౌమిత్రిని బంపుమని శ్రీరాముడు రోషారుణిత

సేతుడై ధనుర్బాణములు దాల్చి విభీషణా! సుగ్రీవాదుల గూడి నీవు తోడుగా వచ్చిన యెడల వానిని గూల్చెదనని దిగ్గునలేచెను. అప్పుడు విభీషణుడు రామునకు మ్రొక్కి దేవా! పదునాల్గు సంవత్సరములు నిద్రాహారములు విడిచి బ్రహ్మచర్యమును పాటించిన వానిచే మాత్రమే మేఘనాథుడు మరణించునని పూర్వము నారదుడు తెలిపెను. ఆ విధముగా సౌమిత్రియుండెనని వింటిననిన రాముడు తమ్ముని వలన విషయము తెలిసికొని ఇంద్రజిత్తును చంపుటకై లక్ష్మణునంపి వానికి తోడుగా పవనతనయనీలాంగదాదులనంపెను.

అంతనా వానరులు కొండలు శిలలు వృక్షములు తీసికొని భూనభోంతరాళములు మారుమ్రోగునట్లు సింహనాదములు చేయుచుహోమ ప్రదేశమునకేగి తరువులను శిలలను వర్షములుగాకురిసిరి. లక్ష్మణుడింద్రజిత్తు చేతులలోనెనిమిది బాణములు నుదుట మూడు బాణములు ఱొమ్మున నొక బాణము నాటెను కొందరు వానరశ్రేష్ఠులు కొండరాళ్ళను వేసి అగ్నికుండములను చల్లార్చిరి. అంజనేయుడొకవృక్షముతో నింద్రజిత్తు ఱొమ్మున మోదెను దానితో నతడు నిశ్చేష్టుడై నేలగూలి దిగ్గునలేచి మిగుల కోపముతో ధనుర్బాణము లుగ్గైకొనియరద మధిరోహించి వానర సైన్యమును ముట్టడించెను. వజ్రములవంటి శరములను వానరులపై వేయుచుండవారు కొండలను చెట్లను వేయుచుండిరి.

రాక్షస వీరులు శరధారలతో వానర వీరులను ముంపగా వానరులు కొండలను పెకలించి రక్కసులపై విసిరి పీనుగులుగా చేయుచుండిరి. ఇంద్రజిత్తు భీకరశరవృష్టిచే వానర సైన్యమును నొప్పించెను. గజుడు గవయుడు మున్నగు వానర వీరులు మేఘనాథుని శరవృష్టివలన ధైర్యము కోల్పోయి యేయుపాయము నుతోచక నిర్జన స్థలములకు పారిపోయిరి.

వానర సైన్యము కకావికలై పారిపోవుట చూచి సుగ్రీవుడు ఆంజనేయుడు అంగదుడు మున్నగు వీరులు లక్ష్మణుని చేరి సౌమిత్రీ ! ఇంద్రజిత్తునకు భయపడి వానర సైన్యము చెల్లాచెదరై పారిపోయినది. వానరులకు రక్షణ కల్పించి ధైర్యము గరపుము అని పలుకగా లక్ష్మణుడు ప్రళయాంతకునివలెనుగ్రుడై రెండు నూరులు బాణములచే మేఘనాథుని దేహము నొప్పించి విల్లు విరచి సారథిని ద్రుంచి రాక్షస సైన్యము పారిపోవునట్లు వాడిబాణముల వాన గురిపించెను.

అంతనా మేఘనాథుడు రథముతో నెగిరి మెఱుపువలె మబ్బుల చాటుననిలిచి మరియొక విల్లు గైకొని బాణవర్షము కురిపెను. విను వీధినుండి పడుచున్న బాణవర్షమునకు నిలువలేక వానరులు లక్ష్మణునిశరణు వేడిరి. లక్ష్మణుని విల్లెక్కుపెట్టి ఆకాశమునుండి గురియు బాణపరంపరను తునియలు చేయసాగెను. అట్లొకదినము గడచెను. లక్ష్మణుని ధైర్యము సన్నగిల్లుట విభీషణుడు గమనించి లక్ష్మణుని చేరి కుమార ! ఆకసమున రావణియు మనము క్రింద నుంటిమి. వాని బాణ వర్షముచే నొచ్చి వానరులు నేలగూలు చుండిరి. అది చూచి పగవారు మనలను గేలిసేయుచున్నారు. రాకుమార ! మేఘనాథుడు మహాబలుడు మహారథుడు. అఖిలశాస్త్రములందును మాయలయందును నిపుణుడు. ఆకసము నుండి మనతో నేలనున్నవాడెట్లు పోరాడవలెనో యోచింపుమనెను. లక్ష్మణుడు సమరమునకు సమానస్థలము మేలనిపలుకగా హనుమంతుడు సౌమిత్రీ ! నీవు నా వీపున గూర్చున్నయెడల నిన్నాకసమునకు తీసికొనిపోయి యింద్రజిత్తుతో సమస్థానము కల్పింతును. నీవు సులభముగా సమరము చేసి యింద్రజిత్తును జయింపుమని పలుకగా సౌమిత్రి యంగీకరించి

హనుమంతుని భుజములపై గూర్చుని యైరావతము మీదనున్న యింద్రునివలెను ఉదయాద్రినున్న చంద్రునివలెను విలసిల్లెను.

వామనుడు త్రివిక్రముడై భూనభోంతరాళములనాక్రమించిన రీతిగా హనుమంతుడు తన దేహము పెంచెను, ఇంద్రజిత్తు మూడు వాడి బాణములు లక్ష్మణుని బొమ్మన ప్రయోగింపగా శోణాద్రి నుండి యెర్రని సెలయేరులు ప్రవహించునట్లుగా గాయములనుండి రక్తపుటేరులు పారెను. అంత రామానుజుడు రాక్షస మాయ తొలగింపదలచి ఆగ్నేయాస్త్రముతో రాక్షసమాయనణచివైచెను. లక్ష్మణుడంతతో నాగక రావణి తేరుగూల్చి చాపము ఖండించి కవచము చీల్చి శరీరము నొప్పించెను. అంత మేఘనాథుడు విరథుడై క్రిందికి దిగి మనోహరమైన వేరొక తేరెక్కి ధనుర్బాణములు దాల్చి యుద్ధమునకరుదెంచు చుండెను. హనుమంతుడు పసిడి కొండవంటి దేహమునుతగ్గించెను సౌమిత్రి తీవ్రమైననారాచములను ఇంద్రజిత్తుపై ప్రయోగింపగా వాడును హనుమంతునిపై వాడిబాణము ప్రయోగించి పదునైన ఏడుబాణములను లక్ష్మణుని పై వేసి భయంకరముగా గర్జించెను. రామానుజుడును రావణిను దుట భుజములయందు ఆరేసి బాణములు ప్రయోగింపగావాడు (ఇంద్రజిత్తు) లక్ష్మణునిపై నూరమ్ములు ప్రయోగించెను. లక్ష్మణుడు జంకు లేక రావణిపై నైదుబాణములు ప్రయోగించెను. అంతతో నాగక రెండువైపుల పదునుకల యెనిమిది బాణములు బొమ్మన,చుబుకముపై నైదు ప్రయోగించి నొప్పించి రాక్షసాధమా! నీ కొవ్వణచెదనని. పలికి ఆగ్నేయాస్త్రమును ప్రయోగింపగా రావణి వారుణాస్త్రమున దాని నణచెను. దానవుడు నాగాస్త్రము నేయగా సౌమిత్రి గారుడాస్త్రముచే దానిని ఖండించెను. ఈ విధంగా నెడతెగని బాణవర్షముతో దేవదానవులకు వింత గొల్పునట్లు

సౌమిత్రియు మేఘనాథుడు పోరుచుండగా చివరకు విసుగెత్తి సౌమిత్రి విశ్వామిత్రుడుపదేశించిన బ్రహ్మాస్త్రమును ఇంద్ర జిత్తుపై ప్రయోగింపగా అదిభయంకరముగా జ్వాలలుగ్రక్కుచు భూనభోంతరములు దద్దరిల్లునట్లు వేగముగాపోయి యింద్రజిత్తు ను గూల్చెను. ఆ సమయమున దేవతలు దుందుభులు మ్రోగించి పూలవాన గురిసిరి. ఆనందమున నచ్చరలాడిరి.

కుమారుడగు నింద్రజిత్తు మరణ వార్త విని రావణుడు మూర్ఛవోయి శీతలోపచారములకు కొంతసేపటికి తెలివి వచ్చిన భర్తను మందోదరి సమీపించి నాథ! కష్టదినము లేతెంచినవి కానలకేగి తపము చేసికొని ముక్తి గాంచుట మేలని హితవు గరపుచుండ రావణుడిట్లనెను. వనితా! త్రిలోకములు జయించి వైభవమునార్జించి పేదబాపనివలె ముక్కుమూసికొని యడవుల లో నివసించుటకు నేనంగీకరింపను. ఇలలో నేనైన నుండవలె రాముడైన నుండవలెగాని యిరువురు నుండుట కుదరదు. సమర మున రాముని జయించిన జానకి లభించును. మరణించిన ముక్తికాంత లభించును. కష్టములందు ధైర్యమవలంబింప వలయుననుమాట నీవు వినలేదా? మానవమాత్రునకు భయపడి యడవలలోవసించిన దేవదానవులునగరా? ఎప్పటికైనను మర ణము తప్పదుకదా? దశగ్రీవుని పలుకులువిని మందోదరి దుఃఖించుచు మారు పలుకలేక మిన్నకుండెను.

మేఘనాథుని గూల్చి వానర వీరుల జయజయ ధ్వానము లతో లక్ష్మణు డన్నను సమీపించి మ్రొక్కగా రాముడు లక్ష్మ ణుని ఆలింగనము చేసికొని సుగ్రీవాదులవలన లక్ష్మణుడింద్ర జిత్తును గూల్చిన విషయము తెలిసికొని యభినందించి సుగ్రీ వాదులను మిగులగొనియాడెను. ఆ రాత్రి చాలాసేపు సమర వార్తలు ముచ్చటించుకొని రామలక్ష్మణ సుగ్రీవాదులు చక్రా కారముగా నిలిచిన సైన్యము యొక్కమధ్యయందు నిద్రించిరి.

భేరీ మృదంగాది వాద్యరవములు భూమ్యాకాశములను మార్మోగజేయుచుండగా చతురంగబల సమేతుడై లంకవెడలి దశగ్రీవుడు వానరవీరులపైబడి సంహరించుచుండ వానర వీరులు శిలలను తరువులను వర్షముగా గురియసాగిరి ఉభయ సైన్యములకును సంకుల సమరము జరుగుచుండెను. ఆ కోలాహలమును విని రామలక్ష్మణులు విభీషణుని చూచి యీ గందరగోళమేమని ప్రశ్నింపగా విభీషణుడు భటుల వలన విషయమెరిగి రావణుడు సైన్యసమేతుడై సమరమునకేతెంచెనని విన్నవించెను. ధనుర్బాణములు చేతబూని సౌమిత్రి యుద్ధ సన్నద్ధుడై సుగ్రీవ విభీషణాదులను సమరమునకు పురికొల్పిన వారలును తొందరగా జని సింహనాదములు చేయుచు దానవ సైన్యముపైబడి పాదములతోతన్నుచు చేతులతో చరచుచు మోకాళ్ళతో పొడుచుచు పలు రీతులుగా శత్రు సైన్యమును సంహరించుచుండ విభీషణుడన్న నెదిరించి శరజాలమును ప్రయోగించుచున్న సమయమున దానవేంద్రుడు తమ్ముని జూచి రోషాగ్ని శిఖలెగయ నిట్లనెను. ఓరి కులద్రోహీ! శత్రువులతో గలిసి యుద్ధమున కేతెంచితివా? మయుడొసంగిన యీశక్తిచే చావుమని పలికి యభిమంత్రించి వేసెను. అది యప్రతిహతమైనదగుటచే రుద్రుని శూలమువలె విష్ణుచక్రమువలె బ్రహ్మదండమువలె భూనభోంతరాళములు నిండునట్లు నిప్పురవ్వలు వెదజల్లుచు వచ్చుచుండ లక్ష్మణుడు విభీషణునకడ్డమువచ్చి శక్తిపై వాడియమ్ములను ప్రయోగించెను. అదియాబాణములను సరకుగొనకమంటలు గ్రక్కుచు లక్ష్మణుని రొమ్మున ప్రవేశించి యతడు విష్ణువునకు శయనంబైన శేషుని యంశచే నవతరించినందున ప్రాణములను తీయజాలక మూర్ఛ పడనేసెను.

శ్రీరాముడది చూచి దుఃఖించి యెట్టకేలకు ధైర్యమవలంబించి కాలసర్పములవంటి బాణ సహస్రములచే రావణుని దేహమున తూట్లు పొడిచి సారధినిదునిమి నూరమ్ములచే రథాశ్వముల గూల్చి వజ్రసమాన బాణపరంపరచే పదివిల్లులు ఖండించి నుదుట మూడు వాడియమ్ములను ప్రయోగించిన రావణుడు విరథుడై నేలబడి సొమ్మసిల్లి లేచి రాముని యెదుట నిలువలేక లంకకు పరుగిడి ఇంటిలో ప్రవేశించినేడు సౌమిత్రిని చంపితినని మంత్రులతో యుద్ధమును గూర్చి వివరించుచుండెను.

రావణుని తరిమివేసిన పిదప శ్రీరాముడు మూర్ఛపోయిన తమ్ముని చూచి దుఃఖ సాగరమున మునిగి మూర్ఛిల్లెను. ఆంజనేయుడు సుగ్రీవుడు మున్నగువారు రాముని చుట్టును చేరి ఖిన్నులై వగచుచుండ సుషేణుడరుదెంచి లక్ష్మణుడు జీవించియేయున్నాడు. దుఃఖింపకుడనెను.

సుగ్రీవుడు సుషేణుని చూచి మాకానందముగాచెప్పుమని యాదేశింపహనుమదంగదాదులు కూడ సుషేణుని చేరి లక్ష్మణుని జీవింపజేయుమని కోరిరి. అంతనా సుషేణుడు చంద్రగిరియందు సంజీవనము సంధానకరణము మున్నగునోషధులు కలవు. వానిని సూర్యోదయమునకు ముందే తెచ్చి యిచ్చిన లక్ష్మణుడు జీవించుటయే కాక మరింత బలశాలి కాగలడని వలికెను.

కొంతసేపటికి రాముడు మూర్ఛలేచి తమ్ముని కౌగిలించుకొని దుఃఖించుచుండ సుగ్రీవాదులు సుషేణుడు తెల్పిన మాటలు రామునకు విన్నవించి యూరడించి వెంటనే మందులు తేగలవారిని చంద్రగిరికి పంపవలెనని పలుకగా రామచంద్రుడాంజనేయుని చూచి యిట్లు పలికెను. సోదరా! ఆంజనేయ! నా తమ్ముడగు లక్ష్మణుడు నీకు తమ్ముడే. నేటి నుండి నాకు నీతో నలువురు

తమ్ముఁలు. ఇప్పుడేమిచేయవలయునో నాకేమియు పాలుపోకు న్నది. సుషేణుడు చెప్పినట్లు నీవోషధులు తెచ్చి మన తమ్ముని, సౌమిత్రిని జీవింపజేయుము. అని పలుకగా మారుతి రామునకు మ్రొక్కి దేవా! చంద్రగిరి యోషధులను తీసికొని సూర్యోదయ మునకు ముందే వచ్చి లక్ష్మణుని జీవింపజేయుదునని విన్న వించెను.

పూర్వమేగిన దారినే హనుమంతుడు చంద్రగిరికేగుచుండ ఆ వార్తను శుకసారణుల వలన రావణుడు తెలిసికొని వెంటనే బయలుదేరి యర్ధరాత్రివేళ కాలనేమి యింటికేగి పిలువగా వాడు రావణునకు మ్రొక్కి రాక్షసరాజ! ఇంతయర్ధరాత్రి వచ్చుటకేమి కారణమో సెలవిండు అని పలుకగా రావణుడు కాలకేయ! రాక్షస కులమునకు ముప్పువచ్చిపడినది. సూర్య వంశీయులగు రామ లక్ష్మణుల వలన మనవారెందరో సమరముననిహతులైరి. రామ లక్ష్మణులకు తోడుగా కోతుల గుంపు వచ్చి మనవారితో పోరాడుచు భయంకర కృత్యములు చేయుచున్నారు. ఆ రాజకుమారులు మన చతురంగబలమునే కాక బంధుమిత్రులను పుత్రులను గూడ చంపివేసిరి. నేను వారినెల్లరనెదిరించి సమరముచేసి లక్ష్మణుని గూల్చి యింటి కరుదెంచితిని. రామాదులు ఓషధుల నిమిత్తమై వాయుసుతుని చం దగిరి కంపిరట. చంద్రగిరియందు కల సంజీ వన సంధానకరణాద్యోషధులను తెచ్చి లక్ష్మణుని జీవింపజేయు దురట. హనుమంతుడు చంద్రగిరికేగి యోషధులు తేకుండ నీవేగి ఆటంకము కలిగింపవలయును. అనగా కాలనేమి రావణు సెలవు పొంది పండితుని వేషము దాల్చి బయలుదేరి అంజనేయుని దారిలో తనమాయచే నొకతపోవనమును సృజించి తాను శిష్య సహితుడగు బ్రహ్మర్షి వేషము దాల్చి కన్నులు మూసికొని తప మొనరించుచున్నట్లు నటించెను.

ఆకాశ మార్గమున చంద్రగిరి కేగుచున్న హనుమంతుడు దారిలోనున్న మాయాతపోవనము చూచి ఇంతకు పూర్వము చంద్రగిరి కేగినప్పుడు లేని తపోవనమిప్పుడెట్లువచ్చినది ? నేను దారితప్పియుందునని భ్రమించి ఈ తపోవనమున దాహము దీర్చుకొని దారితెలిసికొని వెళ్ళెదనని తలచి నేలకు దిగి తపోవనము చేరి కపట మునీంద్రుని గని నమస్కరించి నిలువగా ఆ కపట ముని హనుమంతుని జూచి యిట్లు పలికెను. వాయుతనయా : తపోబలమువలన నిన్నును, నీవు బయలుదేరిన పని, చోటు గ్రహించితిని. రాక్షస రాజగు రావణుడు రామానుజుడగు సౌమిత్రిని యుద్ధభూమిలో పడగొట్టగా వానిని జీవింప జేయుటకోషధులు తెచ్చుటకు చంద్రగిరికి బయలుదేరి దారి తప్పియిట కరుదెంచితివి. నా తపోబలము వలన నిచట దివ్యౌషధములున్నవి. అయినను ఇంత తొందరపాటేల? లక్ష్మణుడు మూర్ఛపోయెనే కాని చనిపోలేదుకదా : లక్ష్మణుడు మూర్ఛలేచియున్నతో మాట్లాడుచున్నాడు. వానర వీరులు కూడ రామలక్ష్మణులతో మాట్లాడుచు సింహగర్జనలు చేయుట దివ్యదృష్టితో నిప్పుడే చూచితిని.

సంజీవని, విశల్యకరణి, సంధానకరణి మున్నగునోషధులు మా తపోవనమున కలవంటిని కదా : నీకు కావలసినయెడల నా దగ్గరనుపదేశమందిన నీకీ వనములోనన్ని యోషధులు కనుపింపగలవు అని పలుకుచుండ వాయునందనుడు మునీంద్రా: యుద్ధశ్రమచే మిగుల దప్పికగొనియుంటిని చల్లని మంచినీరుగల ప్రదేశమీప్రాంతముననెటనున్నదో తెల్పుమని కోరగా ఆకపటముని వాయునందనా : నా కమండములో చల్లని మంచినీరున్నది. త్రాగి బాగుగాముగ్గిన తీయని పండ్లు భుజించి నేటి రాత్రి విశ్రమించి యుదయమే వెళ్ళుము. లక్ష్మణుడు సుఖముగానున్నాడు కదా : అనిన హనుమంతుడు మునీంద్ర : నీ కమండ

లములోని నీరు నా దాహము తీర్చజాలదు కావున మంచి జలాశయమున్న తెలియజేయుము. నీరు గ్రోలెదననగా నా కపట ముని చిరునగవుతో మాయా శిష్యుని చూచి వత్స! ఈ వాయు తనయున కీవనమున గల జలాశయమును చూపుమని యాదేశింపగా ఆ కపట శిష్యుడు చిత్తమని పలికి హనుమంతుని వెంటనిడుకొనివెళ్ళి యెదుట నొక కొలను చూపెను అది నిర్మల మైన తీయని నీటితో నిండియుండెను. అది చూచి హనుమంతు డుత్సాహముగా చెరువులోదిగి కన్నులు మూసికొని నీరు గ్రోలు చున్నసమయమున ఆ కొలనులోని జలచర మాంజనేయుని మ్రింగివైచెను. అంతనాహనుమంతుడు దేహమును పెంచి వానిని చీల్చి పొట్టనుండి బయటకరుదెంచెను.

హనుమంతునిచే చీల్చబడిన మొసలి శాప విముక్తి బడసి స్త్రీగామారి దేవతలతోగూడి యాకసమున నిలిచి వాయునందనా! వీడు కాలనేమి యను రక్కనుడేకాని ముని కాడు అనిన నీ వెవ తెవు ? మొసలివై పడియుండుటకు కారణమేమి ? అని ప్రశ్నింపగా ఆ వనిత యిట్లు పలికెను. నేను ధాన్యమాలిని యను నచ్చరను. సునాభుడను ముని తపము చేయుచున్న సమయమున ఆకసమున పోవుచున్న నేను సునాభుని తపోవనముజూచి యందు విహరింపగోరి తిరుగుచుండగా ఆ ముని నన్ను చూచి మదన బాణ పీడితుడై నా పొందు గోరగా నో మునీంద్రా! నే నిప్పుడు రజస్వలనైయుంటినని లజ్జతో విన్నవింపగా స్నానానంతరము నా కోరిక దీర్చి వెళ్ళుమని యాదేశించి కన్నులు మూసికొని జప మొనరించుచుండెను. అట్టి సమయమున ముని ఎదుట తిరుగుట భావ్యము కాదని యెంచి స్నానానంతరము సునాభుని కోరిక దీర్చుటకై కొండలలో కోనలలో తిరుగుచుంటిని.

ఆ సమయమున దశగ్రీవుడు దిగ్విజయమునకై విమానమున నేగుచు కొండచరియలలో తిరుగుచున్న నన్నుచూచి కొండపై విమానము దింపి నాకడ కరుదెంచి యో కాంతా! నీపై మరులు గొని వచ్చితిని. నా కోరిక దీర్పుమనగా ఓ దనుజేంద్రా! ఈ వనములో తప మొనరించుచున్న సునాభుడను మునీంద్రుడు నేను ఋతుమతినని యెరింగి స్నానదినమునకై వేచియుండెను. వాని గోరిక దీర్చిన పిదప నీ కోరిక దీర్తునని పలుకగా దశాననుడు దనుజులకు ఋతుమతియైన వనిత మిగుల ఆనందము గూర్చునని పలికి బలాత్కారముగా నొక పొదరింటిలోనికి కొనిపోయి సుఖించి యతడరిగెను. నాల్గవ దినమున స్నానమొనరించి శుచినై ముని కడ కేగితిని. ముని విషయమును గ్రహించి వనితా! ఇతర పురుషుని గూడి సమయభంగ మొనరించితివి కావున నూరేనుగుల బలము గల మొసలివి కమ్మని శపించెను నేనా మునికి మ్రొక్కి మునిసత్తమ! అబలనగు నన్ను దానవ బలముచే రాక్షసాధిపతి బలాత్కరించిన నేనేమి చేయగలను? ఇందు నా నేర మేమున్నది? కరుణించి శాప విమోచన మనుగ్రహింపవేయని వేడిన ముని దివ్య దృష్టితో నంతయు గ్రహించి వనితా! రామ దూతయైన హనుమంతునిచే నిహతవై శాప విముక్తి బడసి దివ్యరూపముదాల్తువని వరమిచ్చెను. అప్పటినుండియు మకరమునై యీ సరస్సులో గ్రుమ్మరుచుంటిని. నీ దయవలన శాప విమోచనమైనది. ఇదియే చంద్రగిరిమార్గము మాయావియైన కాలనేమిని చంపి వెళ్ళుము అని పలికి సెలవుదీసికొని యథేచ్ఛగా బోయెను.

అంత నా హనుమంతుడు ముని వేషధారియగు కాలనేమి కడకేగగా వాడు చూచి వానరోత్తమా! చెరువులో నీరు తృప్తిగా గ్రోలితివా? ఇంత జాగుచేసితివేల: నీకోషధులు గైకొనవలెనని యున్న మంత్రముపదేశింతును. మంత్రోపదేశమున కర్ధరాత్రి

మంచిదందురు కదా ! పల్లవసంపుటీకరణముతో మంత్ర ముప దేశింతును వినుము అని పలుకగా హనుంతుడిట్లనెను. మంత్రోప దేశముచేయ కుతూహలపడు మీకు తగిన దక్షిణ నొసంగెదను గైకొనుడు. అని పిడికిలి బిగించి రొమ్ముపై బొడిచెను. వజ్రఘాతముచే నేలగూలినచెట్టువలె గూలి తెలివితప్పిన కపట ముని కొంతసేపటికి మూర్ఛలేచి రాక్షస రూపముదాల్చి ప్రళయభీకరముగానార్చి పవనాత్మజుని డీకొనెను. హనుమంతు డొకవృక్షమును పెకలించి యుద్ధసన్నద్ధుడయ్యెను. ఇరువురును జయకాంక్షతోపోరాడిరి.

హనుమంతుడాకాలనేమికాళ్ళుబట్టి గరుత్మంతుడురగేంద్రుని వలె నేలనుగొట్టి యమసదనమునకనిపెను. తరువాత వాని శిష్యులను చంపి వెంటనే చంద్రగిరికేగి ఔషధులుకానక కొండను పెకలించి చేతబట్టి వచ్చెను. సూర్యునితో గూడి యుదయాద్రియరుదెంచుచున్నదని యెల్లరు భ్రమించిచూ చుచుండిరి. చంద్రగిరి రక్షకులు సమరమునకు రాగ తోకతో వారిని తరిమి హనుమంతుడు లంకకు పయనమయ్యెను.

శ్రీరాముడు హనుమంతుని చేతిలో నుదయగిరివలె నొప్పు చున్నచంద్రగిరిని చూచి సూర్యోదయమగుచున్నది. సౌమిత్రికి ప్రమాదమేమో ! విల్లెక్కుపెట్టి సూర్యుని గూల్చెదనని ధను ర్బాణములు తీసికొనగా జాంబవంతుడు రామచంద్రునకు మ్రొక్కి దేవా! చంద్రగిరిని తీసుకొని హనుమంతుడరుదెంచు చున్నాడేకాని సూర్యుడు కాని, యుదయాద్రి కాని వచ్చుటలేదు. ఉత్తరదిక్కున సూర్యోదయముండునా? రామా! విచారింపకుము. తప్పక మేలు కల్గును. అని చెప్పునంతలో మారుతి చంద్రగిరి

చేతబూనియుటకరుదెంచి రామునకు మ్రొక్కి దేవా! ఓషధులున్న చంద్రగిరి తెచ్చితినని విన్నవించెను.

వానర వైద్యుడగు సుషేణుడు కొండపై నోషధులు గుర్తించి వానితో తగు చికిత్సచేయగా లక్ష్మణుడు నిద్ర లేచినట్లు లేచి గూర్చుండెను. రాముడు తమ్ముని కౌగిలించుకొని యానంద బాష్పములు రాల్చుచు శిరము మూర్కొని హనుమంతునివలన దారిలో రక్కసులు చేసిన మాయలువిని మారుతి సామర్థ్య మెగ్గించి అంజనేయ! చంద్రగిరిని యథాస్థానమున నుంచి రమ్మన్న అతడట్లే చేసెను.

వానర వీరులు మహోత్సాహముతో సమరమున కేగుచుండిరి. శుకసారణుల వలన కాలనేమి మరణవార్తయు, సౌమిత్రి జీవించిన విషయమును రావణుడాలకించి చింతాక్రాంతుడై కొంతతడవునకు ధైర్యమును తెచ్చుకొని కులగురువగు శుక్రుని దర్శించి వినమ్రుడై మ్రొక్కి గురువర్యా! మంత్ర శాస్త్రవేత్తలలో అగ్రగణ్యుడవు. నీ పాదములనే నమ్ముకొంటిమి. నీ శిష్యుల మగుమమ్ము కాపాడుము. నీ శిష్యులందరిలోను భోగభాగ్యములలో అధికుడనైనను రామలక్ష్మణులవలన పుత్రులను బంధుమిత్రులను కోల్పోయి విపత్సముద్రమున మునిగి నీకడ కరుదెంచితిని. నా పుణ్యము వలన నీ పాదపద్మములను దర్శింప గల్గితిని. రామలక్ష్మణులను జయించు నుపాయమును తెల్పుము అని ప్రార్థింప శుక్రుడిట్లనెను. దైత్యనాథ! శత్రువులను జయించుట కొకభయంకర పద్ధతియున్నది. దానిని విధి పూర్వకముగా నీకుపదేశింతును

ఇతరులకు తెలియకుండునట్లు హోమము చేసిన ధనుర్బాణములు కవచము అశ్వములు హోమ గుండము నుండి

యావిర్భవించును. వానిని తీసికొనిపోయి సమరము చేసిన హరిహరాదులు కూడ నిలువజాలరు. తప్పక జయము కలుగును. హోమమునకాటంకము కలిగిన కీడు కలుగును. అని వివరించి హోమ విధానమును వివరించెను.

రావణుడు శుక్రునకు మ్రొక్కి సెలవు గైకొని గృహమునకరుదెంచి ఇతరులకెవ్వరికిని తెలియని యొక పాతాళ బిలమును దొలిపించెను. ఆ పాతాళ బిలమున తైలము, నెయ్యి పెరుగు, తేనె, బెల్లము, కల్లు మున్నగు ద్రవ్యములు యవలు గోధుమలు, కందులు, పెసలు. సెనగలు, మినుములు, నువ్వులు ఉలవలు, ఆవాలు మున్నగు ధాన్యములు. చంద్ర మారేడు మేడి చింత మోదుగ రావిజువ్వి మున్నగువాని సమిధలు సింహము వ్యాఘ్రము వరాహము హరిణము నక్క కుందేలు పిల్లి కోతి తోడేలు మేక ఎద్దు మున్నగు వాని మాంసము ఆయా జంతువుల రక్తము కాకి గ్రుడ్లగూబ చిలుక కొంగ గ్రద్ద గోరువంక తిత్తిరిపక్షి మున్నగు పక్షుల రెక్కలును గాడిదలు గుఱ్ఱములు ఏనుగులు పందులు కుక్కలు మున్నగు జంతువులు దర్భలు సృక్స్రువములు అభిచారహోమమునకు తగిన ఎముకలు బూడిద బట్టలు కట్టెలు మున్నగునవియు ఆయా చోట్ల నుంచుకొని బిలద్వారమితరులకు కానరాకుండ కొండ శిఖరముచేమూసి గుహమధ్య భాగమున ఏకాగ్రచిత్తుడై పులి చర్మమున ఆసీనుడై గురువగు శుక్రాచార్యుడుపదేశించిన రీతిగా హోమము చేయుచు జపము చేయుచుండెను. ఆ హోమ ధూమము సూర్యమండలమును కప్పెను.

వానరులా పొగజూచి రామునకు విన్నవింపగా శ్రీరాముడు విభీషణుని చూచి లంకలో పొగలెగయుచున్నవి. కారణమేమని

యడిగిన విభీషణుడు శుక్రుని యుపదేశానుసారము రావణుడు హోమము చేయుచుండెనని తెలిసికొని రామునితో విన్నవించి ఈ హోమము నిర్విఘ్నముగా పూర్తియైన రావణుడు సురాసురుల కసాధ్యుడగునని తెల్పెను. వెంటనే రాముడు హనుమజ్జాంబవదాదుల జూచి రావణుని హోమమునకు విఘ్నమొనరింపుడని యాదేశింపగా వారు తొందరగా వెళ్ళి లంకలోగల గృహములు మండపములు భవనములు సౌధములు వనములు గోపురములు మున్నగు ప్రదేశములలో రావణునికై వెదకి కనుపించక ఇండ్లు మున్నగు వానికి నిప్పుపెట్టిరి.

అగ్నిజ్వాలలకు భయపడి గజతురగాది జంతువులును వీరులు భటులు స్త్రీలు పురుషులు బాలురు వృద్ధులు మున్నగు వారును ఒక్కసారిగా నివాసములు విడిచి యేడ్చుచుచు బయటకు పరువిడి వచ్చి రావణుడు జానకిని అపహరించి తెచ్చుటవలన తమకిట్టిగతి సంప్రాప్తించినదని నిందించుచుండిరి. అగ్నిజ్వాలలతో మండుచున్న లంకానగరము వసంతకాలమునందలి మోదుగుతోటవలె నుండెను.

ఆ సమయమున సరమయను విభీషణుని భార్య అంగదునకు చేసైగతో బిలద్వారమును తెలుపగా అంగదుడు కాలి తాపులతో బిలద్వారమునగల కొండ శిఖరములను ముక్కలు ముక్కలుగా జేసెను. వాని వెనుక సుగ్రీవాదులు లోనికేగి గుహామధ్యమున జపము చేయుచున్న రావణుని చూచి సంతసముతో అగ్నికుండములలో అచటనున్న ద్రవ్యములు మాంసము రక్తము జంతువులు కుశలు స్రుక్స్రువములు మున్నగునవి యొక్కసారిగా వేసి అగ్నినార్పి పంక్తిముఖుని మీసములు కేశములు పట్టియూగుచు తన్నుచు గ్రుద్దుచు చెవులలోనార్చుచు

పెక్కురీతులుగా బాధింపగా అతడు చలింపక దేవతలకు గూడ వింతగొలుపునట్లు జపమొనరించుచుండెను. అప్పుడు సుగ్రీవాదులు మందోదరినిటకు తెచ్చి బాధించిన రావణుడు జపము చాలించునని యోచించి మందోదరిని తీసికొని వచ్చుటకై యంగదునంపిరి.

అంగదుడు రావణుని అంతఃపురమునకేగి శచీదేవి చిత్రరేఖలవంటి సుందరాంగులూడిగములు చేయుచుండ నవరత్నఖచిత సువర్ణసింహాసనమున లక్ష్మీవలె సౌందర్య విభవములతో విరాజిల్లుచుండియు ఖిన్నురాలై యున్న మందోదరిని చూచి ఆ మహా వైభవమున కచ్చెరువడి పెద్దపులి హరిణాంగనను పట్టు విధమున జుట్టుపట్టిలాగి యెల్లరు బెదిరిపోయి పరుగిడుచుండ తలయందలి నగలలోని రత్నములు శరీరమునందలి నగలలోని రత్నములు ఉల్కలవలె నేలరాలగ రావణునికడ కీడ్చుకొని వచ్చి పెక్కు రీతులు బాధించుచుండ ఆమె భర్తనుద్దేశించి యిట్లనెను. దనుజేంద్రః ఇంక జపమేల? ఈ వానరులు లంకను కాల్చి నీ భార్య సిగ్గుపడునట్లుగా నీకడకీడ్చి తెచ్చి బాధించుచుండిరి. సీతకై సర్వనాశన మొనరించితివి. ముల్లోకములను జయించిన నీ భుజబలమేమయ్యెను? మునివేషముతో నిర్జన ప్రదేశమున ముక్కు మూసికొని దాగితివా? నా కుమారుడు యింద్రజిత్తు జీవించి యున్నయెడల నన్ను విడిపింపకుండునా? నేను నోచిన నోములిట్లున్నవి. నేనేమి చేతును? పుత్రులు మిత్రులు బంధువులు మరణించిరి. అడ్డులేక శత్రువులింటప్రవేశించిరి. నీయిల్లాలిని నీకడకీడ్చుకొని వచ్చిరి. వెంటనే నన్ను విడిపింపుము వైరులవలన మరణించిన మేలు కలుగదు. రిపులజంపిన కీర్తి రాదా? అని ఘోరుననేడ్చు భార్యను చూచి

రావణుడు మండోదరిని విడువుమని కత్తితో నంగదుని కొట్టెను. వాలిసుతుడగు నంగదుడు మండోదరిని విడిచి దూరముగా పోయెను మారుతి గజుడు మైందుడు మున్నగువారు వెంటనే రాముని కడకేగిరి.

రావణుడంత భార్యనక్కున జేర్చుకొని కన్నులు తుడిచి వనితా! విధియిట్లున్నది. విలపింపకుము. నరవానరులను గెలువ వలెనను వరమడుగమరచితిని. కర్మఫల మనుభవింపక తీరదు కదా! ధైర్యమవలంబింపుము అని యూరడించి భార్యను వెంటనిడుకొని యింటికేగి భుజించి శుకసారణాద్యసుర ముఖ్యులను చూచి వారి పలుకులు విని రామలక్ష్మణులను గెలుచుట సాధ్యముకాదని మనమున నిశ్చయించుకొని మంత్రులను పిలిచి నరపాలుర గెలుచుటెట్లన దైత్యనాథ! శత్రు సంహారమునకు మమ్ము పంపుము. మంత్రబలముచేతను రామ నాశనహేతువులైన మాయోపాయముల చేతను వైరి వీరులను సంహరింతుము. సుగ్రీవుని చంపి యెముకలు నీకు కానుకగా నొసంగుదుము. అనిన దశగ్రీవుడు రామునితో చేయు సమరమునకు తోడురండు అని యుద్ధోత్సాహము పురిగొల్పి మిగిలిన సైన్యము సమరమున సంసిద్ధుల జేయుడని యాజ్ఞాపించి యంతఃపురమున కరుదెంచి మండోదరిని చూచి వనితా! యుద్ధమునకు కేగుచున్నాననిన ఆమె విభునిపాదములపై మోముంచి నాథ! రాముడు సామాన్య రాజనియెంచితివా? రాముడు నారాయణుడు, సౌమిత్రి ఆదిశేషుడు, సీత ఆదిలక్ష్మి అని నారదుడు చెప్పగా వింటిని. జీవితేశ్వర! నామాట మన్నించి యుద్ధమున కేగవలదు. జానకిని శ్రీరామచంద్రున కర్పించి ఇతర వాంఛలు వీడి యడవికేగి తపము చేయుడు.

నేను మీపరిచర్యలు చేయుదును. అనిన రావణుడిట్లనెను. కాంతా! రావణ కుంభకర్ణులు శ్రీహరి ద్వారపాలకులని నారదుని వలన వింటిని అనిన మండోదరి నాథా! శ్రీహరి ద్వారపాలకులగు జయవిజయులు ధరణిపై పుట్టవలసిన పనియేమి? అని ప్రశ్నించిన రావణుడిట్లు చెప్పదొడంగెను. ఒకనాడు సనక సనందనాదులు శ్రీహరి దర్శనార్థమై యేగగా జయవిజయులు మునులారా! శ్రీహరి యనుమతిలేనిదే బ్రహ్మకూడ లోనికేగరాదు. మీరు వచ్చినదారినే వెళ్ళుడు అనగా మీరు రాక్షసులై భూమిపై జన్మింపుడని శపించి మౌనులేగిరి.

మౌనులేగిన తరువాత జయవిజయులు శ్రీహరిని దర్శింపగా శ్రీహరి వారిని చూచి ద్వారపాలకులార! మునుల శాపములకు గురియైన మీరిటనుండదగదు. పొండు అనిన వారు దేవా! నిన్ను విడిచియుండజాలము. రక్షించుము, రక్షించుము అని ప్రార్థింప మునుల శాపమనుభవింపకతప్పదు. మూడు జన్మలు రాక్షసులై పుట్టి నాకు విరోధులై నా వలన మృతి పొంది మరల నాకడకు రాగలరు. అనియానతీయగా ఆ జయవిజయులు శ్రీహరికి మ్రొక్కి హిరణ్యాక్ష హిరణ్యకశిపులై పుట్టి శ్రీహరిచేత నిహతులైరి. తరువాత జన్మమున విశ్రవసునకు రావణ కుంభకర్ణులుగా జనించిరని నారదుడు తెల్పెను. అదియుగాక పతిమాటకెదురు పలికినపడతి దుర్గతినొందును అని శాస్త్రజ్ఞులు పల్కుదురు. దానినతిక్రమించిన నీవు దుష్టురాల వనిపించుకొందువు. శ్రీరాముడే శ్రీమన్నారాయణుడైన యెడల రామునిచే నిహతుడనై ముక్తినందుదును. అదియునుగాక సమస్త దిక్పతులను జయించి అన్ని సౌఖ్యములనుభవించి చిరకాలము జీవించితిని. పుట్టినవానికి చావుతప్పదు కదా! ఏ విధముగా చూచినను యుద్ధమే మేలు

అని పలికి దిగ్గునలేచి రావణుడు రాజ్యాదులపైగల మోహలతను జ్ఞాన ఖడ్గముచే ఖండించి సభకరుదెంచి యుద్ధమునకు సైన్యము నాయత్తపరపుడని మంత్రులనాదేశించి రథమధిరోహించి చతురంగ బలములతో వెంటనే సమర భూమికేగెను.

రావణుని సైన్యములోని భేరీ నినాదములు ఏనుగుల ఘీంకారములు సైనికుల వీరాలాపములు అశ్వముల సకిలింపులు వందిమాగధుల ధనుష్టంకారములు ఒక్కసారిగా భూనభోంతరాళములు మారుమ్రోగ వానరులు లేచినలుదిక్కులు చూచి కడలిపై వంతెన గట్టినందుకు మనపైననలిగి సప్త సాగరములు శీకర ధ్వనులతో మనపై వచ్చిపడుచుండెనా? అని భావించి కొందరు వానరులు రామునికడకేగి దేవ! శీకర ధ్వనులు వినిపించుచున్నవి. అవి యేమియోకదా! అనిన రాముడు విభీషణుని సాభిప్రాయముగా తిలకింప విభీషణుడు రామ! రావణుడు సమస్త బలముతో సమరమున కరుదెంచుచున్నాడు. అని తెలుప రాముడు హనుమత్సుగ్రీవాదులను చూచి దశాననుడు సమరమునకేతెంచుచున్నాడు. సమధికోత్సాహముతో సైన్యమును సమరాయత్తము చేసి కదలిరండు నేను దశకంఠునితో పోరి వాని తలలు నరకి భూమినలంకరింతునని పలికి శరశరాసనములందుకొని ధనుష్టంకారము చేసెను.

వానర సైన్యమొక ప్రక్క దానవ సైన్యమొక ప్రక్క మోహరించినది. వానరులకు దానవులకు సంకుల సమరమారంభమైనది. వజ్రకవచు నాంజనేయుడు దృఢకవచు నంగదుడు అశోకుని నలుడు విశోకునినీలుడు శరజిత్తును జాంబవంతుడు సహస్రజిత్తును సుగ్రీవుడు అగ్నికేతుని లక్ష్మణుడు ఇతర దానవ వీరుల నితరవానర వీరులు నెదిరించి పోరుచుండ రావణునితో

శ్రీరాముడు పోరాడసాగెను. రామ రావణు లిరువురు రెండు సింగములవలె, రెండగ్నులవలె పోరుచుండిరి. ఇంద్రాది దేవతలు నారదాది దేవర్షులు విమానములపై ఆకాశమున నిలిచి రామ రావణుల సమరము నీక్షింపసాగిరి. ఇంద్రుడు దేవతలను జూచి రావణాదులు రథముల పైనుండి సమరము చేయుచుండ రాముడు మున్నగువారు నేలపై నుండి పోరు సాగించుచున్నారు,

ఆ సమయమున కుబేరుడింద్రుని చూచి సాటిలేని రీతిలో సమరము జరుగుచున్నది. శ్రీరామునకు అశ్వములను పూన్చిన రథమును ధనుర్బాణములను పంపుము అని పలుకగా ఇంద్రు డంగీకరించి తన సారథియగు మాతలి నిచ్చి యరదమును ధనుర్బాణములను రామునకంపెను. మాతలి యరదముతోలుకొని వచ్చి రామునకు మ్రొక్కి రామ! ఈ తేరునింద్రుడు పంపినాడు నా పేరు మాతలి. ఈ యరదమధిరోహించి దశకంఠునితో పోరాడి సంహరింపుమని వేడగా శ్రీరాముడు విభీషణుని మోము తిలకింప నతడు రామ! ఇది దివ్యరథము. ఇతడింద్ర సారథి. ఇది నిజము ఇది శుభ సమయము. రథమెక్కి దనుజేంద్రుని జయింపుము అని పలికి రామా! రావణునితో పోరుసలుపుచు కొంతజాగుచేయుదును. నీవీలోపుగా రథమధిరోహించి సమర సన్నద్ధుడవుకమ్మని పలికి తానన్నెదిరించి పదిబాణములతో సూతుని పది యశ్వములను నొప్పించి పదిబాణములను దశ కంఠుని పది శిరములపై ప్రయోగించెను.

రావణుడు తమ్ముని యుద్ధమును రాముని ప్రక్కనింద్రుని యరదమును సారథిని పరిశీలించి చూచి మండుచున్న అగ్నిలో

ఆజ్యము పోసినట్లు కోపముతో మండిపడి పెడబొబ్బలు పెట్టుచు తమ్మునిపై బాణవర్షమును కురిసెను.

శ్రీరాముడింద్రుని యరదమునకు ప్రదక్షిణ నమస్కారములు చేసి రథమధిరోహించి యుదయగిరి నధిరోహించిన మధ్యాహ్నకాల మార్తాండునివలె తేజరిల్లుచు ధనుర్బాణములు గైకొని సారధీ! మాతలీ! రావణునితో సమర మొనరించుటకు అరదమును ముందునకు తోలుము అని యాదేశించెను. పరస్పరము యుద్ధమొనరించుచున్న రావణ విభీషణుల నడుమ కరదము చేరగానే రాముడు ధనుర్బాణములు చేతబట్టి శరసంధాన మొనరించి బాణ వర్షము కురిసి దానవ వీరులను నొప్పింపగా వారు భీతితో రాక్షసేంద్రుని మరుగుజొచ్చిరి.

రావణుడును ఆగ్రహారుణిత నేత్రములతో రాముని చూచుచు వానర వీరులకు బెదురు పుట్టునట్లు సమర మొనరించెను. రామ రావణు లిరువురును రథారూఢులై రెండు పులులవలెను రెండు కొండల వలెను. రెండు సింహములవలెను భీకరముగా పోరుచు నెల్లర నాశ్చర్యాంబుధిలో ముంచివేసిరి. రాముడు ప్రయోగించిన బాణములు రావణుని దేహము ప్రవేశించి మరల నమ్ములపొదిలో ప్రవేశించుచుండెను. రాముడు తనపై గుర్రియు శరవర్షమునకు జడివాన మీద పడిన కొండవలె రావణుడు చలింపక ఇరువది చేతులందును విల్లులు ధరించి పోరుచుండ రాముడగ్నిసమములగు శరములు ప్రయోగించి రావణుడేయు బాణములను ఖండించి రావణుని దేహమును నొప్పింప ధైర్య పరాక్రమములు కుంటుపడి యతడు నేలకొరిగెను.

క్షణములో తేరుకొని దశవదనుడు లేచి దానవాస్త్రమును రామునిపై ప్రయోగింప అందుండి పెక్కుమంది రక్కసులు

ద్భవించి రాముని పైబడుట కరుదెంచుచుండిరి. వారి బారి నుండి తప్పించుకొనుటెట్లాయని రాముడు యోచించుచుండ మాతలి యిట్లు పలికెను రామ; నీకు విశ్వామిత్రుడుపదేశించిన వైష్ణవాస్త్రమును ప్రయోగింపుము. నీవు శ్రీహరి కావున సుదర్శనమరుదెంచి మీదిమీదికి వచ్చుచున్న రక్కసులను నాశనము చేయును అని పలుకగా వెంటనే రాముడు సుదర్శనాయుధమును మనసులో తలచుకొని వైష్ణవాస్త్రమును ప్రయోగింప అందుండి పెక్కు సుదర్శనములు వెలువడి రక్కసులనే గాక రావణుని పది తలలు కూడ ఖండించెను. కాని రావణుడు మరణింపక వాని పదితలలు మరల మొలచి దారుణ సమర మొనరింపసాగెను.

రావణుడు రామునిపై ఆగ్నేయాస్త్రమును ప్రయోగింపగా అదిమంటలు వెతలగ్రక్కుచు వచ్చుచుండుట రాముడు చూచి వారుణాస్త్రమును ప్రయోగించెను. అదిమంటలను చల్లార్చి రావణునిపై జలధారలు గురిసెను. రావణుడు మాతంగాస్త్రమును ప్రయోగింప పది లక్షల కోట్ల గజములు రాముని మీద కురుకబోవు నంతలో రాముడు సింహాస్త్రమును ప్రయోగించి కులశైలముల వంటి దేహములు వజ్ర సమానదంతములు వజ్రోపమ నఖములు కలిగిన సింహములు లక్షలకొలది పుట్టెను. అవి మాయాగజములను క్షణములో చీల్చి చెండాడెను.

రావణుడు పర్వతాస్త్రమును ప్రయోగింపగా శిఖరములతో వృక్షములతో మృగములతో పక్షులతో గూడిన రెక్కలుగల ఏడుకొండలరుదెంచెను. రాముడు వజ్రాస్త్రములు సమంత్రకముగా ప్రయోగింప వజ్రములు కొండలను గూల్చి రావణుని రొమ్మును తాకెను. దానితో రావణుడు మూర్ఛపోయి క్షణములో లేచి నాగాస్త్రమునేయ రాముడు గరుడాస్త్రముతో వానిని సంహరించెను. రావణుడు కాలదండాస్త్రమును

ప్రయోగింప రాముడు రౌద్రాస్త్రమును ప్రయోగించెను. అంతతో నాగక రాముడు పదునారమ్ములను రావణునినుదుట ప్రయోగించెను. రావణుడాగ్రహముతో ధ్వాంతాస్త్రమును ప్రయోగింపగా నలుమూలల చీకట్లు క్రమ్మినవి. రాముడు వెంటనే భాస్కరాస్త్రముచే చీకట్లను పారద్రోలెను. రావణుడు రాముని నుదుట నైదర్ధ చంద్రాస్త్రములు ప్రయోగింప రాముని నుదుటి నుండి రక్త ధారాలు స్రవించెను. అంతటితో రాముడాగ్రహ వివశుడై అర్థ చంద్రాస్త్రముతో రావణుని పది తలలు నరికెను. కానియవి యథాప్రకారము మొలచినవి.

అంతలో సూర్యుడస్తమించిన దట్టమైన చీకట్లు వ్యాపించెను. రావణుని సైన్యమున వేలకొలది కరదీపికలు వెలుగుచు సైన్యమునకు వెలుగునిచ్చుచుండెను. వానరులు కొండపైకేగి కరదీప వృక్షములు తెచ్చి నిప్పుముట్టింపగానవి తైలపూరితములగు కరదీపికలవలె వెలుగులు విరజిమ్ముచుండెను. వన్యకరదీపికల వెలుగులో రాముడు సైన్యముతో విలసిల్లెను. రాముడు బాణ సముదాయమును ప్రయోగించి రావణుని శిరములు ఖండింప అవి తాటిపండ్లవలె నేలరాలుచు మరల మొలచుచుండెను. అంతలో సూర్యోదయమయ్యెను ఈ రీతిగా రాత్రిందినములు రామరావణులు పోరాటము సాగించిరి. రాముడు శిరములు ఖండించుటయు అవి యెప్పటివలె మొలచుటయు జరుగు చుండెను.

రాముడది చూచి విసుగు చెంది రావణునెట్లు గూల్పవలయునో తెలియకున్నది. దైవనిర్ణయమేలతప్పును? అని తలపోసి విభీషణుని చూచి ఖండితమైన రావణుని తలలు నేలపైపడియే యున్నవి. వానిని గూల్చుటెట్లు సాధ్యమగును? రావణుని చేతిలో నాకు మరణము వ్రాసి యున్నదికాబోలును. అని పలుకగా

విభీషణుడు రామా! ధైర్యము వీడకుము రావణుని హృదయమున నమృతకలశమున్నది. దానిని హరింపజేసి నూరుమారులు రావణుని శిరములు దునిమిన చివరకొక్క శిరస్సు మిగులును బ్రహ్మాస్త్రముతో నా శిరమును ఖండింపుము అనగా రాముడాలకించి నేను దశరథుని తనయుడనైన యెడల పితృ వాక్యపరిపాలకుడనైన యెడల సీత పతివ్రతయైన యెడల ఈ యాగ్నేయాస్త్రము రావణుని హృదయములోని యమృతకలశము నందున్న యమృతమును హరింపజేయుగాక అని పలికి యాగ్నేయాస్త్రమును విడువగా అది మింట నిప్పులు గ్రక్కుచు రావణుని హృదయమున ప్రవేశించి కలశములోని యమృత మును హరించెను. సుడిగాలి పండుటాకులను రాల్చినట్లు రాముడు రావణుని శిరము గూల్చుచుండెను. రాముడట్లు నూరుసార్లు రావణుని శిరములు ఖండింప నొకే శిరముతోను రెండు బాహువులతోను రావణుడుండి రామునితో పోరాడు చుండెను.

అట్టి సమయమున ఓరి విభీషణా! ఇతరులకు తెలియని రహస్యములు వైరికి తెలిపి అన్నను వంచనతో గూల్చదలచితివా? శూరులు నిన్ను మెత్తురా? కుప్పగాల్చి పేలాలు తినునట్లు వంశ మును నాశనము చేయదలచితివా? అని పలుకుచు రావణుడు రామునిపై బాణ వర్షము గురిసెను. శరీరమంతయు గాయములై రక్తము కారుచున్న రాముడు పూచిన మోదుగు చెట్టువలె నొప్పెను. అంత బ్రహ్మాది దేవతలు రామ! రావణుని వెంటనే కూల్చుమని యాకసము నుండి కోరగా రాముడు బ్రహ్మాస్త్రమును ప్రయో గించెను. ఆ సమయమున దేవతలు భయభ్రాంతులైరి. భూమి కంపించెను. అచలములు చలించినవి. దిగ్గజములు మైమరచి యొరిగినవి. సూర్యుని తేజము తగ్గెను. సప్తసాగరములు ఘూర్ణి

ల్లినవి. బ్రహ్మాండము పిక్కటిల్లెను. బ్రహ్మాస్త్రము రావణుని నేలగూల్చెను. ఆనందముతో దేవతలు పూలవాన గురిసిరి. దేవదుందుభులు మ్రోగినవి. వానరులానందముతో సింహనాదములు చేయగా హతశేషులగు దానవులు భీతితో పలాయనమంత్రము పఠించిరి.

అసూర్యంపశ్యలగు నంతఃపురాంగనలు, మండోదరి రావణుని మరణ వృత్తాంతమును విని గుండెలు బాదుకొనుచు అంతఃపురముల నుండి సమర భూమికేతెంచి రావణుడుపడియున్న యెడకరుదెంచి కళేబరముపై బడి దుఃఖించి దుఃఖావేశముచే మూర్ఛపడి కొంతవడికిలేచి పలురీతులుగా విలపింపజొచ్చిరి. విభీషణుడును అన్నయొక్క శౌర్య ధైర్య బలపరాక్రమములు తలచుకొని దుఃఖింపసాగెను.

ఆ సమయమున నారదుడటకరుదెంచి రామునినుతించి నేలపై బడి విలపించుచున్న రావణుని భార్యలను విభీషణుని ఊరడించి వెడలెను. రామాదులు రావణుని కళేబరముపై బడి విలపించుచున్న విభీషణుని మందోదరిని సమీపించి యూరడించుచుండ మండోదరి రాముని చూచి రామచంద్రా! నీవు పరాత్పరుడవని నారదుడు పూర్వమేతెల్పెను. మహాపతివ్రతయగు సీతను తెచ్చి మిగులక్షోభ పెట్టినందున బలసంపదలు కోల్పోయి నీశరమునకు గురియై నా పతిమరణించెను సతికి పతి విరహమును మించిన దుర్గతి లేదందురు. కావున నా భర్తను కూల్చిన శరముతో నన్నును చంపి పతికడకంపి పుణ్యమును మూటగట్టుకొనుము ఇదియే నా కోరిక. భార్యాభర్తల యెడబాటు దుఃఖము ఎట్టిదో నీవెరుగనిదికాదు. నా వంటి యదృష్టవంతురాలు లేదని నుతించిన వారియెదుటనే పతిని కోల్పోయి దుర్భర వైధవ్య బాధనెట్లను భవింప గలను? పరుల

నాశ్రయించి బ్రతుకుటకంటె మరణించుటయే మేలని తోచుచున్నది. రామచంద్రః సతిపతికర్ధాంగము కావున పతిని చంపి నన్నువిడచుటసగము చంపుటయే. అది నీకు తగదు. కావున నన్ను పూర్తిగా చంపివేయుము. పరలోక భోగములననుభవించుచున్న నా నాథుని కలిసి సుఖింతును. దంపతులను కలిపిన పుణ్యము నీకు దక్కగలదు. అని విన్నవించెను.

అంత రాముడిట్లనెను. కాంతలారా! సతులనెవ్వరు? పతులనెవ్వరు? జీవితాంత సమయముననెవ్వరి కెవ్వరునులేరు. జీవుడొంటరిగా నీలోకమునకరుదెంచి యొంటరిగా నీలోకమును వీడును. తృణజలూకన్యాయమున దేహి ఒక దేహమును చూచుకొనియే యొక దేహమును వీడును. పూర్వ కర్మానుసారము కలిమి లేములు కష్టసుఖములు అనుభవించి కర్మపరిసమాప్తి నొందిన పిదపనశించును. దీనికి చింతింపనేల? వనితలార! మీ నాథుడు జీవుడా? దేహమా? జీవుడందురా? జీవుడు నిత్యుడు కాన చావులేదు. కరచరణాద్యవయవములతోడి దేహమే పతి యనుకొన్నయెడల మీ భర్తయొక్క కరచరణాదులతో గూడిన తనువిటనేయున్నది. తీసికొని పొరెడు. అతివ! జీవుడు విశ్వుడు తైజసుడు ప్రాజ్ఞుడు అని మూడు పేర్లతో నొప్పును. విశ్వుడు తైజసుడు కర్మబద్ధులై వివిధములగు కష్టసుఖముల ననుభవింతురు. ప్రాజ్ఞుడు కారణ దేహమున నిరంతరము సుప్తియందు పరమ సౌఖ్యమనుభవించును. పారమార్థికుడగు జీవుడు ఆత్మైక్యము పొందునప్పుడు విశ్వతైజ సౌఖ్యలు పోవును.

స్ఫటికము (బంధుజీవమున) వసించి పద్మారాగ కాంతితో నొప్పునట్లు సర్వసాక్షి, అఖండ సచ్చిదానంద స్వరూపుడునగు ఆత్మమలిన త్రయాత్మకజడోపాధికుడై జీవుడనిపించుకొని నీటిలో

కదలు సూర్యబింబమువలె అవిద్యతో గూడి తానువేరు ఆత్మ వేరు అని యెంచి కాలగతివలన సంప్రాప్తమైన సుకృతదుష్కృతములను తాను చేసితిననియు వాని ఫలము తానను భవింతుననియు తలంచు సర్వజ్ఞత్వము సర్వైశ్వర్యము మున్నగువానిచే విశిష్టమగునాత్మ అవిద్యా విచ్ఛిన్నుడైనందు వలన జీవుడన బరగి స్వస్వరూప జ్ఞానములేక వర్తించుచుండును. జ్ఞానదృష్టితో చూచిన జీవుడు నిత్యుడు అబాధితుడునని తెలియును పలు చోట్ల కూలిన చెట్లు నదీప్రవాహ వేగమున కొట్టుకొని పోవుచు ఒకచోట కలసికొని మరల కొట్టుకొని పోవును. అదేరీతిగా సంసారమున బంధుమిత్ర కళత్రాదులు కలియుచుందురు. విడిపోవుదురు. దీనికై చింతింపనేల ?

మండోదరి ఈ విధముగా రాముని యుపదేశామృతమున తన దుఃఖాగ్ని చల్లార్చుకొని రావణునకగ్ని సంస్కారము కావింపుడని పలికి శ్రీరాముని పాదపద్మములు డెందమున నిలుపుకొని గృహమునకేగెను.

విభీషణు ధైర్యమవలంబించి బంధువులను మిత్రులను భృత్యులు మున్నగువారిని రావించి దశకంఠుని కళేబరము శిబిక (పాడె)యందుంచి శ్మశానమునకు తోడ్కొనిపోయి అగ్ని సంస్కారమొనరించి విధి పూర్వకముగా తిలోదకములు పిండ ప్రదానములు మున్నగునవి యొనర్చి గృహమున కేగి శుచియై రాముని సమీపించి చేతులు జోడించి నిలబడగా రాముడు సౌమిత్రి, సుగ్రీవుడు మున్నగువారిని జూచి విభీషణునకు లంకా రాజ్యాభిషేక మొనరింపుడని యాదేశింప విభీషణుడు రామునకు మ్రొక్కి తాము విచ్చేసి పట్టాభిషేక కార్యక్రమము నిర్వర్తింపుడని ప్రార్థించెను. రాముడు విభీషణుని చూచి దనుజకుంజర!

నా నిమిత్తమై భరతుడు నగరము ప్రవేశింపక జటావల్కలములు దాల్చి నంది గ్రామమున నున్నాడు. అతనితో బాటే నగర ప్రవేశము చేయుదునని శపథమొనరించితిని. కావున నగరమున ప్రవేశింపను. అందుచేతనే సుగ్రీవాదుల నియమించితినని వారు విభీషణునకు పట్టాభిషేక మొనరించిరి.

విభీషణుడు సుగ్రీవాంగదాదులను పూజించి పెక్కు సత్కారములొనరించెను. అనంతరము విభీషణుడు వానరవీరులతో గూడి రాముని దర్శింపవచ్చెను. విభీషణుడు సుగ్రీవాదులకు చేసిన సత్కారములు విని రాముడు సంతసించి జానకిని తీసికొని రండని యానతిచ్చెను

విభీషణుడు హనుమదాదులను వెంటనిడుకొని సరమ మున్నగు రాక్షసాంగనలు వెంటరాగ అశోకవనమునకేగి వేసవి యెండ వేడికి వాడిన మాలతీమాలికవలె నివురుగప్పిన నిప్పులకుప్పవలె ధూళిధూసరితగాత్రయై కన్నీటితో తడిసిన వసనముతో దీన వదనముతోనున్న జానకిని చూచి యంగదుడిట్లనెను. తల్లీ! జానకీ! రావణ కుంభకర్ణాది రాక్షస వీరులను గూల్చి రాఘవులగు రామలక్ష్మణులు దేవతలచే నుతింపబడిరి విభీషణుని లంకకు రాజుగాజేసిరి. అని పలుకగా మోమువంచివేడి నిట్టూర్పులు నిగిడించుచున్న జానకిని చూచి హనుమంతుడిట్లనెను తల్లీ! నీకు మ్రొక్కెదను నిన్ను తీసికొని రమ్మని రాముని సెలవైనది. నా మాట నమ్ముము. నేను హనుమంతుడను. నీకుంగరము తెచ్చి యిచ్చినవాడను నేనేసుమా! అని పలికిన సీత కన్నులు విప్పి వాయుతనయుని చూచి గుర్తించి యిట్లనెను హనుమ! రావణుని గూల్చి రాముడెటనున్నాడు? రాముని క్షేమము

తెల్పుము అనినవిని హనుమంతుడు సీత పాదపద్మములకు మ్రొక్కి తల్లీ! శ్రీరాముడు రావణాదులను గూల్చి ఇంద్రాదులచేనుతింపబడి సువేలాద్రిపై వానరులు గొలువ గూర్చుండి తమ్ముడగు సౌమిత్రితో ముచ్చటించుచుండెను. జానకిని చూడవలెను. కపులనుబంపి వేగముగ తీసికొని రావలెనని పలుకగా వెంటనే సౌమిత్రి మమ్ము పిలిచి సీతను తోడుతెమ్మన్న మేము వచ్చితిమి. అని మరల సీతకు మ్రొక్కి తల్లీ! అంగదాది వానరులు రాఘవులకత్యంతాప్తులు అని చూపుచు నొక్కొక్కరిని పరిచయముచేసి జానకీ! రాముడు వేగముగా నిన్ను తీసికొని రమ్మనెనని పల్లకి నటనిల్పగా సీత మొదట ననుమానించియు చివరకు ధైర్యమవలంబించి పంచభూతములకు మ్రొక్కి యింద్రాది దేవతలను తలచి సూర్యునకు మ్రొక్కి దిగ్గునలేచి హనుమ! పతికడకరుదెంచెదను దారి చూపుము అనగా హనుమంతుడు తల్లీ! పల్లకీ నారోహింపుమనిన జానకి పతికడకేగునప్పుడు వాహనమేల ? యనిన సరమ సీత పాదములకు మ్రొక్కి యిట్లు పలికెను. అమ్మ! జానకీ! స్నానమొనరించి శుభ్రమగు వసనమును దాల్చి యలంకరించుకొని వెళ్ళుమనిన జానకి సరమను చూచి ముళ్ళతో రాళ్ళతో నిండిన యడవులలో చాల సంవత్సరములు పతితో తిరిగితిని. నేనిప్పుడు వాహనమెక్కవలయునా? అదియుగాక ప్రాణనాథుడు అరణ్యములో నివసించి కష్టములంది వానరులతో గూడి రక్కసులతో బోరియలసియుండనేను వాహవమెక్కవలయునా? నడచివచ్చెదను దారి చూపుడని పలుక నాంజనేయుడు మెల్లగా ముందు నడచుచుండ దక్షిణ భాగమున విభీషణుడు వామ భాగమున సుగ్రీవుడు వెనుక నంగదాదులు నడువ జానకి మెల్లమెల్లగా నడచి సువేలాద్రినున్న రాముని చెంతకేగెను. జానకి పతిని

సమీపించి పాదములకు మ్రొక్కి తలవంచి నిలచెను. రాముడు సీతకభిముఖుడై జానకీ! పదునాల్గేండ్లు అరణ్య వాసము చేసి వత్తును అయోధ్యలో నుండుమన్న వినక అడవికరుదెంచితివి. అడవిలో మాయలేడిని పట్టుటకేగుచు నీకు రక్షణగా సౌమిత్రి నుంచగా వానిని దుర్భాషలాడి పొమ్మని రావణునితో తిరిగితివి. రావణుడు నిన్ను లంకజేర్చెను నీకై బాధపడి రావణుని చంపి నీ బాధ పోగొట్టితిని. నీ వలన నాకపకీర్తి వచ్చినది. నీవెటకైన పొమ్ము దైవకృతమెవరుతప్పింపగలరు? అనిన మైథిలి యిట్లనెను నాథ! నిరంతరము పతిననుగమించి సేవించుట సతుల ధర్మ మని నీతోనడవికి వచ్చితిని హా! లక్ష్మణ! అనునార్తనాదము విని నాథునకు కీడు వచ్చెనని భయపడి నీకు తోడుగా లక్ష్మణుని వెళ్ళుమన్న అతడు కదలకపోవుట వలన భయపడి తెలివితక్కువగా పలికితినేకాని తెలిసిపలుకలేదు ముసలి బిచ్చగాని వేషమున రావణుడు వచ్చి బిచ్చమడిగిన మునియని యెంచి యమాయకురాలినై యాతిథ్యమిచ్చితిని. నాథ! నీపాదములు నా మదిలో నిలుపుకొని లంకలో క్షణమొకయుగముగ గడిపితిని. ఎన్నో కష్టములు పడి ప్రాణములు నిలుపుకొంటినేకాని నే నే పాపమెరుగను. అనిన రాముడిట్లనెను. గుఱ్ఱపు సకిలింత, ఉరుము, వానరాకడ, ప్రాణము పోకడ, స్త్రీలమనస్సు, పురుషుని యదృష్టము దైవమునకైనను తెలియదు. స్త్రీల మనస్సు మనుజులకెట్లు తెలియును. స్త్రీలనుకాని గోవులను కాని భూములనుకాని ఎవరైన నపహరించిన యెడల యజమాని విడిపించవలయును కావున విడిపించితిని. నీదారి నీవు చూచుకొనుమని సుగ్రీవాదులువినుచుండ రాముడు పలుకగా భూతనయ శోక రోషదందహ్యమానమానసయై కన్నీరు గార్చుచునేడ్చి కొంత సేపటికి ధైర్యము తెచ్చుకొని భర్తను చూచి నాథా! అగ్నిని

ప్రజ్వలింపజేసిన అందు ప్రవేశించి నీకు కలిగిన యవిశ్వాసము, అపకీర్తి తొలగింపజేయుదును. అనిన రాముడు చితిపేర్పించి నిప్పు ముట్టింపజేయగా ప్రళయాగ్నివలె కరాళజ్వాలలతో ప్రజ్వలించుచున్న యగ్నికడకేగి పతియే బంధువు. పతియే గురువు. పతియే దైవము పతియే హితుడు. సమస్త సంపదలకు పతియే కర్త, పతియే యేడుగడ. పతినిమించి నాకొండులేరు. అని పలికి యగ్నిదేవా! పాతివ్రత్య ధర్మము నతిక్రమించి నేను నడిచినన్ను భస్మమొనరింపుము. అని పలికి జానకి వీతిహోత్రునకు ప్రదక్షిణ నమస్కారములు చేసి చిచ్చులోనురికెను. ఆ సమయమున సీతపాటు చూచి దేవతలు భీతిల్లిరి. భూమి కంపించెను. సాగరములేడును ఘూర్ణిల్లినవి.

పతివ్రతా తిలకమైన సీత పాదపరాగ స్పర్శచే పావనుడనైతినని తలచి వహ్ని మహోగ్రజ్వాలలతో భయంకరముగా నొకజాము వరకు ప్రజ్వరిల్లి మానవ రూపము దాల్చి బంగారు శలాకవలె నిశ్చలముగా నిలిచియున్న సీతను చూచి దేవతలాశ్చర్యచకితులైరి. వైశ్వానరుడు జానకిని తీసికొని రాముని కడకరుదెంచి సీతను రాముని యెడమ తొడపై గూర్చుండబెట్టి రాజేంద్రా ? పతివ్రతా తిలకమైన జానకి నిర్దోషురాలు. ఈమెపై లేని దోషములు మోపి శోకింపజేయవలదు. రాఘవ! కలకంఠకంఠి కన్నీరొలికిన సిరి యింట నిలువదనుపలుకెరుంగవా ? సీత పాద ధూళి వలన నేను పావనుడనైతిని పరమపావనియైన సీత నేలుకొమ్మనిపలికెను ఆ సమయమున బ్రహ్మాదిదేవతలు రాముని సమీపించి రామ! నీవు పరాత్పరుడవు. భూ భారము మోయలేక భూదేవి నిన్ను ప్రార్థించిన దశరథతనయుడవై యవతరించితివి. శ్రీహరివగు నీవు రాముడవై యవతరింప లక్ష్మి సీతయై యవతరించెను. అని విన్నవించెను.

స్వర్గ సుఖము లనుభవించుచున్న దశరథుడు దేవతలతో కలసివచ్చి శివుని ప్రక్కనిలబడెను. మహేశ్వరుడు రాముని చూచి రామ! నీ తండ్రియగు దశరథుడిదె నా ప్రక్కనిలబడెను చూడుము. అనిన రామలక్ష్మణులు తండ్రి పాదపద్మములకు మ్రొక్కిరి. దశరథుడు తనయులను దీవించి సీతను తిలకించి జానకీ! నీవు మహాసాధ్వివి. పామరులనిందలకు భయపడి రాముడు నిన్నగ్ని ప్రవేశము చేయించెను. భర్తపై కోపముంచకుము. అని పలికి నాయనా! రామచంద్రా! జన్మకర్మ రహితుడవగు నీవు కేశవుడవు. నీమాయయే యీ సీత. మీరిరువురు దుష్టులను శిక్షించి శిష్టులను రక్షించుట కవతరించిరి.

నేను పూర్వజన్మమున హరిని గూర్చి తపమొనరించి ప్రత్యక్షము చేసికొని నీవంటి తనయుని ప్రసాదింపుమని కోరగా నాకు సములెవ్వరునులేరు. నేను సూర్యవంశమున నీ తనయుడనై యవతరింతునని పలికి యంతర్ధానమందెను. నా కోరిక దీర్చుటకై నీవు నాకు తనయుడవైతివనినుతించెను.

అప్పుడు రాముడింద్రుని చూచి త్రిదశాధిప! నాకొరకై నిశాచరులతో పోరి చాలమంది వానరులు మరణించిరి. అమృత వృష్టిచేత మరణించిన వానరులనెల్లరను పునర్జీవితులనుగా జేయ వలయును అని కోరగా నింద్రుడట్లే చేసెను. తరువాత దేవతలెల్లరు తమతమ నెలవులకేగిరి.

శ్రీరాముడు జానకిని ప్రియవచనములచే నాదరించి సుగ్రీవాదులను చూచి మీమీ నెలవులకేగుడు మేమయోధ్యకేగెదమనిన. సుగ్రీవుడు విభీషణుడు మున్నగు వారిట్లు పలికిరి. రామచంద్ర! మీ పట్టాభిషేక మహోత్సవము కనులార గాంచ వలెననియున్నది. కావున మీతో అయోధ్య కరుదెంతుమనిన

దాశరథియంగీకరించెను. విభీషణుడు పుష్పక విమానమును తెప్పించి రామచంద్ర! ఈ పుష్పక విమానమున అన్ని లోకముల వారు నధిష్ఠించినను మరియొకనికి చోటుండును. దీనికి కామ గమనముకలదు. దీనినెక్కిన యెడల జాములో నయోధ్య చేర వచ్చును. అని విన్నపంప శ్రీరాముడు సీతాలక్ష్మణులతో గూడి పుష్పక విమానమధిష్ఠించెను. సుగ్రీవాది వానర ముఖ్యులును విభీషణాది దానవశ్రేష్ఠులును పుష్పక విమానమధిరోహించిరి.

రామాజ్ఞతో పుష్పకము ఆకసమున కెగిరివెళ్ళుచుండగా రాముడు జానకికి లంకానగరమును సముద్రమును వానరులు నిర్మించిన సేతువును సముద్రపు టావలియొడ్డును కిష్కింధాపురము ఋష్యమూకము పంపా సరోవరము దండకారుణ్యము అచట గల మునుల యాశ్రమంబులును వనవాస సమయమున తాము నివసించిన ప్రదేశమును, రావణుడు జానకి నపహరించిన చోటును చిత్రకూట పర్వతము గంగాతీరము మున్నగు నా యాత్రవదేశములను చూపుచు భరద్వాజా శ్రమంబునకేగి పుష్పకమునునిలిపి క్రిందకు దిగి భరద్వాజ మహర్షిని సందర్శించిరి.

భరద్వాజమునీంద్రుడు రామునికౌగిలించుకొనితదితరులను సన్మానించియాతిథ్య మొసగి సుఖాసీనుడై యుండగా శ్రీరాముడు సీతాపహరణము రావణ సంహారము మున్నగు విషయములు వివరింపబోగా నా ముని తపోబలమున నంతయు నెరింగితిని. భరతుడు నంది గ్రామమున జటావల్కములు దాల్చి నీపాద పద్మములందు రాజ్యభారముంచి రాజ్యమేలు చుండెను. మీ యాగమన వార్తను భరతునకు తెలియజేయుమలెననిన రాముడాంజనేయుని బిలిచి తాము క్షేమముగా నరుగుదెంచు చున్న విషయమును భరతునకు తెల్పుమని యాజ్ఞాపించెను.

వెంటనే హనుమంతుడు నంది గ్రామముననున్న భరతుని దర్శించి రాముడు సీతా లక్ష్మణులతో గూడి భరద్వాజ మునీంద్రుని యాశ్రమమున నున్నాడనియు త్వరలోనిటకు రానున్నాడనియు తెలియజేసెను. భరతుడాంజనేయునకు తగు మర్యాదలొనరించి వానరోత్తమ! నీవంటి బంధువు మాకు మరియొకడులేడు. నీవెక్కడ నుండి వచ్చితివి? మాయన్న నీకెచటకన్పించెను? సుఖముగానున్నాడా? సీతా రామలక్ష్మణు లిచట కెప్పుడరుదెంతురో తెలిసిన నాకు కర్ణామృతముగా వినిపిం పుము. నరులకును వానరులకును చెలిమి యెట్లు కుదిరినది? అని ప్రశ్నింపగా హనుమంతుడు రాకుమార! రాముని యిల్లాలగు జానకిని దశగ్రీవుడు కపటోపాయమున నపహరించెను. సీత నన్వేషించుచు రామలక్ష్మణులు పంపానది కరుదెంచిరి. వానరో త్తముడగు సుగ్రీవుడు రాముని హృదయము తెలియదలచి నన్ను పంపెను. నేను శ్రీరామచంద్రుని దర్శించి రాముని హృదయ మును వచ్చినపనియు తెలిసికొని సుగ్రీవుని కడకేగి రామలక్ష్మణు లతో చెలిమి చేసి వైరి యగు వాలిని జయింపుమని తెల్పితిని. సుగ్రీవు డంగీకరించి రాముని శరణువేడెను రామ సుగ్రీవులు చెలిమి చేసిరి. శ్రీరాముడు సుగ్రీవుని కోరిక ప్రకారము వాలిని గూల్చి సముద్రమునకు వారధిగట్టి లంకకేగి రావణుని దునించి జయము సంపాదించి సీతను తోడ్కొని వచ్చెను. సీత యగ్ని ప్రవేశ మొనరించి యగ్నిచే రామునకు సమర్పింపబడి సమస్త దేవతలయొక్కయు మీ దివంగత జనకుడగు దశరథుని యొక్కయు మన్ననలు బడసెను.

తదనంతరము సీతా రామ లక్ష్మణులు సుగ్రీవాదులు విభీష ణాదులు పుష్పక విమాన మధిరోహించి భరద్వాజాశ్రమమున కరు దెంచి యున్నారని తెల్పెను.

భరతుడు శ్రీరాముని పాదపద్మములను త్వరలో దర్శించు భాగ్యమబ్బెనని సంతసించి మంత్రులను పిలిచి, తల్లులకు శుభ వార్త తెలియజేసి నగర మలంకరింపుడని యాదేశించెను. రాముని యాగమన వృత్తాంతము నగరములో చాటింపువేయుడని యాజ్ఞా పించెను. రాముని పాదుకలు వాహనముననిడుకొని మంగళ వాద్యఘోషలు మారుమ్రోగ బంధుమిత్రులతో పావని నెదుట నుంచుకొని భరద్వాజాశ్రమమున కేగుటకై నందిగ్రామము వెలు పలికి చేరిరి. అక్కడ సీతా రాములు భరద్వాజుడు సౌమిత్రి విభీష ణుడు సుగ్రీవుడు మున్నగువారు గరుడునిపై వచ్చు లక్ష్మీనారా యణులవలె ఆకాశ మార్గమున వచ్చుచు నడచి వచ్చుచున్న భర తాదులను చూచి రాముడు విమానమును నిలిపెను. భరతుడు తానూరేగింపుగా తెచ్చిన పాదుకలను రాముని పాదముకు తొడిగి నమస్కరించెను. రాముడు భరతుని కౌగిలించుకొని దరహాస సుం దరవదనారవిందుడై దీవించి కుశలమడిగి బంధుమిత్రాదుల నుచిత రీతిగా నాదరించి నందిగ్రామమున ప్రవేశించి పుష్పక మును కుబేరునికడకు పంపివైచిరి.

ఇంతలో శత్రుఘ్నుడు కౌసల్య కైక సుమిత్రలను సీతా రామ లక్ష్మణులను చూచుటకై తోడ్కొని వచ్చెను. రామలక్ష్మ ణులు తల్లులకు మ్రొక్కి తమ్ముని కౌగలించుకొని యాదరించిరి. కౌసల్యా సుమిత్రలు తమ తమ పుత్రులను దీవించి యానంద బాష్పములు రాల్చుచు గగుర్పాటు చెందియుండ సీతముప్వురత్త లకును మ్రొక్కి దీవనలు బడసెను కౌసల్య కోడలిని కౌగలించుకొని కుశల మడుగుచున్నప్పుడు శ్రీరామ సందర్శనార్థము వశిష్ఠాది మునులును సుమంత్రాది మంత్రులును బంధుమిత్రులు పుర జనులు భృత్యులు నేతెంచిరి. దశరథ తనయులు వశిష్ఠాది మును లకు మ్రొక్కి మంత్రుల క్షేమమడిగి మిగిలినవారిని తగు మాట

లతో నాదరించి ఆ దిన మచట గడిపి మరునాడుదయము అను ష్ఠానములు ముగించుకొని వసిష్ఠాది మునులతో భాషించుచున్న రామునితో భరతుడిట్లు పలికెను. అన్నా! రామచంద్ర! పదునాల్గు సంవత్సరముల గడువు పూర్తియైనది. ధనాగారమున పదిరెట్లు ధనము చేరినది. రాజ్యభారమును స్వీకరించి నన్ను కింకరునిగా ననుగ్రహింప వేడుచున్నాను అని పలుకగా గురువు ననుమతి గైకొని రాము డంగీకరించెను. రామ లక్ష్మణులు జడలు విడిచి నారబట్టలు పరిత్యజించి శుభ్రవసనములు దాల్చి యభ్యంగ స్నానములుచేసి దుకూలములు దాల్చి చందనము పూసికొని యలంకరించుకొనిరి. సీతయు రాముని యనుమతిగైకొని మంగళ స్నాన మాచరించి చక్కగా నలంకరించుకొని పట్టుచీరగట్టి వసిష్ఠుని వెంట రామునికడ కరుదెంచెను.

అంత సీతారాములు వసిష్ఠుడు భరత లక్ష్మణ శత్రుఘ్నులు వెంటరాగ రథారూఢులైరి. సుమంతుడు సారథియై యరదము తోలుచుండెను. కౌసల్యాది రాజకాంతలు వేరు వేరు రథములెక్కి వెంట నరుదెంచుచుండిరి. విభీషణ సుగ్రీవ హనుమజ్జాంబవదాదులు మానవరూపములు దాల్చి గజాశ్వాదు లధిరోహించి చనుదెంచు చుండిరి. మంగళ వాద్యములు మ్రోగుచుండ వారకాంతలు నాట్య ములు చేయుచుండ నయోధ్యానగరము ప్రవేశించిరి. రాజమార్గ మున రామాదు లేగుచుండ పురజనులు బారులుతీరి నిలిచి రాముని పాద పద్మములు దర్శించి సీత మహారణ్యములలో నెట్లు గడపెనో కదా! ఆమె పతిభక్తి నుతింపగలమా? మన పూర్వ పుణ్యమున మరల రాముని దర్శింపగల్గితిమి అని చెప్పుకొనుచు సంతసించు చుండిరి.

సీత వనవాస కష్టములు గడచి గట్టెక్కినది. నిర్జనారణ్యములలో నొంటరిగా నెట్లున్నదో కదా! కందమూలాదులు తిని యెట్లు జీవించెను? పతిభక్తిగల వారికి దైవము తోడ్పడకుండునా? సీత పట్టపురాణియై సిరులతో తులతూగునప్పుడు కైకను కానలకంపిన కష్టసుఖములు తెలియునని ప్రజలనుకొను చుండిరి.

తల్లిని తమ్ముని ఇంటిని ఇల్లాలిని విడిచి యన్నతో లక్ష్మణుడడవికేగెను. పితృసమోజ్యేష్ఠః అను ధర్మము ననుసరించిన పుణ్యాత్ములు మరి గలరా? అని పలురీతులుగా చెప్పుకొనుచు పుణ్యాంగనలు మేడలు మిద్దెలునెక్కి సీతా రామ లక్ష్మణాదులపై పేలాలు పువ్వులు నక్షతలు చల్లిరి. అంతనా దాశరథులు రాజభవన సమీపమున నరదములు దిగి మందిరములలో ప్రవేశించిరి.

రాముని భవనమున సుగ్రీవునకు భరతుని భవనమున నంగదునకు లక్ష్మణుని భవనమున జాంబవంతునకు శత్రుఘ్నుని భవనమున విభీషణునకు విడిదు లేర్పరచి మిగిలిన వారికిని తగిన భవనములలో విడుదులేర్పరచి వారికి కావలసిన సౌకర్యములు చేయుటకు తగిన భటులను నియమించెను. నల్వురు సోదరులును బంధుమిత్రులతోగూడి భుజించి విశ్రమించిరి,

ఆ సమయమున వసిష్ఠుడరుదెంచి రాముని మ్రొక్కులు గైకొని దీవించి రామ! పట్టాభిషిక్తుడవై రాజ్యమేలుమనెను. అంత రాముడు మునీంద్ర! "గురు బుద్ధిర్విశేషతః" అను వాక్యము ననుసరించి మీ యానతి మీరదరమా? అనిన వసిష్ఠుడు రామ! శుభగ్రహయుక్తమైన వృషభ లగ్నమున పట్టాభిషిక్తుడవై ప్రజల నేలుము అని పలికెను. అంత సుమంత్రుడు మునీంద్ర! పట్టాభిషేకమునకై సముద్రజలములు తెప్పించుటకై వనచరులను బంప

వలెననిన రాముడు సుగ్రీవుని మోము చూచెను. అంత సుగ్రీవుడు నలుని తూర్పునకు అంగదుని దక్షిణమునకు జాంబవంతుని పడమరకు వాయుసుతుని యుత్తరమునకు నదీ సముద్ర జలములు తెమ్మని నియమించెను.

పురజనులు వీధులు శుభ్రపరచి చందనోదకములు చల్లిరి. అరటి స్తంభములు గుమ్మములచెంత గట్టి బంగారు బిందెలను ప్రక్కనుంచి కలువలు పద్మములు మావిడాకులు తోరణములు గట్టిరి. అందమగు చిత్రకంబళములు సభా భవనమున పరచిరి. ముత్యాలముగ్గు లుంచిరి. అంతలో నలుడు మున్నగువారు నలు దిక్కులనుండియు జలము దెచ్చిరి.

ఇంద్రాది దేవతలు సిద్ధులు సాధ్యులు మున్నగువారు రామ పట్టాభిషేక సందర్శనార్థమై మానవ రూపములతో నరుదెంచిరి. వసిష్ఠుడు నాలుగు వర్ణముల పౌరులను రావించి సీతారాములను భద్రాసనాసీనులుగా జేసెను. వినాయకునిపూజ చేయించి పురుష సూక్తపఠనము జరుగుచుండ మునులు విప్రులు క్షత్రియులు బాలికలు నభిషేకము లొనరించిరి, పట్టాభిషేకానంతరము శ్రీరాముడు గురువును పూజించెను.

సీ॥ వామాంకమందు సీతామహాదేవియు
 న్పాదాబ్జములచెంత పవనసుతుడు
కరముల ఛత్రచామరముల ధరియించి
 యిరుపార్శ్వములయందు భరత శత్రు
హంతకులును సుమిత్రాత్మజుడమల చా
 మరము గైకొని వెన్క మరిసుతుండు

రావణానుజుడు తారాతనూభవుడచ్ఛ
పతయును గోణదిగ్భాగములను

తే॥ భక్తి సేవింపుచుండగా భద్రపీఠ
మందు నిందీవరశ్యాముడైన రాము
డుండె బట్టాభిషిక్తుడై యుడుసమూహ
పరివృతుండైన కమలారి పగిదినపుడు

శ్లో॥ వామేభూమిసుతా పురశ్చ హనుమాన్పశ్చాత్సుమిత్రాసుతః
శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదళయోర్వాయ్వాదికోణేషుచ
సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరాట్తారాసుతో జాంబవాన్
మధ్యేనీలసరోజ కోమలరుచిం రామం భజేశ్యామలం

భావం: వామభాగమున భూ తనయయగు సీతయు ఎదుట హను
మంతుడును వెనుకభాగమున సౌమిత్రియు పార్శ్వభాగము
లలో భరత శత్రుఘ్నులును వాయువ్యమూల మున్నగు
మూలలయందు సుగ్రీవుడు విభీషణుడు అంగదుడు జాంబ
వంతుడు నుండి సేవింప వీరందరి మధ్య నల్లగలువల
గాంతితోనొప్పు రాముని సేవింతును.

సీ॥ ఒక చాయరూపజీవికల నాట్యంబులు
నొక పార్శ్వమందు వైణికుల గీత
మొకపెడ శాస్త్రజ్ఞులొనరించు వాదంబు
లొకదెస సామగాయకుల గాన
మొకదరి రాజన్యులొనరించు కేల్మోడ్పు
లొకవంక వందిపాఠకుల రావము

లోకచెంత మునిబృంద మొనరించు సన్నుతు
లోకపక్క పటుతర సుకవి కృతులు

తే॥గీ॥ నొక్కచోటున ధర్మశాస్త్రోక్త రచన
ముల ప్రశంసింపుచుందురు బుధులు వృద్ధ
సతులు నీరాజనంబులు జక్కగాను
బట్టి జయమంగళంబులు బాడిరపుడు

నాట్యకత్తెల నాట్యములు వీణానాదములు శాస్త్ర చర్చలు సామగానములు రాజశ్రేష్ఠుల మ్రొక్కులు వంది మాగధుల స్తుతి పాఠములు మునుల సన్నుతులు సుకవుల కవితా పఠనములు ధర్మశాస్త్ర చర్చలు జరుగుచుండ పండితులు పెద్దలు వృద్ధవనితలు నీ రాజనములిచ్చుచు మంగళములు పాడిరి.

సర్వలోక కళ్యాణదాయకమైన శ్రీరామ పట్టాభిషేక సమయమున పితామహుండగు బ్రహ్మ పద్మమాలను శ్రీరామునకు బహూకరింపగా శ్రీరాముడు దానిని సీతకు బహూకరించెను. ఆ మాలికను చేతబట్టి జానకి పతిసీక్షించెను. రాముడు జానకీ! నీ యిచ్చవచ్చిన వారికి దండ బహూకరింపుమని పలుకగా నామె యాపద్మమాలను హనుమంతునకు బహూకరించెను. శంకరుడు ఇంద్రుడు మున్నగు దేవతలు రాముని నుతించిరి, పూలవాన కురిసెను. దేవదుందుభులు మ్రోగినవి. ఇంద్రుడు మందారమాలను వరుణుడు ముత్యాల దండను కుబేరుడమితమైన ధనరాసులను సమర్పించి రామచంద్రుని సెలవుగైకొని తమ తమ నిలయముల కేగిరి శ్రీరాముడు విప్రులకు భూరి సంభావన లొసంగెను.

శ్రీరామచంద్రుడు రతనాలు చెక్కిన కాంచనమాల సుగ్రీవునకును, సువర్ణాంగదములంగదునకును, నలునకు కంకణములు జాంబవంతునకు మంచివస్త్రములు విభీషణునకు దివ్యాంబర భూషణములు కానుకలుగా నొసంగెను. మిగిలిన వానరశ్రేష్ఠులకును దానవపుంగవులకును సముచితమైన కానుక లొసంగిరి. అని కుశలవులు తెలిపి శ్రీరాముని యనుమతితో తల్లి కడ కేగిరి అని మార్కండేయుడు ధర్మరాజున కానందమును గూర్చెను.



రాంపల్లి శ్రీరామచంద్రమూర్తి
కామేశ్వరి దంపతులు